B. Narakaci aashi

తెనుఁగు ప్రచురము

26,050—28-2-36.

# గ్రామస్థుల పంచాంగము

## 1936-37





చెన్నపట్టణం వ్యవసాయపు డిపార్టుమెంటు.

## ధాతు నామ సంవత్సర పంచాంగము.

వెల, 1 అణా.

పంచాంగము కోరువాడు కాపి ఒకటికి 1 అణా, పోస్టు ఖర్చు 3¼ అణాలు,
వెరశి 4¼ అణాల స్టాంపులు పంపవలెను.

# న్యూమెటిక్ స్ప్రేయర్లు.

ఒక గ్యాలన్ పరిమాణముగలది రాగితోనుగాని, యిత్తడితోనుగాని చేయబడినది.

రెండున్నర గ్యాలనులు పరిమాణముగలది ఇత్తడితోను చేయబడినది.





ఇవి దిగుమతి కాబడిన వాటిలో కెల్ల మంచివి. ఇవి వ్యవసాయపు చీడలు, తెగుళ్లు రానియ్యకుండ చేయుటకు తగినవి. 250 కంటె యెక్కువ సంఖ్య స్ప్రేయర్లను మలబారులో పోక తోపులలో ప్రస్తుతము వుపయోగింపబడుచున్నవి. మందు చల్లుటకు రబ్బరు, తేయాకు, కాఫీ యెస్టేటులయందు వుపయోగకరముగా మా యంత్రములు కనుపించినవి. మేము మాయొక్క యంత్రములకు ప్రత్యేక భాగములను ఉంచి యున్నాము. మేము మితమైన కర్చుతో బాగుపరచి యిచ్చుటకు సిద్ధముగా యున్నాము. గాలి ఒత్తిడి చూపు యంత్రము (ప్రెషర్ గేజ్) తప్ప అన్ని భాగములు మా ఖార్ఖానాయందు తయారుకాబడుచున్నవి. అన్ని యంత్రములు యెగుమతికి పూర్వము పరీక్షింపబడుచున్నవి.

పరీక్షార్థము వుత్తరవు దయచేయ కోరుచున్నాము.

## ది స్టాండర్డ్ ఫర్నిచర్ కంపెనీ, లిమిటెడ్,

కల్లాయి, దక్షిణ మలబార్.

1-A

మధుర జిల్లా ధాన్యమును విక్రయించు పరపతి సంఘము.

నెం ఎ-1238, మధుర.

---

ఆర్థిక దుస్థితి తగ్గించుటకు ఈ సంఘము రయితులకు ఒక సంజీవి.

విదేశములనుండి దిగుమతి అగు బియ్యమువలన సరియగు ధరలు మనదేశ ధాన్యమునకు వచ్చునట్లు చేయుట ఈ సంఘముయొక్క ముఖ్య ఉద్దేశ్యము. ఈ సంఘపు సభ్యులకు చౌక వడ్డీతో పెట్టుబడి పెట్టుట, మంచిధర వచ్చువరకు ధాన్యమును నిలువ పెట్టుట, మంచి ధరలకు మధ్య బేరిగాండ్ల అవసరము లేకుండా సరాసరి పెద్ద వర్తకులకు, ధాన్యమును ఉపయోగించువారలకు, అమ్ముట ఈ పద్ధతులవలన లాభకరమగు ధరలు సభ్యులకు వచ్చును.

చెన్నపురి రాజధాని మంత్రి గౌరవనీయులైన పి.టి. రాజన్ గారిచే 1931 వ సం॥ ఏప్రిల్ నెలలో ఈ సంఘము స్థాపింపబడినది. 1933-34 వ సంవత్సరము అమ్మకములో రూపాయకు అర్ధణా బోనసున్నూ, నూటికి తొమ్మిది రూపాయలు లాభమున్నూ పంచిపెట్టబడినది, స్థాపించిన కొద్ది కాలములో ఈ సంఘము ఎంత జనామోదమును బడసినదియు ఈ క్రింద చూపించిన నీటి లెక్కలవలన తెలియనగును :—

(1) ఈ సంఘమునకు 13,000 బస్తాల ధాన్యము అమ్మకమునకు తేబడినవి.

(2) 35,000 రూపాయల అడ్వాన్సు ఇవ్వబడినవి.

(3) 30,000 రూపాయల సరకు అమ్మబడినది.

(4) 24,000 రూపాయల సరకు నిల్వఉన్నది.

ధాన్యపు వ్యాపారము చేయు వర్తకులు వ్యతిరేకముగా ఉన్నను, ఈ సంఘము పైవిధముగ యింత వ్యాపారము చేయగలిగినందులకు సర్కారు నవుఖరీ పెద్దఉద్యోగస్థులు, దేశనాయకులు ఈ సంఘముచేసిన పనిని మెచ్చుచున్నారు. రిజర్వు బ్యాంకును ఈ సంఘము ఒక భాగస్వామి. ఒకసారి పరీక్షించిన యిటువంటి సంఘముయొక్క ఉపయోగము మీకు విశదపడును.

కార్యదర్శి,
మధుర ధాన్యము విక్రయించు
పరపతి సంఘము.

మరా.—ప్రత్తి వేరుశనగ దినుసులలో వ్యాపారము చేయు సంఘము 'దిండిగల్లు' యందును, దానిశాఖ 'అద్దన చత్రము' యందును జయప్రదముగా పని చేయుచున్నవి.

# కోటచెరి కో ఆపరేటివు లోను అండు సేలు సొసైటి

కోటచెరి సంఘములో శ్రేష్టమయిన మిరియాలు రయితుల చేత తయారుకాబడి అమ్మబడుచున్నది. ఇప్పటివరకు రయితులు కల్తీ చేయకుండా నికరమయిన సరుకు తయారుచేయుచున్నారు. శ్రేష్టమైన సరుకుకు తగిన ధర వచ్చేటట్టు ప్రధమముననే యత్నించుట వలన కల్తీ చేసి అమ్మవలెనన్న కోరిక రయితులకు పుట్టకుండా యుండును. ఈ సంఘములో చేరుటవలన కలుగు లాభములను కనుగొనుటకు ఒక పర్యాయము మిరియము పండించు రయితులు, సంఘమును వచ్చిచూడ గోరెదము.

# పరిశ్రామిక కో ఆపరేటివు సంఘము

ఉడిపి వ్యవసాయక.

కల్యాణపురమున యుండు ఈ సంఘము శ్రేష్టమైన బెల్లమును తయారుచేయును. కొబ్బరి, నువ్వుల నుండి స్వచ్ఛమైన నూనెను తయారు చేయును. ధాన్యమునుండి బియ్యము కూడా తయారు చేయును. కొంతమంది చెరుకు పండించువారు యీ సంఘమును ఎక్కువగా ఆదరించుచున్నారు. కల్తీలేని స్వచ్ఛమైన సరుకులను తయారు చేయును కాబట్టి ఎల్లరు ఈ ప్రయత్నమును ప్రోత్సాహము చేయసగును.

కేరల సోప్ ఇన్‌స్టిట్యూట్

కల్లికోట.

నూనెవిత్తనములను, చముఖలను,

సబ్బులను మరియు యిటువంటి

యితర దినుసులను రసాయనిక

పరిశోధన చేయుదురు.

తగ్గు రేట్లు:

విచారించుకొనవచ్చును.

## మద్రాసు పరిశ్రామిక డిపార్టుమెంటు.

యింజనీరింగు శాఖ.



పింటో గానుగ.

1. ఆముదము, కొబ్బరి, వేరుశనగ, నువ్వులు మొదలగు నూనె గింజలనుండి నూనె తీయుటకు శ్రేష్టమైన గానుగ. చౌకగా పనిచేయును. ష్టీము, ఆయిలు, ఎలక్ట్రికుశక్తితో ఈ గానుగను త్రిప్పుటకు వేరే ఖర్చులేకుండా దీనిని నడుపతగును.

2. పరిశ్రామిక యింజనీరింగు కార్ఖానలలో అతిజాగ్రత్త పరిశోధనవలన కనుగొనబడిన గానుగ.

3. దీనియొక్క ముఖ్యాంశములు.

(a) ఏ లోహమునకు నూనె గింజ తాకదు.

(b) లోపల సులభముగా తిరుగుటకు చిన్న చిన్న గోలి గుండ్లు అమర్చుటవలన ఈ గానుగను సులభముగా త్రిప్పుటకు వీలగుచున్నది.

(c) కఠిన పదార్థములు గానుగలో తిరుగు భాగమందు అడ్డపడి, నష్టము చేయకుండ సంరక్షణ చేయబడినది.

(d) పండ్ల చక్రములు అరుగని వస్తువులతో చేయబడినవి.

(e) గానుగ ప్రక్క వైపులకు అదమకొండ ఒక జత రోలర్సు తిరుగుడు ప్రదేశమునకు పోటిగా అమర్చబడినవి.

(f) ఎప్పుడు కావలెనో అప్పుడు గింజల నొక్కుబరువు హెచ్చు తగ్గులు చేయుటకుగాను ఇనుప బరువులు గానుగతో ఇవ్వబడును.

(g) మేకులతో బిగింపబడిన రెండు బలమైన గర్డర్లమీద ఈ గానుగ ఏర్పాటు చేయబడినది.

### గానుగ చేయుపని.

| | |
|---|---|
| ఒక సారికి వేయతగిన గింజలు (నువ్వులు). | 10 మద్రాసు పళ్లు (26 పౌనులు). |
| ఒక సారి వేయబడిన గింజలు నలుగుటకు పట్టు కాలము. | 45 మొదలు 50 నిమిషములు (గింజ శ్రేష్టతను, త్రిప్పు నేర్పరితనమును బట్టి యుండును). |
| రాబడిన నూనె వేగము ... | 3½ వీశెలు (11 పౌనులు) నిమిషమునకు 9 చుట్లు తిరుగును. |
| ఎంత వేగము ... ... | 2½ గుర్రపు వేగము. |
| నూనె రాబడి ఎంత ... | గింజ శ్రేష్టతనుబట్టి నూటికి 42 లేక 44 పాళ్లు నూనె వచ్చును. |

4. తినుటకు ఉపయోగింపతగిన స్థితిగల నూనె తయారు అగును. పశువులకు యోగ్యమైన పిండి వెడల్పైన రొట్టెల రూపమున వచ్చును.

5. పింటో గానుగ, ఎద్దుల గానుగ, యింజను రోటరీల యొక్క పని తారతమ్యములు :—

| పింటో గానుగ. | ఎద్దుల గానుగ. |
|---|---|
| ఎద్దులతో త్రిప్పబడుగానుగ ఆక్రమించిన స్థలములో నాల్గవ వంతు స్థలము చాలును. | ఎక్కువ చోటు ఆక్రమించును, శబ్దము ఎక్కువ కలిగించును. |
| సులువుగా, నిశ్శబ్దముగా తిరుగును. ఒక సారి ఎక్కువ గింజలు పట్టి ఎక్కువ నూనెను చౌకగా తయారు చేయును. టన్ను నువ్వులు గానుగ ఆడుటకు 23 రూపాయలు మాత్రము అగును. | ఎద్దులు త్వరలో తగ్గి పోవును. కొద్ది గింజలు ఒక సారి పట్టును. టన్ను నువ్వులు గానుగ ఆడుటకు 48 రూపాయలు అగును. |

| పింటో గానుగ. | రోటరి ఇనుప మిల్లు. |
|---|---|
| ఆహారములో ఉపయోగించ తగిన శుభ్రమైన నూనె తయారు అగును. | ఉక్కు వస్తువులు యుండుటవలన తినుటకు ఎక్కువ మంచిది కాదని చెప్పనగు ఎర్రటి నూనె తయారగును. |
| రొట్టెలవలె వెడల్పు అయిన అమ్మకమునకు యోగ్యమైన పిండి తయారు అగును. | పొడుముగా పిండి తయారు అయి పశువులకు తినుటకు ఆహ్లాదకరముగా యుండదు. |
| గ్రామములో వడ్రంగి, కమ్మరి సులభముగా బాగుచేసి పోయిన చిన్నవస్తువులను తయారు చేయగలుగుదురు. | గ్రామములో బాగుచేయుటకు సాధ్యము కాదు. |

6. మద్రాసులోను, ఇతర చోట్లను చాల సంఖ్యగల ఈ గానుగలు అమ్మబడి పని చేయుచున్నవి. కొనదలచి చూడవలెనని కోరువారికి పనిచేయుచున్న పింటో గానుగలను చూచుటకు అవకాశములు యివ్వబడును.

7. మద్రాసు రాజధానిలో ఏ ప్రాంతము నందైనను పింటో గానుగలను అమర్చుటకు యింజనీరింగు శాఖ పూనుకొన్నది. వివరములకు పరిశ్రామిక యింజనీరింగు కార్ఖానా, కలిపక్కము హైరోడ్డు, వాషరుమానుపేట, మద్రాసు అని వ్రాయనగును.

# మదరాసు పరిశ్రామిక డిపార్టుమెంటుయొక్క ఇంజనీరింగు సెక్షనువారు ఊటబావుల నిమిత్తము రంధ్రమును తొలుచుట.



త్రవ్వించుకొన్నవారి పేరు—మాణిక్యం పిళ్లెగారు.

బెజ్జముయొక్క కొలత—6 అంగుళములు.

గ్రామము—విద్ధాచలం తాలూకా, కవనూరు గ్రామము.

బెజ్జముయొక్క లోతు—భూమి పైమట్టమునకు 253 అడుగులక్రింద.

పైకివచ్చు నీటి ప్రమాణము—రాత్రింబగళ్లు ఏకదారగా నిమిషమునకు 420 గాలనుల నీరు ప్రవహించును.

---

షరా.—ఆదే గ్రామములో ముగ్గురు వేర్వేరు వారలకు ఊటబావుల నిమిత్తము మూడు బెజ్జములు తొలచబడినవి. వాటినుండి ఏకధరగా నిమిషమునకు 300 నుండి 420 గాలనుల నీరు ప్రవహించుచున్నది.

---

వివరములు 'పరిశ్రామిక శాఖ' విషయముగల పుటయందు తెలియనగును.

మధుర, తిరుచనాపల్లి, రామనాడు, తిరునల్వేలి—జి. పలియనప్ప మొదలియారు, సిలోను ఫాన్సీహాలు, 7 గుడ్ షెడ్డు వీధి, మధుర.

తంజావూరు జిల్లా—కే. రాఘవేంద్ర రావు, 180 బిగ్గ బజారు వీధి, కుంభకోణం.

పశ్చిమ గోదావరి, క్రిష్ణ, గుంటూరు.—యస్.సి.హెచ్. మల్లపరాజు, మాన్యుఫాక్చరరు ప్రతినిధి, బెజవాడ.

కొచ్చిను సంస్థానము—కేరళ స్వదేశి స్టోర్సు, లిమిటెడు, తిరుచూరు.

తిరువాన్కూరు సంస్థానము—రాము బ్రదర్సు, మర్చంట్సు, కమీషను ఏజంట్లు, ఎల్లప్పి.

నైజాము సంస్థానము—యస్.బి. సుబ్బారావు అండు సన్సు, 942 హనుమాను టెక్డి, హైదరాబాదు (డెక్కను).

డిపోలు.

క్రిష్ణ అండు సన్సు, జనరలు మర్చంట్సు, కర్నూలు.

హెచ్. రంగన్న గౌడుఅండు బ్రదర్సు, వర్తకులు, బళ్లారి.

గౌను ఖాను లోహనీ జనరలు మర్చంటు, కడప.

బి.సి. ఆదినారాయణశెట్టి అండు సన్సు, జనరలు మర్చంట్సు, అనంతపురం.

కే.ఆర్. భాస్కరయ్య అండు బ్రదర్సు, జనరలు మర్చంట్సు, హిందుపురం.

ప్రొప్రైటరు నేషనలు ప్రావిజను స్టోర్సు వొంటి కొప్పల్, మైసూరు.

# "కిరోసిన్ చమురు"

గవ్వ
150°



నీటికలువ
150°

పరిశుభ్రమైన మొదటి రకపు చమురు పెట్టెలలో నుంచబడినది.

లంగరు 125°



సింహము 125°



ఇది పెట్టెలలోగాని లేక విడిగాగాని యివ్వబడు తెల్ల చమురు. తక్కువ ఖర్చుకే వెలుగుటవలన దానికిచ్చు క్రయమునకు తగిన మంచి చమురు.

ఉదయ సూర్యుడు 125°



చక్రము 125°



ముఖ్యముగా లాందరులకు, స్టౌలకు, విసనక్రలకు వుపయోగించబడు పేరుపొందిన తెల్ల చమురు.

పై రకములకన్న చౌకైన రకము కావలసినవారు వుపయోగించునది.

గుడ్లగూబ—విక్టోరియా మార్కు

ఎర్ర కిరోసిన్ చమురు

బీద జనులు వుపయోగించుచున్న చవుకైన రకము.

ఏజెంట్లు—

## బర్మా-షెల్

ఆయిల్ స్టోరేజి అండు డిస్ట్రిబ్యూటింగు కంపెనీ
ఆఫ్ యిండియా లిమిటెడ్డు
(ఇంగ్లాండులో సంఘము ఏర్పడినది).

మద్రాసు, ఉదకమండలం, సికింద్రాబాదు, తిరుచునాపల్లి, విశాఖపట్నం.

# విషయసూచిక

## I. వ్యవసాయము.



2-A

# గ్రామస్థుల పంచాంగము.

## I. వ్యవసాయము.

### 1. చెన్నపురి వ్యవసాయ శాఖవారి పని.

ఈ రాజధానియందలి ప్రజల ముఖ్యవృత్తియగు వ్యవసాయమునం దభివృద్ధికరమగు పద్ధతులను ప్రవేశపెట్టవలసిన యగత్యము 1854 వ సంవత్సరమున నాటికే గుర్తింపబడెను. కాని సిపాయిల తిరుగుబాటువలన 1863 వ సంవత్సరమువరకు యీ విషయమై చురుకుగ పనిచేయుటకు వీలుకలుగలేదు. ప్రారంభమున సైదాపేటలో 'మాదిరి' ఫారము యొకటి 1864 వ సంవత్సరమున తెరువబడెను. అప్పటినుండియు నీ వ్యవసాయ శాఖ క్రమముగ పెద్దదగుచువచ్చెను. వ్యవసాయ శాఖ, కృషీవలునికి క్రింద వివరింపబడిన నాలుగు విధములుగ తోడ్పడ యత్నించుచున్నది.

#### (a) పరిశోధన.

పరిశోధన రెండువిధములు. అందొకటి వ్యవసాయ సాంప్రదాయములకు సంబంధించిన మూలసూత్రముల యన్వేషణ. ఇది కోయంబత్తూరునందు కొందరు శాస్త్రవేత్తలచే జరుపబడుచున్నది. ఈ యన్వేషణకు ఫలితముగ నచట కనుగొనబడిన నూతన విషయముల ననుసరించి ఆయా జిల్లాలయందలి స్థానికసమస్యలను పరిష్కరించుట మరియొక విధమగు పరిశోధన. ఈ పనిని ఆయా సర్కిలుల యాజమాన్యముగ నున్న డిప్యూటి డైరెక్టర్లు తమక్రింద నున్న వ్యవసాయ స్థానములందు జరుపుదురు.

#### (b) ప్రచారము.

పరిపాలనా సౌకర్యమునిమిత్తము యీ రాజధాని యెనిమిది సర్కిలులుగ విభజింపబడెను. ఒక్కొక్క సర్కిల్ ఒక్కొక్క డిప్యూటి డైరెక్టరు అధీనమున నున్నది. పరిపాలనా సౌకర్యమునకున్ను, తనిఖీల విషయమునను్ను, సహాయము చేయుటకు అసిస్టాంటు డైరెక్టర్లను వీరిలో చాలమందికి యిచ్చియున్నారు. ఒక్కొక్క సర్కిల్‌లో కొంతమంది ప్రచారకు లున్నారు. ఒక్కొక్క ప్రచారకు డొక్కొక్క తాలూకాలోని పని చూచుచున్నాడు. రాజధానిలోని 221 తాలూకాలకు యిప్పుడు 150 ప్రచారకులుమాత్రము గలరు. కొన్ని తాలూకాల కింకను ప్రచారకులు లేరు. ప్రతి తాలూకాకును ప్రచారకుని నియమించుట కేర్పాట్లు జరుగుచున్నవి. 'ఆయా సర్కిలులో పని' అను శీర్షికక్రింద వ్రాయబడిన ప్రచారపు వివరములను చదువరులు గమనింపదగును. సామాన్యపు రైతు భరింప శక్యముగానంత పెట్టుబడి కావలసిన పద్ధతులను వేసినిగాని యీ శాఖవారు శిఫారసు చేయరు. మరియు నీ శాఖవారు శిఫారసుచేయు నూతన

పద్ధతులుగాని, పంచిపెట్టు క్రొత్త వంగడములుగాని పరిశోధనాస్థానములందు చిరకాలము పరీక్షింపబడి లాభకరములని కనుగొనబడినవి మాత్రమే యైయున్నవి.

### (c) విద్యగరపుట.

వ్యవసాయ శాస్త్రము నభ్యసింపజేయుటకును, ఆయా వ్యవసాయపు పనులందు ప్రవీణత కలుగజేయుటకును, విద్యార్థులకు మూడు సంవత్సరములు తగిన శిక్షణ నొసగుటకు వ్యవసాయపు కళాశాల యొకటి (కోయంబత్తూరునందు) గలదు. అచట విద్యార్థులు మెట్ట, పల్లము, తోటనేలలకు సంబంధించిన పను లన్నిటియందును నారి తేరి పిమ్మట తమంతట తాము వ్యవసాయముచేసికొనుటకు దగిన నిపుణతను బొందుదురు. ఇదిగాక మధుర జిల్లాలోని 'పూశిలంపట్టి' యందు వ్యవసాయ పాఠశాల యొకటి గలదు. మరియు మూడు సంవత్సరములు చదువుటకు వీలులేని యెక్కువ భూవసతి గల వారలకు జూలైనుండి మార్చివరకు రమారమి యెనిమిది నెలలకాలము ముఖ్యమైన వ్యవసాయపు పనులు అనగా పశుసంరక్షణ, వెన్నతీయుట, బెల్లము వండుట, తేనెటీగలను పెంచుట మొదలగునవి నేర్పుటకు యేర్పాటు చేయడమైనది.

### (d) అప్పులిచ్చుట.

సర్కిళ్లలో నుండు డిప్యూటీ డైరెక్టర్లు వ్యవసాయపుపనిముట్లు కొనుటకు రైతులకు ఒక్కొక్కరికి పాతిక రూపాయిలవరకు అప్పు శాంక్షను చేయగలరు. దానిపై మొత్తము కావలసియున్నయెడల అగ్రికల్చర్ డైరెక్టరుగారు చేయగలరు. 1934-35 వ సంవత్సరములో రూ 15,063-12-0 లున్ను, 1933-34 వ సంవత్సరములో రూ 12,220-2-0 లున్ను రైతులకు రుణములను యిచ్చిరి. ఈ రుణములు యే పని నిమిత్తము యియ్యబడినవో యీ క్రింద నుదహరింపబడినది :—

| | | రూ. | అ. |
|---|---|---|---|
| 1 | ఇనుప నాగళ్ల నిమిత్తము ... ... | 6,031 | 0 |
| 2 | పరిష్యన్ నీటి యంత్రములకు ... ... | 500 | 0 |
| 3 | చెరుకు ఆడు యంత్రములకు ... ... | 425 | 0 |
| 4 | మోటచక్రములకు ... ... | 533 | 0 |
| 5 | చెరుకుగానుగలు, పెనములు ... ... | 200 | 0 |
| 6 | తోటలలో పనిచేయు పనిముట్లకు ... | 20 | 0 |
| 7 | ఇతర వ్యవసాయ పనిముట్లు వగైరాలకు ... | 7,354 | 12 |
| | మొత్తం ... | 15,063 | 12 |

## 2 (a) ఒకటవ సర్కిల్.

పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, గంజాం జిల్లాలు మొదటి సర్కిల్లో చేరినవి. తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో నివసించువారు వ్యవసాయ పనకు సంబంధించిన విషయములయందు సలహాగాని, సహాయముగాని కావలసియున్న యెడల రాజమండ్రిలో నున్న వ్యవసాయపు అసిస్టాంటు డైరెక్టరువారినిన్ని, విశాఖపట్నం, గంజాం జిల్లాలవారు విశాఖపట్నంలోనున్న వ్యవసాయపు అసిస్టాంటు డైరెక్టరు వారినిన్ని కనుగొనవలెను.

## (౧) ప్రచారము.

వ్యవసాయదారులకు సహాయముచేయుటకు తాలూకాల చార్జీలలో నుండు డిమాన్‌ స్ట్రేటర్లు ప్రతి తాలూకాలోను యెనిమిదింటికి తక్కువకాకుండ ప్రత్యేక గ్రామములను యేర్పాటుచేసి నాటియందు తీవ్రమగు పనిని నడిపించుచున్నారు. అట్టి ప్రత్యేక స్థలములును యీ క్రింది జాబితాలో వివరించడమైనది. పని అభివృద్ధిచెందిన కొలదిని మరికొన్ని ప్రత్యేక స్థలములను యేర్పాటుచేసి క్రొత్త స్థలములకు కూడ నూతన పద్ధతులను వ్యాపింపచేయుదురు :—

| తాలూకా. | డిమాన్‌స్ట్రేటర్లు నివసించు తావు. | ప్రత్యేక స్థలముల పేర్లు. |
|---|---|---|
| **గంజాం జిల్లా.** | | |
| 1 అస్కా ... | బరంపురం ... | కాలసందపూరు, కొండ్రవాలి, ధారాకోట, కోమలదేవిపూరు. |
| 2 బరంపురం ... | డిటో. ... | పెహాలిదియా పాదోరా, డెంగా పాదోరా, గోలంత్రా, అల్లిపురం. |
| 3 చత్రపురం ... | డిటో. ... | సారు, పట్టుపురం, చమ్మాఖండి, పించోళి. |
| 4 సోంపేట ... | సోంపేట ... | పలాసపురం, బెల్లుపడ, పుచ్చపాడు, బారువ, జాడుపూడి, జలంత్ర బెల్లుపడ, రాజాపూరు, తురక శాసనం, కరక. |
| 5 శ్రీకాకుళం ... | నరసన్నపేట ... | నరసన్నపేట, పోలకి, శ్రీకూర్మం, అమిదాలవలస, అచ్యుతాపురం, జలుమూరు, లక్కిందిడ్డి సింగుపూరు. |
| **విశాఖపట్నం జిల్లా.** | | |
| 1 పాలకొండ .... | పాలకొండ ... | వీరఘట్టం, నవగాం, పాలకొండ, సంకిలి, పునుకూరు, భూర్జ, తోటవాడ, గుత్తావల్లి |
| 2 పార్వతీపురం ... | పార్వతీపురం ... | నర్సిపురం, నాగూరు, పెదమేరంగి, బందలుప్పి, మార్కొండపుట్టి, పెదబొండపల్లి, కొమరాడ, పెదగుడబ. |
| 3 బొబ్బిలి ... | బొబ్బిలి ... | శాసాపేట, నిడగల్లు, బర్లి, పిరిడి, బాడంగి, మరడాం, మల్లంపేట, తెర్లాం. |

| తాలూకా. | డిప్యూటీకలెక్టర్లు నివసించు తావు. | ప్రత్యేక స్థలముల పేర్లు. |
|---|---|---|
| | విశాఖపట్నం జిల్లా—శేషము. | |
| 4 విజయనగరం... | విజయనగరం ... | మొయిద, డెంకాడ, జొన్నవలస, రెడ్డిపల్లి అగ్రహారం, తాళ్లవలస, దాకమర్రి, రామతీర్థాలు, గజపతినగరం. |
| 5 శృంగవరపుకోట. | శృంగవరపుకోట ... | శృంగవరపుకోట, జామి, భీమాళి, లక్కవరపుకోట, వష్లంపూడి, కొత్తవలస, బోనంగి, కళ్లేపల్లి. |
| 6 విశాఖపట్నం. | విశాఖపట్నం ... | పెందుర్తి, సింహాచలం, మధురవాడ, గంభీరం, కణితి, గంట్యాడ, హనుమంతవాక, మర్రిపాలెం. |
| 7 అనకాపల్లి ... | అనకాపల్లి ... | తుమ్మపాల, సీతానగరం, సబ్బవరం, బయ్యవరం, అగనంపూడి, పరవాడ, అచ్చుతాపురం, ములగపాక. |
| 8 వీరపల్లి ... | చోడవరం ... | చోడవరం, రాజాం, మేడివాడ, వడ్డాది, కోటపాడు, కోడూరు, గవరవరం, తారువ. |
| 9 సర్వసిద్ధి ... | యలమంచిలి ... | యలమంచిలి, నరిసింగపల్లి, పంచదార్ల, పద్మనాభరాజుపేట, లింగరాజు పాలెం, నక్కపల్లి, గొడిచర్ల, శ్రీరామపురం. |
| 10 గొలుగొండ ... | నర్సీపట్నం ... | నర్సీపట్నం, బుచ్చెంపేట, వేములపూడి, కొత్తమల్లంపేట, కుసర్లపూడి, దారకభూపతి అగ్రహారం, కొత్తకోట, కోటవురట్ల. |
| | తూర్పు గోదావరి జిల్లా. | |
| 1 రాజమండ్రి ... | రాజమండ్రి ... | రాజమండ్రి, కడియం, రాజానగరం, దేవలచెరువు, దోసకాయలపల్లి, గాడాల, గోకవరం, సీతానగరం, మిర్తిపాడు, కోరుకొండ. |
| 2 కాకినాడ ... | కాకినాడ ... | కాకినాడ, పెనుగుదురు, గొల్లపాలెం, కరప, చొల్లంగిపేట, నీలపల్లి, యింజరం, లిమ్మాపురం, మేడపాడు, గొల్లలమామిడాడ. |

| తాలూకా. | డిప్యూటీ కలెక్టర్లు నివసించు తావు. | ప్రత్యేక స్థలముల పేర్లు. |
|---|---|---|
| | **తూర్పు గోదావరి జిల్లా—శేషము.** | |
| 3 రామచంద్రపురం. | రామచంద్రపురం ... | రామచంద్రపురం, ద్రాక్షారామం, కోటిపల్లి, ఆలమూరు, అనపర్తి, బిక్కవోలు, వెదురుపాక, మండపేట, కపిలేశ్వరపురం. |
| 4 రాజోలు .. | కొత్తపేట ... | కొత్తపేట, దేవ-రాపల్లి, పులేటికుర్రు. మోడేకుర్రు, ఆత్రేయపురం, రాజోలు, పసర్లపూడి, మానేపల్లి, చింతలపల్లి, నాగులలంక. |
| 5 అమలాపురం ... | అమలాపురం ... | అమలాపురం, బోడసకుర్రు, కొమరగిరిపట్నం, ముమ్మిడివరం, గుత్తెనదీవి, ముక్కేశ్వరం, వీరవిల్లిపాలెం, లంక, కాట్రేనికోన, చల్లపల్లి. |
| 6 తుని ... | తుని ... | తుని, కోటనందూరు, పోలవరం, దొండవాక, కొత్తపల్లి, కోటగుంట, హంసవరం, వంటిమామిడి. |
| 7 పెద్దాపురం ... | పెద్దాపురం ... | పెద్దాపురం, పులిమేరు, వీరవరం, ప్రత్తిపాడు, జగ్గంపేట, యర్రవరం, వడిశలేరు, యేలేశ్వరం, గండేపల్లి. |
| | **పశ్చిమ గోదావరి జిల్లా.** | |
| 1 నర్సాపురం ... | నర్సాపురం ... | యిలపకుర్రు, నర్సాపురం, పాలకొల్లు, కొప్పర్రు, లంకలకోడేరు, మొగలితుర్రు, యలమంచిలి, గుమ్మలూరు, కవిటం, ఆచంట. |
| 2 ఏలూరు ... | ఏలూరు ... | కైకరం, భీమడోలు, పంగిడిగూడెం, వల్లూరు, పోతునూరు, ముండూరు, పెదపాడు, గుండుగొలను, యేలూరు. |
| 3 తణుకు ... | తణుకు ... | తణుకు, అత్తిలి, పెనుమంట్ర, సిద్ధాంతం, ఖండవిల్లి, లీపర్రు, దువ్వ, అరవల్లి, మారుటేరు, విప్పర్రు. |

| తాలూకా. | డిమాన్ స్ట్రేటర్లు నివసించు తావు. | ప్రత్యేక స్థలముల పేర్లు. |
|---|---|---|
| | **పశ్చిమ గోదావరి జిల్లా—శేషము.** | |
| 4 తాడేపల్లిగూడెం. | తాడేపల్లిగూడెం ... | తాడేపల్లిగూడెం, పిప్పర, గణపవరం, నిడమర్రు, అనంతపల్లి, ఉంగుటూరు, నల్లజర్ల, కరిమొద్ద, నవాబుపాలెం, రావిపాడు. |
| 5 భీమవరం ... | భీమవరం ... | భీమవరం, వుండి, గరగపర్రు, వీరవాసరం, కోలమర్రు, ఆకువీడు, వేంగ్రడ, కోనేటివాడ, శాళ్ల, లోసరిగుంట్లపాడు. |
| 6 కొవ్వూరు ... | కొవ్వూరు ... | కొవ్వూరు, చాగల్లు, నిడదవోలు, తాళ్లపూడి, గోపాలపురం, యిసకపట్నం, పంగిడి, విజ్జేశ్వరం, దొర్నగూడెం. |

డిమాన్ స్ట్రేటర్లులేని తాలూకాలు.

గంజాం జిల్లా—గుంసూరు, సురడ, ఖుదలా, ఛత్రపురం, టెక్కలి, పర్లాకిమిడి, అస్కా.

విశాఖపట్నం జిల్లా—సాలూరు, చీపురుపల్లి.

తూర్పు గోదావరి జిల్లా—పిఠాపురం డివిజను.

పశ్చిమ గోదావరి జిల్లా—చింతలపూడి.

విశాఖపట్నం జిల్లాలో తొమ్మిది తాలూకాలలో ప్రతి సెంటరుకును అనకాపల్లి ఫారములో ట్రయినింగు చేసిన ఒక్కొక మేస్త్రీని నియమించిరి. యీ మేస్త్రీ అతని పనికి యేర్పాటుకాబడిన ప్రత్యేకస్థలము (సెంటరు) నందు నివాసమేర్పరచుకొని ఆ సెంటరులోను చుట్టుపట్లనుండు గ్రామములలోను పనిచేయుచుండును. ఈ మేస్త్రీలను ప్రతి సెంటరులోను కాపురముంచుటవలన రైతులకు కావలసియున్న విషయములు సులభుగా తెలియజేయుటకు వీలగుచున్నది. పూర్వము యిట్టి మేస్త్రీలు లేనందున రైతులకు విషయములు తెలియుటకు చాలకాలము పట్టుచుండెడిది. ప్రస్తుతము యీ మేస్త్రీలు ప్రతిసెంటరులోను కొన్ని గ్రామములయందే ప్రచారము చేయుచున్నారు. ఈ ప్రారంభించిన గ్రామములలో కొంతపని జరిగినపిదప యితర గ్రామములలో కూడ ప్రచారము ప్రారంభించెదరు.

ఈ ప్రత్యేక స్థలములలో ముఖ్యముగా చెరుకు, వరి, చోడి సస్యములను అభివృద్ధి చేయుటకు ప్రయత్నించుచున్నారు. ఇంతేగాక యెరువులను లాభకరముగా తయారు చేయుటను గురించియు పచ్చి రొడ్డలకు, పశువుల గ్రాసము పనికివచ్చుపైర్లు పెట్టుటను గురించియు, వరి, పొగాకు, వంగ మొదలగునవి పాడుచేయు క్రిమికీటముల బాధనుండి తప్పించుకునే మార్గములను గురించి సలహానిచ్చుటయందును, నారింజ, కొబ్బరి మొదలగు

వానికి బూజు తెగుళ్లు రాకుండ కాపాడుకొను మార్గములను సూచించుటయందును పశువులను బాగుగా పెంచుటను గూర్చిన విషయములయందును, కల్తీలేని విత్తనములను తయారుచేయుటయందును డిమాన్‌స్ట్రేటర్లు సహాయము చేయుచున్నారు. వీరు నీళ్లు తోడు యంత్రములను, ఇనుపనాగళ్లు, గుంటకలు మొదలగు నూతన పరికరములను నుప యోగించు విధానములను ప్రత్యక్షముగా చూపించుచున్నారు. చెరుకు తోటలను ఆడు కొనుటకు వుపయోగించునటువంటి నూతనచెరుకు గానుగుల గురించియు బెల్లము వండే పెనములు గురించియు కూడ ప్రచారముచేయుచున్నారు. ఇంతేకాక వీరు రైతుల ప ద్ధతికిని నూతన పద్ధతులకును గల తారతమ్యములను రైతులకు చూపించే కొరకు ప్రత్యే కముగా కొన్ని మళ్లను రెండు పద్దతులలోను సాగుబడి చేయించుచున్నారు. ఇందుకు సమాన ఫలవంతమైనవియు, సమమయినట్టువియు రెండు మళ్లలో ఒక సస్యమును, ఒక భాగములో రైతుల ప్రాత పద్ధతిని, ఒక భాగములో వ్యవసాయ శాఖవారు చెప్పెడి నూ తన మార్గములను సాగుచేయించి, పండిన తరువాత విడివిడిగా కోయించి, యీ రెండిం టికినిగల తారతమ్యములను ప్రత్యక్షముగా చూపించుచున్నారు. మరియు పశువుల సా లల శుభ్రతనుగురించియు, పశువులను, గొర్రెలను, మేకలను అభివృద్ధిచేయు మార్గముల యందును కోళ్లను, తేనటీగలను, పట్టుపురుగులను పెంచుమార్గములయందును కూడ సల హాల నిచ్చుచున్నారు.

వరి పంటను బాగుగా పండించుటకు ముఖ్యముగా చెప్పబడు సలహాలు యేవన :— (1) మంచి వరి వంగడములు అనగా నె 7, 30 ర్లు మైపాలి, నె 3, 4 ర్లు నవకోటి సన్నం, బంగారుతీగ నె 7, 9 ర్లు, రత్నచుడి, నె 47 రు గుణుపురం సన్నం, జి.ఇ.బి. 24, నె 3 రు పునాస అక్కుళ్లు, నె 5 రు సుంకి సన్నం, నె 1 రు బొబ్బిలిగంటి మొదలగునవి గంజాం, విశాఖపట్నం జిల్లాలలోను అక్కుళ్లు, పునాస కొనామణిలలో శ్రేష్ఠమైన వంగడములు గోదావరి జిల్లాలోను సాగుచేయుట, (2) విత్తనములను, ఆకుమళ్లలో పలచగా పోసి బద్దకట్టిన ఆకును ఉడుచుట, (3) పచ్చి ఎరువును దుమ్ముల పొడితోగాని సూపరు పాస్ పేటుతోగాని వాడుకచేయుట.

చెరుకు వ్యవసాయమునుగురించి ముఖ్యముగా నిచ్చెడి సలహాలు వివన (1) ప్రశస్త మయిన రకములను అనగా జావా నె 247 రు, సి.ఒ. 213, సి.ఒ. 281 మొద లయిన రకములను పైరుచేయుట, (2) ఇనుప నాగళ్లతోను, గుంటకతోను భూమిలో తుగా దున్ని బాగుగ తయారుచేయుట, (3) చెరుకుదవ్వను వరుసలుగాను దూరముగాను నాటుట, (4) విత్తనపు చెరుకును తయారుచేయుట, (5) గొప్పు, కాలువలు వగయి రాలు మనుష్యులచే చేయించే బదులు పశువుల సహాయ్యముచేత చేయించుట, (6) మంచి రకములగానుగలు ఉపయోగించుట, మంచిరకము బెల్లమును తయారుచేయుట.

నె 355, 525 ర్లు పునాస జొడి విత్తనములను రైతులకు పంచిపెట్టుచున్నారు. జొన్న విత్తనములను రొంచుటయందును, కాటుక తెగులు రాకుండా చేయుటనుగురిం చియు సలహాయిచ్చుచున్నారు

ఇతర పంటల విషయములో వేరుశనగయొక్క పంటను హెచ్చించుట కొరకు ప్రతి సాలున విత్తనము వేయుటను గురించియు అరటితోటలను నూతన పద్ధతిని వేయు టనుగురించియు, నారింజ వగైరా మొక్కలకు గెత్తము వేయుట నీరుకట్టుట, క్రొత్తరక ములను వేయుటనుగురించియు ముఖ్యముగా ప్రచారము చేయుచున్నారు.

ఇదిగాక కలెక్టరు జమాబందీ, జాతర్లు, పశువుల సంతలు మొదలగు వానియందు చిన్న చిన్న ప్రదర్శనములు జరుపబడును. ఈ ప్రదర్శనములో వ్యవసాయపు పని

ముట్లును, వాటి వాడుకయు అనేరకములు విత్తనములను ఎరువులను నూతనముగా కను గొనబడిన పరిశోధనా ఫలితములను తెలుపునట్టియు, క్రిమికీటకముల జీవితములను తెలుపు నట్టియు పటములనుకూడ చూపబడును. ఈ చిన్న ప్రదర్శనములుగాక సంవత్సరమున కొకసారి ప్రతి జిల్లాలోను ఒక ముఖ్యమైన స్థలమున వ్యవసాయశాఖవారు చేయుచున్న పనులను విపులముగా నొక పెద్ద ప్రదర్శనమున చూపించుచున్నారు. ఏడాదికొకసారి ప్రదర్శనపు మోటారుబండ్లు రోడ్డు నంటియుండు అనేక గ్రామములను దర్శించుచున్నవి. ఈ ప్రదర్శన సందర్భములలో లాంతరు బొమ్మలనుకూడా చూపించెదరు.

ఇప్పటికి ముఖ్యమైన సస్యములనుగురించియు మంచి మార్గములను విశదపర్చుటకు తగిన మేజక్ లాంతరు బొమ్మలు సమకూర్చబడినది. వీని ననుసరించిన ఉపన్యాసములను జిల్లా ఉద్యోగులు, ప్రదర్శనములు జరుగు చోట్లను ఇతర ముఖ్య స్థలములయందును ఇతర సమావేశములందును యిచ్చెదరు.

ఈ సర్కిల్‌లోని డిపోలలో దొరకెడి వస్తువులు యీ క్రింది జాబితాలో చూప బడినది. అవి కావలసినవారు ఎవరికి దరఖాస్తు చేయవలెనో అందును చూపబడినది. ఇదికాక డిపోలలో నిలువ చేయని వస్తువులుకూడ దరఖాస్తులు చేసినయెడల డిమాన్‌స్ట్రేటర్లు యితర స్థలమునుండి తెప్పించి సప్లయి చేయుదురు.

వ్యవసాయశాఖవారు యిచ్చెడి సలహాలేకాక, దినస్సులను అధ్యతయందును కొనుటయందును సహకారశాఖవారు విశేషముగా సహాయముచేయుచున్నారు. ఈ సహకారశాఖవారు స్థాపించిన సంఘములలో రైతులకు వ్యవసాయపు పనుల నిమిత్తము ఋణముల నిచ్చుచున్నారు. తూర్పు పడమటి గోదావరి జిల్లాలలో నివసించురైతులకు యీ విషయమై బోగట్టా కావలసియున్న యెడల రాజమండ్రిలోనున్న కో ఆపరేటివు డిప్యూటి రిజిస్ట్రారువారికిని, విశాఖపట్టణపు జిల్లావారు విశాఖపట్టణములోనున్న కో ఆపరేటివు డిప్యూటి రిజిస్ట్రారువారికిని, గంజాం జిల్లావారు బరంపురంలోనున్న డిప్యూటి రిజిస్ట్రారువారికిని వ్రాసి కనుగొనవచ్చును.

పారిశ్రామిక డిపార్టుమెంటులోని పంపింగు, బోరింగు శాఖవారు బావుల నిమిత్తము రంధ్రములు దొలుచుటకు కావలసిన పనిముట్లను ఎరువుగానిచ్చి వాటిని సరిగా పనిచేయించుటకుగు ఒక మేస్త్రీయొక్క సహాయమునుకూడ నిచ్చెదరు. ఏ యే షరతులపై యీ పనిముట్లు సప్లయి చేసెదరో యెంత చార్జి అగునో మొదలగు విషయములనుగురించి బెజవాడలోనున్న అసిస్టెంటు ఇండస్ట్రియలు ఇంజనీయరువారికి వ్రాసి తెలుసుకొన వచ్చును. వ్యవసాయశాఖవారు నీటి వసతులు బాగుపరచుటవలన గలుగులాభమునుగురించి సలహాలనిచ్చుటకు యెప్పుడును సిద్ధముగానున్నారు. నీళ్లుతోడు యంత్రములు కొనుక్కొనుటకు ఋణము కావలసియున్నయెడల, దరఖాస్తుదారుల భూములను తనిఖీచేసి సిఫార్సు చేయుదురు. ఈ ఋణము ఎట్లు లభించునో, మొదలగు విషయములనుగురించి యీ పుస్తకములోనే మరియొకచోట విపులముగా వ్రాయబడినది.

డిపోల జాబితాయును, విత్తనములు ఎరువులు మొదలగు వానికొరకు
దరఖాస్తు చేయవలసిన ఉద్యోగస్థుల హోదాయును తెలుపు పట్టీ.

| జిల్లా. | డిపోలు ఉంచబడిన స్థలము. | దరఖాస్తు చేయవలసిన ఉద్యోగస్థుని హోదా. |
|---|---|---|
| విశాఖపట్టణం ... | విశాఖపట్టణం ... | అసిస్టెంటు అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, విశాఖపట్టణం. |

విశాఖపట్నం సెంట్రలు డిపోలో లభించు వస్తువుల జాబితా.

| వస్తువుల పేర్లు. | ఖరీదు. | | | రిమార్కులు. |
|---|---|---|---|---|
| I. పనిముట్లు. | రూ. | అ. | పై. | |
| కూపరు నాగలి నెం 11 రు (యినుప సామాను మాత్రం). | 7 | 0 | 0 | ఒక్కొక్కటి. |
| కూపరు నక్కులు ... ... | 0 | 8 | 0 | డిటో. |
| కూపరు నెం 26 రు (యినుప సామానులు). | 8 | 12 | 0 | డిటో. |
| కూపరు నక్కులు ... ... | 1 | 1 | 0 | డిటో. |
| కూపరు కర్రు ... ... | 0 | 3 | 6 | డిటో. |
| హెచ్. ఎం. గుంటక నెం 0 రు (యినుప సామానులు). | 4 | 8 | 0 | డిటో. |
| హెచ్. ఎం. విడికత్తులు ... | 1 | 8 | 0 | డిటో. |
| హెచ్. ఎం. నెం 1 రు (యినుప సామానులు). | 8 | 0 | 0 | డిటో. |
| హెచ్. ఎం. విడికత్తులు ... | 2 | 12 | 0 | డిటో. |
| హెచ్. ఎం నెం 2 రు (యినుప సామానులు). | 14 | 4 | 0 | డిటో. |
| హెచ్. ఎం. విడికత్తులు ... | 3 | 14 | 0 | డిటో. |
| బక్ స్క్రేపరు అను ఇనుపనొల్ల ... | 10 | 4 | 0 | డిటో. |
| మోట గూనలు 1 అ. 10½ అం॥ సైజు. | 8 | 8 | 0 | డిటో. |
| డిటో. 2 అ. 3 అం॥ సైజు. | 9 | 10 | 0 | డిటో. |
| డిటో. 2 అ. 6 అం॥ సైజు | 14 | 0 | 0 | డిటో. |
| మోట్రతాడు లేక,బస్తు (1½ అం. ¾అం॥లు) | 0 | 2 | 0 | పౌను 1 కి. |
| II. విత్తనములు, మొక్కలు. | | | | |
| వరివిత్తనములు (ముతుకరకములు) ... | 4 | 8 | 0 | 164 పౌనులబస్తా 1 కి. |
| డిటో. (సన్నరకములు) ... | 5 | 8 | 0 | డిటో. |
| జనుము విత్తనములు ... ... | 0 | 1 | 0 | పౌను 1 కి. |
| జీలుగు విత్తనములు ... ... | 0 | 1 | 6 | డిటో. |
| పిల్లిపెసర విత్తనములు ... | 0 | 1 | 6 | డిటో. |
| నీలి విత్తనములు ... ... | 0 | 1 | 0 | డిటో. |
| వెంపలి విత్తనములు ... ... | 0 | 1 | 0 | డిటో. |
| చెరుకు దవ్వ, జావా 247, సి.ఓ. 213 యం.ఏ. 21, సి.ఓ. 281. | 2 | 8 | 0 | 500 పౌనుపుట్టి 1 కి. |
| కంబోడియా ప్రత్తి విత్తనములు ... | 0 | 1 | 0 | పౌను 1 కి. |
| హిమాయుద్దీను మామిడి అంట్లు ... | 1 | 0 | 0 | డిటో. |
| నారింజ జాతులు (దేశవాళి నారింజ వడ్లపూడి నారింజ, పంపరపనస, నిమ్మ) 1 సం॥ మొక్కలు. | 0 | 2 | 0 | డిటో. |

షరా.—నెం 9, 10, 11 ర్లు అనకాపల్లి ఫారమునుండి సప్లయిచేయించబడును. కాలమునుబట్టి ధరలు మారుచుండును. రైతులకు విత్తనములు వగయిరాలు కావలసి నప్పుడు ఆయా తాలూకాలలోనుండు డిమానుస్ట్రేటర్లకు దరఖాస్తు పంపవలెను.

రాజమండ్రి డివిజనులోని డిపోల జాబితాయున్ను, విత్తనములు యెరువులు మొదలగువాని కొరకు దరఖాస్తు చేయవలసిన యుద్యోగస్థుల హోదాయున్ను తెలుపు పట్టి.

| జిల్లా. | డిపోలు ఉంచబడిన స్థలము. | | దరఖాస్తు చేయవలసిన ఉద్యోగస్తుల హోదా. |
|---|---|---|---|
| పశ్చిమ గోదావరి. | నర్సాపురం | ... | అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, నర్సాపురం. |
| | తణుకు | ... | డిటో. తణుకు. |
| | ఏలూరు | ... | డిటో. ఏలూరు. |
| | తాడేపల్లిగూడెం | ... | అసిస్టెంటు డిమాన్‌స్ట్రేటరు, తాడేపల్లిగూడెం. |
| | భీమవరం | ... | డిటో. భీమవరం. |
| | కొవ్వూరు | ... | డిటో. కొవ్వూరు. |
| తూర్పు గోదావరి. | రాజమండ్రి | ... | అసిస్టెంటు డిమాన్‌స్ట్రేటరు, రాజమండ్రి. |
| | సామర్లకోట | ... | ఫారము మేనేజరు, సామర్లకోట. |
| | కాకినాడ | ... | అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, కాకినాడ. |
| | రామచంద్రపురం | ... | డిటో. రామచంద్రపురం. |
| | కొత్తపేట | ... | డిటో. కొత్తపేట. |
| | తుని | ... | డిటో. తుని. |
| | పెద్దాపురం | ... | డిటో. పెద్దాపురం. |
| | అమలాపురం | ... | డిటో. అమలాపురం. |

గోదావరి జిల్లాలలోనుండు డిపోలలో దొరకెడి వస్తువులయొక్క పట్టి.

| వస్తువుల పేర్లు. | | ఖరీదు. రూ. | అ. | పై. | |
|---|---|---|---|---|---|
| వరి విత్తనములు సన్న రకము | ... | 4 | 12 | 0 | మొ॥ 166 పౌను గల బస్తా 1 కి. |
| | | 4 | 15 | 0 | |
| డిటో. ముతక రకము | ... | 3 | 12 | 0 | డిటో. |
| జీలుగు విత్తనములు .... | ... | 0 | 1 | 3 | పౌను 1 కి. |
| పిల్లిపెసర విత్తనములు .. | ... | 0 | 1 | 0 | డిటో. |
| సీమచింత విత్తనములు ... | ... | 0 | 0 | 9 | డిటో. |
| కంబోడియా ప్రత్తి విత్తనములు | ... | 0 | 1 | 0 | డిటో. |
| చెరుకు దవ్వ ... | ... | 2 | 8 | 0 | 500 పౌను గల పుట్టి 1 కి. |
| మూపరునాగలి నెం 11 రు (యినుప సామాను). | | 8 | 2 | 0 | 1 కి. |
| డిటో. క్రొత్త మాదిరి | ... | 7 | 0 | 0 | డిటో. |
| డిటో. నక్కులు పాతవి | ... | 0 | 9 | 0 | డిటో. |
| డిటో. నక్కులు కొత్తవి | ... | 0 | 8 | 0 | డిటో. |

| | | | | |
|---|---|---|---|---|
| కూపరునాగలి (నె 26 రు యినుపసామాను). | 8 | 12 | 0 | 1 కి. |
| డిటో నక్కు ... ... | 1 | 1 | 0 | డిటో. |
| డిటో కర్రు . ... | 0 | 3 | 6 | డిటో. |

ఈ క్రింది జాబితాలోని వస్తువులు కోరినయెడల ప్రయత్నముచేసిన సప్లయి చేయగలరు :—

| | | | | |
|---|---|---|---|---|
| ఆరటి పిలకలు ... ... | 6 | 4 | 0 | 100 కి. |
| వినుగగడ్డి దుబ్బులు ... ... | 0 | 2 | 0 | డిటో. |
| గిన్నగడ్డి దుబ్బులు ... ... | 0 | 2 | 0 | డిటో. |
| సులువుగా తిరిగే మోట చక్రము ... | 12 | 12 | 0 | డిటో. |
| ఇనుప నొల్ల ... ... | 9 | 4 | 0 | డిటో. |
| హెచ్. ఎం. గుంటక నెంబరు '0' ... | 4 | 8 | 0 | డిటో. |
| డిటో విడి కత్తి ... ... | 1 | 8 | 0 | డిటో. |
| డిటో నె 1 రు ... ... | 8 | 0 | 0 | డిటో. |
| డిటో విడికత్తి ... ... | 1 | 12 | 0 | డిటో. |
| డిటో నె 2 రు ... ... | 14 | 4 | 0 | డిటో. |
| డిటో విడికత్తి .. ... | 3 | 14 | 0 | డిటో. |
| కూపరు నాగలి నె 25 రు (యినుప సామాను) | 4 | 8 | 0 | డిటో. |
| డిటో విడి నక్కు . | 0 | 5 | 6 | డిటో. |

వ-రా.—మార్కట్టు ధరలనుబట్టి ధరలు మారుచుండును.

### (బి) పరిశోధన.

### మార్టేరు వ్యవసాయ పరిశోధన స్థానము.

ఈ స్థానము జూలై 1925 వ సంవత్సరమున తెరువబడినది. పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలూకా, నెగ్గిపూడి గ్రామము సమీపమునందు నరసాపురము కాలువమీదనున్న మార్టేరు లాకునకు సుమారు రెండు ఫర్లాంగుల దూరమున యీ పరిశోధన స్థానము స్థాపింపబడియున్నది. ఇది నిడదవోలు రైల్వే స్టేషనునుండి, యిరువది ఒక మైళ్లలోనున్నది. అచ్చటనుండి, పడవమీదగాని, మోటారు బస్సుమీదగాని ప్రయాణము చేయవచ్చును. ఈ స్థానముయొక్క విస్తీర్ణము 50 ఎకరములు.

ఈ పరిశోధన స్థానమును చూచి తెలిసికొనవలసిన విషయములు ఆయా తరుణములు.

మే-జూన్ నెలలలో—మెట్టువరి ఆకుమళ్లు, దంపాకుమళ్లు తయారుచేయు పద్ధతి, పలుచగా వరినారు ఊడ్చుట, పచ్చి యెరువు పంటలు, పశువుల మేతకొరకు పంటలు, పైరు పంటలు, పల్లపు భూములలో నొల్ల నుపయోగించి మట్టము చేయు పద్ధతి.

జూలై నెలలో—పెద్ద పంటకు పరియాకుపోయుట, వరినారు పలుచగ నూడ్చుట, నొల్లను ఉపయోగించుట.

ఆగస్టు నెలలో—తేలిక వరులను కురువై, స్వర్ణాలు పుష్పించియుండుట, వరి సస్యము శుద్ధముగానుండుటకు కేళీలను సరియైన కాలమునందు యేరించుట, చేలగట్లమీద అపరములు.

సెప్టంబరు నెలలో.—గరిక సన్నవరి పుష్పించియుండుట, అందుల కేళీలను యెంచుట. చేలగట్లను అపరముల పైరుల కుపయోగించుట.

అక్టోబరు నెలలో—బసంగి, రసంగి, అక్కుళ్లు, పుష్పించుట, వానియందు కేళీలను యేరించుట, చేలగట్లమీద అపరముల పంట యుంచుట.

నవంబరు నెలలో—కృష్ణ కాటుకలు, కొణామణి, కిచ్చిడి సాంబ, ఆటగడ, కృష్ణా డెల్టాలో పండించు కుసుమ, వంకి సన్నము వరులు పుష్పించుట వాటియందు కేళీలను విరించుట, చేలగట్లమీద అపరముల పంటలుంచుట.

డిసంబరు నెలలో—పెద్ద పంటలో అపరములు చల్లి పండించుట.

జనవరి నెలలో—దాళ్వా (రెండవ వరిపంట) కొరకు విత్తనములు చల్లుట, వరి నారు పలుచగ నూడ్చుట, రెండవ వరిపంటకు పచ్చి యెరువు పంటలు, జనుము మేత కొరకు పెద్ద పంటలో వేయుట, అపరములు చేలగట్లమీద పచ్చి యెరువునకు వేయుట.

ఫిబ్రవరి నెలలో—దాళ్వాకొరకు వరినారుపోయుట, వరియాకు పలుచగ నాటుట, రెండవ వరిపంటకు పచ్చియాకు యెరువు పంటలువేయుట, జనుము మేతకొరకు పెద్ద పంటలో జల్లుట. చెరుకు కోత, బెల్లమువంట, సింధువాహి పాడ్యపని చేయుట.

మార్చి నెలలో—వివిధ పైరుపంటలు.—ఉల్లి, ఆముదము, నువ్వు, చోడి, కాయగూర పంటలు, రెండవ పంటగావేయు అపరములు, మిరప మొదలైన పంటలు, పెద్ద వరిపంట విత్తనముల నరుకుంచుట.

ఏప్రిల్ నెలలో.—దాళ్వా లేక రెండవ వరిపంట పుష్పించియుండుట, వేసవికాలమున పశువుల మేతకొరకు పైరుకాలపు పంట లుండుట.

ఇ.రా.—సంవత్సరములో అన్ని కాలములందును, చెరకు, అరటి పెంచు మంచి పద్ధతులు చూడవచ్చును. కారెము, గూడలు, వీనికి బదులు ఆర్కిమీడియన్ స్క్రూ నీటిని యెత్తుట కుపయోగించుటయు, జొన్నకర్రలను, జనపకర్రలను సన్నగా తరుగుటకు యంత్రమును, పశువులకు సరిగా మేతపెట్టుటయు, పశువుల యెరువును జాగ్రత్తపరచుటయు, తెలిసికొనవచ్చును.

పరిశోధనలోనున్న ముఖ్యాంశములు.

1. ఎన్నికవలన దిగుబడి హెచ్చుచేయుట.

2. ప్రస్తుతమువలె వంగడములను ప్రత్యేకముగ సాగుచేయుటకంటె కొన్ని వంగడములను చేర్చి సాగుచేయుట.

3. పంటను 'సంక్రమము' వలన వృద్ధిచేయుట.

4. రెండవ పంట విషయము.—ఋతు సంబంధమైన చిక్కులను తప్పించుకొనుటకుగాను దాళ్వా పంటను ముదురుగా పూడ్చుట.

5. కృషి విధానమునుగూర్చిన శోధనలు.—

(ఎ) ముదురుగా ఆకుపోయుటకు వీలుగలిగి, ముదురుగా నాటుటకు వీలులేని ప్రదేశములయందు నారును రెండుసార్లు నాటుట.

(బి) సన్నధాన్యము డెల్టా భూములలో కొన్ని నాళ్లకు ముదురై వాటికి మొదటనున్న హెచ్చుధర వచ్చుటలేదు. ధాన్యము ముదురు కాకుండనుండుటకు క్రొత్త పద్ధతులను గనిపెట్టుట.

(సి) గింజ పరిమాణమునుబట్టి చల్లవలసిన విత్తనముల పరిమితి నిశ్చయించుట; ఎంతవరకు విత్తనము తగ్గించుటకు వీలుగదునో అంతవరకు తగ్గించినయెడల దాని లాభము, అటుపైని పైరునకు గలుగు లాభము.

(డి) ఒక పంట పెట్టే భూములకు, రెండు పంటలు పెట్టే భూములకు లేక పైరు పంటలు పెట్టే భూములకు తగిన రకములను నిర్ణయించుట.

6. ఎరువులు (సత్తువ) వేయుటయందు చేయు శోధనలు—

(ఎ) ఏ మోస్తరుగా పంటకు సత్తువచేసిన మిక్కిలి లాభముగా నుండునో ఆ పద్ధతులను కనిపెట్టుట.

(బి) ఇతరుల ధనసహాయమువలన పంటకు సత్తువ చేయుటయందు చేయబడు చున్న శోధన.

7. వరితో యితర పంటలనుమార్చి, దానివలన ఎక్కువ ఆదాయము వచ్చునట్లు చేయుట—

(ఎ) కంబోడియా ప్రత్తి.

(బి) చెరకు—

(i) వరిపంటతో చెఱకును మార్చుటవలన వచ్చు లాభ నష్టములు.

(ii) జొన్నతో సంకరజాతులు—డెల్టా భూములకు తగినవి యెంచుట, వాటిని నాటుటకు సరియైన కాలమును నిర్ణయించుట.

(iii) చెఱకునకు కొయ్యనాటుటమాని కొయ్యలతో అడ్డముగా పాదలను కట్టి (Railing) చెరుకు వ్యవసాయపు మదుపును తగ్గించుట.

(iv) 'కార్చి' తోటల పరీక్ష.—యిప్పుడు గల ముఖ్యమైన చెఱకు రకములలో ఏవి 'కార్చి' తోటకు పనికి వచ్చునో కనిపెట్టుట.

(సి) అరటి—

(i) అరటిని వరితో మార్చుటవలన వచ్చు లాభ నష్టములు.

(ii) మామూలు పద్ధతినిగాక, చెట్టునకు రెండు పిలకలను విడిచిపెట్టి దాని వలన హెచ్చు లాభము వచ్చునట్లు చేయుట.

(iii) కొంచెము మెరక మళ్లలో చులకన ధాన్యపు కోత అయిన తరువాత అరటిని వేసి తిరిగి వచ్చే వరిపంటలోగా (అనగా) జూన్, జూలై మాసములలో కూరలు దొరకని సమయమందు గెలలను ఉపయోగపడునట్లు చేయుట.

8. ఇతర శోధనలు—

(ఎ) పెద్ద పంటలో రెండు రకముల పరీక్ష, రెండు రకములు వేరువేరుగా వేయుట, కలిపివేయుట (ఊడుపు పద్ధతి).

3-A

(బి) ముదురు ఉడుపు, లేత ఉడుపు, తంపర భూములలో పైరు మామూలు పల్లపు నేలలలో పైరు వీటినిగురించి వాటివాటి వైఖరిని పరీక్షించుట.

9. పెట్టుబడి తగ్గించి వరి వ్యవసాయము లాభముగానుండునట్లు చేయుట.

10. వరి ఊచతిరి పురుగు విషయమై అన్నివిధముల పరీక్షచేసి దానివలన కలుగు నష్టమును తగ్గించుట.

చూపరులు ఆహ్వానింపబడుచున్నారు.

## వ్యవసాయ పరిశోధన స్థానము, సామర్లకోట.

సామర్లకోటలో వ్యవసాయ పరిశోధన స్థానము 1902 వ సంవత్సరమున స్థాపింపబడినది. ఇది తూర్పు గోదావరి జిల్లా డెల్టా భూములకు ఉత్తరమునను, తేలికయైన మెరక భూములు కలిసెడి ప్రాంతమునను, సామర్లకోట కాలువకు దక్షిణమునను, కాకినాడవెళ్లు రోడ్డున, సామర్లకోట రైల్వే స్టేషనునుండి ఒక అర మైలు దూరమున నున్నది. దీని పరిమితి య 57.42 లు. అందులో 45 యకరములు మాత్రము సాగున నున్నది. తక్కినవి యిళ్లచేతను, రోడ్లచేతను, గట్లచేతను ఆక్రమింపబడి యున్నవి.

ఈ స్థానమునుచూచి తెలిసికొనవలసిన విషయములు, ఆయా తరుణములు.

జనవరి నెలలో—వరి ఆకుమళ్లు, రెండవ వరి పంటకు నేలలను తయారుచేసి ఊడ్చుట, అరటిగెలలను ఒక వెదురుతోకట్టి జాగ్రత్తచేయుట, అరటిగెలలను కొట్టుట, ప్రత్తి, వంగ మొదలగు వ్యవసాయములలో ఒక యెద్దుతోగాని, రెండెడ్లతోగాని వరుసల మధ్య దున్ని గుంటుక సేద్యము చేయుట, వివిధరకములైన శీతకాలపు కాయగూరలు వేయుట, చెరకునకు భూమి తయారుచేయుట, శీతకట్టు అరటితోటలను వేయుట, నీరు కట్టకుండగను, నీరుకట్టియు పెంచిన చెఱకు వ్యవసాయములు ఆటకు సిద్ధముగా నుండుట కనబడును.

ఫిబ్రవరి నెలలో—పైన ఉదహరించిన అంశములున్నూ, చెరకు దవ్వనెంచుట, శుభ్రముచేయుట, వరుసగా నాటుట, చెరకు కొట్టుట, ఆడుట, గోదావరి, సిందువాహి పొయ్యిలమీద బెల్లము చేయుట చూడవచ్చును.

మార్చి నెలలో—బెల్లము వండుట, పంచదార తయారుచేయుట, చెరకు మొదలగు వ్యవసాయములలో పశువులు లాగవలసిన పనిముట్లతో దున్నుట, అరటిగెలలనుకొట్టుట, అరటిపండ్లను నిలవకు తయారుచేయుట.

ఏప్రిల్ నెలలో—దాళ్వావరికోత, పచ్చియెరువులకు విత్తనములు చల్లుట, చెరకులో కాల్వలు త్రవ్వుట.

మే నెలలో—పశుగ్రాసము, పచ్చియెరువులు, చెరుకు, అరటి నెలాఖరున వరి ఆకుమళ్లు పలచగపోయుట, ప్రత్తియేరుట, అనాసరకముల పంట, ప్రత్తియేరుట ఆర్కిమిడియన్ స్క్రూ పనిచేయుట.

జూన్ నెలలో—వరి ఆకుమళ్లలో పలుచగ విత్తనములు చల్లుట, పచ్చియెరువులను దమ్ముచేయుట, వరిమళ్లను తయారుచేయుట, జొన్న, చెరుకు రకములను వేయుట,

విత్తనముకొరకు చెరకు నాటుట, అరటితోటలను వేయుట, అరటిపిలకలు అమ్ముట, మొక్కజొన్న, సోయచిక్కుడు వగైరా చల్లుట, చెరకునకు యెరువువేయుట.

జూలై నెలలో—దున్నుటలపొడి, మరి యితర యెరువులు వరికి వేయుట, వరి ఆకు ఒక్కొక్క మొక్కగ ఊడ్చుట, చెరకు, అరటితోటలకు అనాసతోటలకు ఎరువువేయుట, ఊట కాల్వలు లోతుచేయుట.

ఆగష్టు నెలలో—వరియందు కేళీలుతీయుట, కలుపుతీయుట, చెరకునకు కొయ్య వేయుట, చుట్టుట అనవసరమైన చెరకు పిలకను తీసివేయుట.

సెప్టంబరు-అక్టోబరు నెలలో—చులకన ధాన్యపు కోత, మధ్య వరి రకములు నాటుట.

నవంబరు-డిసంబరు నెలలో—వరి చేను కోత, వరి కొయ్యకాలులో మైరు వ్యవసాయమునకు విత్తనములు చల్లుట, నారు ఊడ్చుట, క్యాబేజ్ మొదలైనవి నాటుట.

పైన ఉదహరించినవిగాక సంవత్సరము పొడవునకు యెన్నియో అంశములు చూడవచ్చును. పశుగ్రాసమునకు పనికివచ్చే వ్యవసాయములు, పలువిధములుగా యెరువు జాగ్రత్తచేయుట, పశువులసాలలో చెత్త, మన్ను వేసి పశువుల నీరుడి జాగ్రత్తచేయుట, చెత్తయు, కలుపుమొక్కలు, కుళ్లబెట్టిన గోతులు, కోళ్లను, పట్టుపురుగులను, తేనెటీగలను, చేపలను పెంచువిధములున్నూ, సీమచింతకోరడిగా యేర్పడియున్న దానిని, ఫలజాతులచెట్లున్ను చూడనగును. చీడపురుగులు, బూజుతెగుళ్లు, వాటి నివారణమార్గములు అవి వచ్చుసమయములలో చూడవచ్చును.

పరిశోధన చేయు సంగతులు.

1. చెరకు.—(ఎ) చెరకు రకములు, కోయంబత్తూరు విత్తనపు చెరకులు, జొన్నతో సంకరపు చెరకు రకములు వేయుట. ఆయా రకములలో వ్యవసాయ సౌకర్యములనుబట్టియు, రసాయనలక్షణములనుబట్టియు మంచి రకములు ఎంచబడి పరిశోధన చేయబడుచున్నవి.

(బి) చెరకును పల్లపు నేలయందును, మెరకయందును ఒక్కతడికట్టియు, తడి కట్టకయుకూడా వేసి తనిఖీచేయుచున్నారు.

(సి) వ్యవసాయపు ఖర్చులను తగ్గించుటయందును, నాటుటయందును, మొలిచిన దవ్వ ఉడుచుటయందును, ప్రతి నెలలలో నాటిన చెరకు పంటనుగురించియు, యే రకమునకు యెంత నత్రజని కావలసియున్నది మొదలగు విషయములుగురించియుకూడా పరీక్షచేయుచున్నారు.

(డి) చెరకుఆడు గానుగలు, బెల్లమువండు ప్రొయ్యిలు, బెల్లముచేయుట, పంచదార తయారుచేయుట మొదలగువానినిగురించికూడ శ్రద్ధచేయుచున్నారు.

2. వరి.—(ఎ) సారువా, దాళ్వా వరి ధాన్యములలో మంచిరకములను యెంచుట, ఆ ఎంచిన రకములను పరీక్షచేయుట, వాటియొక్క తారతమ్యములు కనుగొనుట, మంచి రకములను వృద్ధిచేయుట.

(బి) పల్లపు నేలలలో మెరక దుక్కియొక్క మంచిచెడ్డలను కనుగొనుట. ఇసుక వేయుటవలన కలుగు లాభములను కనుగొనుట, చెరకు ఉడుపువలన నేలలో గలుగు భేదములను కనిపెట్టుట, రెండు పంటలకు మధ్యకాలములో జనుము విత్తనములను తనిఖీచేయుట, చెరకుపంట దరిమిలాను వరికి కావలసిన ఎరువును కనుగొనుట.

3. అరటి—

(ఎ) రకములను పరీక్షించుటయు,

(బి) పిలకలు వేయవలసిన సమయము, ఎట్టి పిలకలు వేసినయెడల, ఎప్పుడు కొట్టువంటి గెలలువేయునో, అవి యెంతకాలము నిలవయుండునో, కనుగొనుటయు.

(సి) యేయే యెరువులు యెంత కావలయునో తెలిసికొనుటయు.

(డి) అరటిపండ్లను యెండబెట్టి నిలువకు తయారుచేయుట.

4. పయరు పంటలు.—రెండవ పంటకు బదులుగా కంబోడియా ప్రత్తి, చోడి, సుజ్జ్వా, టమాటో, వంకాయలు, కూరగాయలు, ఆముదాలు, పొగాకు వేయుట.

5. పచ్చియెరువులు, పశుగ్రాసము.—పిల్లపెసర, లూసర్న్, గిన్నీగడ్డి మొదలగు వానిని పరీక్ష చేయుట.

6. ఫలవృక్షములు.—ఫలజాతులలో అనేక రకములు వేసి పరిశోధనచేయుట.

7. తదితర విషయములు.—సస్యములకు కావలసిన నీరు, ఓడపురుగుల యొక్కయు, తెగుళ్ల యొక్కయు నివారణ పద్ధతులు, మదుపు తగ్గించుటకు వివిధరకముల పనిముట్ల ఉపయోగము మొదలైన విషయములు కనిబెట్టబడుచున్నవి.

చూపరులు ఆహ్వానింపబడుచున్నారు.

## వ్యవసాయ పరిశోధన స్థానము, అనకాపల్లి.

ఈ పరిశోధన స్థానము 1913 వ సంవత్సరమున స్థాపింపబడినది. దీనిని చూచుటకు వచ్చెడువారు రైలుమార్గమునగాని రోడు మార్గమునగాని రావచ్చును. ఇది రైల్వే స్టేషనుకు ఉత్తరమున ఒక ఫర్లాంగులో చోడవరం-మాడుగుల రోడుప్రక్కనున్నది. ఇది మొట్టమొదట స్థాపించబడినపుడు 41 యకరములు విస్తీర్ణము కలిగియుండెను. 1926 వ సంవత్సరమున 104 యకరములకు పెంచబడినది. అందులో 69·80 యకరములు మాత్రము సాగుక్రిందను, తక్కినవి యిండ్లచేతను, రోడ్లచేతను ఆక్రమించబడియున్నవి.

### ఈ పరిశోధన స్థానములో, తెలిసికొన విషయములు, ఆయా తరుణములు.

జనవరి మొదలు ఫిబ్రవరి 15 వ తారీకువరకు.—తేలికైన యినుప నాగళ్లను యెంతలోతు దుక్కి కావలయునో అందుకు తగినట్లు అమర్చుటయు, ఇనుప నాగళ్లచే భూమిని యెత్తు పల్లములులేక యెట్లు దున్నవలయునో తెలిసికొనుటయు, పశువులను త్రాళ్లులేకయే కాడిని పూయుటయు, ఆటకు తయారైన చెరకును, పైరు చోడి ఊడ్పును చూడవచ్చును.

ఫిబ్రవరి 15 వ తేది మొదలు ఏప్రిల్ 15 వరకు —తయారైన చెరుకుతోటలు కొట్టుటయు, చెరకు దవ్వను మంచిపద్ధతిని నాటుటయు, మేలైన యినుప గానుగలతో చెరుకు ఆడుటయు, క్రొత్త పద్ధతిని కట్టిన పొయ్యిమీద బెల్లము, పాలబెల్లము వండుటయు చూడవచ్చును. లేవడి దవ్వకొరకు పెంచిన తోటలు, వర్షాధారమున పెంచిన తోటలు, పైరు చోడిలో యుంచిన కొన్ని మంచి వంగడములు పశువులకు మాగుడుచేసిన మేత పెట్టుటయు చూడవచ్చును.

ఏప్రిల్ 15 వ తేది మొదలు మే 31 వరకు—నీరులేక పెరుగుచున్న కొన్ని చెరకు రకములున్ను, పునాసచోడి, గంటిఆకుమళ్లుపోయుటయు చూడవచ్చును. చెరకు, తాటిరసమునుండి సెంట్రిఫ్యూగల్సు (Centrifugals) వల్ల పంచదార తయారుచేయుట, క్రొత్త పద్ధతిని పాలబెల్లము వండుట, చెరుకు నాటుట చూడవచ్చును.

జూన్-జూలై నెలలలో.—పచ్చిఎరువుకును మాగుడుచేయబడు సస్యముల కొరకును విత్తనములు చల్లబడును. చెరకునకు మొదటిపట్టును, ఎరువువేయుటయు, కాలువలు త్రవ్వుటయు, వరి విత్తనములు ఆకుమళ్లయందు చల్లుటయు, మాగుడుగడ్డి తయారుచేయుటయు చూడవచ్చును.

ఆగస్టు - సెప్టెంబరు నెలలో.—గంటి, చోడి చొప్పలను జనుముతో కలిపి మాగుడుచేయుటయు, విత్తనముకొరకు చెరకు నాటుటయు, వరి ఊడ్పులు మంచి పద్ధతుల మీద చేయుటయు, సాలు చోడి ఆకుమళ్లు పోయుటయు చూడవచ్చును.

అక్టోబరు - నవంబరు నెలలో.—వరిపొలములలో కేలను తీసి రకములను శుభ్రపరచుట. చెరకు, చోడ, మొదలైన పంటలచే యీ కాలమునందు భూమి యావత్తు నిండియుండి చూచువారలకు చాలా ఆనందము కలుగజేయును.

డిసెంబరు నెలలో.—వరికోయుటయు, చెరకునకు నీరు పెట్టుటయు, పైరు చోడి నాటుటయు, ఇనుప నాగళ్లు పనిచేయుటయు చూడవచ్చును. యిదియేగాక పశువుల గొత్తమును శుభ్రముగా భద్రపరచుట, విశేషముగా ఖర్చులేకుండా పశువులను బాగుగా మేపుట, ఆబోతులను, ఆవులను, పట్టుపురుగులను, కోళ్లను, తేనెటీగలను పెంచుట, పుష్పముల మొక్కలను కూరగాయలను పైరు చేయుట, నవీనమైన కొన్ని జాతులను యెల్లప్పుడు చూడవచ్చును.

## పరిశోధన చేయు విషయములు.

1. వరి.—(ఎ) వరి రకములనుండి మంచి వంగడముల నెంచుట, వాటి గుణములను పరీక్షించి వాటిలో మంచివాటిని వృద్ధిచేయుట.

(బి) వరికి పచ్చి ఆకు ఎరువు వేసినచో బాగుగా ఫలించునను సంగతి కనుగొనుట.

2. చెరుకు.—(ఎ) రకముల పరీక్ష.

(i) చెరకు రకముల లక్షణములను అనగా వాటి స్వభావము, పెరుగుట, పుష్టి మొదలైనవానిని కనుగొనుట.

(ii) చెరుకు రకములను రెండు విధములుగా పరీక్షించుట, (1) 56 పౌనులు నత్రజనియిచ్చి నీరు తగ్గించుట, (2) 100 పౌనుల నత్రజనియిచ్చి విశేషముగా నీరుపెట్టుట.

(iii) నీరు, ఎరువు చాల తక్కువవేసి చెరుకు రకములను పరీక్ష చేయుట.

(iv) జక్కర నేలలోగాని, ఆగస్టు నెలనుండి ముంపుడుగానున్న భూములలోగాని ఆగు చెరకు రకములను కనుగొనుట. సి.ఓ. నె 281 రు రకము యిట్టి చోట్లకూడ పెరుగుచున్నది.

(v) ఒక్క తడితో అగునట్టి చెరుకు రకములను నాటుట.

(vi) పల్లం, మెరక భూములలో చెరుకును పెట్టి వ్యవసాయముగ చేయుట.

(vii) పంచదార నిమిత్తము తగిన రకములు కనుగొనుట.

(viii) పల్లం, తోట భూములలో పునాసపంట అయినతరువాత చెరకు వేయుట.

(ix) జొన్నతో సంకరపు చెరుకు రకములను అనేక తరగతుల నేలలలో పరీక్షించుట.

(బి) ఎరువును గురించి పరీక్ష—

(i) చెరుకుయొక్క ఎరువు విషయమై నత్రజని, స్ఫురము ఎంత కావలెనో కనుగొనుట.

(ii) చెరుకునకు ఏ ఎరువులు కావలెనో కనుగొనుట.

(iii) బాగుగ ఎరువువేసిన భూములనుండి తెచ్చిన విత్తనము ఎరువులేని భూములనుండి తెచ్చిన విత్తనము, వీటిలో ఏది నాటిన ఎక్కువ దిగుబడివచ్చునో చూచుట

(సి) వ్యవసాయ పద్ధతుల విషయమై మరికొన్ని సోదాలు—

(i) ఎక్కువ విత్తనము ఉపయోగించుటవల్ల ఎక్కువ దిగుబడి వచ్చునేమో చూచుట.

(ii) లోతుకాలవలలో పాతుట, గట్లువేసి వానిమీద పాతుట వీటివల్ల చెరుకు పెరకువ వగైరా భేదములు కనిపెట్టుట.

(iii) ప్రతి నెలలోను చెరుకు రకముల నాటి, ఏ నెలలో బాగా ఉండునో చూచుటయు, కోయంబత్తూరు, మధుర జిల్లాలలోవలె చెరుకు నాటుటకు సంవత్సరమునకు రెండు సమయములు కనుగొనుట.

(iv) విశాఖపట్నం జిల్లాలో అక్కడక్కడ, గంజాం జిల్లాలోవలె చెరుకు నారుపెంచ, నారును ఊడ్చుట.

(v) నీటిపారుదల విషయమై సోదాలుచూచి దానినిబట్టి చెరకు పెరకువ, బెల్లము దిగుబడి తనిఖీ చేయుట.

(vi) చెరుకును చుట్టుటనుగురించియు, వాసము వేయుటను గురించియు తగినంత సులభమైన పద్ధతులను కనుగొనుట.

(vii) కార్చితోటలను ఉంచుట లాభమా? నష్టమా? కనుగొనుట.

3. చోడి.—మంచిరకముల విర్పు—ఎక్కువగా దిగుబడియిచ్చు మంచి రకములను ఏర్పాటుచేయుట.

4. ఇతర సస్యములు—

(ఏ) కొర్ర, గంటిరకములను నాటి వాటియొక్క దిగుబడులను తెలుసుకొనుట.

(బి) సమురు దినుసులు—నువ్వులు, ఆముదములు, వేరుసెనగ రకములు వేరువేరుగా వేసి వాటిలో ఎక్కువ దిగుబడియున్నవాటిని కనుగొనుట.

(సి) మిగిలిన సస్యములు—పొగాకు, మిరప, సోయచిక్కుడు, అరటి, సెనగ, వీటిని గూర్చికూడా శోధనలు జరుగుచున్నది.

(డి) మేత, ఎరువు సస్యములు—జొన్న పశువుల మేత కొరకును, పిల్లిపెసర, కట్టెజనుము పచ్చి ఆకు ఎరువు కొరకును వేయబడుచున్నవి.

(ఇ) ఫలవృక్షములు—నిమ్మ, నారింజ వగైరా ఫలవృక్షములు పైదేశములనుండి తెచ్చి యిచ్చట పెంచబడుచున్నది.

(ఎఫ్) కూరగాయలు—దేశీయ, విదేశీయ కూరగాయ రకములు వ్యవసాయముచేసి, వాటిలో సంక్రమముచేసి వాటిలో మంచివి ఉత్పత్తిచేయుట.

(జి) పూల మొక్కలు—గులాబి, మల్లె, చామంతి మొదలగు పూల మొక్కలు అమ్మకమునకు యున్నవి.

5. పరిశ్రమలు—తేనె టీగలను మచ్చికచేసి తేనెతీయుట, పట్టు పురుగులను పెంచుట, మంచి జాతికోళ్లను పెంచి వాటిని అభివృద్ధిచేయుట పరిశ్రమలలో ముఖ్యాంశములైయున్నది.

## బరంపురం వరి పరిశోధన స్థానము.

ఈ పరిశోధన స్థానము 1932 వ సంవత్సరమున తెరువబడినది. గంజాం జిల్లా, బరంపురం తాలూకా, శంకరాపురం గ్రామం సమీపమున బరంపురంనుండి అస్కాకును, దిగపూడికున్న పోవు రోడ్లు కలియుచోట యీ ఫారము స్థాపింపబడినది. దీని విస్తీర్ణమును సుమారు 33 యకరములు.

ఈ వరి పరిశోధన స్థానమును చూచి గమనించ దగిన విషయములు; ఆయా తరుణములు.

మే నెలలో—"కూపరు" యినుప నాగలి మొదటి దుక్కిచేయుట కుపయోగించుట హెచ్.ఎమ్. గుంటకను దున్నిన మళ్లలో గెడ్డలను, గడ్డకట్టిన మట్టిని పొడుము చేయుటకై వాడుట.

జూన్ - జూలై నెలలలో—కట్టె జనుము, జీలుగ మొదలైన పచ్చి ఎరువు పైర్లను జల్లుట, పలచనగా వరి నారును పోయుట, చల్లికచేలయందు వరిని విత్తుట.

ఆగస్టు నెలలో—ఎరువు పైర్లను పడద్రోసి దమ్ముచేయుట, తేలిక భూములయందు దమ్ములకు ఇనుపనాగళ్ల యుపయోగము (ముఖ్యముగా "కూపరు" నాగలి) వరి యూడ్పులు మంచి పద్ధతులమీద చేయుట.

సెప్టెంబరు నెలలో—వరి యూడ్పు, గట్ల పైని అపరములను జల్లుట.

అక్టోబరు - నవంబరు నెలలలో—వివిధ వరి రకములు పుష్పించుట, వాటియందుగల కేళీల నేరుట.

(v) ఒక్క తడితో అగునట్టి చెరుకు రకములను నాటుట.

(vi) పల్లం, మెరక భూములలో చెరుకును పెట్టి వ్యవసాయముగ వేయుట.

(vii) పంచదార నిమిత్తము తగిన రకములు కనుగొనుట.

(viii) పల్లం, తోట భూములలో పునాసపంట అయినతరువాత చెరకు వేయుట.

(ix) జొన్నతో సంకరపు చెరుకు రకములను అనేక తరగతుల నేలలలో పరీక్షించుట.

(బి) ఎరువును గురించి పరీక్ష—

(i) చెరుకుయొక్క ఎరువు విషయమై నత్రజని, స్ఫురము ఎంతకావలెనో కనుగొనుట.

(ii) చెరుకునకు ఏ ఎరువులు కావలెనో కనుగొనుట.

(iii) బాగుగ ఎరువువేసిన భూములనుండి తెచ్చిన విత్తనము ఎరువులేని భూములనుండి తెచ్చిన విత్తనము, వీటిలో ఏది నాటిన ఎక్కువ దిగుబడివచ్చునో చూచుట

(సి) వ్యవసాయ పద్ధతుల విషయమై మరికొన్ని సోదాలు—

(i) ఎక్కువ విత్తనము ఉపయోగించుటవల్ల ఎక్కువ దిగుబడి వచ్చునేమో చూచుట.

(ii) లోతుకాలవలలో పాతుట, గట్లువేసి వానిమీద పాతుట వీటివల్ల చెరుకు పెరకవ వగైరా భేదములు కనిపెట్టుట.

(iii) ప్రతి నెలలోను చెరుకు రకముల నాటి, ఏ నెలలో బాగా ఉండునో చూచుటయు, కోయంబత్తూరు, మధుర జిల్లాలలోవలె చెరుకు నాటుటకు సంవత్సరముకు రెండు సమయములు కనుగొనుట.

(iv) విశాఖపట్నం జిల్లాలో అక్కడక్కడ, గంజాం జిల్లాలోవలె చెరుకు నారుపెంచ, నారును ఊడ్చుట.

(v) నీటిపారుదల విషయమై సోదాలుచూచి దానినిబట్టి చెరకు పెరకువ బెల్లము దిగుబడి తనిఖీచేయుట.

(vi) చెరుకును చుట్టుటనుగురించియు, వాసము వేయుటను గురించియు తగినంత సులభమైన పద్ధతులను కనుగొనుట.

(vii) కార్చితోటలను ఉంచుట లాభమా? నష్టమా? కనుగొనుట.

3. చోడి.—మంచిరకముల ఏర్పు—ఎక్కువగా దిగుబడియిచ్చు మంచి రకములను ఏర్పాటుచేయుట.

4. ఇతర సస్యములు—

(ఎ) కొర్ర, గంటిరకములను నాటి వాటియొక్క దిగుబడులను తెలుసుకొనుట.

(బి) నమురు దినుసులు—నువ్వులు, ఆముదములు, వేరుసెనగ రకములు వేరువేరుగా వేసి వాటిలో ఎక్కువ దిగుబడియున్న వాటిని కనుగొనుట.

(సి) మిగిలిన సస్యములు—పొగాకు, మిరప, సోయచిక్కుడు, అరటి, సెనగ, వీటిని గూర్చికూడా సోధనలు జరుగుచున్నది.

(డి) మేత, ఎరువు సస్యములు—జొన్న పశువుల మేత కొరకును, పిల్లిపెసర, కట్టెజనుము పచ్చి ఆకు ఎరువు కొరకును వేయబడుచున్నవి.

(ఇ) ఫలవృక్షములు—నిమ్మ, నారింజ వగైరా ఫలవృక్షములు పైదేశములనుండి తెచ్చి యిచ్చట పెంచబడుచున్నది.

(ఎఫ్) కూరగాయలు—దేశీయ, విదేశీయ కూరగాయ రకములు వ్యవసాయము చేసి, వాటిలో సంక్రమము చేసి వాటిలో మంచివి ఉత్పత్తిచేయుట.

(జి) పూల మొక్కలు—గులాబి, మల్లె, చామంతి మొదలగు పూల మొక్కలు అమ్మకమునకు యున్నవి.

5. పరిశ్రమలు—తేనె టీగలను మచ్చికచేసి తేనెతీయుట, పట్టు పురుగులను పెంచుట, మంచి జాతికోళ్లను పెంచి వాటిని అభివృద్ధి చేయుట పరిశ్రమలలో ముఖ్యాంశము లైయున్నది.

## బరంపురం వరి పరిశోధన స్థానము.

ఈ పరిశోధన స్థానము 1932 వ సంవత్సరమున తెరువబడినది. గంజాం జిల్లా, బరంపురం తాలూకా, శంకరాపురం గ్రామం సమీపమున బరంపురంనుండి అస్కాకును, దిగుపూడికున్న పోవు రోడ్డు కలియుచోట యీ ఫారము స్థాపింపబడినది. దీని విస్తీర్ణమును సుమారు 33 యకరములు.

ఈ వరి పరిశోధన స్థానమును చూచి గమనించి దగిన విషయములు ;
ఆయా తరుణములు.

మే నెలలో—"కూపరు" యినుప నాగలి మొదటి దుక్కిచేయుట కుపయోగించుట హెచ్.ఎమ్. గుంటకను దున్నిన మళ్లలో గెడ్డలను, గడ్డకట్టిన మట్టిని పొడుము చేయుటకై వాడుట.

జూన్ - జూలై నెలలో—కట్టెజనుము, జీలుగ మొదలైన పచ్చి ఎరువు పైర్లను జల్లుట, పలచనగా వరి నారును పోయుట, చల్లికచేలయందు వరిని విత్తుట.

ఆగస్టు నెలలో—ఎరువు పైర్లను పడద్రోసి దమ్ముచేయుట, తేలిక భూములయందు దమ్ములకు ఇనుపనాగళ్లే యుపయోగము (ముఖ్యముగా "కూపరు" నాగలి) వరి యూడ్పులు మంచి పద్ధతులమీద చేయుట.

సెప్టెంబరు నెలలో—వరి యూడ్పు, గట్ల పైని అపరములను జల్లుట.

అక్టోబరు - నవంబరు నెలలలో—వివిధ వరి రకములు పుష్పించుట, వాటియందుగల కేళీల నేరుట.

డిసంబరు నెలలో—చులకన వరి కోతలైన తరువాత కంబోడియా ప్రత్తిని ఇంగ్లీషు కూరలు (టమాటా, నూలుకోలు వగైరా) వేయుట. దుక్కిచేసి జనుము పశువుల మేతకున్ను, పెసర పంటకున్ను వేయుట.

జనవరి మొదలు మార్చి నెలవరకు—వెంపలి, నీలి పచ్చి యెరువుకొరకు విత్తుట, వరి మిడత గ్రుడ్లను చంపుటకు గిట్లను నరుకుట.

ఏప్రిల్ నెలలో—చెరుకుమంచి పద్ధతులలో నాటుట.

ఇక్కడ పరిశోధించెడి విషయముల క్లుప్త వివరములు.

(ఎ) ఈ ప్రాంతమం దుపయోగింపబడుచున్న వరులలో రకములను ఏర్చి జాగ్రత్త పరుచుట.

(బి) గంజాం జిల్లాలో హెచ్చుగా వాడబడుచుండు వరి రకములనుండి బాగా ఫలించు మంచి జాతులను తయారుచేయుట.

(సి) వరి సస్యమందుగల గుణముల పరీక్షించి మంచి పంటలకును వాటికినిగల సంబంధములను స్పష్టపరచుట.

(డి) వరిసస్యముయొక్క పద్ధతులలో మంచి వాటినిగూర్చి పరీక్షలు.

(ఇ) వరిచేలకెట్లు సత్తువచేయవలెనను అంశములగూర్చి చర్చలు.

(ఎఫ్) ఇవిగాక, వరిపొలము లీదేశమందు జనవరి మొదలు జూలైవరకు కొర్నుగా విడువబడుచున్నవి. ఇట్టి స్థలములయందు బాగా లాభమునిచ్చు పంటలు (అనగా చెరుకు, నువ్వు, ప్రత్తి, కూరగాయలు వగైరా) పండించుటకెంతవరకు వీలుగలదాయను పరీక్ష.

చూచుటకు వచ్చెడువారు ఆహ్వానింపబడుచున్నారు.

సి. రామస్వామి నాయుడు,

వ్యవసాయపు డిప్యూటి డైరక్టరు.

---

## 2 (b) రెండవ సర్కిల్.

ఈ సర్కిలులో కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలు చేరియున్నవి. ఈ సర్కిలు గుంటూరు మకాముగా నేర్పరచుకొనియున్న ఒక డిప్యూటి డైరక్టరుగారి స్వాధీనము క్రిందయున్నది. గుంటూరు మకాముగా గల ఒక అసిస్టంటు డైరక్టరుగారు వీరికి సహాయులుగా నున్నారు. నెల్లూరు, గుంటూరు జిల్లాలు వీరి అధీనముక్రిందయున్నవి.

### (ఎ) ప్రచారము.

నూతన వ్యవసాయ పద్ధతులను ప్రచారమునకుగాను చాల వరకు అన్ని తాలూకాలలోను డిమానుస్ట్రేటరులను నియమించుచున్నారు. ప్రతి తాలూకాలోను 8 మొదలు 10 చోట్ల అయిదేసి గ్రామములు ఒక గ్రూపుగ నేర్పరచి ప్రచారము చేయుచున్నారు. అట్లు చేయుటవలన 40—50 గ్రామములలోవరకు ప్రస్తుతము ప్రచారము నడుపబడుచున్నది. ఈ సెంటర్లలో కొంతవరకు పనిజరిగిన తరువాత యితర సెంటర్లు తీసికొనబడును. ఆయా గ్రామములలో ప్రచారముచేసి రైతులకు తగు సలహాల నొసంగుట

డిమానుస్ట్రేటర్ల విధియైయున్నది. ప్రస్తుతము యీ డిమానుస్ట్రేటర్లు యెచ్చటెచ్చట పనిచేయుచున్నారో యీక్రింద పట్టీలో వివరింపబడినది :—

| తాలూకా. | నివాసస్థానము. | పనిచేయు గ్రామములు. | డిమానుస్ట్రేటర్లు లేని తాలూకాలు. |
|---|---|---|---|
| | | కృష్ణా జిల్లా. | |
| 1 బందరు ... | మచిలీపట్నం ... | పెన్నూరు, బంటుమల్లి, వడ్లమన్నాడు, గూడూరు, మచిలీపట్నం, పెడన, నందమూరు, చల్లపల్లి. | దివి, కైకలూరు తాలూకాలు. |
| 2 గుడివాడ. | గుడివాడ ... | గుడివాడ, సిద్ధాంతం అగ్రహారం, గుడ్లవల్లేరు, అడ్డాడ, పామర్రు, వెంట్రప్రగడ, నందివాడ, పెద పాలపర్రు, ముదెనపల్లి. | తిరువూరు, నూజివీడు డివిజనులు. |
| 3 గన్నవరం. | గన్నవరం ... | గన్నవరం, ముస్తాబాదా, వీరవల్లి, కనుమోలు, నందమూరు, పుమ్యూర్యారు, ముహనూరు, కపిలేశ్వరపురం. | ... |
| 4 బెజవాడ. | బెజవాడ ... | బెజవాడ, పోరంకి, కంకిపాడు, రామవరపాడు, గొల్లపూడి, కొండపల్లి, సున్నంపాడు, మైలవరం. | ... |
| 5 నందిగామ. | నందిగామ ... | నందిగామ, ముప్పాల, కొనకంచి, కంచికచెర్ల, కంచల, మొక్కపేట, జగ్గయ్యపేట, నడిగూడెం, గండ్రేయి, వీరవల్లిపాడు. | ... |
| 6 అవనిగెడ్డ. | చల్లపల్లి ... | చల్లపల్లి, అవనిగెడ్డ, కోడూరు, నాగయ్యలంక, ఘంటసాల, శ్రీకాకుళం, నిడుమోలు, భట్లపెనుమర్రు, మొవ్వ, మంగళాపురం. | ... |

| తాలూకా. | నివాసస్థానము. | పని చేయు గ్రామములు. | డిమానుస్ట్రేటర్లు లేని తాలూకాలు. |
|---|---|---|---|
| | | **గుంటూరు జిల్లా.** | |
| 1 గుంటూరు. | గుంటూరు ... | గుంటూరు, పెదకాకాని, మంగళగిరి, పెద వడ్లపూడి, వేజండ్ల, పెరిచర్ల, మొనమదల, లామెల్ల. | రేపల్లి, ఒంగోలు, సత్తెనపల్లి, నర్సారావుపేట. |
| 2 తెనాలి ... | తెనాలి ... | తెనాలి, చిరుపూరు, దుగ్గిరాల, సంగాం, జాగర్లమూడి, చేబ్రోలు, చుండూరు, కొల్లిపర, కొల్లూరు. | ... |
| 3 బాపట్ల ... | బాపట్ల ... | బాపట్ల, మామిళ్లపల్లి, మునిపల్లి, నిడుబ్రోలు, అప్పికట్ల, జమ్మలపాలెం, చీరాల, పరచూరు. | ... |
| 4 పల్నాడు. | గురజాల ... | గురజాల, రెంటచింతల, మాచెర్ల, దుర్గి, అడిగొప్పుల, కారెంపూడి, దాచేపల్లి, బ్రాహ్మణపల్లి, పిడుగురాళ్ల. | ... |
| 5 వినుకొండ. | వినుకొండ ... | వినుకొండ, ఆయినవోలు, ముక్కెర్లపాడు, పెద కంచెర్ల, సావల్లిపురం, కొచ్చెర్ల, అయిపూరు, వెల్లటూరు. | ... |
| | | **నెల్లూరు జిల్లా.** | |
| 1 నెల్లూరు. | నెల్లూరు ... | నెల్లూరు, జగ్గాదేవిపేట, మైపాడు, సరుకూరు, తోటపల్లి గూడూరు, కాకుపల్లి, బ్రహ్మదేవం, సర్వేపల్లి, కాకుటూరు, అమ్మచెర్ల. | కనిగిరి, ఉదయగిరి, దాపూరు, పోలూరు. |

| తాలూకా. | నివాసస్థానము. | పనిచేయు గ్రామములు. | డిమాన్‌స్ట్రేటర్లు లేని తాలూకాలు. |
| --- | --- | --- | --- |
| | నెల్లూరు జిల్లా—శేషము. | | |
| 2 గూడూరు. | నాయుడుపేట ... | నాయుడుపేట, మర్లపల్లి, ఓజిలి, యెకొల్లు, మెలుపాక, సూళూరుపేట, గూడూరు, కోట, నాకడు, కడివాడు. | దరశి, పొదిలి, వెంకటగిరి డివిజనులలో డిమాన్‌స్ట్రేటర్లు లేరు. |
| 3 ఆత్మకూరు. | ఆత్మకూరు ... | ఆత్మకూరు, నాబిలి, కార్ణపాడు, దేవరాయిపల్లి, విరూరు, చేజర్ల, నాపూరు, అనంతసాగరం, పొంగూరు, రాపూరు. | .. |
| 4 కావలి ... | కావలి ... | కావలి, తోళ్లపాలెం, మంగమూరు, బిట్రగుంట, జలదంకి, చినక్రాక, కలిగిరి, ఆదిముతుపురం, కొత్తపల్లి, బ్రాహ్మణక్రాక. | ... |
| 6 కందుకూరు. | కందుకూరు ... | కందుకూరు, ఉలవపాడు, సింగరాయకొండ, పోకూరు, పాలకుర్రు, పొన్నలూరు, గూడూరు, తుమడు, రామయపట్నం, పెదపవని. | ... |
| 5 కోవూరు. | నెల్లూరు ... | కోవూరు, అల్లూరు, బుచ్చిరెడ్డిపాలెం, చోలకచెర్ల, దమరమడుగు, దండిగుంట, గండవరం, సంగాం, పెర్యూరు, విడవలూరు. | ... |

డిమాన్‌స్ట్రేటర్లుండుతావులందు డిపోలుకూడ యేర్పాటు చేయబడెను. ఈ డిపోలలో రైతులకు కావలసిన విత్తనములు వగయిరాలు నిలువచేయబడును. ఇచ్చట వ్యవసాయ శాఖవారు ప్రచురించు పత్రికలు పుస్తకములుకూడ దొరకును. ఈ డిపోలలో నిలువచేయు సరుకులు, వాటియొక్క విలువ వగైరాలు ఆయా డిపోలు చార్జిలోనున్న ఉద్యోగస్థులను కనుగొని తెలుసుకొనవచ్చును.

జిల్లాలో ముఖ్యముగా వ్యవసాయ స్థానములో తనిఖీ కాబడిన వరి, జొన్న, చోడి, వేరుశనగ, మిరప, ప్రత్తి విత్తనమును వృద్ధిచేసి రైతులకు పంచిపెట్టుటయందును, క్రొత్త విత్తనములను రైతుల భూములలో పరీక్షచేయుట, మంచి విత్తనములను డిపోలలో నిలువచేసి రైతులవద్దనుంచియు పంచిపెట్టుటయు చేయుచున్నారు.

వరిలో కొణామణి, వంకిసన్నం, ఆటగడ తనిఖీకాబడుచున్నవి. మార్చేరు నె 7, 8 ర్లున్నూ, జి.ఇ.బి. నె 24 రు చాలావరకు వ్యాపించినవి. చెరుకు రకములలో సి.ఓ. నె 213, 243, 281 ర్లు, పి.ఒ.జె. నె 2878 రు సిఫార్సు చేయుచున్నారు. ప్రత్తి, పొగాకు, జొన్న, చోడి, మిర్చి రకములు తనిఖీలోనున్నవి.

కూపరు నె 25, 26 ర్లున్నూ ఘూర్జరు నాగలి, రిడ్జి నాగలి, మోటలు యితర నీరుతోడు యంత్రములు గురించి సలహా యిచ్చెదరు.

ఇతర కృషి విషయములో వరివిత్తనములను పలచగ పోయుట, చెరుకు దవ్వను దూరదూరముగా నాటుట, పండ్ల జాతులను వృద్ధిచేయుట, గొప్పకు గుంటక మొదలగు వానిని ఉపయోగించుటను గురించి సలహాలను యిచ్చుచున్నారు.

వరి వ్యవసాయమునకును, పండ్ల తోటలకును పచ్చి ఎరువు వేయుటను గురించియు వాటితో కలిపి దమ్ముల గుండవేయుటవలన గలుగు లాభమును గురించియు రైతులకు ప్రచారము చేయుచున్నారు.

ఇంతేకాక పశువుల గెత్తమును జాగ్రత్త పరుచుట అందు మూత్రమును వృథాకాకుండా తీసుకొను పద్ధతులను పిడికొట్టపు పద్ధతులను రైతులకు బోధపరుచుచున్నారు. కంపోస్టులను చేయుటను గురించికూడ హెచ్చరించుచున్నారు.

క్రిమికీటక బాధలనుండి తొలగించుటకు తగు సలహాల నిచ్చుటకు గుంటూరులో ఒకరిని ప్రత్యేకముగ నియమించియున్నారు. ఆయనను కోరినయెడల ఆయా గ్రామములకువచ్చి తగు చికిత్స చేయగలుగుదురు.

పశువుల వంగడములను అభివృద్ధి చేయుటయందు తగిన పని జరుగుచున్నది. ఇదిగాక, సంవత్సర వార్షికపు పద్ధతిని ఆబోతులను గ్రామములలోనుంచుటకు, పరిపాలనా సంఘములను రైతులను ప్రోత్సాహపర్చుచున్నారు. ప్రజల యుపయోగము నిమిత్తము పశువైద్యశాలలయందు ఆబోతుల నుంచుచున్నారు. అట్టి ఆబోతులు గుంటూరు ఒంగోలు, కొమరిక, దొండపాడు, బిట్రగుంట, కావూరు (వినయాశ్రమం), శ్రీకాకుళం, సున్నంపాడు గ్రామములలో నున్నవి.

పశుగ్రాసమునకు పనికివచ్చు పైరులను పెట్టుట, మాగుడు చేయుటను గురించియు, మంచిరకము కోళ్ల తాలూకు గ్రుడ్లను సప్లయి చేయించుటయుకూడ చేయుచున్నారు. పండగలు, జాతరలు మొదలగు సందర్భములలో ప్రదర్శనములు పెట్టి లాంతరు బొమ్మల సహాయమున ఉపన్యాసములుకూడ యిచ్చుచున్నారు.

విత్తనములు, ఎరువులు, నాగళ్లు, చెరుకు గానుగలు కొనుటకు రుణములను యిప్పించుచున్నారు.

ఇదిగాక సహకార విషయములను గురించియు పారిశ్రామిక విషయములను అనగా బోరింగులు వగైరాలను గురించియు పశువైద్యమును గురించియు తగు సలహాలనిచ్చుచున్నారు.

డిపోలలో నిలువచేయు సరకుల పట్టి.

| విత్తనములు. | పనిముట్లు. |
|---|---|
| 1 పిల్లిపెసర ... ... | 1 కూపరు నాగళ్లు. |
| 2 జీలుగు ... ... | 2 విడినక్కులు. |
| 3 వెంపలి ... ... | 3 హెచ్. ఎమ్. గుంటకలు. |
| 4 జనుము ... ... | 4 పై దానికి విడిసామానులు. |
| 5 వరివిత్తనములు. | |

## (బి) పరిశోధన.

### గుంటూరు వ్యవసాయ పరిశోధన స్థానము.

ఈ వ్యవసాయ పరిశోధన స్థానము గుంటూరు అమరావతి రోడ్డుమీద గుంటూరు నుండి 5 మైళ్ల దూరములోనున్నది. ఇది 1922 వ సం॥ మే నెలలో స్థాపింపబడినది. ఇందు 150 యకరములు విస్తీర్ణముగల మెట్ట భూమి, ప్రత్తి, పొగాకు, మిరప, తృణధాన్యములను గురించి పరిశోధన జరుపబడుచున్నది. సుమారు 150 యకరములు వ్యవసాయ స్థానములో పశువుల జాత్యభివృద్ధికొరకు ఏర్పాటుచేయబడిన చిన్న ఢిల్లీ బర్రెల మందకొరకును, ఒంగోలు ఆవుల కొరకును బీడుక్రింద వినియోగింపబడుచున్నది :—

| చూడతగిన విషయములు. | చూడతగిన సమయము. |
|---|---|
| 1 ఇనుప నాగళ్ల వాడుక ... ... | సంవత్సరము పొడుగునను. |
| 2 గొర్రుల వాడుక, గొర్రులతో పైరులను విత్తుట— | |
| (ఏ) పునాస ... ... | జూన్-జూలై. |
| (బి) పయర ... ... | అక్టోబరు-నవంబరు. |
| 3 కాటుక తెగులు తగలకుండ గంధకపు పొడితో తృణ ధాన్యముల విత్తులను తయారు చేయుట— | |
| పునాస పైరులు ... ... | జూన్-జూలై. |
| పైర పైరులు ... ... | అక్టోబరు-నవంబరు. |
| 4 నారుమళ్లు తయారుచేసి, నారుపెంచుట— | |
| మిరప ... ... ... | జూలై మొదటి పక్షము. |
| పొగాకు ... ... ... | ఆగస్టు మొదటి పక్షము. |
| 5 పునాస పైర్లలో పాపడము పాయుట ... | జూలై-ఆగస్టు. |
| 6 గొర్రు వెనుక అక్కడులతో ప్రత్తి విత్తుట. | సెప్టంబరు మొదటి పక్షము. |
| 7 లైనులు వేసి నాటుటకు నేలను తయారుచేయుట— | |
| మిరప ... ... ... | సెప్టంబరు. |
| పొగాకు ... ... ... | అక్టోబరు. |
| 8 ప్లానెటు జూనియరు పాపడముతో ప్రత్తి, పొగాకు, మిరప పైర్లలో ఎడ సేద్యము చేయుట. | అక్టోబరు-జనవరి. |
| 9 మేలైన హెచ్. ఎమ్. గుంటకతో వేరుశనగ త్రవ్వుట. | నవంబరు-డిసెంబరు. |
| 10 ప్రత్తి శుభ్రముగా నేరుట ... ... | ఫిబ్రవరి-మార్చి. |

| చూడతగిన విషయములు. | చూడతగిన సమయము. |
|---|---|
| 11 పొగాకు కోసి తయారుచేయుట ... | ఫిబ్రవరి-మార్చి-ఏప్రిలు. |
| 12 వేసంగి సేద్యము— | |
| (ఎ) ఇనుప నాగళ్లతో దున్నుట ... | డిసంబరు-జనవరి-ఫిబ్రవరి. |
| (బి) కలుపు మొక్కలు లేకుండ చేలను శుభ్రముగా నుంచుటకు తరచు గుంటకను పాయుట. | ఫిబ్రవరి-మార్చి-ఏప్రిలు. |
| 13 విత్తనములు ఏరి నిలువచేయుట ... | పైరు కోయుటకు 15 రోజులు ముందు. |
| 14 చేతితో చొప్పను నరుకు యంత్రము దానితో చొప్పను పశువుల కొరకు నరుకుట. | సంవత్సరము పొడుగున. |
| 15 పశువుల ఎరువును తయారుచేయుట "లూజు బాక్సు" పద్ధతి. | డిటో. |
| 16 పచ్చి ఆకు మాగుడి యెరువు తయారు .. | సంవత్సరములో నెప్పుడైనను. |
| 17 మేత పైరులు, గిన్ని గడ్డి, ఏనుగు గడ్డి ... | డిటో. |

6. పరీక్షింపబడుచున్నటువంటి సమస్యలు—

(ఎ) మంచి విత్తనముల నేరుట.—ప్రత్తి, జొన్న, మిరప విత్తనములను మంచివిగా నేరుట.

(బి) మెట్ట చేలలో కంబోడియా ప్రత్తిని ప్రవేశపెట్టుట.

(సి) మిరప, పొగాకు, వరిగ, ప్రత్తి పైరుకు అమ్మోనియము సల్ఫేటు, సూపరు ఫాస్ఫేటు వేయుటను గురించి పరిశోధన.

(ఇ) పశువుల జాత్యభివృద్ధి.—శాస్త్రోక్తముగా అసలు ఢిల్లి జాతి సంకరపు ఢిల్లి జాతి, వంగోలు జాతి, పశువులను పెంపొందించి మంచి పద్ధతులను పెంచి మేపుట.

పరిశోధన స్థానము చూడవచ్చినవారికి ఎప్పుడును సుస్వాగత మొసర్చబడును. ఫారము ఉద్యోగస్తులు ఫారము అంతటను త్రిప్పి చూపించెదరు.

టి. బుధవిధేయ రావు,
వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, రెండవ సర్కిలు.

---

## 2 (c) మూడవ సర్కిల్.

బళ్లారి, అనంతపురం, కర్నూలు, కడప జిల్లాలుచేరి మూడవ సర్కిలుగా యెన్నబడుచున్నది. ఈ సర్కిలు పై అధికారియైన డిప్యూటి డైరెక్టరువారు బళ్లారిలోనుందురు. ఇతనికి సహాయముగా యిద్దరు జిల్లా ఆఫీసర్లు వున్నారు. ఈ యిద్దరిలోను ఒకరు బళ్లారిలోను, మరియొకరు కర్నూలులోను వున్నారు. బళ్లారి జిల్లా వ్యవసాయపు ఆఫీసరు, బళ్లారి, అనంతపురం జిల్లాలలో పనిచేయుచున్న వ్యవసాయ బోధకులపై నధికారిగాయున్నారు. ఆరీతిగనే కర్నూలు జిల్లా వ్యవసాయపు ఆఫీసరు, కర్నూలు, కడప జిల్లాలలో పనిచేయుచున్న వ్యవసాయ బోధకుల పై అధికారిగానున్నారు.

## (౨) జిల్లాయందు జరుగు పని.

రయితులకు సహాయ మొనర్చుటకుగాను వ్యవసాయ బోధకులు జిల్లాలలో తిరుగుచున్నారు. కాని తగినంతమంది లేకపోవుటచే యింకను యీ జిల్లాలో 17 తాలూకాలలో వ్యవసాయ బోధకులులేరు.

ఈ దిగువ వ్యవసాయ బోధకులుండు ముఖ్యస్థానములు, వారు పనిచేయు స్థలములు కనుపరుచబడినవి :—

### A. వ్యవసాయ బోధకులుండు తాలూకాలు.

| తాలూకా. | ముఖ్యస్థలములు. | పనిచేయు స్థలములు. |
|---|---|---|
| | బళ్లారి జిల్లా. | |
| బళ్లారి ... | బళ్లారి ... | బళ్లారి, మోక, కుడితిని, కగ్గాలు, కోలూరు, శంకరబండా, రూపెంగుడి. |
| హాస్పేటు ... | హాస్పేటు ... | హాస్పేటు, కంపిలి, కమలాపురం, గడిగనూరు, డరోజి, టోర్నగల్లు, నారాయణదేవరకెరి, మురియమ్మనహల్లి, పప్పినాయకనహల్లి. |
| సిరిగుప్ప ... | సిరిగుప్ప ... | హచ్చొళ్ళిహల్లి, హాలకోటె, రారావి, సిరిగుప్ప, టెక్కలకోట, కరూరు, శిరిగేరి, సానవాసపురం. |
| ఆదోని ... | ఆదోని ... | గాలపురం, యెమ్మిగనూరు, ఆదోని, హరివనం, కౌతలం, విరుపాపురం, కొత్తహల్లి, పెద్ద తుంబళం, కొసిగి. |
| రాయదుర్గ ... | రాయదుర్గ ... | (యింకా యేర్పాటు కాలేదు). |
| | ఆనంతపురం జిల్లా. | |
| గుత్తి ... | గుత్తి ... | గుత్తి, ఉరవకొండ, చెట్వూరు, పామిడి, పాతకొత్తచెరువు, క్రిష్టిపాడు, పెద్ద హడుగూరు, కరూరు. |
| గుత్తి ... | గుంతకల్ ... | బళ్లారి జిల్లా, ఆలూరు తాలూకా, బంటనహాల్, గుంటకల్లు చుట్టుపట్ల ప్రత్తిపని. |
| కదిరి ... | కదిరి ... | కదిరి, పట్నం, వోబళదేవరచెరువు, మహమ్మదాబాదు, నల్లచెరువు, పులగంపల్లి, గనలపెంట్ల, టోర్నహాలు, ముత్యాలచెరువు. |
| హిందూపూరు ... | హిందూపూరు ... | హిందూపూరు, గోరవపల్లి, పాలసముద్రము, గోరంట్ల, లేపాక్షి, పూటమూరు, కొండికొండ, చోలూరు. |

4

| తాలూకా. | ముఖ్యస్థలములు. | పనిచేయు స్థలములు. |
|---|---|---|
| | అనంతపురం జిల్లా—శేషము. | |
| అనంతపురం ... | అనంతపురం ... | అనంతపురం, శింగనామాల, కల్లుమాడి, కందుకూరు, గార్లదిన్నె, కోడూరు, నరపాల. |
| తాడిపత్రి ... | తాడిపత్రి ... | తాడిపత్రి, జూటూరు, రాయలచెరువు, కట్లూరు, భోగసముద్రం, శనగలగూడూరు, అమలదిన్నె, యెల్లనూరు. |
| | కర్నూలు జిల్లా. | |
| డోను ... | డోను ... | డోను, బటుమచల్లి, వెలుదుర్తి, క్రిష్ణగిరి, పైయిపల్లి, వెంకటాపురం, కలబేటల, వెంగలపల్లి. |
| కర్నూలు ... | కర్నూలు ... | కర్నూలు, గాడిదమడుగు, కొడుమూరు, పెద్ద టేకూరు, గూడూరు, నన్నూరు, పోరవకాలు, కాల్వ. |
| నంద్యాల ... | నంద్యాల ... | నంద్యాల, కనాల, పోలూరు, పాణియం, పుసలూరు, భీమవరం, కొత్తపల్లి, మహానంది, పార్లపల్లి, శివపురం. |
| కంభం ... | గిద్దలూరు ... | గిద్దలూరు, ముండ్లపాడు, రేచర్ల, సోమిదేవిపల్లి, గంగ్రెడ్డిపల్లి, కొమరోలు, కంభం, బేస్తవారపేట. |
| సిరువెల్ ... | ఆళ్లగెడ్డ ... | ఆళ్లగెడ్డ, చాగలమర్రి, వల్లగట్ల, యెర్రగుంట్ల, సిరువెల్, రుద్రవరం, గోవిందపల్లి, దీబగుంట్ల. |
| కోయిల్‌కుంట్ల. | కోయిల్‌కుంట్ల ... | కోయిల్‌కుంట్ల, దోర్నిపాడు, ఔక్, కొలిమిగుండ్ల, లింగందేవి, రేవనూరు. |
| | కడప జిల్లా. | |
| కడప ... | కడప ... | ఖాజీపేట, చేనూరు, పుష్పరాపల్లి, కడప, గంగనాపల్లి, చింతకొమ్మదిన్నె, వల్లూరు, కమలాపురం, ఎర్రగుడిపాడు. |
| ప్రొద్దటూరు ... | ప్రొద్దటూరు ... | అరకటవేమల, ప్రొద్దుటూరు, దువ్వూరు, పెద్ద శెట్టిపల్లి, చిన్నదండులూరు, ఎర్రగుంట్ల, మాదూరు, వానిపెంట. |
| రాజంపేట ... | రాజంపేట ... | నందలూరు, రాజంపేట, పెనగలూరు, కోడూరు, చిట్వేలు, పుల్లంపేట, పురంపాడు, టంగుటూరు. |

సు.రా.—వెంకటాపురం చెరువు క్రింద పనిచేయుటకుగాను ఒక మేస్త్రీని కూడ యేర్పాటుచేసియున్నారు.

(బి) వ్యవసాయ బోధకులులేని తాలూకాలు.

బళ్లారి జిల్లా.—ఆలూరు, హడగల్లి, కుడ్లిగి.

అనంతపురం జిల్లా.—ధర్మవరం, కళ్యాణదుర్గం, మడకశిర, పెనుకొండ.

కర్నూలు జిల్లా.—మార్కాపురం, పత్తికొండ, నందికోటకూరు.

కడప జిల్లా.—బద్వేల్, జమ్మలమడుగు, కమలాపురం, పులివేండ్ల, రాయచోటి, సిద్దవటం.

3. జిల్లాలలోని వ్యవసాయ బోధకులు, నమ్మకమైన రయితులకు హగరి 1 వ నెంబరు ప్రత్తి విత్తనములు, నంద్యాల 14 వ నెంబరు ప్రత్తి విత్తనములు, నంద్యాల, హగరి వ్యవసాయ పరిశోధన స్థానములనుండి తెచ్చియిచ్చెదరు. కంబోడియా ప్రత్తిలోని కోయంబత్తూరు 2 వ నెంబరు విత్తనములు అక్కడక్కడ పంచిపెట్టుచున్నారు. హగరి వ్యవసాయ స్థానమందుత్పత్తిచేయబడిన టి. 8 వ నెంబరు రాగి, టి. 1 వ నెంబరు జొన్న, నంద్యాల వ్యవసాయ పరిశోధన స్థానమునందు పుత్పత్తి చేయబడినట్టి టి. 6 వ నెంబరు జొన్న, రయితులకు పంచిపెట్టుచున్నారు. మరియు 24 వ నెంబరు వరి శ్రేష్టమైన చెరుకు ముక్కలను (విత్తనము కొరకు) రయితులకు తెప్పించి యిచ్చుచున్నారు.

ఇనుప నాగళ్లతో సేద్యముచేయుట, హెచ్. యం. గుంటకతో పనిచేయుట, రయితుల భూములలో స్వయముగాచేసి చూపించుచున్నారు. బోదులలో చెరుకునాటుట, మంచి పొయ్యిలమీద శ్రేష్టమైన బెల్లమును వండుట రయితులకు చూపించుచున్నారు.

పశువుల యెరువును జాగ్రత్తయచేయు నూతన పద్ధతులను రయితులకు బోధించుచున్నారు. "పెట్ట" పద్ధతిలో యెరువును తయారుచేయుట, గెత్తమును ఎరువు గోతులలో వేయుట విషయమై రయితులకు తరుచు హెచ్చరించుచున్నారు. నాగజముడు, వేరుసెనగ పొట్టు, యెండు ఆకులను, జొన్న మొళ్లను కుళ్లబెట్టి ఎరువుచేయు పద్ధతులను బోధించుచున్నారు.

డిపార్టుమెంటువారు యిచ్చిన విత్తనములద్వారా తయారైన పైర్లకు హెచ్చుధరలు వచ్చునటుల రయితులకు సదుపాయముల ఏర్పర్చుచున్నారు.

పురుగుల విషయమై తెగుళ్ల విషయమైకూడ సలహా నిచ్చుచున్నారు. రయితులకు పురుగుల విషయమున్ను పైర్లకు తగులుబూజు జాడ్యములను నివారించు పద్ధతుల విషయమై, సలహా నెల్లప్పుడును యిచ్చుటకును బళ్లారియందు యిద్దరు బోధకులున్నారు. పరీక్ష చేయవలెననిన, వచ్చి పుచితముగా పరీక్షచేసెదరు. ఇంకా యితర విషయములందు సలహాలు కావలసినచో వ్యవసాయ బోధకులకుగాని జిల్లా వ్యవసాయాధికారికిగాని వ్రాసి తెలిసికొనవచ్చును.

4. ఈ సర్కిలులో నున్నటువంటి డిపోలు అచ్చట దొరకు వస్తువులు యీ దిగువ నుదహరింపబడినది. ఎప్పటి ధరల నప్పుడు వ్యవసాయ బోధకులద్వారా తెలిసికొనవచ్చును :—

| డిపోలు. | అచ్చట దొరకు వస్తువులు. | ధరలు. |
| --- | --- | --- |
| | బళ్లారి జిల్లా. | |
| బళ్లారి ... | హగరి 1 వ నెం. కో. 2 వ నెం. కంబోడియా ప్రత్తి విత్తనము. | ... |
| డిటో ... | జనుము ... ... ... | ... |

4—A

| డిపోలు. | అచ్చట దొరుకు వస్తువులు. | | ధరలు. |
|---|---|---|---|
| హొసపేట ... | జి.యి.బి. 24 వ నెం. వరి విత్తనము | ... | ... |
| డిటో ... | టి. 8 రాగి విత్తనము ... | ... | ... |
| డిటో ... | టి. 1 వ నెం. జొన్న ... | ... | ... |
| డిటో ... | జనుము ... ... | ... | ... |
| ఆదోని ... | హగరి 1 వ నెం., కో. 2 వ నెం. కంబోడియా ప్రత్తి విత్తనములు. | | ... |
| సిరుగుప్ప ... | డిటో. | | ... |
| | జి.యి.బి. నె 24 రు వరి విత్తనము | ... | ... |
| | జనుము ... ... | ... | ... |
| | **అనంతపురం జిల్లా.** | | |
| గుంతకల్ ... | హగరి 1 వ నెం. ప్రతి విత్తనము | .. | .. |
| గుత్తి ... | డిటో | ... | ... |
| | జి.యి.బి. 24 వ నెం. వరి విత్తనము | ... | ... |
| | జనుము ... .. | ... | ... |
| | టి. 8 రాగి విత్తనములు | ... | ... |
| | టి. 1, టి. 6 జొన్న విత్తనములు | ... | ... |
| | ఉల్లి విత్తనములు ... | ... | ... |
| | ఎముకల పొడి ... ... | ... | ... |
| తాడిపత్రి ... | గుత్తిలో దొరకినవన్ని యిచ్చట దొరకును | ... | ... |
| అనంతపురం. | డిటో | ... | ... |
| కదిరి ... | టి. 8 రాగి విత్తనము .. | ... | .. |
| | జి.యి.బి. 24 వ నెం. వరి విత్తనము | | .. |
| | జనుము విత్తనము ... | ... | ... |
| హిందూపురం. | జి.యి.బి. 24 వ నెం. వరి విత్తనము | ... | ... |
| | టి. 8 నెం. రాగి విత్తనము ... | ... | ... |
| | టి. 1 నెం. జొన్న విత్తనము ... | ... | ... |
| | జనుము విత్తనము ... | ... | ... |
| | **కర్నూలు జిల్లా.** | | |
| కర్నూలు, నంద్యాల, గిద్దలూరు, కంభం, అర్లగడ్డ. | నంద్యాల 14 వ నెం. ప్రత్తి విత్తనము | ... | ... |
| | కంబోడియా ప్రత్తి విత్తనము ... | ... | ... |
| | జనుము విత్తనము ... | ... | ... |
| | జి.యి.బి. 24 వ నెం. వరి విత్తనము | ... | ... |
| | కోయంబుత్తూరు 1 వ నెం. వరి విత్తనము | ... | ... |
| | టి. 6 వ నెం. జొన్న విత్తనము | .. | ... |

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| | రాయల్ అగ్రికల్చరల్ కమిషన్ వారి రిపోర్టులు (తెలుగు) 1 కి. | 1 | 8 | 0 |
| కర్నూలు ... | హెచ్. యం. గుంటుక నెం. 0. — యినుప భాగములు మాత్రము 1 కి. | 4 | 8 | 0 |
| | హెచ్. యం. గుంటుక నెం. 0. — దాని పలుగు 1 కి ... | 1 | 8 | 0 |

| డిపోలు. | | అచ్చట దొరుకు వస్తువులు. | ధరలు. | | |
|---|---|---|---|---|---|
| | | | రూ. | అ. | పై. |
| నంద్యాల ... | హెచ్. యం. గుంటక నెం. 1. | యినుప భాగములు మాత్రము 1 కి. | 8 | 0 | 0 |
| | | దాని పలుగు 1 కి .. | 2 | 12 | 0 |
| గిద్దలూరు ... | హెచ్. యం. గుంటక నెం. 2. | యినుప భాగములు మాత్రము 1 కి. | 14 | 4 | 0 |
| | | దాని పలుగు 1 కి ... | 3 | 14 | 0 |
| కంభం ... | పూపరు నాగలి నెం. 25. | యినుప భాగములు మాత్రము 1 కి. | 4 | 8 | 0 |
| | | కర్రు ... | 0 | 5 | 6 |
| అర్లగడ్డ ... | పూపరు నాగలి నెం. 26. | యినుప భాగములు | 10 | 12 | 0 |
| | | కర్రు కర్రు మొన ... | 1 | 1 | 0 |
| | | కర్రు మొన ... | 0 | 3 | 6 |

కడప జిల్లా.

కడప ... కర్నూలు జిల్లాలోని డిపోలలో దొరకు వస్తువులు.

ప్రొద్దుటూరు. నంద్యాల 14 వ నెం. ప్రత్తి విత్తనము ...

రాజంపేట ... పూగరి 1 వ నెం. ప్రత్తి విత్తనము ...

హెచ్చరిక.—మైలుతుత్తపు ప్యాకెట్లు, గ్రామస్థుల పంచాంగములు 1 కి 1 అణా చొప్పున పై నుదహరించిన అన్ని డిపోలలోను దొరకును.

5. పరపతి సంఘపు డిపార్టుమెంటు.—ఈ సర్కిలులో యిద్దరు పరపతి సంఘపు డిప్యూటీ రిజిస్ట్రార్లుగారు వున్నారు. బళ్లారి, అనంతపురం జిల్లాలు, బళ్లారి ముఖ్యస్థానముగా తీసుకొనిన డిప్యూటీ రిజిస్ట్రారువారి యాధీనములోనున్నవి. కడప, కర్నూలు జిల్లాలు, కడప ముఖ్యస్థానముగా చేసుకొనిన డిప్యూటీ రిజిస్ట్రారువారి యాధీనములోయున్నవి. ప్రతి జిల్లాలోను ఒక సబు డిప్యూటీ రిజిస్ట్రారువారున్నారు. ఈ సంఘముల విషయమై సలహా కోరువారు పైని చెప్పిన వుద్యోగస్థులకు వ్రాసి తెలిసికొనవచ్చును. వ్యవసాయ సంఘమువారును, సహకార సంఘమువారును యేకీభవించి పనిచేయుచున్నారు. విత్తనములను విక్రయించుటు సహకారముగా ప్రత్తిని అదరించి గింజలను తీయుటు, దూది విక్రయించుటు, యివి అన్నియు బళ్లారి, ఆదోని, నంద్యాలలోను స్థాపింపబడిన సహకార సంఘములవారికి బంటకాలు వ్యవసాయ అభివృద్ధి సంఘమునకును వొప్పజెప్పుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి.

6. శిల్పకారుల డిపార్టుమెంటు లేక ఇండస్ట్రీసు డిపార్టుమెంటు.—బెజవాడలో నున్న అసిస్టెంటు ఇండస్ట్రియల్ యింజనీయరుగారు యాధీనములో బళ్లారి, కర్నూలు జిల్లాలున్నవి. అనంతపురం, కడప జిల్లాలు కోయంబుత్తూరులోనున్న అసిస్టెంటు ఇండస్ట్రియల్ యింజనీయరుగారి యాధీనములోనున్నవి. యంత్రములను స్థాపించే విషయములనుగాని బావులను త్రవ్వించే విషయములను గురించిగాని తెలుసుకొనగోరువారు అసిస్టెంటు ఇండస్ట్రియల్ యింజనీయరుగారికి వ్రాసుకొనవలయును.

## (బి) పరిశోధన.

ఈ సర్కిలులో రెండు వ్యవసాయ పరిశోధన స్థానములుగలవు. అందులో నొకటి బళ్లారి జిల్లాలోనున్న హగరి పరిశోధన స్థానము. రెండవది కర్నూలు జిల్లాలో నున్న నంద్యాల పరిశోధన స్థానము.

### హగరి వ్యవసాయ పరిశోధన స్థానము.

ఈ పరిశోధన స్థానమును 1906-07 వ సంవత్సరమున స్థాపించినారు. ఇది మదరాసు సదర్న్ మహారాటు రైల్వే కంపెనివారి హగరి రైల్వే స్టేషనుకు దక్షిణమున 1½ మైళ్ల దూరముననున్నది. దీనిలో పరమదేవనహళ్లి, కగ్గలు భూములు చేరియున్నవి. ఇది బళ్లారికి 10 మైళ్ల దూరములో గుత్తికిపోవు రోడ్డు ప్రక్కన నున్నది. కనుక సులభముగా రైలునగాని బస్సులద్వారాగాని దీనికి వెళ్లవచ్చును. ఈ వ్యవసాయ స్థానము 318 ఎకరములు విస్తీర్ణము కలది. అందులో సుమారు సగము సాగుబడి యగుచున్నది. మిగిలిన విస్తీర్ణము పర్రలు. ఈ పర్ర నెమ్మదిగా బీడుగా చేయబడు చున్నది. సాగుబడి అగు 155·34 ఎకరములలో 14 ఎకరములు యిసుకదిబ్బల వద్దనుండు చిన్న బావి ఆధారముతో తోటభూమిగా నున్నది. మిగిలిన విస్తీర్ణము నల్లరేగడ భూమిగానున్నది. దీనియందు ప్రత్తి, జొన్న, కుష్కి పైరులు సాగుచేయ బడుచున్నవి. సౌతు వెస్టు మాన్సూనునందు వీచు తీవ్రమైన గాడ్పులవల్ల చేరువనున్న నదినుండి కొట్టుకొనివచ్చిన యిసక యిక్కడ పర్రలుగా నేర్పడ్డది. ఈ పర్రలక్రింద నల్లరేగడ భూమియు అచ్చటచ్చట గరపనేలయు మరియు బంకమట్టియు 2 మొదలు 15 అడుగుల లోతున కలవు.

2. నవంబరు, డిసంబరు మాసములయందు భూములన్నియు పైర్లచే నాక్రమింప బడియుండును. ఈ సమయమునందు శ్రేష్ఠమైన ప్రత్తి, జొన్న విత్తనములు యెటుల నుత్పత్తిచేయుదురో చూడవచ్చును. పశువుల యెరువులను జాగ్రత్తపరచుట, ఆ ఎరువుకు పశువులు మేయగా మిగిలిన చొప్పను కలిపి వృద్ధిచేయుట, జొన్న మొళ్లను యుండు ఆకులను, నాగజముడును కుళ్లబెట్టి యెరువుగా మార్చుట సంవత్సరము పొడుగున చూడ వచ్చును. ఇసుక పర్రలయందు తుమ్మచెట్లను పెంచి మంచి బీడులుగా యే విధముగా మార్చినారో చూడవచ్చును. ఆయా మాసములలో చూడదగిన ముఖ్యపైరులు, దోహ దములు రైతుల యుపయోగార్థమిందు వివరింపబడినది.

3. ఈ పరిశోధన స్థానమునందు నల్లరేగడ భూములకు యెట్టి సేద్యముచేయ వలెనో, ఏ విధముగా బలపరపవలెనో, ఏ యే పైరులు వేయవలెనో తెలిసికొనుటకుగాను పరిశోధనలు జరుపబడుచున్నవి. మరియు ప్రత్తి జొన్న పైరులను అభివృద్ధిచేయుటకు గాను యీ స్థానమున నేర్పరచినారు. ఈ స్థానమున వుత్పత్తిచేయబడిన హగరి 1 వ నెంబరు ప్రత్తి నీటిలేమిని బాగుగా నోర్చి యెక్కువ పంట నిచ్చునట్టిది. దీని దూది శ్రేష్ఠమైనది. దీని దూది దేశవాళి దూదికన్న బేలు 1 కి 15 మొదలు 25 రూపాయిల వరకు యెక్కువ ధరకు అమ్మబడును. 1 వ నెంబరు తెల్లజొన్న దేశవాళి జొన్నల కంటె పంటయందును, గింజ నాణ్యమునందును, చొప్ప రుచియందును శ్రేష్ఠమైనది. కొంత భూమియందు రాగి, కంబోడియా ప్రత్తి వుల్లి మొక్కజొన్న మొదలగు తోట పైర్లనువేసి నాటి లాభములు రహితులకు దృష్టాంతరముగా చూపబడుచున్నవి. 8 వ నెంబరు రాగి దేశవాళి రాగికంటె చాల శ్రేష్ఠమైనది. ఈ పైరునందు మరి యితర పైర్లయందు మంచి విత్తనములను వుత్పత్తిచేయుచున్నారు.

ముఖ్యముగా జొన్న పైరునకు సాలుసాలుకు యెంత యెడముంచవలెనో పరిశోధన చేయుచున్నారు. గత సంవత్సరపు పరిశోధనవల్ల యెక్కువ యెడముపుంచిన యెక్కువ పంట పండునని తెలియుచున్నది. ఇది తక్కువవర్షము కురియు ప్రదేశము గనుక భూమియందు చెమ్మ ఆరకుండ నుండుటకు యేమిచేయవలెనని పరిశోధన సలుపుచున్నారు. తగినంత పశువుల యెరువు లేకపోవడమువల్ల రయితులు కొద్ది భూమికి మాత్రము యీ యెరువు వేయుచున్నారు. దీని నివారణకొరకు పరిశోధనలు సల్పుచున్నారు. పశువుల యెరువును యేవిధముగా భద్రపరుపవలసినది పరిశోధింపబడుచున్నది. ప్రత్తి జొన్న పైరులకు, అమ్మోనియం సల్‌ఫేటు, సూపరుఫాస్ఫేటు యేవిధముగా గొడ్ల యెరువుతో కలిపి వేయవలెనో పరిశోధన చేయబడుచున్నది.

ఏప్రిలునుండి జూన్ నెలవరకు—హెచ్. యం. గుంటకతో జొన్న మోళ్లను వెళ్లగించుట, యినుప నాగళ్లతో భూమిని దున్నుట, వెక్కువిధములగు గుంటకలతో భూమిని పాయుట, బక్‌స్క్రేపరుతో భూమిని సమముచేయుట, నాగజముడుతోను, ఎండు ఆకులతోను, గులక దంట్లతోను యెరువులు తయారుచేయు విధము చూడ వచ్చును.

జూన్ నెల—ఈ నెలలో పలచగా రాగి నారుపోయు విధము, బావి ఆధార ముతో జాడుచొప్పను విత్తుట చూడవచ్చును.

జూలై—తోట భూములలో—రాగి నారు నాటుట, జాడుచొప్పను విత్తుట చూడవచ్చును. కుష్కి భూములలో—పెద్ద యినుప నాగళ్లతో దున్నిన భూములను పెద్ద గుంటకలతో పాయుటయు, ముంగారి వర్షములు వచ్చినయెడల గొర్రుతో ముంగారి కొర్ర, వేరుశనగ విత్తుట చూడవచ్చును.

ఆగస్టు—కొర్ర వేరుశనగ మొదలగు కుష్కి పైర్లను నాటుట, తోట భూము లలో దవ్వకొరకు చెఱకు నాటుట, చూడవచ్చును.

సెప్టంబరు—ప్రత్తి గొర్రుతో విత్తుటయు, పెరుగుచున్న రాగిని యీ మాసకు లో చూడవచ్చును.

అక్టోబరు—ఈ నెలలో జొన్నలు, గోధుమలు, కుసుములు, శనగలు, విత్తుట చూడవచ్చును.

నవంబరు—ఈ నెలలో తోటరాగిని కోయుటయు, ఉల్లిగడ్డలు సీమవంగలు నాటు టయు, జాడు చొప్పను మొక్కజొన్న నాటుటయు చూడవచ్చును. మిరప నెలలలో చాలులుగా వేసినపైరులలో యెడ సేద్యము చేయుట చూడవచ్చును.

డిసంబరు—అభివృద్ధి చేయబడిన పని ముట్లతో వేరుశనగ పెళ్లగింపబడును. పలుసస్యములను నిలుపున చూచుటకు యిది మంచితరుణము.

జనవరి.—వరుసలుగా వేసిన మిరపసస్యములకు యెడసేద్యము ఆఖరుతడవ చేయుట. ఈ మాసపు రెండవ పక్షములో జాడుమొక్కజొన్న కోసి ఎన్సెలేజీ (అనగా పచ్చిగడ్డిని పాతరవేసి చాలాకాలముండునట్లు) చేయుట చూడవచ్చును.

ఫిబ్రవరి.— ఈ మాసపు రెండవ పక్షములో జొన్నకోత, చెఱకుకోత ముచ్చలు నాటుట చూడవచ్చును.

మార్చి.—పలుగింజలు ఎగురబోయుట ; గింజల ఎగరబోతకుపయోగించు యంత్ర ములను ఉపయోగించుట చూడవచ్చును. పత్తి పింజ విర్పు యీ మాసమున పూర్తియ గును. రాయ ధాన్యముల సస్యములు తీసి పొలములు దున్నుట చూడనగును.

## వ్యవసాయ పరిశోధన స్థానము, నంద్యాల.

ఇది మదరాసు సదరన్ మహరాటా రైల్వే కంపెనివారి నంద్యాల రైల్వే స్టేషనకు ¼ మైలు దూరములో కంభం, కర్నూలు, నంద్యాల, కోయిలకుంట్ల రోడ్ల యొక్క జంక్షన్ వద్ద 1906 వ సంవత్సరమున స్థాపింపబడినది. 92 ఎకరముల విస్తీర్ణముకలదు. దీనిలో సగము 1911 వ సంవత్సరమున సంపాదింపబడినది. భూమి చాకొలేటు రంగుగల రేగడ ; దీనిక్రింద పసుపు పచ్చటి రేగడకలదు. ఎండినయెడల యిది రాతివలె గట్టిపడును.

2. నవంబరు, డిసంబరు మాసములందుపైరులన్నియు భూముల నాక్రమించియుండును. వాటికి పైసేద్యము చేయబడును. ప్రత్తి జొన్న విత్తనములను వుత్పత్తిచేయ పద్ధతులు సెప్టెంబరు, మార్చి మాసములందు చూడవచ్చును. పశువుల యెరువును జాగ్రత్తపరచుట, జొన్న మోళ్లను, యెండు ఆకులను కుళ్లపెట్టి యెరువుగా మార్చుట, పశువుల పాకలను వాటికి సరిపోవు ఆహారముల నిచ్చుట యెల్లవేళలయందు చూడవచ్చును. ఈ పరిశోధన స్థానమునందు యే యే మాసములందు యెట్టి కృషి చేయబడునో ఈ క్రింద తెలియపరచడమైనది :—

జనవరి —ఈ నెలలో జొన్న కోతలు, రాతిబండ క్రింద జొన్న కంకుల నూర్చుట చూడవచ్చును. ప్రత్తి, శనగ, కూరగాయలు నిలువున చూడవచ్చును.

ఫిబ్రవరి.—ఈ నెలలో ప్రత్తిని చెట్లనుండి పరిశుభ్రముగా విరుచువిధము, రాతిబండక్రింద శెనగలను నూర్చుట, నూర్చిన గింజలను సులభమైన చేతి యంత్రముతో పరిశుభ్రముచేయుట చూడవచ్చును. ప్రత్తి, కూరగాయలు నిలువనను, శనగకాయలు విర్చుటయు చూడవచ్చును.

మార్చి మొదలు మే నెల వరకు.—హెచ్. యం. నె 2 రు గుంటకతో ప్రత్తి మోళ్లను, జొన్న మోళ్లను పెళ్లగించుట చూడవచ్చును. మోళ్లనుకూడ దీయు పనిముట్లుతో జొన్న మోడుకూడ బెట్టుట ; పెద్ద యినుపనాగళ్లతో లోతుగా దున్నుట చెరుకు ప్రత్తి సస్యములు నిలువున చూడవచ్చును.

జూన్.—లోతుగాదున్నిన నేలలులో రాతిబండ, బండిచక్రము, తోలి విత్తుటకు సిద్ధముచేయుట, పశు గ్రాసమునకు, జొన్న, పిల్లిపెసర, గొర్రుతోవేయుట, పచ్చిరొట్ట యెరువులును, కూరగాయలునారు పెంచుట, చెరుకు నిలువున చూడవచ్చును.

జూలై —వేరుశనగ, కొర్ర, గొర్రుతో విత్తుట, జాడు జొన్న, పిల్లిపెసర, పచ్చిరొడ్డ యెరువు సస్యములు, చెఱకు నిలువున చూడవచ్చును.

అక్టోబరు.—ప్రత్తి జొన్న చేలలో యాసన తోలుట, జొన్నజాడుతో నైలేశి (అనగా పచ్చిగడ్డిని పాతర వేసి నిలువచేయుట) చూడవచ్చును. జొన్న, ప్రత్తి, కూరగాయలు, చెఱకు, పిల్లిపెసర, వేరుశనగ సస్యములను చూడవచ్చును.

ఆగస్టు.—ప్రత్తిని గొర్రుతో విత్తుట, వేరుశెనగ, చెఱకు, జాడు చొప్ప, జొన్న చేలు, పిల్లిపెసర, పచ్చిరొడ్డ ఎరువు సస్యములు, పచ్చి రొడ్డలు భూమిలోకలియ దున్నుట చూడవచ్చును.

సెప్టంబరు.—జొన్నను గొర్రుతో విత్తుట, మిరప, ప్రుల్లి మొదలైన పైర్లను నాటుట, ప్రత్తి, జాడు జొన్న, వేరుశనగ మొదలైన పైర్లను చూడవచ్చును.

నవంబరు, డిసంబరు.—శనగను గొర్రుతో విత్తుట, పశువుల మేతకొరకు పైరులను వేయుట, ప్రత్తి, జొన్న, శనగ, పైరులను, వేరుశనగను హెచ్. యం. గుంటకతో పెళ్లగించుట చూడవచ్చును.

3. ఈ దేశమునకు ముఖ్యమైనటువంటి ప్రత్తి జొన్న వేరుశనగ, కొర్ర పైర్లను అభివృద్ధిచేయుటకై ఈ స్థానము యేర్పరుపబడినది. ఏ యే పైరులను యెట్టి యెరువుల వేయవలెనో పరిశోధన చేయుచున్నారు. మరియు ముఖ్యముగా జొన్న ప్రత్తి పైరులకు యెంత యెడము నుంచవలెనో కనుగొనుటకుగాను పరిశోధనలు సల్పుచున్నారు. వేరుశనగను మామూలు పంట మార్పులో చేర్చి పరీక్ష చేయుచున్నారు.

చూడగోరువారు యెల్లవేళలయందు రావచ్చును.

ఎ. సి. ఎడ్మండ్సు,

వ్యవసాయపు డిప్యూటీ డైరక్టరు, మూడవ సర్కిలు.

---

## 2 (d) నాలుగవ సర్కిల్.

సెంటు థామసు మౌంటు (పోస్టు ఆఫీసు, రెయిల్వే స్టేషను)లో నుండు వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారి పరిపాలనక్రింద చెంగల్పట్టు, ఉత్తర-దక్షిణార్కాడు, చిత్తూరు జిల్లాలు చేరియున్నవి. వీరికి సహాయముగా యిద్దరు అసిస్టెంటు వ్యవసాయ డైరక్టర్లు యున్నారు. దక్షిణార్కాడు, చెంగల్పట్టు జిల్లాలకుగాను ఒక్కరు కడలూరు నందును, ఉత్తరార్కాడు చిత్తూరు జిల్లాలకుగాను మరియొక్కరు వేలూరునందును యున్నారు.

### (౧) ప్రచారము.

చాలవరకు అన్ని తాలూకాలకును వ్యవసాయ ప్రదర్శకులున్నారు. వారు అసిస్టెంటు డైరెక్టరు ఆఫ్ అగ్రికల్చరు వారిక్రింద పనిచేయుచున్నారు. ప్రతి తాలూకా యందును కొన్ని తగిన చోటులయందు ప్రదర్శక స్థానములు యేర్పాటుచేయబడినవి. ఈ ప్రదర్శక స్థానములలో రైతులుచేయు వ్యవసాయమార్గములలో అభివృద్ధిమార్గములను వ్యవసాయప్రదర్శకులు ప్రవేశ పెట్టుచున్నారు. ఈ స్థానములలోనున్న రైతులందరును ఈ నూతనపద్ధతుల నవలంబించవలెనని వారి ముఖ్యోద్దేశము. వ్యవసాయప్రదర్శకుని పనులందు ఒక డిమాన్‌స్ట్రేషను మేస్త్రి సహాయము చేయుచుండును. ప్రతి ప్రదర్శకుని ముఖ్యస్థానమునందు ఒక డిపో యుంచబడినది.

అభివృద్ధి పనులు.—

(1) పశువుల యెరువునందు యే మాత్రముగాని నష్టము గలుగనటుల నిలువ చేయుటయు, ఆకు మొదలైన వస్తువులను కుళ్లబెట్టి (కంపోస్టు) యెరువు తయారు చేయుటయు.

(2) పచ్చియాకు యెరువు పైర్ల యుపయోగము వాటిని పెంచు మార్గములు.

(3) అనాంగిక సత్త్వములను యెక్కువగా యుపయోగబెట్టుట.

(4) శ్రమను తగ్గించునట్టి అభివృద్ధి జెందిన పనిముట్లును వుపయోగించుట హెచ్చుచేయుట.

(5) మంచి వరి విత్తులను, నారుమడియందును పొలమునందును మంచి యెరువువేసి విత్తనములను తగ్గించు పద్ధతులను ప్రవేశపెట్టుట.

(6) క్రొత్త చోటులయందు చెరుకును పైరు పెట్టించుట వృద్ధిచేయుట, లాభకరమైన మంచి రకములను సాగుచేయుటయందు ఖర్చులు తగ్గించుట, మంచి ఎరువు వేయుట, శ్రేష్టమైన బెల్లము కాచుట.

(7) ట్రయల్ ప్లాటులను (Trial plot), డిమాన్‌స్ట్రేషన్ ప్లాటులను (Demonstration plots) స్థాపించుట, వరి పచ్చియాకు యెరువును వృద్ధిపరచుటకు సీడు ఫారములను (Seed Farms) స్థాపించుట.

(8) లాభకరమున్న పనులన్నియును జూపించుటకుగాను ప్రదర్శనములు జరుపుట, మ్యాజిక్‌లాంతరు సహాయమునగాని లేక గాని వుపన్యాసము లిచ్చుట.

(9) కాపుల స్థితిగతుల నభివృద్ధిచేయుటకుగాను తీవ్రమైన సాగుబడిచేయుట

(10) ఉపవృత్తిగా ఫలవృక్షములను బెట్టుట, కోళ్లను బెంచుట మొదలగునవి.

(11) పశువుల నభివృద్ధిచేయుటకుగాను ఈ దిగువ కనబరచిన చోట్లయం దుంచబడిన ఆబోతులచేత రైతుల ఆవులను దాటించునటుల చేయుట.

(12) ఉత్తర-దక్షిణ ఆర్కాడు జిల్లాలలో రైతులు తమ వేరుశనగను పర పతి సంఘములద్వారా అమ్మేటట్టుగ సహాయము చేయుట.

పురుగులువలనను, చీడలవలనను పైరులు నష్టపడుచున్నవని తెలియచేసినపుడు, ప్రచారకులు వచ్చి సరియయిన చర్య పుచ్చుకొనెదరు. తీవ్రనష్టము కలిగినయెడల ఆయా విషయములలో తగినీమఆయినవారు చర్య పుచ్చుకొనెదరు.

పరపతి శాఖ.—చెంగల్పట్టు జిల్లాకు చెన్నపట్టణములో డిప్యూటి, మరియు సబ్ డిప్యూటి రిజిస్ట్రార్లున్నారు. దక్షిణార్కాడు జిల్లాకు వుత్తర కడలూరు పట్టణములో డిప్యూటీ మరియు సబ్ డిప్యూటీ రిజిస్ట్రార్లున్నారు.

ఉత్తరార్కాడు జిల్లాకు వేలూరులో డిప్యూటీ మరియు సబ్ డిప్యూకి రిజిస్ట్రా ర్లున్నారు. చిత్తూరు జిల్లాకు డిప్యూటి రిజిస్ట్రారు నెల్లూరులోను, సబ్ డిప్యూటి రిజి స్ట్రారు చిత్తూరులో నున్నారు.

పరిశ్రమ శాఖ.—దక్షిణ ఆర్కాడు జిల్లాకు కడలూరులో పరిశ్రమ శాఖ సూపర్ వైజరుగారున్నారు. అసిస్టెంటు యిండస్ట్రియల్ యింజనీరు తంజావూరిలో నున్నారు. చెంగల్పట్టు జిల్లాకు అసిస్టెంటు యింజనీయరు చెన్నపట్టణములో నున్నారు. ఉత్తరా ర్కాడు చిత్తూరు జిల్లాకు కోయంబత్తూరులోను, అసిస్టెంటు యిండస్ట్రియరు యింజ నీర్లున్నారు. వేలూరులో పరిశ్రమశాఖ సూపరువైజరుగారు చిత్తూరు ఉత్తరార్కాడు జిల్లాకు యున్నారు.

## కడలూరు డివిజన్.

### (A) వ్యవసాయ ప్రచారకులుండు తాలూకాలు.

| తాలూకా. | మకాం. | కేంద్రములు. |
|---|---|---|
| | చెంగల్పట్టు జిల్లా. | |
| కంజీవరం ... | కంజీవరం ... | కంజీవరం, మగరాం, గోవిందవాడి, బాల చెట్టిచత్రం, పుత్తరమేరూర్, వాలాజాబాద్, కల్వాపెట్టే, వేదాల్. |
| మధురాంతకం ... | మధురాంతకం ... | చేయూర్, పోలంబాకం, పారుక్కాల్, మధురాంతకం, పాకం, మామందూర్, నెల్వాయి, వీరణకున్నం. |
| చెంగల్పట్టు ... | చెంగల్పట్టు ... | చెంగల్పట్టు, గుడువంచేరి, మనమట్టి, తిరుపూరూర్, తిరుక్కలికుండ్రం, కాలత్తూరు, మద్రాసు, శింగపెరుమాల్ కోయిల్. |
| తిరువళ్లూర్ ... | తిరువళ్లూరు ... | తిరువళ్లూరు, పెరతూర్, బుచ్చిలిపేట, పాకం, పట్టడపెరంబుదూర్, పెరంబాక్కం, పన్నీరుకులం, కన్నిగపైర్, మప్పేడు, పేనలూరుపేట. |
| సైదాపేట ... | సైదాపేట ... | సైదాపేట, మైలాపూర్, తిరువత్తిపూర్, పోరూర్, మధురవయల్, విల్లివాకం, పల్లివరం, మాదవరం. |
| తిండివనము ... | తిండివనము ... | తిండివనం, పోలక్కూర్, కట్టీరుపట్టు, రెత్తనేయి, మందూర్, తివనూర్, వెల్లిమేడు, బ్రహ్మదేశము. |
| వృద్ధాచలం .. | వృద్ధాచలం ... | వృద్ధాచలం, యమ్‌పారూర్, మంగళంపేట, పూమంగళం, పెన్నడం, తిట్టగుడి, తొలుదూర్, కమ్మాపురం. |
| కడ్డలూరు ... | కడ్డలూరు ... | పన్రుతి, కాండ్రకోట, కీలగవరపట్టు, పాలూర్, నెల్లికుప్పం, కడలూర్, తొండమణకం కుల్లంచావడి, వాడలూరు. |
| విల్లుపురం | ల్లుపురం ... | విల్లిపురం, విక్రవంది, రాధాపురం, వలవనూర్ మాంబలపట్టు, కండమంగళం, సీర్‌నందనూర్, నేమూర్. |
| కల్లకుర్చి ... | కల్లకుర్చి ... | కల్లకుర్చి, చిన్నశేలం, శంకరాపురం, ఆలతూర్, త్యాగదుర్గం, రిషివంధ్యం, పూధూర్, ముదియనూరు. |

| తాలూకా. | ముఖ్య స్థానము. | కేంద్రము. |
|---|---|---|
| చిదంబరం ... | చిదంబరం ... | కిళ్లేవడగం, పోర్టునోవో, విల్లియనూరు, వడక్కుమంగుడీ, బువనగిరి, కాటు రాక్షి, చిదంబరం, శెట్టియటోపు, మన్నార్‌గుడి, పాలకోట్టై. |
| తిరుక్కోయిలూర్. | తిరుక్కోయిలూర్ ... | తిరుక్కోయిలూర్, అరియూర్, పిడాగం, కిరునామనల్లూర్, అరసూర్, వు. కురనూర్, పెన్నావలంవానూర్ |

(B) వ్యవసాయ ప్రదర్శకులు లేని తాలూకాలు.

చెంగల్పట్టు జిల్లా.—శ్రీపెరంబుత్తూరు, పొన్నేరి.

దక్షిణార్కాడు జిల్లా.—జింజీ.

(C) ప్రత్యేక ప్రచారకులు.

| | | |
|---|---|---|
| కడలూరు ... | కొత్తపట్నం ... | వేరుశనగ అమ్ముటకు కడలూరు కొత్త పట్నమునకు. |
| తిరుక్కోయిలూర్. | తిరుక్కోయిలూర్ ... | వేరుశనగ అమ్ముటకు తిరుక్కోయిలూర్ కొట్టువద్ద. |

వేలూరు డివిజన్.

(A) వ్యవసాయ ప్రచారకులుండు తాలూకాలు.

ఉత్తరార్కాడు జిల్లా.

| | | |
|---|---|---|
| వేలూరు ... | వేలూరు ... | సన్నంకుప్పం, అగనంచేరి, ఐడువయార్, అనయకరూరు, పైగై, పుస్నూరు, వెంకటాపురం, నెలోయి, అల్లిపురం. |
| గుడియాత్తం ... | గుడియాత్తం ... | సానాకుప్పం, నేనిమట్టి, చెంచేట, కొత్తమిట్టరానూలి, కవనూర్, అగరంకుప్పం, హవాటూర్ |
| పోలూరు ... | పోలూరు ... | సంతసవాల్, పోలూరు, ముండకలస్పూరు, రొలట్టూరు, కలంబూరు, చిట్టట్టు, సిరువల్లూరు, మామిడిమంగళం. |
| తిరువణ్ణామలై ... | తిరువణ్ణామలై ... | తిరువణ్ణామలై, పెన్నతూరు, వెరనూరు, తలమంచిపురం, మంగలం, కోసబూరు, నాయుడుమంగళం, కిరవనూర్, అవూరు. |

| తాలూకా. | | ముఖ్యస్థానము. | | కేంద్రము |
|---|---|---|---|---|
| వాలాజా | ... | వాలాజా | ... | కీలవాయి, తిమిరి, ఆర్కాటు, రాణిపేట, (పొన్నేరి ఆనకట్టు), కడపేరి, మారుమండలం, వళువంబాకము. |
| తిరుపత్తూరు | ... | తిరుపత్తూరు | ... | విషమంగళం, యేలూరు, యేకలాసుపురం, నత్రంపల్లి, మాడపులం, ఆండిఅప్పనూరు, అలంగాయం, కందిలి. |
| తిరువెట్టిపురం లేక వెన్నూర్. | | వెన్నూర్ | ... | ఐక్కారై, పల్లవరం, ఆనక్కారం, తింపనామిన్, నేడుపారై, నేరంబాకం, నశ్వేరి, తందావై. |

చిత్తూరు జిల్లా.

| | | | | |
|---|---|---|---|---|
| చిత్తూరు | ... | చిత్తూరు | ... | పుగ్రనంపల్లి, పాకూరి, తగినంపల్లి, గుంభాల, కట్టమంచి, కొత్తకోట, బైజురెడ్డిపల్లి, పారవారిమిరూపాక్షి. |
| మదనపల్లి | ... | మదనపల్లి | ... | వేనేప్పలి, పెద్ద తిప్పసముద్రం, కొత్తకోట, పెద్ద తిప్పసముద్రం, రెడ్డివారిపల్లి, గరబుర్ల, కంచాలపల్లి, గొల్లపల్లి, సోంపల్లి, గంకలమాడుగు. |
| పల్మనేరు | ... | పల్మనేరు | ... | కల్లుపల్లి, పల్మనేరు, బాలుపల్లి, బైరెడ్డిపల్లి, వెంకటగిరికోట, కొంగటాం, రామ్‌కుప్పం, సముద్రపల్లి. |
| తిరుత్తని | ... | తిరుత్తని | ... | తిరుకాలగాడు, ఆర్కాడుకుప్పం, అత్తిమంజేరి, బీవనంబాకం, నారాయణవరం, కార్వేటినగరం, ఉప్పరాపల్లి, పూడినిడియం, వేదియంగాడు. |

## (B) ప్రదర్శకులు లేని తాలూకాలు.



ఉత్తర ఆర్కాడు జిల్లా—

| | |
|---|---|
| ఆర్కోణం. | వండివాషు. |
| ఆర్ని. | చెంగం. |

చిత్తూరు జిల్లా—

| | |
|---|---|
| వాయల్‌పాడు. | కుప్పము. |
| చంద్రగిరి. | కాళహస్తి. |
| పుంగనూరు. | పుత్తూరు. |

ఆబోతుల పట్టిక.

| | జిల్లా. | స్థలము. | ఆబోతు జాతి. |
|---|---|---|---|
| 1 | ఉత్తర ఆర్కాడు. | తిరువెత్తిపురం, చెయ్యార్ తాలూకా. | ఒంగోలు నె 20 రు. |
| 2 3 4 | డిటో ... | కాట్పాడి మిషన్ ఫారం. | కాంగాయం నె 1 రు, నె 109 రు, సింధి నె 600 రు. |
| 5 | డిటో . | శేరుకాడు గ్రామం ... | కాంగాయ నె 101 రు. |
| 6 | డిటో ... | నూరంకుప్పం, గుడియాతం తాలూకా. | కాంగాయం. |
| 7 8 | డిటో ... | కాట్పాడి పరిశ్రమలబడి. | కాంగాయం నె 113, 74 ర్లు. |
| 9 | డిటో ... | మేల్పాడి ... | కాంగాయం నె 102 రు. |
| 10 | డిటో ... | జిల్లా జైలు, వేలూరు ... | ఒంగోలు నె 50 రు. |
| 11 | డిటో ... | యరం తంగాల్ ... | కాంగాయం. |
| 12 | చిత్తూరు ... | మదనపల్లి పశువైద్యశాల. | కాంగాయం నె 25 రు. |
| 13 | డిటో ... | పంచాయతి బోర్డు ప్రెసిడెంటు, చెవరంపాకం. | కాంగాయం నె 143 రు. |
| 14 | చెంగల్పటు ... | మెర్బోజుపురం, చెంగల్పట్టు. | కాంగాయం నె 128 రు. |
| 15 | డిటో ... | కంజీవరం, పసువైద్యశాల. | సింధి నె 69 రు. |
| 16 | దక్షిణార్కాడు. | అజీజునగర్ శెటిల్మెంటు. | కాంగాయం నె 106 రు. |
| | మదరాసు ... | పశువైద్యకలాశాల ... | సింధి నె 13 రు, ఒంగోలు, నె 97 రు, మాంటాగమరి నె 180 రు, అయిర్షైర్ — ఒంగోలు నె 150 రు, అయిర్షైర్—ఎనుబోతులు నె 4 రు. |

డిపోలలో నగదు డబ్బుకు దొరుకు వస్తువుల జాబితా.

| వస్తువుల పేరు. | | |
|---|---|---|
| హెచ్. యం. గుంటక నె 0 రు | ... | ... |
| హెచ్. యం. గుంటక నె 1 రు | ... | ... |
| హెచ్. యం. గుంటక నె 2 రు | ... | ... |
| కూపరు నాగలి నె 26 రు | ... | ... |
| కూపరు నాగలి నె 26 రు | ... | ... |
| కూపరు ఓడిషేరు క్రరుతో | ... | ... |
| కూపరు విడిషేరు క్రరుతో | ... | ... |
| కూపరు విడిక్రరు మాత్రం | ... | ... |

వస్తువుల పేరు.

| | | |
|---|---|---|
| వెంపలి విత్తనములు | ... | ... |
| జీలుగ విత్తనములు | ... | ... |
| పిల్లిపెసర విత్తనములు | ... | ... |
| జనుము విత్తనములు | ... | ... |
| పరివిత్తనము—చులకన | ... | ... |
| ,, బరువు | ... | ... |
| క్రూడుఆయల్ యమల్షన్ | ... | ... |
| చేపనూనెతో చేసిన సబ్బు | ... | ... |
| లెడ్డు ఆర్సనేటు | ... | ... |
| వ్యారిను గ్రీను | ... | ... |
| గ్రామస్థుల పంచాగములు | ... | ... |
| అన్ని ప్రకటన పత్రికలు | ... | ... |

బజారు ధరల ననుసరించి ఖరీదులు మారును. సమీపముననున్న వ్యవసాయపు డిమాన్ట్స్రేటురుకుగాని, అసిస్టాంటు డైరెక్టరుకుగాని వ్రాసి తెలిసికొనవలెను.

రసారమి యివియన్నియును డిపోలో దొరుకును. ఏదైన దొరకనిపక్షమున కావలసినవారు ముందుగానే పైకం చెల్లించి యితర స్థలములనుండి అవివచ్చువరకు కాచుకొనియుండవలెను.

అన్ని వ్యవసాయ విషయములనుగూర్చి యుచితముగ సలహాలు యివ్వబడును.

(బి) పరిశోధన.

వ్యవసాయ పరిశోధన స్థానము, తిండివనము.

1925 వ సం॥ జూన్ మాసములో తాత్కాలికముగా తెలుపబడిన పాలకుప్పం వ్యవసాయ పరిశోధనస్థానము పది సంవత్సరముల కవులుముగియుటచే 1935 వ సం॥ మే 31 వ తేదిన మూసివేయబడినది. తిండివనం తాలూకా. యరయనూర్ గ్రామంలో విస్తీర్ణం య 40·28 ల స్తలము 1935 వ సం॥ మే 16 వ తేదిని తీసుకొని పరిశోధనముయొక్క యేర్పాటులు జరుగుచున్నవి. యీ స్తానము తిండివనం విలియనూర్ రోడ్డునచేరి తిండివనం రైల్వే స్టేషన్ సుమారు 2 మైళ్లదూరముననున్నది.

రకముల పరిశోధన వంగడముల యేర్పు యీ వ్యవసాయస్తానమున విరివిగా జరుగుచున్నవి.

ఏమి చూడవలెను ? ఎప్పుడు చూడవలెను ?

జనవరి—వర్షాధారపు సూపు, వేరు సెనగ ఆముదములు వీని కోత.

ఫిబ్రవరి—వర్షాధారపు సూపు, ఆముదము—వీనికోత, కైలు.

మార్చి-మే—మంచి కనిమట్లతో మెట్ట నేలల సాగు ; తోట సూపు, మెట్ట సూపుకోత, ఆముదపుచెట్లు తీయుట.

జూన్-జూలై—వర్షాధారపు వేరుసెనగ ఆముదము చల్లిక ; తోట సూపు కోత.

ఆగస్టు-సెప్టెంబరు—వేరుసెనగ, ఆముదాలు, వంగడముల పరీక్ష.

అక్టోబరు—పునాస వేరుసెనగ తీత.

నవంబరు-డిసంబరు—వర్షాధారమున నూవు చల్లిక; నిలవవున్న వేరు సెనగ ఆముదములు, వేరుశనగ తీత.

వ్యవసాయ పరిశోధన స్థానము, పాలూరు (దక్షిణార్కాడు జిల్లా).

పాలూరు వ్యవసాయ పరిశోధన స్థానము కడలూరు-వృద్ధాచలం రస్తామీద నున్నది. నెల్లికుప్పము రయిల్వే స్టేషనుకు 5 మైళ్ల దూరమున నున్నది. ఇది 1905 వ సంవత్సరములో స్థాపింపబడినది. ఈ స్థానములో 51 యకరములు సాగు. అందులో 32 యకరములు బావులువల్ల సాగు, 19 యకరములు వర్షపు సాగు.

ఏమి చూడవలెను? ఎప్పుడు చూడవలెను?

ఈ స్థానము చూచుటకు మంచి కాలము అక్టోబరు నెల. అప్పటిలో అన్ని పొలములలో పైర్లుండును.

సంవత్సరమంతయు ఎప్పుడు పడితే అప్పుడు యీ దిగువ నుదహరించినవి చూడవచ్చును. కొంచము లోతునసున్న నీరు తోడుటకు ఆర్కిమిడియను స్క్రూయను నీరు తోడు యంత్రమును, మేలైన చుట్టు కపిల సులువుగా తిరిగే బాల్ బేరింగు మోట చక్రము, పశువుల జాగ్రత, మేతపెట్టు విధి, పశువుల కొట్టాయిలోనే పశువుల ఎరువును గంజరమును జాగ్రత్తపెట్టుట. విశేషముగ గ్రుడ్లు పెట్టు వైటు లెగ్గు జాతను కోళ్లను, తీండికి అనుకూలముగానుండి విశేషము గ్రుడ్లుపెట్టు రోడ్ ఐలెండు రెడ్, వైటు సస్సెక్సు కోళ్లు పెంచబడుచున్నవి. వాటి చిన్న పిల్లలు సాధారణమైన వెలకు అమ్మబడును.

తినుటకు మంచివిఅయినట్టియు, ముళ్లు తక్కువ గలిగినట్టియు చేపలను ఫారము బావులలో పెంచుచున్నారు.

దేశవాళీ తేనె పట్లు సంవత్సరమంతయు పెంచబడును. తేనె విరివిగా యుండు కాలమున తేనెతీయుట చూడనగును.

ఏప్రిల్-మే నెలలు తప్ప తక్కిన కాలమంతలోను ఈరి పట్టుపురుగులన్ని స్థితులలోను, పట్టు వడుకుట మొదలగునవి చూడవచ్చును.

జనవరి-ఫిబ్రవరి—రాగి, వేరుశనగకు భూములను రెక్కగల యినుప నాగళ్లతో దున్నుట నీటి కాలువలు, మళ్లు బండుఫార్మరుతో అచ్చుట్టుకట, వేరుశనగ పీకుట, రాగి నాటుట, చెరకు విత్తనము నాటుటకు యిరువైపున రెక్కలుగల యినప నాగళ్లతో సాళ్లుతీయుట, చెరకు విత్తనము మందులో తడుపుట, సాళ్లలో చెరకు నాటుట, వర్షాధారపు వేరుశనగను త్రవ్వుట, వరికోయుట, ప్రత్తి ఏరుట, తూర్పు పట్టుయంత్రము పనిచేయుట.

మార్చి-ఏప్రిల్—చెరకుకొట్టుట, రసముయంత్రము సహాయముతో తీయుట, బెల్లము చేయుట, పాకుతీయుట, పంచదార చేయుట జరుగును. జంట సింధువాహి చెరకు పొయ్యి పనిచేయుచుండును. రాతిగుండ్లక్రింద రాగి కంకులు నూర్చుట చూడవచ్చు

ను. రాగిపైరులో వేరుశనగ విత్తుట, లేత అరటి తోటలు, చెఱకురకములు వేరుశనగ పైర్లు చూడవచ్చును.

మే.—'కోర్రై' యను తుంగను నిర్మూలించుటకుగాను హెచ్.యం. గుంటకతో పాయుట. వరికి నారుమడి తయారుచేసి విత్తులను పలచగ చల్లుట, చెరుకు సాళ్లమధ్య ఒంబెడ్డు కట్టి జూనియర్ హోతో (Junior Hoe) మెడసేద్యము చేయుట చూడవచ్చును. పెరుగుచున్న జీలుగ, జనుము పచ్చియాకు పైర్లను, వేరుశనగ, చెరకు, అరటిపైర్లను చూడవచ్చును. వేరుశనగను పాడుచేయు 'సురుల్ పూచీ' యను పురుగును ఆకర్షించుటకుగాను రాత్రిళ్లు దీపపుబోనులను చూడవచ్చును.

జూన్-జూలై.—పచ్చియాకు ఎరువు పైర్లను హిందుస్థాన్ యినుపనుడకతో పడదున్నుట, వరిని వంటినారుతో నాటుట, చెరకునకు రెండవసారి ఎరువుపెట్టి హిందుస్థాన్ యినుపనాగలితో మన్నుతోయుట, తోటపైరు వేరుశనగను లేవనెత్తుట, పెరుగుచున్న పచ్చియాకు పైర్లను, చెరకును చూడవచ్చును.

ఆగస్టు.—మెట్టు వరిరకములను గొర్రుతో విత్తుట, పల్లపు భూములలో పచ్చియాకెరువు పైర్లను హిందూస్థాన్ నాగలితో పడదున్నుట, కంబోడియా ప్రత్తిని గట్లమీద విత్తుట, చెరకునకు కడసారి మన్నుతోయుట, చెరకు మధ్యను దంతితోగాని హెచ్.యం. గుంటకతోగాని పాయుట; పెరుగుచున్న సజ్జ, జొన్న, ప్రథమ పంట వరి, చెరకు, అరటి, వరి వక్కొక్క మొక్కయెన్నికల పైర్లను పల్లపు భూములలో చూడవచ్చును. వరకు విత్తనములు శీఘ్రకాలములోనే మొక్కవచేయుటకుగాను చెరకు నాటుట చూడవచ్చును.

సెప్టంబరు.—పల్లపు భూములలో రకముల తారతమ్యములకును 4 ఎరువుల పరిశోధన నిమిత్తము ప్లాటులు యేర్పాటుచేయుట, వరినారును వరుసలుగ నాటుట, వరిపైర్లకు పచ్చియాకు ఎరువులకు సహాయముగా భాస్వరపు ఎరువులువేయుట, ప్రథమ వరిపైర్లను కోయుట, రెండవ పంట వరికి భూమిని తయారుచేయుట, చెరకు పైర్లకు కొయ్యలు పిట్టింగు గడ్డపారతో గోతులు తీసి నాటి యినప తిగలతోను వెదుళ్లతోను దంతెములువేయుట, కోసే యంత్రముతో సజ్జదంట్లు కోయుట.

నవంబరు-డిసంబరు.—రెండవ వరిపైరు నాటుట, చెరకు నాటు పొలములలో పచ్చియాకు ఎరువు పైర్లు చల్లుట, పెరుగుచున్న వరి, చెరకు అరటి పైర్లను చూడవచ్చును.

## విచారణీయమైన అంశములు.

వరి.—(1) ముఖ్యమైన దేశవాళి వరిరకములు విగన ఒంటి వరి రకములతో పరిశోధన.

(2) మెట్ట వరిపైరు రకముల పరిశోధన.

(3) పచ్చియాకు ఎరువులకు తోడు భాస్వరపు ఎరువులు, ఎముకలపొడి వేయుటవల్ల గలుగు మేలు పరిశోధన.

చెరకు.—(1) లోగడ విదేశములనుంచి చెరకు రకములు తెప్పించి పైరు చేయడమైనది. అవి క్రమక్రమముగ క్షీణించినది. మంచిరకము చెరకులు యిచ్చుటకుగాను వేర్వేరు చెరకులరకము పరిశోధనలు జరుగుచున్నవి. రోగమునకు, నీటిలేమికి, నీటి ముంపుదుకు తట్టుకొనే చెరకు రకములు, మరియు విశేషము పైరునిచ్చేవి, బెల్లము, జాస్తినిచ్చే చెరకు రకములు పరిశోధనలో నున్నవి.

(2) మంచి విత్తనముగాక ఎరువుకూడ చెఱకు పంటలో మంచి పనిచేయును. అందుకుగాను యీ దిగువ నుదహరించిన పరిశోధనలు జరుగుచున్నవి.

(a) స్వల్ప మదుపుతో ఎక్కువ పంట తీయుటకు ఎంత భాస్వరము, పొటాషు, కావలయునో కనుగొనుట.

(b) సేంద్రియపు ఎరువులతో కలిపియు, ప్రత్యేకముగను, సోడియ నత్రితము యొక్క ఉపయోగమును కనుగొనుట.

ఈ విషయమునుగురించి పరిశోధనలు జరుగుచున్నవి.—

1. చెరుకు కార్చి తోటలనుంచుటవలన లాభ నష్టములు.

2. చెరుకు దుబ్బులకు చుట్టునున్న నేలలో ఎరువు వేయుటవలన లాభము.

3. వరపున కాగు కో॥ 213, 281, 285 మొదలగు చెరుకులకు నీరు తగ్గించి పెట్టుటవలన మంచి చెడ్డలు.

4. 6, 8 మాసములలో పంటకువచ్చి దేశవాళి రకముల రాలికతో సమమయిన శాలికనిచ్చు జొన్నలో సంకరపు చెరకు రకములు యీ ప్రాంతములలో అనుకూలముగా పెరుగు కాలమును కనిపెట్టుటకు అన్ని మాసములలోను వేసి పెంచబడుచున్నవి.

5. దురుకుగా నాటు వేవడి దవ్వ పెంచబడుచున్నది. యితర సస్యముల మంచి వంగడములు ప్రవేశపెట్టుటకుగాను, వేరుశనగ, సూళ్ళు, చోడి తారతమ్య పరిశోధనలు జరుగుచున్నవి. 2. వరి మొదలగు సస్యములకు, నీరు ఎంతవరకు ఆవశ్యకమో కనుగొనబడుచున్నది. 3. యితర పరిశోధనలతో పాటు నీరుతోడు యంత్రముల యొక్కయు నాగళ్లయొక్కయు యితర పనిముట్లు యొక్కయూ తారతమ్య శోధనలు జరుగుచున్నవి.

## వ్యవసాయ పాఠశాల స్థానము, కాళహస్తి, చిత్తూరు జిల్లా.

కాళహస్తి రైల్వే స్టేషనుకు 2 మైళ్ల దూరమునను, కాళహస్తి పట్టణమునకు 3 మైళ్ల దూరమునను, తిరుపతి-కాళహస్తి రస్తామీద యీ స్థానమున్నది. ఇది 1926 వ సంవత్సరమున స్థాపింపబడినది. ఈ స్థానము పరిమితి 30 యకరములు. అందులో 9 యకరములు మాగాణి, 5.55 యకరములు మెరక, 4.80 యకరములు తోట భూమి, మిగతాది రోడ్లు, యిళ్లు. పల్లపు భూములకు పూరందూరు చెరువు మెరక భూమునుంచి నీటిపారుదల. దీనికి సహాయముగ నై 10 రు పల్లపు భూమిలో యొక ఒంటిమోటగల బావియున్నది. తోట భూమికిగాను రెండు మోటలమర్చబడిన బావి నై 20 రు భూమిలోనున్నది. ఈ ప్రాంత్యములో సంవత్సరమునకు 55 పదునులు (inches) వర్షము. అందులో నూటికి 60 వంతులు వర్షము తూర్పు వానకాలములోను, 30 వంతులు పడమటి వర్షకాలములోను, మిగతవర్షము యెండకాలములోను పడును. అడుగున జిగటుమట్టిగల సారములేని యిసుక తెరయైన బీదచవుడు భూములు. ఇంకను ప్రారంభింపని వ్యవసాయ మధ్యమ పాఠశాలకు అనుబంధముగానుండుటకుగాను యీ స్థానముయేర్పడినది. ఈ పాఠశాలలో యెట్టి మంచి విద్యాభ్యాసము యివ్వవలెనో యింకను తీర్మానించబడలేదు. భూస్వాముల చదువుకన్న కుమాళ్లకు వ్యవసాయము నేర్పుటయేగాక, లోవరు శెకండరీ బళ్లలో కుఱ్ఱవాళ్లకు వ్యవసాయపు పాఠములు చెప్పుటకుగాను తరిఫీయతు చేయుటకు కొద్దిమంది శెకండరీ గ్రేడు ఉపాధ్యాయులు చేర్చుకొనబడుదురు. వారికిని వ్యవసాయములో ఒక సంవత్సరము తరిఫీదునియ్యదురు. చవుడువిరుగుటకుగాను చెరువులోని వండును, కుళ్లిన కంపోస్టుయెరువును మెరక భూములకు తోలుటయు, పచ్చియాకెరువులగు బొబ్బర పులవపైర్లను తోట భూములలో పడదున్నుటయు, పచ్చియాకు పైర్లను పచ్చియాకులును పల్లపు భూములలో పడదున్నుటయును, నీరు నిలువకుండ తీసివేయుటకుగాను తగిన శ్రద్ధ తీసుకొనబడుచున్నది. ప్రతి సంవత్సరము శ్రద్ధతో యీలాగు చేయుటవల్ల చవటి భూములు బాగుపడి లాభకరములైన చెరకు, వేరుశనగ. వరి అరటి పైర్లు లాభకరముగ పంట పెట్టబడుచున్నవి.

ఫారములో యేమిచూడవలెను, ఫారము యెప్పుడు చూడవలెను.

జనవరి-ఫిబ్రవరి.—వర్షాధారపు వరి పైర్ల కోత. వాడను సంబా, సి.ఓ. 2 వరి, జి.ఇ.బి. 24 వరి, వర్షాధారపు పైర్లుగా చూడవచ్చును. వాడను సంబావేసిన భూములలో జీలుగను పచ్చియాకు ఎరువుకుగాను విత్తుట. కేసరి జి.ఇ.బి. 24 వరిపైర్లను నాటుట, చల్లుట, రాగులు, వేరుశనగ మిశ్రమమైన పైర్లు, గుత్తివేరుసెనగ, జావా 247 చెరకు, సి.ఒ. 213, జొన్నతో సంకరపు చెరకు, అరటి, జనుము, బొబ్బర, పులవ పచ్చియాకు పైర్లను చూడనగును.

మార్చి-ఏప్రిల్.—మెరక, తోట భూములకు చెరువులోని వండును తోలుట, చల్లుట, అరటిలోను, శాశ్వతపు గడ్డి భూములలోను ఇనుపనాగళ్లతోదున్నుట, జూనియర్ హో (Junior Hoe) ను, బండుఫార్మరును పనిచేయుట, చెరకు నాటుట, చెరకు కొట్టి బెల్లముచేయుట, రాగికోత, హెచ్. యం. గుంటకతో వేరుశనగ లేవనెత్తుట.

మే-జూన్.—కొర్రు భూములను యినుప నాగళ్లతో దున్నుట, నారుమళ్లు చల్లుట, రాగి, సజ్జనాటుట మెరక వరి పొలములలోని జీలుగుకోయుట, దానిని కంపోస్టుచేయుట, కూరగాయలు, ఎర్రగెడ్డలు నారులుపోయుట. వాడను సంబా వరివేసిన భూములకు యెరువువేసి యినుప నాగళ్లతో దున్నుట.

జూలై-ఆగస్టు.—రాగి పైరులో యినుపపండ్ల దంతితో కొండసేద్యముచేయుట, గొర్రుతో వాడన్ సంబా. జి.ఇ.బి. 24, సి. ఒ. 2 వడ్లు విత్తుట, పల్లపు వరిభూములలో పెరుగుచున్న జీలుగ పైరు, అరుక, కంది మిశ్రమ పైర్లలో 5 వరుసలు ఆరుకలు క వరుస కంది గొర్రుతోను, ఖుర్రతోను. విత్తుట. వర్షాధారపు భూములలో కంది, బుడమ కలిపి మిశ్రమపైరుగ విత్తుట. ఆముదాలు విత్తుట. వర్షాధారపు భూములలో కొర్రలు, సజ్జలు, గింజలకు, గడ్డికిగాను విత్తుట. ఎర్రగెడ్డ నారు నాటుట.

సెప్టంబరు-అక్టోబరు.—రాగి, సజ్జ కోత, విత్తనము ఏరుట. పెరుగుచున్న వాడన్ సంబా వరిపైరు. పల్లపు భూములలో జీలుగపైరు. కోసిన మిట్ట, తోటభూములో పచ్చియాకు యెరువుకుగాను బొబ్బర్లు, ఉలవలు చల్లుట. పెరుగుచున్న కొర్ర, ఎర్రగెడ్డ, సజ్జ, జి.ఇ.బి. 24, కందిపైర్లు. మిట్టను గొర్రుతోవేసిన వరి సాళ్లలో పండ్లమానుతోలుట. సి. ఒ. 2 వరి, పైరు నాటుట, పెరుగుచున్న అనాస పనస పైరును చూడవచ్చును.

నవంబరు-డిసంబరు.—జాడ సజ్జను, జీలుగును కోయుట. హెచ్. యం. గుంటకతో నేలను పాకిరే జాతి వేరుశనగను లేవనెత్తుట. పల్లపు భూములలో వరికిగాను పచ్చియాకు జీలుగపైరును పడదున్నుట. పల్లపు భూములకు కేసరి, జి.ఇ.బి. 24, వడ్లునారు పోయుట. పెరుగుచున్న చెరకు రకములు, కోసిన మేత పైర్లనుమాగుడుకు గుంతలోవేయుట చూడవచ్చును. భూములన్నియు సమాన ఫలితమునకు రాని కారణమున వ్యవసాయ సమస్యలను పరిష్కారముచేయు పనులను యీ స్థానమునందింక ను ప్రారంభింపలేదు. కాని వరి చల్లికలోను, నాటుటలోను, గొర్రుతో విత్తుటలోను గల పంట తారతమ్యములు, ఖర్చులు తారతమ్యములు తెలుసుకొనుటకుగాను ప్రయత్నములు నడుచుచున్నవి.

ఈ స్థానమునకు యెల్లరు రావచ్చును.

కె. ఉన్నిక్రిష్ణ మీనన్,

వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, నాల్గవ సర్కిలు.

## 2 (ఇ) ఐదవ సర్కిల్.

ఈ సర్కిలులో తిరుచునాపల్లి, తంజావూరు జిల్లాలు చేరియున్నవి. ఈ సర్కిలు పై యధికారియైన డిప్యూటి డైరెక్టరువారు తిరుచునాపల్లిలో నుందురు. వీరి ఆఫీసు పుత్తూరు (తిరుచునాపల్లి) పాత పోలీసు ఆసుపత్రి భవనములో నున్నది. వీరియొక్క తపాలా చిరునామా "వ్యవసాయ డిప్యూటి డైరెక్టరు, 5 వ సర్కిల్, తిరుచునాపల్లి."

### (ఎ) ప్రచారము.

2. ప్రచారము చక్కగాను, శ్రద్ధతోను, సమర్థతతో కార్యమును జరుపుటకుగాను ప్రతి తాలూకాయందు నాల్గు ముఖ్య స్థలములకు బదులు ఇంకొక పద్ధతి నవీనముగా పెట్టబడినది. ప్రతి తాలూకాలోను నాలుగు ముఖ్యస్థలములకు బదులు తొమ్మిది ముఖ్య కేంద్రములేర్పరచి యీ కేంద్రములందును, కేంద్రముల సమీపముననున్న ఆయిదు గ్రామములనుకూడా వ్యవసాయ పద్ధతులను ప్రదర్శించునట్లు యేర్పాటు చేయనయినది. వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు తాలూకా అంతయు తమ శక్తిని వినియోగించుటకు బదులుగా యీ నలభై స్థలములలోనే తమ యావత్తు శక్తిని ప్రయోగించి రయితులను నూతన పద్ధతులను అవలంబింపచేయుచున్నారు. రయితులు యీ నూతన పద్ధతులను చక్కగా తెలుసుకొనిన తరువాత వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు యితర గ్రామములకు వెళ్ళెదరు. అవసరమైనయెడల డిమాన్‌స్ట్రేటర్లు తాలూకాలోని ఇతర గ్రామములకు వెళ్ళెదరు. ఈ పద్ధతిని పది సంవత్సరములలో తాలూకాలోని అన్ని గ్రామములలోను విరివిగా పని జరుప వీలు కలుగుచున్నది. గ్రామములో సాగుచేయు సస్యములను అన్ని విధముల అభివృద్ధిపరచుటకు, ఒక్కొక్క అభివృద్ధి ఎక్కువ మళ్లలో ప్రయత్నము చేయుట అవశ్యకమని, ఒక్కొక్క కేంద్రమున ఆయిదు, ఆరు, ప్రదర్శక పొలములు వుంచునట్లు వ్యవసాయపు డిమానుస్ట్రేటరుకు వుత్తరవుగలదు.

డిమాన్‌స్ట్రేటర్లు యీ క్రింద కనబరచిన స్థానములయందు నియమింపబడి యున్నారు. వారుండు స్థలములలో డిపోలున్నవి. వారు పనిచేయు స్థలములకూడా తెలుపబడినవి:—

| తాలూకా. | ముఖ్యస్థానము. | ప్రదర్శక స్థానములు. | డిమాన్‌స్ట్రేటర్లులేని తాలూకా. |
|---|---|---|---|
| | | తిరుచునాపల్లి జిల్లా. | |
| 1 తిరుచునాపల్లి. | తిరుచునాపల్లి ... | అరిశన్నగుడి, తిరుప్పత్తురై, నెల్లితిరుముడమ్, తిరువాళార్‌సోత్తై, అహామ్, ఎట్టారైకుప్పు, కుట్టిపట్టు ఆరియపూరు, పెంకట్. | ... |
| 2 లాల్‌గుడి ... | లాల్‌గుడి ... | లాల్‌గుడి, కలియనల్లూరు, ఇమంగలూర్, అరియూర్, వగ్గలూరు, నెల్లానూర్, కళ్లకుడి, శిరుగనూరు. | ... |

| తాలూకా. | ముఖ్యస్థానము. | ప్రదర్శక స్థానములు. | డిమార్క్ స్ట్రైటర్ లేని తాలూకా. |
|---|---|---|---|
| | | తిరుచునాపల్లి జిల్లా—శేషము. | |
| 3 కుళిత్తలై ... | కుళిత్తలై ... | మాయనూరు, మరుదూరు, మణిపారై, మహాధనపురం, వైగనల్లూరు, పొయ్యామణి, కలుగూర్ ఉదయపట్టి, వైయాంపట్టి. | ... |
| 4 కరూరు ... | కరూరు ... | కరూరు, పరమతి, వెల్లియన్నై, నేరూర్, పుగలూర్, ఉప్పిడిమంగళం, గూడలూర్, చిన్న ధారాపురం. | ... |
| 5 ముసిరి ... | ముసిరి ... | మేపూరు, తొరయూరు, కాట్టుపుత్తూరు, తాత అయ్యంగారు పేట, వైగిచెట్టిపాళ్యం, ముసిరి, తొట్టియూమ్, జంబునాథపురం. | ... |
| 6 పెరంబలూరు. | పెరంబలూరు ... | వాలికొండిపురం, పేరలి, చెట్టికుళం, నారాయణమంగళం, నక్కాశలం, ఆవాంబూరు, ఒగలూరు, పెరంబలూరు. | ... |
| 7 ఉడియార్ పాళ్యం. | అరియలూరు ... | అరియలూరు, ఉడియార్ పాళ్యం, తిరువంగూరు, సెందురై, వీరంగుడి, అండిమాదం, టీపాలూరు, గంగమైనాండాపురం. | ... |
| | | తంజావూరు జిల్లా. | |
| 1 తంజావూరు. | తంజావూరు ... | రాయంపేట, తిరుకుట్టుపల్లి, అమ్మను, రామాపురం, సూరమదై, వన్నాక్పదై, ఖుడలూర్. | అరందాంగి. |

| తాలూకా. | ముఖ్యస్థానము. | ప్రదర్శక స్థానములు. | డిమాకొన్సెస్టి టర్లు లేని తాలూకా. |
|---|---|---|---|
| | | తంజావూరు జిల్లా—శేషము. | |
| 2 కుంభకోణం. | కుంభకోణం ... | ఉడియలూరు, కుంభకోణం, తిరుపనందాల్, తిరుమంగళంకుడి, కుత్తనూరు, పరుదనైలూరు, స్వామిమలై, కోవిల్ చేరి. | ... |
| 3 పాపనాశం. | పాపనాశం ... | నల్లూరు, ఆగరమాంగుడి, కల్లం, పుత్తామదానపురం, కాళంచేరి, కపిస్థలము, విరుకరుగపూర్, అయ్యంపేట, చంద్రశేఖరపురం. | ... |
| 4 మాయవరం. | మాయవరం ... | మాయవరం, శంబణారుకోవిల్, తిరుచెందూరు, మంగనల్లూర్, కుత్తాళమ్, మనమోడు, తిరుకడయూర్, ట్రేంక్విబార్. | ... |
| 5 షియ్యాళి. | షియ్యాళి ... | షియ్యాళి, కొడికుడినాడపడి, హనుమంతపురం, కున్నం, తిరువేంగాడు, కుదనం, వడిగల్, పారంగట్టుగుడి. | ... |
| 6 నన్నిలం ... | నన్నిలం ... | నన్నిలం, కరుగుడి, శెరుకళత్తూర్, కడంబంగుడి, కడిగం, వర్కుడి, పల్లివిలగం, కూతనూరు. | ... |
| 7 నాగపట్టణం. | తిరువాలూరు ... | యిళవూరు, శిక్కాల్, వలివలం, మాలంగుడి, వెంప్పాలం, కొరడచేరి, వప్పికక్కరై, నన్నిలాయపురం. | ... |

| తాలూకా. | ముఖ్యస్థానము. | ప్రదర్శక స్థానములు. | డిమాన్ స్ట్రేటర్లు లేని తాలూకా. |
|---|---|---|---|
| | తంజావూరు జిల్లా—శేషము | | |
| 8 మన్నారుగుడి. | మన్నారుగుడి ... | పూవనూరు, శిత్తనకుడి, బూతమంగళం, మేల్ నాతం, కోవిలెవెన్ని నిడువకోట్టై, మన్ని యూర్, ఓవర్ చేరి. | ... |
| 9 తిరుత్తుర పూండి. | తిరుత్తురపూండి. | ఉప్పూరు, నీడుంబలం, మేట్టుపాళ్యం, నీరు ముల్లై, తెన్ పట్టి, క రంబియారు, తెన్నం బాలం, వేదారణ్యం. | ... |
| 10 పట్టుకోట్టై. | పట్టుకోట్టై ... | పట్టుకోట్టై, పాపనాడ్, పురటనాడ్, పెరవర్ణి, ముదుకూర్, రాజమ దం, అండికాడు, నాంబివయాల్. | ... |

3. జిల్లాలలో ప్రచారమువల్ల జరుగు పనులు అభివృద్ధి పొందుటకు ముఖ్య పద్ధతులు.

(ఎ) పశువుల యెరువు భద్రపరచు సదుపాయములు.—పశువుల మూత్రము, పేడ, రయితులకు సులభముగాను, శ్రమలేక దొరకు ఎరువుగా యుంటున్నవి. కావున పశువుల యెరువు యే మాత్రము వృథాపోకుండయుండుటకు యెరువుతో కసువు కలిపి, ఎరువు యెండకు యెండకుండ గాలికి వృథాపోక జాగ్రత్తతో యుంచు మార్గములు రయితులకు బోధింపబడుచున్నవి. ఏ రయితు తన యెరువు దిబ్బను జాగ్రతపరుచుకొనక పోవునో ఆతడు తన ఆస్తిని పోగొట్టుచున్నట్లు తలచవలసినది. ఎరువులు రయితులకు ఆస్తితో సమానమైనవి కావున పశువుల మలమూత్రములను, పశువులశాలలోయుండు కసువు మొదలగునవియు భద్రపరచి శ్రేష్టమైన ఎరువుగాచేయు పద్ధతులను రయితులకు వ్యవసాయ ప్రదర్శకులు యెక్కువగా వక్కాణించి బోధించుచున్నారు.

(బి) పచ్చిఆకుల ఎరువు వి త్తనములు ప్రవేశపెట్టుట, సాధ్యమైనంత తక్కువ వెలకు అమ్ముట.—జీలుగ, వెంపలి, జనుము, నీలి, యీ నాలుగు పచ్చి ఆకుల ఎరువు వి త్తనములు, రైతులు వారి భూములలోచల్లి సాగుబడిచేయుటకు సలహాలు యివ్వబడుచున్నవి. దంప నేలలకు యివి చవకైన యెరువులు.

(సి) ఈ ప్రాంతమునకు అనుకూలించే సారయుక్తమగు రసాయన సంబంధమగు యెరువులు జనసమ్మతమగునట్లు చేయుట.—చాలినంత పశువుల పెంట లేకపోవుటచే పొలములకు తక్కువగావేసి, అమ్మోనియంసల్ఫేటు, సూపరుఫాస్ఫేటు, ససిఫాస్ మొదలగు రసాయనపు ఎరువులనుకలిపి ఉపయోగించవలెను.

రసాయన ఎరువులను మన పెంటతో అనగా పశువులపేడ, గానుగ పిండి మొదలగు వాటితో కలిపివేయుటకు హెచ్చరింపబడుచున్నారు.

(డి) అభివృద్ధి పనిముట్లను విరివిగా ఉపయోగించుట.—కూపర్ నె 25 రు, నె 11 రు వంటి రెక్క గల యినుప నాగళ్ల ఉపయోగమువలయు ప్రదర్శనములతో రయితులకు యిదివరకే తెలిపియున్నారు. వ్యవసాయశాఖవారివలన ఇవ్వబడు ప్రత్యేక అప్పులువలన ప్రతి రయితు అభివృద్ధి పనిముట్లను కొనుక్కొనవచ్చును.

(ఇ) మేలయిన రకముల వరివిత్తనములను వృద్ధిపరచి వాటిని రయితులకు పంచిపెట్టుట, నారుమడిలోను పొలములోను విత్తనము తగ్గించుట.—కట్టు సంబాలో తక్క మిగిలిన అన్ని ముఖ్య వరి రకములలోను, మంచి వంగడములు, రయితుల ఆమోదమును పొందియున్నవి. రెండు సంవత్సరములక్రితమే యేర్చబడిన కట్టు సంబాలోని వంగడము శీఘ్రముగా వృద్ధిపొందబడుచున్నది. ఆడుదురై వ్యవసాయ పరిశోధన స్థలమునుండి వచ్చు వరివిత్తనములు యీ రెండు జిల్లాల రయితులకు పంచిపెట్టుటకు చాలవు. గనుక అక్కడనుండి వచ్చు విత్తనములు సీడు ఫారం కండిషన్ క్రింద అభివృద్ధిచేసి యితర రయితులకు యివ్వ సమ్మతించిన గొప్ప భూస్వాములకు మాత్రం యివ్వబడుచున్నవి. నారుమడిలో విత్తనము చాలామట్టుకు తగ్గించినారు. రెండు, మూడేసి, మొనలు వూడ్చుటకు వీలుకలుగుటచే యీ దిగువ వివరించిన చొప్పున, విత్తనము చల్లుట, లాభకరమని హెచ్చరింపబడుచున్నారు:—

(i) యెనిమిది, పది శెంట్లు, ఆకుమడిలో 10 పట్నంపళ్ల సంభా విత్తనము పోసి పెంచిన, నారు, ఒక ఎకరము వుడుపు సరిపోవును.

(ii) పది శెంట్ల నారుమడిలో 15 పట్నం పళ్ల కురివై విత్తనము పోసిపెంచిన, నారు, యెకరము వుడుపుకు సరిపోవును.

మంచి రకపు చెరుకులను ప్రవేశపెట్టి, సైరుపెట్టుట, ఎరువులను లాభకరముగా వుపయోగించుట, తృప్తికరముగ శ్రేష్టమైన బెల్లమును తయారుచేయుట.—కోయంబుత్తూరులో తయారుఅయిన మంచి రకము చెరుకుల ముచ్చలు రయితులకు సరఫరా చేయబడుచున్నవి. చెరకు స్వల్ప విస్తీర్ణంలోయున్న తంజావూర్ జిలాలోకూడా, నీటి యెద్దడి, నీటిముంపును, ఓర్చినబువంటి చెరకు రకములు, జయప్రదముగా ప్రవేశపెట్టబడుచున్నవి. అభివృద్ధిచేయబడిన చెరకు రకముల ప్రవేశపెట్టుటతోపాటు, ముచ్చలును దోదెలలోనాటుట, లాభకరముగా యెరువు వేయుట, శ్రేష్టమైన బెల్లం తయారుచేయుట, మొదలగు అభివృద్ధి మార్గములుకూడా రయితులకు బోధపర్చుటలో శ్రద్ధ వహింపబడుచున్నది.

(ఎఫ్) మేలైన కంబోడియా ప్రత్తి రకములు.—కరుంగన్ని ప్రత్తి రకములు ప్రతి సంవత్సరమును కోయంబత్తూరునుంచి విత్తనములను తెప్పించి రయితులకు యివ్వబడుచున్నవి.

(హెచ్.) ఎ.హెచ్. 25, హెచ్ జి. 1 వంటి మంచి వంగడముల వేరుశనగను, చోడి, జొన్న, విత్తనములను తెప్పించి రైతులకు సరఫరాచేయుట.

(ఐ) ప్రదర్శన రంగములు.—వీలైన స్థలములయందు రయితుల భూములలోనే వారి ఖర్చులతోనే ప్రదర్శనరంగములు యేర్పాటుచేసి డిపార్టుమెంటువారి తనిఖీ క్రింద నూతన వ్యవసాయ పద్ధతులను అవలంభించుటవల్ల కలుగు అనుకూలములను రయితుల మనస్సుకు నచ్చునట్లు చూపబడుచున్నది. అన్ని కేంద్ర గ్రామములలోను ఆ గ్రామ

ములలో సాగుచేయు అన్ని సస్యములయొక్క అభివృద్ధి మార్గములు, వీలయినన్ని ప్రదర్శక పొలములలో వేయబడును. ఈ ప్రదర్శనములను యింకను వుపయోగమగునట్లును, బలపరచుటకును పరపతి వ్యవసాయ సంఘములు యేర్పాటుచేసి మెంబర్ల భూములలోగాని లేక గుత్త భూములలోకాని, విస్తారముగా ప్రాబల్యమునకు తేబడుచున్నవి.

(జె) తంజావూరు డెల్టాలో నగదువచ్చు సస్యములను ప్రవేశపెట్టుట, వరి ధర బాగా తగ్గిపోవుటచే తంజావూరు డెల్టాలో యితర డబ్బువచ్చే సస్యములను ప్రవేశపెట్టుట ఆవశ్యకమయియున్నది.

ఆడుదొరె వ్యవసాయ పరిశోధన స్థానమునందు కుష్కి, తోట పంటలను మాగాణి భూములలో సైరుచేయుటకు సాధ్యమగునా, కాదా అని తెలిసికొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. ఈ పరిశోధన స్థానము తిరుచనాపల్లిలోయుండు వ్యవసాయ డిప్యుటి డైరెక్టరువారి యధికారములలో యున్నది.

(కె) విత్తనములు, ఎరువులు, మంచి చెలగు రకముల విత్తనములు, వ్యవసాయ పనిముట్లు కావలసిన రయితులు తమకు దగ్గరనుండు వ్యవసాయ డిమాన్ స్ట్రేటరులకు తగినంత ముందుగానే వ్రాసుకొనవలెను. అరువు యివ్వబడదు.

4. డిమాన్ స్ట్రేటరు ముఖ్యస్థానములలో విత్తనములు వగైరా నిచ్చుటకు ఒక డిపో యున్నది. ఈ డిపోయందు వెంపలి, జీలుగ, జనుము, నీలి, వరి మొదలగు విత్తనములు, పనిముట్లు, సకాలములయందు వెలకు దొరుకును.

5. పైర్లకు, ఫలవృక్షములకు తగులు బూజు తెగుళ్లనివారణ మామూలుగా డిమాన్ స్ట్రేటర్లు చూతురు. పైరులకు, ఫలవృక్షములకు తగులు బూజు తెగుళ్ల నివారణకు ఎక్కువగా ఆడుదొరె వ్యవసాయ స్థానమునందున్న కీటక క్రిమి శాస్త్రజ్ఞులు చూతురు. వీరి అవసరమున్నవారు ఆడుదురె వ్యవసాయస్థాన అధికారిగారికిగాని, పెదవ సర్కిల్ డిప్యూటి డైరెక్టరువారికిగాని వ్రాసిన పంపుదురు.

6. దేశవాలీ పశువులను అభివృద్ధి పరచుటకుగాను రైతులు సర్కారువారివలన రుసుము పుచ్చుకొనిగాని యితరత్రగాని మంచి ఆబోతులను స్వంతముగా ఉంచుకొను రైతులును, సంఘములును సలహా యివ్వబడుచున్నారు. గవర్నమెంటు పశుస్థానమున నుండికొనిన ఆబోతులకు సంవత్సరమునకు రూ 100 చొప్పున మూడు సంవత్సరములు రుసుము యివ్వబడును.

7. పరిశ్రామిక డిపార్టుమెంటు.—అసిస్టెంటు ఇండస్ట్రియల్ యింజనీయరు, తంజావూరు ముఖ్యస్థానమును యేర్పాటు చేసుకొనియున్నారు. వీరికి ఆరు జిల్లాలు అనగా దక్షిణ ఆర్కాడు, తంజావూరు, తిరుచనాపల్లి, మధుర, రామనాడు, తిరునల్వేలిమీద అధికృత కలదు. వీరికి సహాయముగా తంజావూరులో వొక సూపర్ వైజరున్ను, తిరుచనాపల్లిలో వొక సూపరు వైజరున్ను తమ తమ జిల్లాలలో అధికృతను కలిగియున్నారు. భూస్వాములు, భూబెజ్జములు, వ్యాండు బోరింగు యంత్రము, పవరు డ్రిల్లు యంత్రములు, నీళ్లుతోడే యంత్రములు, బ్లాస్టింగు యంత్రము, ఇక్స్టలేషన్ సర్కారువారివల్ల పరిశ్రామిక పనులకు యివ్వబడు అప్పుల విషయమై తెలుసుకొనకోరు

వారు ఆయా జిల్లాలవారు ఆయా సూపరువైజర్లకు దరఖాస్తులు వ్రాసుకొనవల యును.

8. పరపతి సంఘపు డిపార్టుమెంటు.—ఈ రెండు జిల్లాలలో ప్రతియొక జిల్లా లోను పరపతి సంఘముల డిప్యూటీ రిజిస్ట్రారును, వీరికి సహాయార్థముగా ఒక్కొక్క సబ్-డిప్యూటీ రిజిస్ట్రారు వున్నారు. వీరు ఈ సంఘములలో జరుగు పనులను తనిఖీ చేయుదురు. మరియు క్రొత్త సంఘములు యేర్పాటు చేయుటయందును, వీనిపైన చో నాన్-క్రెడిటు సంఘముల పనులకు సహాయము చేయుదురు. వీరి అడ్రసు—

(i) డిప్యూటీ రిజిస్ట్రారు ఆఫ్ కో ఆపరేటివు సొసైటీస్, విలియమ్స్ రోడ్డు, కంటోన్మెంటు, తిరుచినాపల్లి.

(ii) డిప్యూటీ రిజిస్ట్రారు ఆఫ్ కో ఆపరేటివు సొసైటీస్, కో ఆపరేటివ్ బిల్డింగ్సు, పడమర మెయిన్ స్ట్రీటు, తంజావూరు.

9. ఈ రెండు జిల్లాలకు ఒక డిస్ట్రిక్టు వెటరినరి ఆఫీసరు, తిరుచినాపల్లిలో వున్నారు.

10. డిమాన్‌స్ట్రేటర్లువారి డిపోలు; మరియు వీటిలో దొరుకు సామానుల జాబితా.

బజారు ధరలబట్టి ధరలు మారును. ఈ సామానులు సమీప డిమాన్‌స్ట్రేటరు గారికిగాని డిప్యూటీ డైరెక్టరుగారికిగాని వ్రాసిన బడయగలరు.

వెంపలి విత్తనములు, జీలుగ విత్తనములు, జనుము విత్తనములు, నీలి (కాకినాడ) పిల్లిపెసర, శేరుశనగ విత్తనములు, కంబోడియా ప్రత్తి విత్తనములు.

11. అన్ని వ్యవసాయ విషయములలోను ఉచితముగా సలహా యివ్వ డును.

## (బి) పరిశోధన.

1. శాస్త్రీయ పరిశోధన స్థానముయొక్క నిర్మాణమున్ను, దాని పూర్వచ రిత్రము.

ఆడుదురై వ్యవసాయ శాస్త్రీయ పరిశోధనస్థానము 1922 వ సంవత్సరమ స్థాపించబడినది. పూర్వము మంగనల్లూర్ వ్యవసాయ స్థానములో జరుపబడిన పరిశో ధన క్రమములను యీ స్థానమందు బహు విమర్శనముగా జరుపబడుచున్నది. ఈ స్థానము తంజావూర్, మాయవరం మధ్యనుండు ఆడుదురై రైల్వే స్టేషనునుండి సుమారు 2 ఫర్లాంగుల దూరమున మరుదవకుడి అను గ్రామములో యున్నది. దీని విస్తీర్ణము సుమారు 50 ఎకరములు. అందులో సుమారు 45 ఎకరములు సాగుబడిక్రిందనున్న ది. మిగతది కట్టడములతోడను, రోడ్లతోను నిండియున్నది.

### పైస్థానములో చూడతగినవేవి? ఎప్పుడు చూడతగినవి.

2. జూన్-జూలై మాసములలో.—కురువై, పూడు, వరిజాతుల నారులు పోయ టకు మెట్ట నారుమళ్లు తయారుచేయుట, మొదటి కారు వరి నారు మడులు, మొద

కారుయొక్క వరినారు నాటుట, సంబా వరి పులక నారుమళ్లను తయారుచేయుట, విత్తుట చూడవచ్చును.

ఆగస్టు-సెప్టెంబరు.—సంబా వరి పులక నారుమళ్లను, సంబా నారును నాటుటకు భూమిని దున్ని తయారుచేయుట, మరియు సంబా వరి నారును నాటుట, వెన్నులో యుండు కురువై వరి జాతులు, వరి పంటను నష్టముచేయు పీతలు, ఎలుకలను పట్టినివారించు పద్ధతులను చూడవచ్చును.

అక్టోబరు-నవంబరు.—మొదటి కారు వరి రకరముల కోత, కురువై పైరు కోత అయిన తరువాత భూమిని దున్ని రెండవ కారు పంటకు తయారుచేయుట, తల్లిడె అను రకము లేక రెండవ కారు నాటుట చూడవచ్చును.

డిసంబరు-జనవరి.—ఈ నెలలు పరిశోధనస్థానము చూచుటకు మంచి తరుణము. సంబా రకములు వెన్నులు దాల్చియుండుటయును, వరి పైరులో మిశ్రమ మొలకలను యేర్చి ఒకే రకముల పైరును యుంచుట, పూతలడు పరిశోధించుట, తెగులు పరిమితిని కనుగొనుట, సంబా, వరి రకములు కోత చూడవచ్చును.

ఫిబ్రవరి.—వరి కోతలు కళ్లముచేయుట, తూర్పు యెత్తుట, శుభ్రముచేయుట' యెండబెట్టుట, గింజలను పోగుచేయుట మొదలగునవి పనులు, జీలుగ, వెంపలి, జనుము' పచ్చియాకు యెరువు పైర్లు సంబా, కారు, చేనులలో చూడవచ్చును.

మార్చి-జూన్.—విత్తనములను రయితులకు యిచ్చుట, కురువై మెట్ట నారుమళ్లను తయారుచేయుట, వేరుశనగ, నువ్వులు, అరటి, చెరుకు, జొన్న మొదలగు పైరులు మాగాణి భూములలో సాధ్యమగునా కాదా అని తెలుసుకొనుటకు పరిశోధనలను చూడవచ్చును.

పశువుల యెరువును పోగుచేయుట పశువుల కొట్టములోనే యెరువులను తయారుచేయుట (లూజ్ బాక్సు) కుప్ప చెత్తను గోతులలోనేవేసి మంచి యెరువుగా తయారుచేయుట సంవత్సరమునందంతటను చూడవచ్చును.

ప్రస్తుతము శాస్త్రీయ పరిశోధన క్రిందనుండు విషయములు.

3. (a) అల్ప ఫలమునిచ్చు దేశవాళి మిశ్రమజాతి వరికి బదులుగా యెక్కువ ఫలితమిచ్చు వరి రకములను కనిపెట్టి, పైకి వదలుట.

(b) వరి పంటకు అనుకూలమైన యెరువులను కనుగొనుటకుగాను ఆకు సంబంధమైన లోహ సంబంధమైన యెరువుల తారతమ్యములను వేరువేరుగాను, చేరికగాను వేసి పరిశోధనముచేయుట, పశువుల కొట్టము యెరువు (లూజ్ బాక్సు) చెత్త గోతి యెరువులు (కంపోస్టు పిట్సు) యొక్క గుణాతిశయములను వరి పంటకు యెరువుగా పరీక్షచేయుట,

(c) అపరిమితముగా వరి పైరును సాగుచేసి ధరలను తగ్గించుటకు బదులుగా, మాగాణి భూములలో మెట్టతోట పైర్లు అధికముగా పైరుచేసి యెక్కువ లాభముపొందు సదుపాయముల ప్రయత్నములు చేయబడుచున్నది.

ఈ వ్యవసాయ స్థానమును చూడగోరువారి కెల్లప్పుడును స్వాగతము.

(11) శాస్త్రీయ పరిశోధన స్థానముయొక్క నిర్మాణము, దాని పూర్వచరిత్ర—పట్టుకోటై వ్యవసాయ పరిశోధన స్థానము 1935 వ సం॥ జనవరి 1 వ తేదిని స్థాపిం

చబడినది. వరికి బదులుగా డబ్బునిచ్చే సస్యములను సాగుచేయ వీలు కనుకొనుట యును, ప్రాజెక్టు కాలువలనుండి సర్కారు విధించిన తీరువాయికి నీరు పుచ్చుకొని, యీ డబ్బు సస్యములకు లాభకరముగా ఉపయోగించుటను, యీ ప్రదేశములో తోట సస్యములు, వ్యాపారిక సస్యములును, పెంపుడు లాభకరముగా నుండునని, రైతులకు ప్రదర్శక పూర్వకముగా తెలియపరుచుట యీ పరిశోధన స్థానముయొక్క ముఖ్యో ద్దేశము.

యీ వ్యవసాయ స్థానము పట్టుకోటై రైల్వే స్టేషనుకు ఒక మైలుదూరమున పట్టు కోటై, ముత్తుపేట రస్తాలో పబ్లికు వరక్సు డిపార్టుమెంటువారి భవనమునకు చేరియు న్నది. జూన్ మాసములో కాలువలలో నీరు అందగనే సాగుబడి ఆరంభించబడును. దీని విస్తీర్ణం 36 యకరిములు మెరక, తోట, పల్లపు సస్యములు సాగుబడికి వీటిలో 32 యకరములు ఉపయోగించబడును.

యం. యస్. కుళందస్వామి పిళ్లే,
వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, ఐదవ సర్కిల్.

---

## 2 (f) ఆరవ సర్కిల్.

ఆరవ సర్కిల్ మధుర, రామనాడు, తిరునెల్వేలి జిల్లాలు చేరియుండి మధుర మకా ముగా వొక డిప్యూటీ డైరెక్టరువారి అధికారముక్రింద నున్నది. వీరికి మధురలో నున్న అసిస్టెంటు డైరెక్టరువారున్ను, తిరునెల్వేలిలోనుండే అసిస్టెంటు డైరెక్టరువారు న్ను తోడ్పడుచున్నారు. సదరు వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరువారియొక్కయు, అసిస్టాంటు డైరెక్టరువారియొక్కయు కచ్చేరీలు మధురలో పడమరైరోడ్డు ప్రక్కను న్న గవర్నమెంటు వారి పరిశ్రామిక సంఘముయొక్క భవనములోనున్నవి. తిరున ల్వేలి అసిస్టాంటు డైరెక్టరువారి ఆఫీసు పాలంకోటు పోవు పెద్ద రస్తాలోనున్న వన్నీరు పేటలోనున్నది.

మధుర జిల్లాయొక్కయు, రామనాడులోని తూర్పు ఆరు తాలూకాలయొక్క యు ప్రచారపు పనియంతయు మధుర అసిస్టెంటు డైరెక్టరువారి యధికారమందున్నది. తిరునల్వేలి అసిస్టంటు డైరెక్టరువారికి తిరునల్వేలి జిల్లా అంతయున్ను, రామనాడులో నున్న సాత్తూరు, శ్రీవిల్లిపుత్తూరు, అరుప్పుకోట్టై తాలూకాలయొక్కయున్ను వ్యవ సాయ ప్రచారపు పనియంతయు చేరియున్నవి. తాలూకాకు ఒక్కొక్క వ్యవసాయపు ప్రచారకుని చొప్పున జిల్లా పనియంతయు చేయబడుచున్నది.

(ఎ) ప్రచారము.

2. ఆరవ సర్కిలులోనున్న వ్యవసాయ ప్రచారకుల మకాములు వారివారి ప్రచార స్థలములు యీ దిగువను చూపబడియున్నవి:—

వ్యవసాయపు ప్రచారకులుండే తాలూకాలను చూపెడు పట్టి.

| తాలూకా. | మకాము. | ప్రచారకుల ముఖ్య గ్రామములు. |
|---|---|---|
| | మదుర డివిజను. | |
| 7 పళని | ... పళని | ... పళని, కీరానూరు, ఇడైకోట్టై, వేలూరు, కునుకపట్టై, మేట్టుక్కారై పట్టి, తలయూత్తు, పాప్పమ్మాపట్టి, |

| తాలూకా. | మకాము. | ప్రచారకుల ముఖ్య గ్రామములు. |
|---|---|---|
| | మధుర డివిజన్—శేషము. | |
| 6. దిండిగల్లు ... | దిండిగల్లు ... | దిండిగల్లు, ఈరియోడు, వేవసందూరు, పలక్కనూరు, అయ్యలూర్, వడమధురై, కుసువపట్టి, కన్నినాడి. |
| 5. నైలకోట్టై ... | నైలకోట్టై ... | అలంగనల్లూరు, నైలకోట్టై, బట్లగుండు, శివాయిన్‌కోట్టై, గవడిపట్టై, అమ్మాయనాయకనూర్, తానువయం. |
| 2. మేలూరు ... | మేలూరు ... | వేలూరు, కట్టయంపట్టి, సట్టిం, తిరువాడూర్, వెళ్లాలూర్, కొత్తంపట్టి, వెళ్లాళపట్టి, నరశింగంపట్టి. |
| 1. మధుర ... | మధుర ... | మదుర, అళగర్‌కోయిల్, తిరుముగూర్, పులియూర్‌కుండు, సామయనల్లూరు, అప్పన్ తిరుపతి, కవనూర్, కిలమతూర్, శోలవండాం. |
| 3. పెరియకుళం. | పెరియకుళం ... | పెరియకుళం, ఉప్పమపాళయం, అల్లినగర్, గంగువార్‌పట్టి, వీరపాండి, అండిపట్టి, కొంచాయి, కీలమంగళం. |
| 4. తిరుమంగళం... | తిరుమంగళం ... | తిరుమంగళం, కల్లిగుడి, కల్లుపట్టి, ఉసిలంపట్టి, సెక్కనూరాణి, పన్నికుండు, సిందుపట్టి, సెడపట్టి. |
| | రామనాడు డివిజన్. | |
| శివగంగ ... | మానామధుర ... | మానామధుర, శివగంగ, తిరుపవనం, పారిబనూరు, ముత్తనిండాల్, అక్కూర్, కలియార్‌కోయిల్, అభిరామమ్. |
| తిరుపత్తూరు ... | తిరుపత్తూరు ... | సింగంపునారి, పట్టమంగళం, తెక్కూరు, కున్నకుడి, తిరుపత్తూరు, తిరుకోష్టియూర్, శత్రుసంఘరకోట్టై, కున్నకుడి. |

| తాలూకా. | మకాము. | ప్రచారకుల ముఖ్య గ్రామములు. |
|---|---|---|
| | **రామనాడు డివిజన్—శేషము.** | |
| 3. రామనాడు ... | రామనాడు ... | రామనాడు, తిరుప్పల్లనీ, దేవిపట్నం, సవీరకుడి, వలంతరువై. |
| | **తిరునల్వేలి డివిజన్.** | |
| 2. శ్రీ విల్లిపుత్తూరు. | శ్రీ విల్లిపుత్తూరు ... | వత్రాపు, రాజపాళయం, నలమనాయకన్ పట్టి, నాచ్చిరుకోయిల్, శీవిల్లిపుత్తూరు, మన్నూరు, రామక్రిష్ణపురం, మాంసాపురం, చోలపురం, కిలరాజ కులరామన్. |
| 1. సాత్తూరు ... | సాత్తూరు ... | ఒతగల్, మేటుమాలే, వలూంపట్టి, సప్పలాపురం, కమీనరు, నడువపట్టి, వీరారిపట్టి, కుకుపట్టి, సాతురు, శిల్వారుపట్టి. |
| 3. అరుప్పుకోట్టై... | అరుప్పుకోట్టై ... | చితంబరపురం, మల్లంపట్టి, రామనేతూరం, సీవలపట్టి, అరుప్పుకోట్టై, రెడ్డియిపట్టి, పంబట్టి, పెరినాయకపురం, వెల్లాయపురం, పాలకనాదం. |
| 4. తిరునల్వేలి ... | తిరునల్వేలి (వన్నార్ పేట). ... | మెలకలూరు, మానూరు, గంగైకొండన్, పుదూరు, కీలనాతం, కిలపట్టం, రెడ్డియపట్టి. |
| శ్రీవైకుంఠం ... | శ్రీవైకుంఠం ... | కరున్‌గులం, శిరకులం, వల్లనాడు, పెరున్‌గులం, అరియ పెరనల్లూరు, వర్తకరెడ్డిపట్టి, పుదుకొట్టయి, అరుముగమంగళం, కొలత్తట్టపరెయి. |
| నాంగునేరి ... | నాంగునేరి ... | తిరుకరుంగుడి, కలక్కాడ్, వల్లియార్. మంద్రాడెయిప్పు, ముతెయికరయిపట్టి, పనగుడి, సలవూరు, రాధాపురం, విజయనారాయణం. |
| తిరుచెందూరు ... | తిరుచెందూరు ... | అప్మనపురం, అంగమంగళం, ఆలార్తిరునగరి, అరుముగనేరి, అత్తూరు, కులశేఖరంపట్నం, శాస్తవినెల్లూరు, శతానాకులబ్య తెంతిరుపెరి. |

| తాలూకా. | మహాము. | ప్రచారకుల ముఖ్యగ్రామములు. |
|---|---|---|
| అంబాసముద్రం ... | అంబాసముద్రం ... | మెట్టూరు, కడయం, అల్వారుకురిచి, విక్రమసింగాపురం, వీరవనల్లూరు, శర్మదేవి, మిలశేనాల్, కప్పకుడి, రుడియికాల్. |
| తెంకాసి ... | తెంకాసి ... | సివరాంపెట్టయి, ఇడగార్, కంబులి, కొర్తాలం, మెలపవూరు, గిప్పనంపట్టి, కీలపవూరు, ఆలంగులం, కడయనల్లూరు. |
| శంకరన్‌కోవిల్ ... | శంకరన్‌కోవిల్ ... | ముల్లికులం, మదత్తుపుట్టి, విశ్వనాథపెరి, పెరుంబత్తూరు, కలింగపట్టి, సంగుపట్టి, నెవాల్‌కులం, మెయిప్పరెయి, వాసుదేవనల్లూరు. |
| కోవిల్‌పట్టి ... | కోవిల్‌పట్టి ... | నల్లటిక్‌పుత్తూరు, దలవెయిపురం, కయతార్, మనియాచి, కరుకుచెరెయి, ఇప్పోడువెంద్రం, ఇట్టయాపురం, వీలాతికులం, నగలపురం. |

ప్రచారకులులేని తాలూకాలు.

| జిల్లా. | తాలూకా. |
|---|---|
| రామనాడు ... | ... పరమకుడి, ముదుకుళత్తూరు, తిరువదనై. |

3. ప్రతి తాలూకాలోను పైన చెప్పబడిన ముఖ్యస్థలములయందు ప్రదర్శనము, ప్రచారము వ్యవసాయపు ప్రచారకులు తీవ్రముగా జరుపుచున్నారు. ఒక్కొక్క ప్రచారకునివద్దను రైతులకు అసలు ధరలకిచ్చుటకై మంచి వ్యవసాయపు పనిముట్లును, విరిన విత్తనములును తమతమ డిపోలోనుంచబడియున్నవి. మరియు గ్రామస్థుల ఇండ్లు వీధులు మొదలైనవి పరిశుభ్రముగా నుంచుటయందు సహాయపడుచున్నారు. ప్రదర్శన ప్రచారములలో నీ దిగువ వ్రాయబడినవి ముఖ్యాంశములు—

(i) ఎరువును మంచి పద్ధతులపైని జాగ్రత్తపరచుట.—పశువుల ఎరువుయందు ముఖ్యమైన పశువుల మూత్రమును పోనీయక జాగ్రత్తపెట్టుటకై, కొట్టములలోనున్న చెత్త మొదలైనవి చేర్చినయెడల మూత్రమును పీల్చుటయేగాక పశువులకు పరుపుగాకూడ నుపయోగపడుననియు రైతులకు వ్యవసాయశాఖవారు బోధపరుచుచున్నారు. అట్టి యెరువును లోతులేని గోతులలో వేసి మట్టి వరుసలతో కప్పవలెను. ఎరువు నెక్కువగా చేయుటకుగాను చెరుకుపిప్పి, చెత్త పెదారకు కలుపుమొక్కలు మొదలైన అంగవిశిష్టమైన పదార్థములను దొరకినంతవరకు గోతులలో వేసి క్రుళ్ల బెట్టవలసినదనియు బోధించుచున్నారు.

(ii) విత్తనము వేయకముందు మరియు విత్తనము చల్లిన తరువాత పరిశుభ్రముగా సేద్యముచేయుటకు పనికివచ్చు యినప నాగళ్లను, గుంటకలను ఉపయోగించుట.

(iii) పొలములను మట్టము చేసి, గట్లనువేసి వర్షపు నీటిని భూమిలోనికి యింకునట్లుచేయుట.

(iv) పశువుల నభివృద్ధిచేయుట.—పశువుల నభివృద్ధిచేయుటకు మంచి ఆబోతులును, మంచి మేతయు నావశ్యకములు. గానుగపిండ్లు, జనుము, జొన్న మొదలైన పైరులు. పచ్చిమేత చాలకాలమువరకునుండునట్లు పైరులపాతరలువేయుట మొదలైన విషయములయందు సలహాల నిచ్చుచున్నారు. ఈ సర్కిలులోయున్న ఆంబోతులను దాటుటకు 8 అణాల వంతున నుచ్చి నుపయోగపరుపవచ్చును.

ఆంబోతు లెక్కడెక్కడనుండునది, వాటి జాతి లక్షణములు యీ దిగువ వ్రాయబడియున్నది :—

మధుర జిల్లా.

| స్థలము. | | | ఆంబోతు జాతి. |
|---|---|---|---|
| గ్యానముత్తు, సాతంగుడి పోస్టు, తిరుమంగళం | ... | 65 | కాంగేయం. |
| ఆర్. వెంకటస్వామి, సెంగపట్టె, తిరుమంగళం | ... | 61 | డిటో. |
| రెవరెండు డూడ్లి, తిరుమంగళం ... | ... | 72 | డిటో. |
| చిన్నసామి, పెరుంగమనల్లూరు ... | ... | 91 | డిటో. |
| పళనియాండి తేవన్, కొక్కులం ... | ... | 77 | డిటో. |
| పళని గవుండరు, కాంచనాయకన్ పట్టి, పళని తాలూకా. | | 82 | డిటో. |
| క్రిస్టియన్ వేదమణి, వైగైకుళం ... | ... | 98 | డిటో. |
| మీనాక్షినాయర్, పొన్నమంగళం ... | ... | 107 | డిటో. |
| మహమదు యూసఫ్ అంబళం, అభిరామం, మనమధుర. | | 99 | డిటో. |
| రెవరెండు బ్రాదర్ మైకేలు, కొడైకెనాల్ | ... | | సంకర జాతి (సఖను). |
| వేటారు వి. స్వామి నాయకర్, చాత్రపట్టి | ... | 112 | కాంగేయం. |
| లాన్ బీన్, పశువసై ... ... | ... | 15 | సింధి. |
| రెవరెండు స్టాన్లీ వ్యాసుం, మనమధుర | ... | 3 | సింధి. |
| డిస్ట్రిక్టు బోర్డు ప్రెశిడెంటు (మధుర) పూసలంపట్టి. | | 100 | కాంగేయం. |
| రెవరెండు సి. ఇ. వోల్ స్టెడు, మనమధుర | ... | 14 | లాస్టు హాప్ (ఎనుబోతు). |
| రెవరెండు డడ్లే, తిరుమంగళం ... | ... | 15 | హాఫ్ ఫుల్ (ఎనుబోతు). |
| మ్యూనిసిపల్ కౌన్సిల్, దిండిగల్ ... | ... | 105 | కాంగేయం. |
| దేవకోట జమీందారు, కళయార్ కోయిల్ | ... | 51 | డిటో. |
| రెవరెండు రిగ్గ్సి, పెంగనూరు ... | ... | 156 | సంకరజాతి. |
| సీ. దేవదాను, విక్రమంగలం ... | ... | 126 | కాంగేయం. |
| కరుప్పతేనారు, నక్కలకొట్టము ... | ... | 125 | డిటో. |

మధుర జిల్లా—శేషము.

| స్థలము. | | ఆంబోతు జాతి. |
|---|---|---|
| పి. యస్. శివానంది తేవార్, అయ్యర్ మెటుపట్టి. | 127 | కాంగేయం. |
| మిస్. చంఢ్లర్, రాచన్యాపురం ... ... | 124 | డిటో. |
| మూకవిరుసు డివారు, కిలగుడి ... ... | 92 | డిటో. |
| వి. సి. టి. ఎన్. నారాయన్ వీరలపట్టి జమీందారు పళని. | 1 | డిటో. |
| నల్లతంబిశేర్వై, తంబిపట్టి, తిరుపత్తూరు తాలూకా. | 131 | డిటో. |
| ఎల్. ఆర్. యం. ఆర్. యం. రామనాథన్ శెట్టియార్, నెయికుప్పెయి. | 139 | డిటో. |
| మయతవన్, వగెయికులం ... ... | | ఒక ఆంబోతు. |

తిరునల్వేలి జిల్లా.

| | | |
|---|---|---|
| ఇడైసెవల్, కోవిల్‌పట్టి తాలూకా... ... | | కాంగేయం, సంకరజాతి. |
| తెంకాసి తాలూకా, కీలపపూరు ... ... | 108 | కాంగేయం. |
| అంబాసముద్రం తాలూకా, మేలసెవల్ ... | 179 | ఒంగోలు. |
| అకిలాండ్రంపిల్లై, తెంకాసి తాలూకా, ఇలంజి ... | 123 | కాంగేయం. |
| కోయల్‌పట్టి తాలూకా, ఒట్టనాతం .. ... | 122 | డిటో. |
| సివకుంటం తాలూకా, అనవరతనల్లూరు ... | 116 | డిటో. |
| శ్రీవిల్లిపుత్తూరు తాలూకా, రాజపాలియం ... | 121 | డిటో. |
| డిటో. ... | 137 | డిటో. |
| ఎ. పెరుమాల్ నాయకర్, పడంతాల్, సత్తూరు తాలూకా. | 134 | కాంగేయం. |
| కె. అలిగిరిసామి రెడ్డియార్, సేవల్‌పట్టి, అరుప్పుకోట్టయి తాలూకా. | 140 | డిటో. |
| పి. ఎ. సి రామసామి రాజు, రాజపాలెయం ... | 138 | డిటో. |
| వి. శంకరనారాయణ రెడ్డియార్, మలెయిపట్టి, అరుప్పుకొట్టైయి తాలూకా. | 142 | డిటో. |

కోళ్లు.—వ్యవసాయమునకు తోడుపాటుగానుండుటకు మంచిజాతి కోళ్లను పెంచు విషయములందు రైతులకు సహాయము బోధనచేయబడుచున్నవి.

(v) ప్రదర్శనభూములు.—సేద్యముగురించియు, విత్తనరకములగూర్చియు, ఎరువులలాభముల పరీక్షించుటకున్నూ ప్రదర్శనపుమళ్లు రైతులచేలలోనే యేర్పరుపబడుచున్నవి. ఇరుగుపొరుగు రయితులకు వీటినిగురించి బోధచేయబడుచున్నది. క్రొత్త పనిముట్లు మొదలైనవి రైతుల భూములలో వారి నమ్మకముకొరకై పరీక్షచేయబడిన తరువాత వారలకు అమ్మబడుచున్నవి.

(vi) నానావిధ వస్తుప్రదర్శనములు, ఉపన్యాసములు.—పశువుల సంతలలోను, ఉత్సవములలోను ముఖ్యస్థలములయొద్ద వ్యవసాయపు సంబంధమైన వస్తుప్రదర్శనములు జరుపబడును. వ్యవసాయమందుగల మంచి పద్ధతుల నవలంబించుటవలన గలుగు

లాభములనుగూర్చి మ్యాజిక్ లాంతరు సహాయముతో ఉపన్యాసముల నిచ్చుటయును వీలైనచోట్ల పనిముట్లను ప్రదర్శించుటయును ఆ సమయములలో జరుపబడును.

(vii) వ్యవసాయాభివృద్ధి సంఘములు.—పళని తాలూకాలో, వేలూరు గ్రామమువద్ద నిట్టి సంఘమొకటి స్థాపింపబడినది. ప్రస్తుత మీసంఘము చేయుచున్న పని లేవన, ఆ గ్రామమందును, చుట్టుప్రక్కలనుయున్న రైతులకు కావలసిన అభివృద్ధి చేయబడిన కంబోడియా, కరుంగణీ ప్రత్తివిత్తనములను పంపించి వారికి పంచిపెట్టుట, మంచి వ్యవసాయపు పనిముట్లను యుపయోగములోనికి తెచ్చుట, గెత్తమును గోతులలో సరిగా జాగ్రత్తపరుచుట, సమిష్టిగ సామగ్రులను కొనుట అమ్ముట మొదలైనవి ఈ తాలూకాలోనే శ్రీవైకుంఠమునందు మరియొకటి పనిచేయుచున్నది. దీని సభ్యులందరు భూఖామందులు. ఈ సంఘము మంచి వరిజాతులను విత్తపుసేద్యము (seed farm) పరతువైని పెంచుచున్నది. ప్రదర్శనపు మళ్లను వ్యవసాయపు శాఖవారిచ్చు సలహాలను రైతులకు బోధపర్చుటకై వేయుచున్నారు. ఇట్టి సంఘములను మరికొన్ని స్థలములలో స్థాపించుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి.

(viii) విత్తనముల పంచిపెట్టుట.—అభివృద్ధిచేయబడిన వరి, ప్రత్తి విత్తనములు జి.ఇ.బి. నె 24 రు వరి, ఎ.ఇ.బి. నె 65 రు వరి, కరుంగణ్ణి సి. నె 7 రు ఎ. నె 10 రు మరియు కంబోడియా కొ. నె 2 రు మొదలైనవి రహితుల భూమిమీద శుభ్రముగా కేలీలులేకుండ పంపించి వృద్ధిచేయబడును. ఈ విధముగా పెంచబడిన విత్తనములు సర్కారు డిపోలలోనుంచి రైతులకు పంచిపెట్టుదురు.

వరి.—ఈ క్రింద వ్రాసినరీతి వరియందు అభివృద్ధిచేయబడుచున్నది :—

(ఎ) పచ్చి ఆకు ఎరువు పైర్లను పెంచుట, మరియు ఎముకలపొడుమును, పుష్టి కూరువులను నేర్పుగా పచ్చి ఆకు ఎరువులతో నుపయోగించుట,

(బి) పలుచని ఆకుమళ్లనుచల్లి మంచి నారును పెంచి విత్తన వ్యయమును తగ్గించుట,

(సి) తక్కువసారులు దున్ని పొలముల నెక్కువ పదునును కలుగజేయు చిన్న యినుప నాగళ్ల నుపయోగించుట.

ప్రత్తి అభివృద్ధి—

(ఎ) సులభముగా పనినిచేయు యెడసేద్యపు పనిముట్ల నుపయోగము చేయుటకు వీలుగానుండునట్లు చాలులలో విత్తనములువేయుట,

(బి) పరిశుభ్రముగ ప్రత్తిని యేరి దానిని పరస్పర సంఘముద్వారా విక్రయించుట.

(ix) బూజు తెగుళ్లను పురుగుల వ్యాధులను నివారించుట.—ఈ వ్యాధి నివారణలో సహాయముచేయుటకు తాలూకాలలోనుండు వ్యవసాయపు ప్రచారకులుగాక రయితులకు తగు సలహాలనిచ్చి సహాయపడుటకు వేరె యొక బోధకుడైన కలడు. వాని మకాము కోవిల్‌పట్టి వ్యవసాయ పరిశోధన స్థానము. ఈయన మధుర, రామనాడు మరియు తిరునల్వేలి జిల్లాలలో పనిచేయుచుండును. వీరి ఆధీనమందున

ప్రదేశము విస్తారముగానుండుటచే ముఖ్యమైన పిలుపులకు మాత్రము యీతడు స్వయముగాపోయి చూచుకొనుటకు అవకాశముండును. ప్రతి తాలూకా ముఖ్యస్థానము యొద్ద వ్యవసాయపు ప్రచారకునితోపాటు ఒక డిపోకూడ కలదు. దీనియందు విరిన విత్తనముల రకములు, అభివృద్ధి చేయబడిన పనిముట్లు పంచిపెట్టుటకు యుంచబడును.

4. డిపోలు, వాటిలోనున్న వస్తువులు, వాటిధరలు మొదలైనవి తెలుపు పట్టీ.

(ఎ) పనిముట్లు.

| | రూ. | అ. | పై. | |
|---|---|---|---|---|
| కూపరు నె 25 రు ... ... | 4 | 8 | 0 | 1 కి ఎక్కువగా లాటులలో కొనేమొడల ధరలు ఇంకను తగ్గవచ్చును. |
| డిటో నె 11 రు ... ... | 7 | 0 | 0 | |
| డిటో నె 26 రు ... ... | 8 | 12 | 0 | |
| త్రవ్వుకునే పళ్లపారలు ... ... | రూ 4 మొదలు 5 లవరకు. | | | |
| కూపరు నె 25 రు కర్రులు ... | 0 | 5 | 9 | 1 కి. |
| డిటో నె 11 రు కర్రులు ... | 0 | 9 | 0 | 1 కి. |
| డిటో నె 26 రు కర్రులు ... | 1 | 1 | 0 | 1 కి కోలతో. |
| హెచ్చియం గుంటక నె 0 రు ... | 3 | 12 | 0 | ఈ ధరలు ఇంచుమించులో వేయబడినవి. సరియైన ధరలకు ఆర్డరుచేసిన పైని సప్లయిచేయబడును. |
| డిటో నె 1 రు ... | 6 | 8 | 0 | |
| డిటో నె 2 రు ... | 12 | 4 | 0 | |
| మోటు చక్రము ... ... | 11 | 0 | 0 | |

(బి) విత్తనములు.

| | |
|---|---|
| వెంపలి ... ... | ధరలు యెప్పటికప్పుడు మారుచుండును. గనుక ధరలు ఎప్పటికప్పుడు మీకు దగ్గరగానున్న వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరుగారి వద్ద తెలిసికొనవచ్చును. |
| జీలుగు ... ... | |
| నీలి ... ... | |
| జనుము ... ... | |
| ధాన్యము ... ... | |
| వేరుశనగ ... ... | |
| ప్రత్తి-కంబోడియా కరుంగణ్ణి ... | |
| పెద్ద పచ్చ జొన్న ... ... | |

హెచ్చరిక.—పై వ్రాసిన ధరలు బజారు ధరల ననుసరించి మార్చబడుచుండును.

5. చిల్లర విషయములు.—వృద్ధిపరచిన వేరుశెనగ, చెరుకు, బళ్లారి ఉల్లి మొదలైన విత్తనములను పంచిపెట్టుట, మరియు బెల్లము వండుటకు వృద్ధి చేయబడిన బెల్లపుపొయ్యిని కట్టుట.

6—A

లాభములనుగూర్చి మ్యాజిక్ లాంతరు సహాయముతో ఉపన్యాసముల నిచ్చుటయును వీలైనచోట్ల పనిముట్లను ప్రదర్శించుటయును ఆ సమయములలో జరుపబడును.

(vii) వ్యవసాయాభివృద్ధి సంఘములు.—పళని తాలూకాలో, వేలూరు గ్రామమువద్ద నిట్టి సంఘమొకటి స్థాపింపబడినది. ప్రస్తుత మీసంఘము చేయుచున్న పని లేవన, ఆ గ్రామమందును, చుట్టుప్రక్కలనుయున్న రైతులకు కావలసిన అభివృద్ధి చేసిన కంబోడియా, కరుంగణీ ప్రత్తివిత్తనములను పండించి వారికి పంచిపెట్టుట, వ్యవసాయపు పనిముట్లను యుపయోగములోనికి తెచ్చుట, గెత్తమును గోతులలో సరిగా జాగ్రత్తపరుచుట, సమిష్టిగ సామగ్రులను కొనుట అమ్ముట మొదలైనవి ఈ తాలూకాలోనే శ్రీవైకుంఠమునందు మరియొకటి పనిచేయుచున్నది. దీని సభ్యులందరు భూఖామందులు. ఈ సంఘము మంచి వరిజాతులను విత్తపుసేద్యము (seed farm) పరతువైని పెంచుచున్నది. ప్రదర్శనపు మళ్లను వ్యవసాయపు శాఖవారిచ్చు సలహాలను రైతులకు బోధపర్చుటకై వేయుచున్నారు. ఇట్టి సంఘములను మరికొన్ని స్థలములలో స్థాపించుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి.

(viii) విత్తనముల పంచిపెట్టుట.—అభివృద్ధిచేయబడిన వరి, ప్రత్తి విత్తులు జి.ఇ.బి. నె 24 రు వరి, ఎ.ఇ.బి. నె 65 రు వరి, కరుంగణ్ణి సి. నె 7 ఎ. నె 10 రు మరియు కంబోడియా కొ. నె 2 రు మొదలైనవి రహితుల భూమిమీద శుభ్రముగా కేలీలులేకుండ పండించి వృద్ధిచేయబడును. ఈ విధముగా పెంచబడిన విత్తనములు సర్కారు డిపోలలోనుంచి రైతులకు పంచిపెట్టుదురు.

వరి.—ఈ క్రింద వ్రాసినరీతి వరియందు అభివృద్ధిచేయబడుచున్నది :—

(ఎ) పచ్చి ఆకు ఎరువు పైర్లను పెంచుట, మరియు ఎముకలపొడుమును, పుల్ల కూరువులను నేర్పుగా పచ్చి ఆకు ఎరువులతో నుపయోగించుట,

(బి) పలుచని ఆకుమళ్లనుచల్లి మంచి. నారును పెంచి విత్తన వ్యయమును తగ్గించుట,

(సి) తక్కువసారులు దున్ని పొలముల నెక్కువ పదునును కలుగజేయ చిన్నయినుప నాగళ్ల నుపయోగించుట.

ప్రత్తి అభివృద్ధి—

(ఎ) సులభముగా పనినిచేయు మెడసేద్యపు పనిముట్ల నుపయోగముచేయుటకు వీలుగానుండునట్లు చాలులలో విత్తనములువేయుట,

(బి) పరిశుభ్రముగ ప్రత్తిని యేరి దానిని పరపతి సంఘముద్వారా విక్రయించుట.

(ix) బూజు తెగుళ్లను పురుగుల వ్యాధులను నివారించుట.—ఈ వ్యాధి నివారణలో సహాయముచేయుటకు తాలూకాలలోనుండు వ్యవసాయపు ప్రచారకులుగాక రయితులకు తగు సలహాలనిచ్చి సహాయపడుటకు వేరే యొక బోధకుండు కలడు. వాని మకాము కోవిల్‌పట్టి వ్యవసాయ పరిశోధన స్థానము. ఈయన మధుర రామనాడు మరియు తిరునల్వేలి జిల్లాలలో పనిచేయుచుండును. వీరి అధీనమందు

ప్రదేశము విస్తారముగానుండుటచే ముఖ్యమైన పిలుపులకు మాత్రము యీతడు స్వయముగాపోయి చూచుకొనుటకు అవకాశముండును. ప్రతి తాలూకా ముఖ్యస్థానము యొద్ద వ్యవసాయపు ప్రచారకునితోపాటు ఒక డిపోకూడ కలదు. దీనియందు విరిన విత్తనముల రకములు. అభివృద్ధి చేయబడిన పనిముట్లు పంచిపెట్టుటకు యుంచబడును.

4. డిపోలు, వాటిలోనున్న వస్తువులు, వాటిధరలు మొదలైనవి తెలుపు పట్టి.

(ఎ) పనిముట్లు.

| | రూ. | అ. | పై. | |
|---|---|---|---|---|
| కూపరు నె 25 రు ... ... | 4 | 8 | 0 | 1 కి ఎక్కువగా లాటులలో కొనేమెడల ధరలు ఇంకను తగ్గవచ్చును. |
| డిటో నె 11 రు ... ... | 7 | 0 | 0 | |
| డిటో నె 26 రు ... .. | 8 | 12 | 0 | |
| త్రవ్వుకునే పళ్లపారలు ... ... | రూ 4 మొదలు 5 లవరకు. | | | |
| కూపరు నె 25 రు క్రరులు ... | 0 | 5 | 9 | 1 కి. |
| డిటో నె 11 రు క్రరులు ... | 0 | 9 | 0 | 1 కి. |
| డిటో నె 26 రు క్రరులు ... | 1 | 1 | 0 | 1 కి తోలతో. |
| హెచ్చియం గుంటక నె 0 రు ... | 3 | 12 | 0 | ఈ ధరలు ఇంచుమించులో వేయబడినవి. సరియైన ధరలకు ఆర్డరుచేసినపైని సప్లయిచేయబడును. |
| డిటో నె 1 రు ... | 6 | 8 | 0 | |
| డిటో నె 2 రు .. | 12 | 4 | 0 | |
| మోట చక్రము .. ... | 11 | 0 | 0 | |

(బి) విత్తనములు.

| | |
|---|---|
| వెంపలి ... ... | ధరలు యెప్పటికప్పుడు మారుచుండును. గనుక ధరలు ఎప్పటికప్పుడు మీకు దగ్గరగానున్న వ్యవసాయ డిమానుస్ట్రేటరుగారి వద్ద తెలిసికొనవచ్చును. |
| జీలుగు ... ... | |
| నీలి ... ... | |
| జనుము ... ... | |
| ధాన్యము ... ... | |
| వేరుశనగ ... ... | |
| ప్రత్తి-కంబోడియా కరుంగణ్ణి ... | |
| పెద్ద పచ్చ జొన్న ... ... | |

హెచ్చరిక.—పై వ్రాసిన ధరలు బజారు ధరల ననుసరించి మార్చబడుచుండును.

5. చిల్లర విషయములు.—వృద్ధిపరచిన వేరుశెనగ, చెరుకు, బళ్లారి ఉల్లి మొదలైన విత్తనములను పంచిపెట్టుట, మరియు బెల్లము వండుటకు వృద్ధి చేయబడిన బెల్లపు పొయ్యిని కట్టుట.

6. సహకార పరపతి సంఘ శాఖ.—ఈ సర్కిలులో నిద్దరు పరపతి సంఘముల డిప్యూటి రిజిస్ట్రారులు గలరు. ఒకరు మధురలో మకాముచేసికొని మధుర జిల్లాయున్ను, శ్రీవిల్లిపుత్తూరు, సాతూరు తాలూకాలు తప్ప మిగతా రామనాడు జిల్లాయున్ను చూచు కొనుచున్నారు. రెండవవారు రామనాడు జిల్లాలో మిగిలిన శ్రీవిల్లిపుత్తూరు, సాతూరు తాలూకాలున్ను, తిరునెల్వేలి జిల్లాయున్ను చూచుకొనుచున్నారు. వీరి మకాము తిరునెల్వేలి యింకను శ్రీవిల్లిపుత్తూరులో మకాము చేసికొని సాత్తూరు శ్రీవిల్లిపుత్తూరు తాలూకాలను చూచుకొనుటకు సబ్ డిప్యూటి రిజిస్ట్రారువారుగలరు. పరపతి సంఘ విషయముల తెలిసికొన గోరువారు వీరికి వ్రాయవచ్చును.

7. పరిశ్రామిక శాఖ.—నూతులలో బోరింగుచేయుట, యంత్రములవలన నీరును తోడుట మొదలగు విషయములను గురించి తెలుపుటకు రామనాడు, మధుర, తిరునెల్వేలి, తంజావూరు జిల్లాలకు అసిస్టెంటు యిండస్ట్రియల్ యింజినీయరుగా రొకరు తంజావూరు మకాములో యున్నారు.

(బి) పరిశోధన.

వ్యవసాయపు పరిశోధన స్థానము, కోవిల్‌పట్టి.

1. ఈ స్థానము 1901 వ సంవత్సరములో స్థాపింపబడినది. ఇది దక్షిణ యిండియా రైల్వే మార్గమున కోవిల్‌పట్టి రైల్వే స్టేషనుకు దగ్గరనున్నది. ఇందు భూమి రెండు ఖండములుగా నున్నది. వీనిలో ఎఱ్ఱ భూమి రైల్వే స్టేషనుకు సుమారు ¼ మైలు దూరమున నున్నది. ఈ బ్లాకుయొక్క విస్తీర్ణము 25 యకరములు కాని 16 యకరములు మాత్రము సేద్యములో నున్నది. మిగతా భూమియందు ఇండ్లు, శాలలు వగైరాలు వున్నవి. ఇందు 12 యకరముల భూమి తడియుటకు 4 నూతులు గలవు. ఫారములో పండు ప్రత్తి యేకుటకును, విత్తనము ఫారములో పండు ప్రత్తిని యేకుటకుగాను ఒక యంత్ర మమర్పబడియున్నది. విత్తనములను తీసి రైతులకు సరఫరా చేయుచున్నారు. ఈ ఫారములో ప్రజల ఉపయోగము నిమిత్తము ఆబోతులనుకూడ వుంచియున్నారు. స్వల్ప రుసుమునకే ఆవులపైని దాటింతురు.

నల్ల రేగడి భూమి రైలు స్టేషనుకు రెండు మైళ్ల దూరమున నున్నది. ఇది సాతూరుకు వెళ్లు రోడ్డుపైన నున్నది. దీని వైశాల్యము 115 యకరములు అందు 105 యకరములు మాత్రము సేద్యములో నున్నది. మిగతా భూమిలో రోడ్డు బిల్డింగులు వగైరాలు వున్నవి.

పరిశోధనలోనున్న వివిధ అంశములు.

2. (ఎ) ప్రస్తుతపు వాడుకలోనున్న సి. నె 7 రున్ను నె 1 రు రకమును తొలగించి దాని స్థానే మంచి కరుంగణ్ణి ప్రత్తి జాతుల నుత్పత్తిచేయుట.

(బి) ప్రత్తి పంట పండించుటకు యేయే గెత్తములు యెంతవరకు వేయవలసి యున్నదో గనుటయు.

(సి) నల్ల భూములలో ప్రత్తి పైరు బాగుగా పెరుగుటకు కావలసిన దుక్కులు వగయిరాలను తనిఖి చేయుటయు.

(డి) పశువుల మేతకొరకు వేసిన జొన్న దరిమిలాను వేసిన ప్రత్తి పైరును పాడు చేయుటకు కారణములను కనుగొనుట.

(ఇ) ఈ దేశములో పండు పంటలను, యితర దేశములో పండు పంటలను పెట్టి, తనిఖీచేసి వానిలో బాగుగానుండు వాటిని ఆయా ప్రదేశములలో ప్రవేశపెట్టుట.

(ఎఫ్) జొన్న, గంటి, మినుగులు, ధనియములలోను మంచి వంగడములకొరకు పరిశోధన జరుగుచున్నది.

వివి యెప్పుడు చూడవచ్చును.

3. అక్టోబరు.—ప్రత్తి, సజ్జ, జొన్న, గొర్రుతో విత్తుట.

నవంబరు, డిశంబరు, జనవరి.—దంతులు, జూనియర్ హోలుతో యెడ సేద్యముచేయుట ప్రత్తి, సజ్జ, జొన్న పైరులను పంటమీద చూచుట వాటియందు చేయు తనిఖీలను, జొన్న మొదలగు పశువుల మేతలను మాగుడిగ తయారుచేయుట.

ఫిబ్రవరి, మే, జూలై వరకు.—జొన్న, సజ్జ మొదలయినవి కోయుటయు; ప్రత్తి విరుట, యినుప నాగళ్లతో దుక్కి.

అగస్టు, సెప్టెంబరు.—పైరులను పెట్టుటకు భూమిని తయారు చేయుట, యుక్తమైన రీతిని గెత్తములను వేయుట, కంబోడియా ప్రత్తి వేయుటకుగాను కాలవలు, గట్లు, రిడ్జినాగలితో తయారుచేయుట.

అన్ని మయములయందును :—

సంవత్సరములో యల్లప్పుడును భూమిని పరిశుభ్రముగా చేయుట, పశువుల యెరువును విడికొట్టము పద్ధతి పైని తయారు చేయుటయు, పశువుల గెత్తమును జాగ్రత్త పర్చుటయు, దాటుటకుగాను వుంచబడిన ఆంబోతులను, దూడలను, పశువులకు మేత పెట్టుట, నవీనమైన నాగళ్లు, గొర్రులు వగయిరాలు, తెల్ల లెగ్‌హారన్ కోళ్లు, గిన్నిగడ్డి, మందులువల్ల పురుగులు బూజు తెగుళ్ల నివారణ, పరిషియను నీటి చక్రము.

సి. ఆర్. శ్రీనివాస అయ్యంగారు,
వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, ఆరవ సర్కిల్.

---

## 2 (g) ఏడవ సర్కిల్.

పశ్చిమ తీరమండలి మలబారు, దక్షిణ కన్నడ జిల్లాలు యీ సర్కిలులో చేరియున్నవి. ఇది తెల్లిచెరిలో నుండు వ్యవసాయపు డిప్యుటి డైరెక్టరుగారి ఆధీనములో నున్నది.

### (ఎ) ప్రచురణ.

మలబారు జిల్లాలో 9 తాలూకాలున్ను, దక్షిణ కన్నడ జిల్లాలో 6 తాలూకాలున్ను యున్నవి. ప్రతి తాలూకాలో వ్యవసాయ అభివృద్ధి మార్గములను చూపుటకు ఒక ఉద్యోగి యున్నాడు. ప్రతి తాలూకాయున్ను 8 మొదలు 10 భాగములుగా విభజించి, ఆయా భాగములలో ఒక గ్రామములలో విస్తారముగా పని చేయుచున్నారు. ఈ గ్రామములలోను వాటి చుట్టు ప్రక్కలను పని అభివృద్ధి చెందిన తరువాత యితర గ్రామములు యెంచుకొనబడును. వ్యవసాయ వుద్యోగి, నెల కొకసారి 4, 5 దినములు

లు ఆ గ్రామములో నుండి ప్రచారము చేయును. యే రయితయిన అభివృద్ధి మార్గములను గురించి సలహా కావలసిన యెడల ఆయా మధ్య గ్రామములలోనుండు డిమాన్‌స్ట్రేటర్లను కలసికొని అక్కడ జరుగుచున్న పద్ధతులను చూడవచ్చును. రయితులు కోరినయెడల డిమాన్‌స్ట్రేటరు వారి భూములను చూచి సలహా వుచితముగా యిచ్చును. ఈ క్రింద వివరించిన పట్టిక ఆయా వ్యవసాయ వుద్యోగి నివసించియుండు స్థలమును, వారు ప్రచారముచేయు తాలూకాయున్ను, పనిచేయు గ్రామమును తెలుపును :—

| తాలూకా. | ముఖ్య స్థలము. | పనిచేయు స్థలము. |
|---|---|---|
| | దక్షిణ కన్నడ జిల్లా. | |
| కూందపూరు ... | కూందపూరు ... | తెక్కెట్టి, బస్రూరు, కందవార్, కవ్రాడి, హర్దలిమండలి, క్రాసి, ఉప్పుండ, కూందపూరు, బెయిందూరు, శంకరనారాయణ. |
| ఉడిపి ... | ఉడిపి ... | ఉడిపి, కాట్పాడి, కాప్, ఫలిమార్, షిర్వా, కలియన్‌పూరు, బ్రహ్మవార్, అరూర్, కోట, బోమ్మర్‌బెట్టు. |
| కార్‌కాల్ ... | మూడ్‌బిద్రి ... | కల్లముమ్మాకర్, ముదచిద్రి, పల్లడ్క, మహూర్, కరిమనెల్, కర్కాల్, బెళ్తన్న, బెయిలూర్, అజెకార్, పనపిల. |
| పుట్టూరు ... | పుట్టూరు ... | సుల్లియా, మద్నూరు, (కవు), పుట్టూరు, ఉప్పినన్‌గాడి, బెళ్తన్‌గాడి, బెల్లారి, విట్టల్, కన్యాన, మని, వీరకంబ. |
| మంగళూరు ... | మంగళూరు ... | మంగళూరు, ఫరెంజిపేట, భన్ట్వాల్, పుంజల్ కట్టెయి, పని మాంగళూరు, కొటికార్, సురత్కాల్, మూక్కి, సుర్‌పూర్, బాజ్పే. |
| కాసరగోడ ... | కాసరగోడ్ ... | బయాక్, కేసరగాడ్, కన్‌హన్‌గాడ్, మన్‌జేశ్వర్, మంగళపాడి, ములియార్, పెర్డార్, పనతాడి, తూర్పు త్రికారిపూర్, ఉదుమ. |
| | మలబారు జిల్లా. | |
| చిరకాల్ ... | కన్ననూరు ... | పయ్యన్నూర్, పలయంగాడి, అళక్కోడు, పప్పినిశ్శేరి, తలిపరాంబ, పుదక్కాడ్, ఇలయపూర్, అంజరకండి. |

| తాలూకా. | ముఖ్య స్థలము. | పనిచేయు స్థలము. |
|---|---|---|
| | మలబారు జిల్లా — శేషము. | |
| కొట్టాయం ... | తలచ్చేరి ... | మెలూర్, కదిరూర్, కుట్టుపరంబ, కన్నవాం, మట్టనూర్, చోక్లి, పనూర్, ఇరిట్టి. |
| వాయినాడ్ ... | మనంతోడి ... | మనంతాడి, ఘార్వన, పెరియ, కనియంపేట, కల్పేట, మెప్పాడి, మీనంగాడి, సుల్తాన్సబాటరీ. |
| కురంబ్రనాడ్ ... | బడగర ... | ఉర్కుట్టేరి, నడపురం, కుట్టియాడి, విల్లియపల్లి, పయ్యోలి, పెరంబ్రా, చిమంచేరి, బలుస్సేరి. |
| కల్లికోట ... | కల్లీకోట ... | ఇలత్తూర్, కల్లికోట, చెరువన్నూర్, చెవయూర్, కొడువల్లి, తమరస్సేరి, నన్మిండ, మక్కాడ. |
| ఎర్నాడు ... | మంజరి ... | మంజిరి, నిలంబూర్, కొండొత్తి, వల్లికున్ను, ఫెరోక్, రామనాత్కర, ఉరప్పనగాడి, తిరురంగాడి, మలప్పురం. |
| పొన్నాని ... | పొన్నాని ... | పొన్నాని, ఇడపాల్, కుమారనల్లూర్, త్రిత్తల, తిరూర్, పొన్నాండం, అలత్తూరు, చౌగాట్, అండతోడి. |
| వులవనాడ్ ... | పరింతల్మన్న ... | పెరింటల్మన్న, పట్టాంబి, మన్నార్ఘాట్, ఒట్టాపాలం, చెరుపుల్స్సేరి, పులమంతాల్, మన్కాడ, మెలత్తూరు. |
| పాల్గాట్ ... | పాల్గాట్ ... | పాల్గాట్, కంజికోడ్, ఆలత్తూరు, వడక్కన్చేరి, కొడువయూర్, కొల్లంగోడ్, కొంగాడ్, మన్కార. |

డిమాన్‌స్ట్రేటర్లు పని జరుగు స్థలములకు వెళ్లి రయితులకు అభివృద్ధి మార్గమును చెప్పుదురు. అవి యేవన, మంచి విత్తనము చల్లుట, పశువులను సరిగా మేపుట పాడుగ నుండు ఆకు ఆలములను సరిగ నుపయోగింప, పొలములోని పెంట సరిగ జాగ్రత్తచేసి యుంచుట, క్రిమికీటకాదుల బాధలు నివారించుట. ఇవిగాక వరి, చెఱకు, కొబ్బరి, మిరియము, మంచి మార్గముల సాగుచేయు విధములను చూపుటకు మచ్చు చూపు పొలములలో ఆయా చోట్లకు తగిన యేర్పాటులు చేయబడియున్నవి.

విత్తనములు పంచుట.—మంచి విత్తనములయొక్క లాభములు తరచు రైతుల
ను బోధపరుపబడుచున్నవి; పరిశోధన స్థానములలో యెక్కువ పంట నిచ్చు యెంపుడు
విత్తనములు, రయితులకు తెప్పించి యిచ్చుచున్నారు. గత సంవత్సరమున 76 టన్ను
లు వరి విత్తనములు యీ సర్కిలులో రయితులకు యివ్వబడినవి. రయితులందరకు
యిచ్చుటకు విత్తనములు సరిపోవు గనుక వారు యెట్లు విత్తనములను శుభ్రముగా నుంచ
వలెనో ఆ మార్గములు నేర్పబడుచున్నవి.

ఈ సర్కిలులో విస్తారముగా కొబ్బరి తోటలు వేయుచున్నారు. కాసరిగోడ్
పరిశోధన స్థానములో యెంచబడిన బాగా కాయు చెట్లనుండి తీసిన కాయలు, రయి
తులకు యిచ్చుచున్నారు. మలబారు, దక్షిణకన్నడ జిల్లాలలో యెంచిన మంచి తోటల
నుండి, తీసిన కొబ్బరికాయలనుండి నీలేశ్వరపు పరిశోధన స్థానమున మొక్కలు పెంచి
రయితులకు యివ్వబడుచున్నది.

మంచి రకపు మిరియపు తీగలు, కావలసినవారికి యివ్వబడుచున్నవి.

ఫల వృక్షములు పెంచుటకు మంచి సలహా యివ్వబడుచున్నది. ముఖ్యముగా
అరటి పిల్లలు, అనాస పిల్లలు, మామిడి అంట్లు, సపోటా అంట్లు, రయితులకు సప్లయి
చేయుచున్నవి. కావలెనన్నపుడు రయితులకు విత్తనములు శ్రద్ధగా సప్లయి చేయ
బడును. అన్ని పంటలకును యుక్తమైన మార్గములు తెలుపబడును.

పాతరవేయబడిన పశువుల మేత.—వర్షములు ముగించిన తరువాత కొండప్రక్కల
ను పచ్చికబయళ్లను, గడ్డి విస్తారముగా మొలచును. అది వేసవికాలమున యెండి
యెందుకు పనికి రాకపోవుచున్నది. అటువంటి గడ్డిని పాతరవేసి జాగ్రత్తచేయు పద్ధతి
నేర్పబడుచున్నది.

కుళ్లబెట్టిన యెరువు.—యెరువులు విస్తారముగా కావలెనను చున్నారు. గనుక,
ఆకు అలములు, చేలయొక్క దుబ్బులు, కలుపు మొక్కలు మొదలయినవాటిని యెట్లు
త్వరలో కుళ్లబెట్టి పెంటచేయవలెనో, ఆ మార్గములు చూపబడును.

పశువుల పెంట సరిగా నిలువయుంచు మార్గము.—అన్ని పెంటలలో పసువుల
పెంటు మంచిది, చవుక. అయితే, మనము దానిని సరిగా జాగ్రత్త చేయుటలేదు.
దానిని కూడ వేయుటయందును, ఉంచుటయందును చాల రద్దగుచున్నది. అందుచే
దానిని జాగ్రత్తగనుంచు మార్గములు రయితులకు చెప్పబడుచున్నవి. పశువుల పెంటను
పోగుచేయుటలో లూజ్ బాక్సు పద్ధతివల్ల యెరువు వ్యర్థమవుట తగ్గును. మంచి పశు
వుల సాలలు కట్టి, యెండిన ఆకులు, పచ్చి ఆకులు, వదలివేసిన మేత మొదలయినవి
పరచి వాటిమీద పశువులను కట్టినయెడల మంచి పెంట తయారగును. ఆ పద్ధతి దక్షిణ
కన్నడ జిల్లాలో నున్నది. దానిని మలబారు జిల్లాలోకూడ అలవాటు చేసుకొనుట
రయితులకు నేర్పబడుచున్నది.

పశువుల జాగ్రత.—పశువులను సరిగా మేపుట మంచి సంతతి అభివృద్ధిచేయుట,
వాటికి సరియైన సాలలు కట్టుట మొదలగు విషయములను గురించి, రయితులకు బోధింప
బడుచున్నది. వేరుశనగ, నూపిండులు, యింకా బలమైన పదార్థములు వాటికి యిచ్చు
టకును, మేత కొరకు జొన్న, గన్నీ గడ్డి, యేనుగగడ్డి సాగుచేయుటకు మార్గములును
బోధింపబడుచున్నవి. పై చెప్పిన గడ్డియొక్క పిల్కలు కూడ తెప్పించి యివ్వబడు
చున్నవి.

కోఆపరేటివు సొసయిటీలు, గొప్ప రయితులు, మంచి ఆబోతులను పెంచుటకు ప్రేమియములు యిచ్చి ప్రోత్సాహ పరుపబడుచున్నారు. ఈ సర్కిలులో ఆలాటి ఆబోతులు 12 ఎనుపోతులు 3 ను వున్నవి. అవికాక వ్యవసాయ శాఖవారు, 2 ఆబోతులను మంగళూరు వెటరినరీ ఆసుపత్రిలోను, కన్ననూరు వెటరినరీ ఆసుపత్రిలోను, తలిపరంబ వ్యవసాయస్థానములో ఒక యెనుపబోతును ఉంచినారు. ఈ ఆబోతులను ఎనుపోతుకు కొద్ది రుసుము యిచ్చినచో రయితులు ఉపయోగించుకొనవచ్చును.

ఈ సర్కిలులో ఆరు మాసములకన్న అధిక కాలము యెక్కువగా వర్షములు కురియును కనుక పశువులకు సరియైన సాలలుండుట ముఖ్యము. ఈ సంగతి రయితులకు బోధపరుపబడుచున్నది, తగిన సాలలు కట్టుటకు వారు ప్రోత్సాహపరుపబడుచున్నారు.

కోళ్లు.—హొసూర్సారు లైవుస్టాక్ రిశెర్చి స్టేషనునుంచి మంచి పెంపుడు రకముల కోళ్లు, గుడ్లు తెప్పించి కావలసినవారికి యిచ్చుచున్నారు.

తేనేపట్లు.—తేనేపట్లు, పట్టుట, పెంచుట మొదలగు విషయములలో తగు సహాయము చేయుదురు.

క్రిమికీటకాదులను, బూజులను నివారించుమార్గము.—ముఖ్యముగా బాధచేయు కీటకములు రెండు. కొబ్బరి ఆకులుమీద గొంగలి పురుగు, వరిమీద గొంగలి పురుగు. వీటియొక్క జీవిత చరిత్రయు, వాటిని నివారించు మార్గములు అనగా, పురుగుపట్టిన ఆకులను త్రుంచి తగులబెట్టుటయు ఆ గొంగలి పురుగులను చంపితిను పురుగులను ప్రవేశపెట్టుటయు, రయితులకు తెలుపబడుచున్నవి.

బూజు తెగుళ్లు.—ఈ సర్కిలులో యెక్కువ వర్షను కురియును కనుక, పోక చెట్లమీద మహాళి జబ్బును, తాటికొబ్బరిచెట్ల యొక్క మొవ్వును చెరుచు జబ్బును తరచుగా కనబడును. మహాళి జబ్బునకు బోర్డో ద్రావకము చల్లుట చాల ఉపయోగమగుచున్నది, గనుక, ఆపని ఆజబ్బు కనబడగానే చేయబడుచున్నది. తాటి, కొబ్బరి చెట్టుకు తెగులు వచ్చినప్పుడు మొవ్వులను కోసి తగులపెట్టువలెనని బోధింపబడుచున్నది. పాలఘాటు తాలూకాలో, పెస్టు ఆక్టు అములలోనికి తీసుకొని రాబడినది. ఎక్కడనైనను కీటక బాధగాని, తెగుళ్ల బాధగాని వచ్చెనన్న సంగతి తెలిసినచో, వెంటనే ఆ ప్రదేశము పరీక్షించి, వాటిని నివారించుటకు తగుమార్గములు బోధింపబడుచున్నవి.

ప్రచురించుటకు పరీక్షించుటకును యేర్పడిన మళ్లు.—వ్యవసాయ పరిశోధన స్థానములలో కనుగొనబడిన మంచిమార్గములు రయితుల భూములయందు మొదట మచ్చుకై కొన్నిచోట్ల పరిశీలింపబడుచున్నవి. తరువాత ఆమార్గములు మంచివి అని రూఢమైనయెడల అన్ని శెంటరులలోను ప్రవేశపెట్టబడుచున్నది.

ప్రదర్శనములు ఉపన్యాసములు.—ప్రతి సంవత్సరము, ప్రతి జిల్లాలయందు ఒక గొప్ప ప్రదర్శనము చూపబడును. యిదిగాక ప్రతి తాలూకాయందు చిన్న ప్రదర్శనములు చూపబడును. ఇవి సాధారణముగా జమాబంది కాలమునను కో ఆపరేటివు కాన్ఫరెన్సులయందును ముఖ్యపండుగలయందును చూపబడును. వీనియందు మంచి పనిముట్లు మంచి విత్తనములు యెరువులు, క్రిమికీటకములను చూపి వాటిని అణచుటకు తెలుపునట్టిన్ని పరిశోధన ఫలితములను చూపునట్టిన్ని పటములను ప్రదర్శించెదరు. క్రొత్తరీతిని పనిముట్లతో పనిచేయుట, క్రిమికీటకాదుల తెగుళ్లను చూపుటయు మచ్చు

చూపబడును. దున్నుట క్రిమికీటకాదులను నివారించు మార్గములను, ప్రదర్శించెదరు వ్యవసాయ మభివృద్ధి గురించి ఉపన్యాసములు యిచ్చెదరు.

ప్రదర్శన మోటారు.—వ్యవసాయ శాఖవారి ప్రదర్శన మోటారు బండి సంవత్సరములో మూడు, నాలుగు నెలలు యీ సర్కిలులో త్రిప్పి, రైతులకు మంచి మార్గములు ప్రదర్శించుచుందురు.

రయితులు వ్యవసాయ డిపార్టుమెంటు సహాయము కావలసివచ్చినప్పుడు వారి తాలూకా డిమానుస్ట్రేటరుగారికి గాని లేక తెల్లిచెరిలోయున్న డిప్యూటి డైరెక్టరుగారికి గాని వ్రాయవలెను.

ప్రతి డిమానుస్ట్రేటరుగారి ముఖ్యస్థలమున డిపోలు ప్రదర్శన శాలలుగలవు. యీడిపోలలో చుట్టుప్రక్క స్థలములకు తగిన విత్తనములు, పనిముట్లు దొరకును. ప్రదర్శన శాలలయందు, విత్తనములు, యెరువులయొక్క మచ్చులు, పటములు, ప్రకటనలు, గ్రామస్థుల పంచాంగములు, మొదలయిన కాగితములు వుంచబడును. విత్తనములు యెరువులు యిక్కడనుండి అమ్మబడును. ఇక్కడ విత్తనములు ఖరీదులు తెలుపవలెను.

కోఆపరేటివు శాఖ.—కోఆపరేటివు సొసైటి డిప్యుటి రిజిస్ట్రారులు యిద్దరు యున్నారు. ఒకరు మలబారు జిల్లాకున్ను, మరియొకరు దక్షిణ కన్నడ జిల్లాకును. మలబారు జిల్లాలో యున్నవారికి కల్లికోటయున్ను, దక్షిణ కన్నడలో యున్నవారికి మంగలూరును ముఖ్యస్థలములయి యున్నది. వీరు రైతులకు సహాయపడి కో ఆపరేటివు సొసైటీలను స్థాపించి తక్కువవడ్డికి, వ్యవసాయాభివృద్ధికి అప్పులనిచ్చే ఏర్పాటు చేయుదురు. కొత్త సొసైటీలు స్థాపింపతలచిన రైతులు వీరిని కోరవలయును.

పరిశ్రామిక శాఖ.—మలబారు, దక్షిణకన్నడము జిల్లాలలో పనిచేయు పరిశ్రామిక శాఖ ఆసిస్టెంటు యింజనీయరుగారు, కోయంబత్తూరులో మకాం చేసియున్నారు నూతులు తొలచుటకును, యింజనులు స్థాపించుటకును వీరి సలహాను అడగవచ్చును.

## (b) వ్యవసాయ పరిశోధన.

వ్యవసాయ పరిశోధనస్థానము, పట్టాంబి.—పట్టాంబిలో వ్యవసాయ పరిశోధన స్థానము 1927 వ సంవత్సరమున స్థాపింపబడినది.

ఈ పరిశోధనస్థానము పట్టాంబి రైల్వే స్టేషనునుండి ఒక మైలుదూరమున నున్నది. పులమంతోలె, పాలఘాటు, వల్లువనాడు తాలూకా నెట్టిమంగళం, కోటలూరు దేశములలో రోడ్డులు రెండును యిక్కడ కలియును. యిది వల్వనాడు తాలూకాలోని నెట్టిమంగళం, కోటలూరు గ్రామమునకు చేరియున్నది. దీనియొక్క విస్తీర్ణము 82 ఎకరములు. ఇది రెండు వరిపంటలు పండెడి భూమియు, ఒక వరిపంట పండెడి భూమియు, కొండభూమియు నివాసస్థలములుగల ప్రదేశము.

## వ్యవసాయ పరిశోధనస్థానములందు యేమిచూడవలయును, యెప్పుడుచూడవలయును'

ఏప్రిల్.—సాధారణముగా రెండు పంటలనిచ్చు భూములలోను యినుపనాగళ్లతో దున్ని, వేసవికాలపు వానలు పడగనే, పచ్చి యెరువునకు బొబ్బర్లు చల్లుట, విత్తనములన్నియు యెండబెట్టుట, డిమాన్‌స్ట్రేటరులకు పంపెడి విత్తనములు సరిగా మొలకెత్తునో లేవో యని పరీక్షించుట, రయితుల కిచ్చుటకు విత్తనములు డిమాన్‌స్ట్రేటర్లకు పంపుట.

మే.—మెట్ట భూములలో చామలు మొదను చల్లుట, మొదటి పంట వరిరకముల దంప, మెట్ట ఆకుమళ్లకు చల్లికలు. పశువులమేతకొరకు జొన్న, గంటి, జనుము పచ్చి యెరువునకు బొబ్బర్లు భూమిమీదయుండును. భూమినిదున్ని అల్లము పూడ్చుట; రాగులు, వేరుశనగ, ప్రత్తి జీలుగ, జనుము సాయచిక్కుడు. మొదను భూములయందు చల్లబడును. చెరుకు రకములనుగూడ చూడవచ్చును.

జూన్.—పశువులకొరకును, పచ్చియెరువునకును వేసిన పంటలను కోయుట. మొదట పంట వరికి పచ్చి యెరువును తిరుగ దున్నుట; దమ్ముపట్టుట మొదటి పంట వరి పూడ్చు మొదను వరి, చామ, రాగి, పత్తి, వేరుశనగ, జనుము, జీలుగ, సాయచిక్కుడు పంటలను చూడవచ్చును.

జూలై.—మొదటి వరి పంట పూడ్చు, సాంతము అగును. చామలు కోతకు తయారుగా నుండును. మొదను వరి పొట్టలో నుండును. వేరుశనగా, జీలుగ, జనుము పుష్పించియుండును, చెరకుతోటలు యుండును. క్రొత్తగా నాటిన మొదటి పంట వరిని పాడుచేయు క్రిమికీటకాదులను నివారించుట.

ఆగస్టు.—చామలు కోసి తరువాత దున్నుట పచ్చియెరువు నిమిత్తము పులవ చల్లుట. మొదను వరివెన్ను వేసియుండుట, మొదటి పంట వరి నాటుకొని బాగుగ యెదిగియుండుట, రెండవ పంట ఆకుమళ్లు సిద్ధముచేయు లోతునీళ్లలో పెరుగు వరి రకములు చల్లుట, పత్తి, వేరుశనగ పుష్పించియుండుట.

సెప్టంబరు.—ఇరుప్పగర్, పల్లియాల్ మొదటి, రెండవ పంట వరి రకములు యీనియుండుట, మొదను వరి కోత మొదను వరి మోళ్లదున్ని నువ్వుచల్లుట, రెండవ ఆకుమళ్లు చల్లుట, వలల సహాయముతో పురుగులను పట్టుట వరి కాడలను కొరుకు పురుగులను దీపసహాయమున పట్టుట, అల్లం మళ్లలో కలుపుతీసి, ఆకులను పరచుట, వేరుశనగ త్రవ్వి తీయుట, లోతు నీటిలో పెరుగు వరి రకములను నాటుట.

అక్టోబరు.—మొదటి పంట వరికోయుట, రెండవపంట నేలదున్నుట, రెండవ పంట పూడ్చు, పులవ, అల్లం, నువ్వు వృద్ధిలో నుండుట, ప్రత్తిపిందెలు వేయుట.

నవంబరు.—రెండవ పంట పూడ్చు పూర్తియగుట నువ్వు, పులవ కాయలు తొడుగుట, మెట్టుచేలలో పులవను పచ్చియెరువుక్రింద దున్నుట, పశువులకొరకు కొండగడ్డితో సైలేజి తయారుచేయుట, పశువులకొరకు గడ్డి నిలువచేయుట.

డిసంబరు.—రెండవ పంట వరి యీనియుండుట, విత్తనమునకు వేరుపరచిన చేలయందు కేళీలను తీయుట, నూచేలు కోయుట, చెరుకు తోటలు అభివృద్ధిగా నుండుట.

జనవరి.—రెండవ పంటకు వరి కోతకు సిద్ధముగానుండుట; చెరకు పంట పదును మీదయుండుట, చెరుకు ఆడుటకును, రసమును మురుగబెట్టుటకును పరికరములు తట్టురు చేయుట, సింధువాహిపొయ్యి కట్టుట.

ఫిబ్రవరి.—రెండవ పంట వరి రకముల కోత, పశువుల మేతకొరకు వేయు జొన్న, కంటె, జనుము పంటలకు భూమి తయారుచేయుట, అల్లం త్రవ్వితీయుట, మొదటి పంట వరి భూములకు ఆకుమల్లు తయారు చేయుట, చెరుకు నరికి ఆడి, రసము మురుగబెట్టి బెల్లం చేయుట, చెరుకు దవ్వనాటుట.

మార్పి.—రెండవ పంట వరికోత పూర్తియగుటు పుంజ వరికి బదులు జొన్న, గంటి, జనుము పంటలు భూమియందుండును. కలుపు మొక్కలు యితరమైన తుక్కు మొదలయినవాటిమీద వేడనీళ్లు, ఎముకలపొడి, జల్లి, పెంట తయారుచేయుట, గోతులు నుండి స్తైలేజిని తీసి పశువులమేతగా నుపయోగించుట.

నోటు.—ఈ వవ్యసాయ స్తానములో పెంట గోతులు, పండ్లతోట, అనాసతోట, తేనెపట్టుట, పాలుయిచ్చెడి గేదెలు సర్వకాలముయందు చూడవచ్చును.

ఈ వ్యవసాయస్తానమున పరిశోధింపబడు పలు అంశములు.

పశ్చిమ సముద్రతీరపు జిల్లాలైన మలబారు, దక్షిణ కన్నడములయందు ప్రస్తుతము పెరుగుచున్న వరిరకములను వాటినుండి విరివిగా పంటనిచ్చు మొక్కలను ఏంచి అభివృద్ధి చేయుట; వేరువేరు రకముల మొక్కల సంయోగసంధానమువలన రెండు రకముల యొక్క సమూహానుగుణములు గలిగిన రకములను బడయుటయు; యీ రెండు ముఖ్యమైన పద్ధతులవలన వరిసస్యములు అభివృద్ధిచేయుట యీ వ్యవసాయస్తానముయొక్క వుద్దేశమయియున్నది. ముఖ్యమైన ఒకటి, రెండు, మూడవ పంటల రకములనుండి యేర్చిన పంటలు వివిధ పరిషులయందున్నవి. కొన్ని బాగా ఫలించు రకములు రయితుల భూములయందు ఈ జిల్లాలో ముఖ్యప్రదేశములో కొన్నిచోట్ల రయితుల భూములలో పరిశీలింపబడుచున్నవి. మురుగు వరి, మెట్ట వరి రకములు యీ వ్యవసాయ స్తానమున పెంచబడుచున్నవి.

పరిశోధింపబడు తదితర విషయములు.

వరిగాక తదితరమైన సస్యములు ఏటేట మార్పిగాని లేక వరికి బదులుగాగాని పెంచి చూచుచున్నారు. మోదాన్ లేక మెట్ట భూములయందు చామలు, వులవలు, నువ్వులు వరితో మార్పి పెట్టబడుచున్నవి. వేరుశనగ, ప్రత్తి, జొన్న, గంటెలు, జీలుగ, జనుము మెట్టభూములయందును, పల్లియాల్ భూములయందును సాగుచేసి చూచుచున్నారు. పెలకు పల్లియల్ భూములయందు వరితో మార్పుచెంది సాగుబడి చేయబడుచున్నది జీలుగ, జనుము మూడవపంట వరికి బదులు పల్లపు భూములయందు సాగుచేయుటకు వీలగునా యను అంశము పరీక్షింపబడుచున్నది.

మెట్టభూమిలో పలురకముల ఫలవృక్షములు సరిగా వచ్చునో లేదో పరిశీలించుటకు తోట యొకటి వేయబడినది. మెట్ట భూమియందు అనాసతోట లాభకరముగ నుండు నటుల సూచనలు కనబడుచున్నవి.

వివిధరకములు గడ్డితో 'సైలేజి' తయారుచేయుట, కలుపు మొక్కలతోను సమస్తవిధములైన తుక్కు మొదలయినవాటితో వుపయోగకరమగు పెంట తయారు చేయుట ఈ వ్యవసాస్తానమునయెల్లకాలముల చేయు పనులలోనివి. పశువుల మెరుపు మంచి పద్ధతుల ప్రకారము నిలువచేయబడును.

అనుకూలమైన మేతవలనను, సంరక్షణవలనను యెంతనీరసమైన పశువునయినను బాగుపడగలదని నిదర్శనము యీస్తానములోయున్న పశువులను చూచిన తెలియును.

ప్రేక్షకులు దయచేయ ప్రార్థితులు. వారికి స్తానమున జరుగుచున్న సమస్తమును బోధింపబడును.

ముఖ్యమైన వరి రకములను జాగ్రత్తచేసి, వరి పూడ్చుట, వెదచల్లుట, అనేక గుర్తులలో చల్లుట, ఎక్కువ తక్కువ దూరములలో పూడ్చుట, మెట్ట ముంపుడువరు

లకు కావలసిన యెరువులు మొదలగు విషయములు గురించి తగు పరిశోధనలు జరుగు చున్నవి.

### వ్యవసాయ పరిశోధనస్థానము, తలిపరంబ.

ఈ వ్యవసాయ స్థానము 1905 వ సంవత్సరమున మిరియముల వైరుసు పరిశోధించుటకు స్థాపింపబడినది. ఇది తలిపరంబ రోడ్ల రైల్వేస్టేషనునుండి పది మైళ్ల దూరమున తలిపరంబ, యిరుకూరు రోడ్డువైపున నున్నది. తలిపరంబ గ్రామమునకు రైలు స్టేషన్ రెండు మైళ్లదూరమున యున్నది. రైల్వేస్టేషను వద్దనుండి మోటారు బస్సులు కారులు తలిపరంబ గ్రామమునకు వచ్చును. అక్కడనుండి ఫారమునకు యిరుకూరునకు పోవు బస్సులును, కారులును దొరుకును.

ఈ స్థానముయొక్క విస్తీర్ణము 148 యెకరములు. అందున 57 యెకరములు సాగుబడియగుచున్నవి. సాగుబడి అయ్యేడి భూమిలో—

| | | | | ఎ. |
|---|---|---|---|---|
| మిరియపు పంట | ... | ... | ... | 29.60 |
| పల్లపు భూములు | ... | ... | ... | 8.59 |
| మెట్ట భూములు | ... | ... | ... | 16.86 |
| ఫలవృక్షముల తోట | ... | ... | ... | 2.00 |
| | | మొత్తము | ... | 57.05 |

### ఈ స్థానమున యేమి చూడవలయును, ఎప్పుడు చూడవలయును.

ఏప్రిల్ నెల.—ఇనప నాగళ్లు, పల్లపు భూములయందును, గుంటకలు కొబ్బరి తోటలయందును పనిచేయును. అనాసలు ఫలించుచుండును.

మే-జూన్.—మిరియపు తోట నాటుట, దంప నేలలతో పలుచగ పోసిన వరి నారుమళ్లు, దంప నేలలలో దమ్ముచేసి పచ్చి యెరువు సస్యములు కలియదున్నుట, వరి ఊడ్చుట చెరకు తోటలకు కడసారి యెరువువేయుట. మెరక నేలను విత్తనములు చల్లుట, మొక్కవేయుట.

జూలై-ఆగష్టు.—మిరియపు తోటలలో త్రవ్వుట, మిరియపు తోటలో కాలీలు నాటుట, కొబ్బరి చెట్లకును పండ్ల చెట్లకును ఎరువువేయుట.

G ఆగష్టు-సెప్టంబరు.—ఈ స్థానముచూచుటకు యీ నెలలు అనుకూలము, ఈ సమయమున అన్ని పంటలును భూమిమీదనుండును. ప్రేక్షకులు యీ క్రిందివాటిని చూడవచ్చును :—

(ఎ) పల్లపు భూములలో—

(1) విర్చివేసిన వరి విత్తనములుచల్లి పెంచిన నారు పూడ్చినచేలు, వీనిని ప్రక్కనున్న చేలతో పోల్చి చూడవచ్చును.

(2) వేరువేరు రకముల చెరకు తోటలు.

(3) నేంద్రము, యితర రకముల అరటి తోటలు.

(బి) తోట భూములలో—

(1) మిరియపు రకములు గల తోటలు వాటిని జాగ్రత్తగా సాగుచేయుట.

(2) కాఫీ మొక్కలు మిరియపు తోటలలో సాగుచేయుట.

(3) పలురకముల ఫలవృక్షముల గల తోటలు.

(సి) మెట్ట భూములలో—

(1) మిరప, అల్లము, పసుపు, కర్రపెండలము, అనాస మొదలైనవి కొండ వరికి బదులు విస్తారముగా సాగుచేయుట.

(2) సపోటా అంటు మామిడి వంటి పండ్ల తోటలు.

(3) కొబ్బరి తోటలు మెరక భూములమీద పెంచుట.

(4) పశువుల మేతకు కావలసిన జొన్న, గంటి గిన్నిగడ్డి సాగుచేయుట.

అక్టోబరు-నవంబరు.—సైలేజి తయారుచేయుట మిరప తోటలకు రెండవసారి గొప్పు త్రవ్వుట. బాగా ఎదిగిన నానాజాతుల చెరకులు.

డిసంబరు-జనవరి.—కాపుబట్టిన ఫలవృక్షములు, పల్లపు భూములలో అపర ధాన్యపు పంటలు, మిరియపు తోటలు పంటలు వచ్చియుండుట, తీగలుకట్టి, గొప్పు త్రవ్వుట, చెరుకు నాటుటకు నేల సిద్ధముగ చేయుట, పల్లపు భూములలో నేంద్రము అరటి, కాయగూరల తోటలు, చెరకు ఆడిబెల్లము చేయుట.

ఫిబ్రవరి-మార్చి.—చెరకులు ఆడి, బెల్లముచేయుట, చెరకు దవ్వనాటుట—పల్లపు భూములలో నేంద్రము అరటి, కాయగూరల తోటలు, పచ్చి ఎరువు సస్యములు. సైలేజి ప్రాతర వేసినగడ్డి పశువులకు మేపుట.

తేనె టీగలను పెంచుట చూడవచ్చును. ఇక్కడ ఉండు ఎనుముల రకము బాగు పర్చుటకు ఒక ఢిల్లీ విత్తనపు ఎనుపోతునున్ను కొన్ని మంచి గేదెలను ఉంతురు.

పశువుల పెంట పాడవుగా జాగ్రత్తపెట్టుట, చెత్త చెదారములు కుళ్లపెట్టి యెరువు చేయుట సంవత్సరము పొడుగున చూడవచ్చును.

పరిశోధింపబడు ముఖ్యాంశములు.

1. కాలమాన స్థితులనుబట్టి, మిరియపు గింజలు రాలిపోవుట.

2. పలు రకములు మిరియములు, యేయే పరిస్థితులలో బాగా వచ్చుచున్నది.

3. మిరియపు తీగలకు ప్రాకుటకు కావలసిన మొక్కలు వాటినీడ యే విధముగ మార్చుట.

4. మిరియపు తోటలో యే విధమున సాగుచేయవలసినది, ఎట్లు అభివృద్ధిచేయ వలసినది.

5. మిరియపు తోటకు యెంత యెరువు కావలసినది.

6. 'పొల్లు' జబ్బు యెట్లువచ్చునో పరీక్షించి దానిని నివారించుటకు మార్గములు కనిపెట్టుట.

7. కాఫీ చెట్లు, మిరియపు తోటలో పెంచు మార్గము పరిశీలించుట.

పల్లపు భూములు.

1. వెంపలి అనుప సస్యములు పెంచి పచ్చి యెరువుక్రింద వరిపొలముల కుపయోగించుట.

2. వరి పంటను, విత్తనము యెంచుటవలనను, మంచి మార్గముల సాగుచేయుట వలనను అభివృద్ధిచేయుట.

3. పలురకముల అరటులను పరీక్షించుట.

మెట్ట భూములు.

1. సస్యములు పలువిధముగగూర్చి, సాగుచేయుట.

2. ప్రత్తి, అల్లము, మిరప, అనాస వర్షాధారముతో సాగుచేయుట.

3. ఫలవృక్షముల పరిశీలన, అంటు మామిడి ముఖ్యముగా గమనించుట.

ఈ వ్యవసాయస్థానమున పశువులమేతకు కొంతగడ్డి వేసవి కాలమున పనికివచ్చుటకు పాతరవేయుటయు, సమస్తవిధమైన తుక్కు మొదలయిన వాటితో వుపయోగకరమైన పెంట తయారుచేయుట, పశువుల పెంట జాగ్రత్తగాను, పొదుపుగాను పోగు చేయుట మొదలైనవి యెల్లప్పుడును చేయబడును.

పశ్చిమతీరమునందలి కొబ్బరి పరిశోధన స్థానములు.

కొబ్బరి పరిశోధన 4, స్థానములయందు చేయబడుచున్నది. ఈ స్థానములో 3 రకముల భూమి అనగా (1) కంకర నేలలు, (2) యెర్ర నేలలు, (3) యిసుక నేలలు ఉదహరించుటకుగాను స్థాపింపబడినవి.

నీలేశ్వర్ I.—ఈ స్థానము 1916 వ సంవత్సరమున స్థాపింపబడినది. దక్షిణ కన్నడ జిల్లా, కాసర్‌గోడు తాలూకా, పీలికోడు గ్రామమున చేరియున్నది. దీనికి దగ్గర రైల్వేస్టేషను, చెన్నపురి, మంగళూరు రైలు మార్గమున, చెరువత్తూరయియున్నది. ఈ పరిశోధన స్థానము రయిలు స్టేషనునకు 15 మైళ్ల దూరమున దక్షిణమున నున్నది.

ఈ భూమియందు విస్తారముగా కంకరయున్నది. అయితే చదునుగాయున్నది. అక్కడక్కడ కొండరాళ్లుపైన నున్నవి. ఈ స్థానముయొక్క మొత్తపు విస్తీర్ణము 70 యెకరములు. అందులో 33.68 యెకరములలో తోట వేయబడినది.

ఈ స్థానమున యేమి చూడవలయును, యెప్పుడు చూడవలయును.

ఈ స్థానము ముఖ్యముగా, మెట్ట భూముమీద కొబ్బరి తోటలు సాగుచేయుటకుగాను స్థాపించబడినది గనుక, దానికి సంబంధించిన వ్యవసాయపు పనులను చూడవచ్చును.

జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్.—ఈ నెలలలో ముఖ్యముగా, గుంటక తోలుట జరుగును.

మే-జూన్.—కొబ్బరి చేను పచ్చి యెరువుక్రింద మంసూను నాగలితో దున్నుట, రసాయనపు యెరువులు కొన్ని మొక్కలకు వేయుట, కొబ్బరి చెట్లకు తెగుళ్లురాకుండా మందు చల్లుట.

జూలై-ఆగస్టు.—బొబ్బరిచేను బాగా బలిసియుండును. అది పశువుల గ్రాసముతోకూడ, దున్నబడును. కొబ్బరి మొవ్వు చెరుచు తెగులునకు మందు చల్లబడును. చుట్టుప్రక్క నేలనున్న పచ్చి ఆకు, పొగుచేసి, నరికి, దానిని పశువుల శాలలో మెత్తగా వేయబడును.

అక్టోబరు, నవంబరు, డిసెంబరు.—కొబ్బరి మొక్కలలో మంసూను నాగలితో దున్నుటయు, గుంటక తోలుటయు చూడవచ్చును. నవంబరాఖరున, కొబ్బరి తోట వేయనిచోట మొలచిన గడ్డి కోసి 'సైలేజి' చేయబడును. మొవ్వు చెడిపోయిన చెట్లకు మందు చల్లబడును.

పరిశోధన చేయబడు అంశములు.—కొబ్బరి మొక్కలు, 1, 2, 3 అడుగుల లోతునను మొక్కకు, మొక్కకు దూరము మార్చియు, వేయబడి అవి యెట్లు వచ్చునది గమనించుట. ప్రపంచకములో ముఖ్యముగా కొబ్బరి తోటలు పెంచు ప్రదేశములనుండి తెచ్చిన, రకములు యెట్లు వచ్చునో పరిశీలించుట. ఏ నెలలో తీసిన కాయలు బాగా మొలచి, విస్తరించునా అను అంశము పరిశీలించుటకు, కాసరగోడ నుండి వచ్చిన కాయలను, పాతుట, ఆ మొక్కలను పరిశీలించుట. ప్రత్యేకముగా ఒక చెట్టు పువ్వారముచేత ఫలించిన కాయలను పలుచెట్ల పువ్వారములు మిళితమై కలిగిన కాయలను కాసరగోడనుండి పంపగా వాటిని విడివిడిగా పాతి, మొక్కలను పరిశీలించుట.

నీలేశ్వర్ II.—ఈ స్థానము ఒకటవ స్థానమునకు ఉత్తరముగా 5 మైళ్ల దూరమున నున్నది. నీలేశ్వరము రైల్వేస్టేషను పడమటకు ఒక మైలు దూరము. రైల్వే స్టేషనునుండి ఫారమునకు, బండిదారియున్నప్పటికి, సరియైన బండ్లు దొరకవు.

ఈ స్థానము తక్కిన కొబ్బరి స్థానములతో పాటు 1916 వ సంవత్సరమున స్థాపింపబడినది. అయితే 1918 వ సంవత్సరమునగాని, కొబ్బరి తోట వేయుట ప్రారంభించలేదు. భూమి యెర్ర రేగడ నేల. 1933-34 వ సంవత్సరములలో పాత చెట్లు కొట్టివేయబడి, మూడడుగులు లోతుగల, గోతులలో క్రొత్తగా, 1934-35 వ సంవత్సరములో పాతబడినవి.

ఈ స్థానమున యేమి చూడవలయును, యెప్పుడు చూడవలయును ?

కొబ్బరి తోట ముఖ్యమైన పంట. సంకరజాతి మొదలయిన పలురకముల కొబ్బరి చెట్లు నాటబడినవి. చెత్తచెదారములు కుళ్లబెట్టి యెరువుచేయుట, తేనె టీగలను పెంచుట, పురుగులను పట్టుట యెల్లప్పుడును చూడవచ్చును. జూన్ మొదలు ఆగస్టు వరకు పచ్చి యెరువుకొరకు కొబ్బరి తోటలలో వేసిన బొబ్బరులు చూడవచ్చును.

పరిశోధింపబడు అంశములు.

(1) అనేక రకముల సంకరములనుండి తయారైన కొబ్బరి కాయలను నారు కట్టి ఆ నారుయొక్క పెరుకువ మిగిలిన లక్షణములు చూచుట.

(2) రంగు, రాలిక మొదలగు గుణములు యెట్లు మారునో చూచుట.

(3) భూమిమీదనున్న, మూడడుగుల లోతులోనున్న పాతినారు కట్టిన మొక్కల, భూమిలో వేరు భూమి పై కాండము పెరుకువ కనుగొనుట.

(4) మంచి, చెడ్డ చెట్లు పదిహేను సంవత్సరములయిన తరువాత తీసి మరల పాతిన, వాటియొక్క స్వభావ భేదములు కనుగొనుట.

నీలేశ్వర్ III.—ఇది రెండవ స్థానమునకు వాయవ్యముగ ఒక మైలు దూరమున నున్నది. ఒక మంటి రోడ్డు రెండవ స్థానమునుండి, మూడవ స్థానమునకు వేయబడినది. అయితే ఒక పెద్ద కాలువ వీటిమధ్య నున్నది. అందు పడవలు యెప్పుడును తిరుగుచుండును. నీలేశ్వరనది యీ స్థానము ప్రక్కను పారుచున్నది. ఈ స్థానము సముద్రమునకు ముప్పాతిక మైలు దూరముననున్నది.

భూమి, యిసుకభూమి. నీళ్లు వేసవికాలమున యేప్రిల్-మే నెలలో 18 అడుగుల లోతున దొరకును.

దీనియొక్క విస్తీర్ణము 48·07 యెకరములు, అందు 33·2 యెకరములలో తోట వేయబడినది.

ఈ స్థానమున యేమి చూడవలయును, యెప్పుడు చూడవలయును.

జనవరి-ఫిబ్రవరి-మార్చి-ఏప్రిల్.—ఈ మాసములలో గత సంవత్సరములో వేసిన నారుమడికి నీరుపోయుట ముఖ్యమైన పని. విత్తనపు కాయలు, ఆకుమడిలో ఏప్రిల్-మే నెలలో నాటుదురు. విత్తనముకొరకు జీడిమామిడి గింజలు యేరుదురు.

మే-జూన్.—ఈ పొలములు మంసూన్ నాగలితో దున్ని, బొబ్బరిచేను పచ్చి యెరువుగ నుపయోగించుటకు, విత్తనములు మొదటి వర్షములతో చల్లెదరు.

జూలై-ఆగస్టు.—కొబ్బరి మొక్కలు శుభ్రముచేయుట, యీ కాలమున ముఖ్యమైనపని అయియున్నది. పచ్చి యెరువుతో వేయుటకు, పశువుల గెత్తముకొని జాగ్రత్త పెట్టుదురు.

ఆగస్టు-సెప్టెంబరు.—బొబ్బరి పచ్చి యెరువుగ దున్నుట. ఎరువులు వేయుట. పరిశోధన మళ్లలో కాలవలు త్రవ్వుట.

అక్టోబరు-నవంబరు-డిశంబరు —భూమిని మంసూను నాగలితో దున్నుట. గుంటక తోలుట. గతములో త్రవ్విన కాలువలు పచ్చిరొడ్డ యెరువులువేసి కప్పుట.

సంవత్సరములో యెప్పుడైనను.—పురుగులకొరకు వెతకుట. యెండు ఆకులుకొట్టి ఇండోరు పద్ధతిని యెరువు తయారుచేయుట. ఈగలు బాధ తగ్గ నివారణ పద్ధతులు, తేనెపట్టులు పెంచుట సంవత్సరము పొడుగున జరుగుచుండును.

కొబ్బరినారు, జీడిమామిడి తోటలుకూడ చూడవచ్చును.

పరిశోధింపబడుచున్న అంశములు.—కొబ్బరి మొక్కలు ముందుగా లేక ఆలశ్యముగా మొలుచుట ఆకులు పైకివచ్చుటకు పట్టెడికాలము, మొక్కలయొక్క పొడుగు వలముకొలుచుట వేళ్లయొక్క కొలతలు, ఆకులయొక్క గుణము మొదలగు అంశములు నారులోనే మంచి రాలికయిచ్చెడి మొక్కలను యెంచగలుగుటకు తనిఖీ చేయడముగు చున్నవి. వివిధచోట్లనుండి తెచ్చిన మొక్కలయొక్కయు వేరువేరు చెట్లయొక్క సంయోగమువలన కలిగిన ఫలముల మొక్కలను ప్రత్యేకముగా ఒక చెట్టుయొక్క పువ్వారముచేత పుట్టిన కాయలయొక్క మొలకువ, పెరుకువ మొదలగు విషయము తనిఖీ చేయబడుచున్నవి.

యెరువులు అవివేసే పద్ధతులుకూడా తనిఖీచేయడమగుచున్నది.

కొబ్బరి చెట్లయొక్క గుణములు అనగా ఆకులుపుట్టుట, రాలుట గెలలువేయుట, పిందెలుపుట్టుట, రాలుట మొదలగు వివిధ విషయము లెక్కలు వ్రాసి తనిఖీ చేయు చున్నారు.

ఆయిదు యెకరముల ఫారములో జీడిమామిడి తోటనుగురించి పరిశోధన క్రొత్తగా మొదలుపెట్టబడినది.

కాసరగోడు వ్యవసాయ పరిశోధన స్థానము.—దక్షిణ కన్నడ జిల్లా, కాసరగోడు తాలూకా, కుడ్లు గ్రామమున నున్నది. కాసరగోడు రయిల్వే స్టేషనునకు ఉత్తర మున మూడు మైళ్ల దూరమున నున్నది. మోటారు బస్సులు, జటకాలు స్టేషనుసుండి వచ్చును. సముద్రము ఫారమునకు మూడు ఫర్లాంగుల దూరమున నున్నది.

భూమి యెర్ర యిసుక భూమి నీలేశ్వరము II వ స్థానములోనున్న భూమి మాది రిగ నుండును. దీని సంపూర్ణ విస్తీర్ణము య 30·90 లు, అందులో య 25·90 ములలో తోట వేయబడినది.

1916 వ సంవత్సరమున యీ స్థానము తోటతోకూడ తీసికొనబడినది. అప టికి కొబ్బరి చెట్లకు 20, 25 సంవత్సరముల వయస్సుండెను.

ఈ స్థానము యెప్పుడు, చూడవలయును? ఏమి చూడవలయును?

ఈ స్థానముయొక్క ముఖ్యపంట కొబ్బరి. తదితర పంటలు, పశువుల మేతకు జొన్న, మొక్క జొన్న, వేరుశనగ, రాగి కొద్దిగా సాగు చేయబడును.

జనవరి, ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్.—కొబ్బరి తోటలలో గుంటుక తోలుటయు, కొబ్బరి తోట లేనిచోట నొల్ల వాడుటయు, కొబ్బరి ఆకులతో వెంట తయారుచేయుట యు, కొబ్బరి తయారుచేయుటయు, విత్తనముకొరకు కాయలను ఏరుట చూడవచ్చును.

మే-జూన్.—పరిశోధనచేసెడి మళ్లలో యెరువు వేయుట, తక్కినమళ్లలో బొబ్బర్లు పచ్చి యెరువునకు చల్లుట, వేరుశనగ వేయుట, పశువులకు జొన్న వేయుట, కొబ్బరిచెట్ల తలలు బాగుచేయుట, తోటలలో కాలవలు త్రవ్వుట.

జూలై-ఆగస్టు.—పచ్చియెరువు దున్నుట, యెరువులువేయుట, కాలువలుత్రవ్వుట.

అక్టోబరు-నవంబరు-డిసంబరు.—అక్టోబరు, నవంబరులలో దున్నుటయు, కలుపు లను తీయుటకును, గొప్పుకొరకును గుంటక తోలుటయు జరుగును.

పరిశోధింపబడు అంశములు.—(1) కొబ్బరి చెట్లయొక్క ముఖ్య గుణములను గమనించుట. (2) ఏయే యెరువులు యెంత యెంత వేసినచో, కొబ్బరి చెట్లకు మంచి గుణము చేయునదియు, నిశ్చయించుటకు పలువిధములుగ పరిశ్రమ చేయబడుచున్నది. ఇవి ప్రస్తుతము వాటి గుణములు సూచించుటకు జరుపబడుచున్నవి. ఇంతకన్న నె క్కువగా నీలేశ్వరం తోటలలో జరుపబడును. (3) తోటలలో సాగుచేయుట వలన లాభము ఉన్నదా, లేదా యను విషయము చర్చించుటకు కొన్ని తోటలు దున్నబడు చున్నవి, మరికొన్ని లేక యున్నవి. (4) యెంపు కొబ్బరి యాకులను యెరువుక్రింద మార్చుటకు ప్రయత్నములు చేయబడుచున్నవి. (5) వివిధ పంటలను కొబ్బరి తోట లలో సాగుచేయుటవలన కలుగు లాభనష్టములు పరిశీలించుటయు గమనించెదరు.

ప్రేక్షకులు విచ్చేయ ప్రార్థితులు.

డిమాన్‌స్ట్రేటర్ల డిపోలవద్ద అమ్మబడు వస్తువుల జాబితా.

వరి విత్తనములు—

| | |
|---|---|
| తవలకణ్ణన్ ... ... ... | పౌను 1 కి పై 7 లు. |
| రాజకాయమ ... ... ... | |
| తెల్లబియ్యపు కాయమ ... ... | |
| మొదను ... ... ... | |
| కరుత్త మోదను ... ... ... | |
| తలిపరంబ వరి విత్తనము ... ... | |
| వరంబన్ నవర ... ... ... | |

| | ధర. | | |
|---|---|---|---|
| | గూ. | అ. | పై. |
| జి.ఇ.బి. నె 24 రు పౌను 1 కి ... ... / సిజి నె 3 రు పౌను 1 కి ... ... | 0 | 0 | 9 |

పచ్చి యెరువు విత్తనములు—

| | | | |
|---|---|---|---|
| ఆర్యన్ ... ... ... ... / పాన్నార్యన్ ... ... ... ... / యిరవపాండి ... ... ... ... / వెళ్లారి ... ... ... ... | పౌను ఖరీదు | | |
| | 0 | 0 | 7 |
| కొలింజి పౌను 1 కి ... ... ... | 0 | 0 | 8 |
| విత్తనపు కొబ్బరి కాయలు, వందకు (కాసరగోడులో ఇచ్చుటకు.) | 4 | 0 | 0 |
| కొబ్బరి పురుగును పొడచు ఋల్లు తీగ ఒకటికి ... | 0 | 1 | 3 |
| గ్రామస్తుల పంచాంగములు (ఇంగ్లీషున, కన్నడమున, మళయాళమున) ఒకటి. | 0 | 1 | 0 |
| వ్యవసాయ రాయల్ కమిషను వ్రాసిన రిపోర్టు (క్లుప్తపరచి వ్రాసినది). | 1 | 8 | 0 |
| కూపరు నాగలి నె 25 రు, ఒకటి ... ... | 4 | 8 | 0 |
| పై నాగిలి నక్కు ఒకటి ... ... ... | 0 | 5 | 9 |
| బోట్లు, సట్టు ... ... ... | 0 | 2 | 3 |
| అనాస పిలకలు, నూరు ... ... ... | 2 | 0 | 0 |
| | మొదలు | | |
| | 4 | 0 | 0 |
| | వరకు. | | |

కే. టి. ఆళ్వా,

వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, ఏడవ సర్కిల్, తలిచేరి.

## 2 (h) ఎనిమిదవ సర్కిల్.

కోయంబత్తూరు, సేలం, నీలగిరి జిల్లాలుచేరి 8 వ సర్కిల్ ఆయినది. ఇది ఒక వ్యవసాయపు డిప్యుటీ డైరెక్టరుగారి అధీనమందున్నది. వీరి నివాసస్థానము కోయంబత్తూరు, లాలీ రోడ్డు పోస్టు ఆఫీసు దరినున్న వ్యవసాయపు కళాశాలయందున్నది. వీరి అధీనములో జరుగుచున్న ముఖ్య కృషి విషయములు యీ క్రింద వివరింపబడినవి.

(1) పరిశోధన.—నంజినాడ్ వ్యవసాయపు పరిశోధన స్థానములో ముఖ్యముగా బంగాళాదుంప (ఉర్లగడ్డలు) పంట అభివృద్ధిగురించిన్ని, నీలగిరి జిల్లాలో మిగిలిన వ్యవసాయపు అభివృద్ధులనుగురించిన్ని పరిశోధనలు జరుగుచున్నవి. ఈ పరిశోధనలు ఆ ఫారములో సూపరింటెండెంటుగారి అధీనములో యిద్దరు ఫారము మేనేజర్ల సహాయముతో జరుగుచున్నవి.

(2) ప్రచారము—అభివృద్ధి విషయములుచేసి చూపించుట.—కోయంబత్తూరు, నీలగిరి జిల్లాలలో యీ పని డిప్యుటీ డైరక్టరుగారి ఆధిపత్యమున జరుగుచున్నది. సేలం జిల్లాలో మాత్రము అసిస్టంటు డైరక్టరుగారు, డిప్యూటి డైరక్టరుగారి ఆదర్శకము క్రింద చూచుచున్నారు. సేలం జిల్లాలో హూసూరు తాలూకా, నీలగిరి జిల్లాలో గూడలూరు తాలూకాలకు తప్ప ఈ సర్కిలులో ప్రతి తాలూకాకున్ను ఒక వ్యవసాయపు ప్రచారకుడు కలడు.

(3) కంబోడియా ప్రత్తి నె 2 రు విత్తనము వృద్ధిపరచి, పంచిపెట్టు స్కీములు.—ఈ స్కీము ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీవారి ద్రవ్యసహాయముచేత తిరుపూర్ సహకారపు వర్తక సంఘమువారిద్వారా వ్యవసాయశాఖవారి ఉద్యోగస్థుల సహాయమున డిప్యూటీ డైరక్టరువారి ఆధిపత్యమున జరుగుచున్నది.

(4) లోయర్ బవాని ప్రాజక్టు గురించి జరుగుచున్న వ్యవసాయ సంబంధమయిన దరియాప్తులు.—ఈ పని ఒక అసిస్టెంటు డైరక్టరుగారున్ను, యిద్దరు వ్యవసాయపు ప్రచారకులున్ను పి.డబ్ల్యు.డి. రివిన్యూ శాఖల సహాయమున చేయుచున్నారు.

ప్రచారము.—ఈ క్రింద జాబితాలో వ్యవసాయపు ప్రచారకుల విలాసములు, వారి నివాసస్థలములు తెలుపబడినవి. వ్యవసాయపు భోగట్టాలను విత్తనములు మొదలగునవి కావలిసిన రయితులు వీరి సహాయము తీసుకొనవలయును.

డిప్యూటీ డైరక్టరు ఆఫ్ అగ్రికల్చర్, 8 వ సర్కిలు,
లాలీ రోడ్డు పోస్టు, కోయంబత్తూరు.

| ఉద్యోగుల విలాసములు. | వారు పనిచేయు తాలూకాలు. | పనిచేయు స్థలములు. |
|---|---|---|
| I—డిప్యుటి డైరెక్టరు ఆఫ్ అగ్రికల్చర్, 8 వ సర్కిలు, లాలీ రోడ్డు పోస్టు, కోయంబత్తూరు. | | |
| కోయంబత్తూరు జిల్లా. | | |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, అన్నూర్. | అవనాసి | ... కరియంపాలియం, అన్నూర్, కున్నతూర్, కరవలూర్, అవనాసి, కనూర్, వా వల్లి, మెట్టుపాలియం, అం బోడి, వడుగపాలియం. |

| ఉద్యోగుల విలాసములు. | వారు పనిచేయు తాలూకాలు. | పనిచేయు స్థలములు. |
|---|---|---|
| | కోయంబుత్తూరు జిల్లా—శేషము. | |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ధారాపురం. | ధారాపురం ... | ధారాపురం, కాంగయం, ఉడియూర్, నూరియానలూర్, కుండడు, పొన్నాపురం, ములనూర్, వెల్లకోయిల్, పచ్చపాలయం. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, తిరుచునాపల్లి రోడ, కోయంబత్తూరు. | కోయంబత్తూరు. | పెరియనాయకన్‌పాలెం, ఇడిగరే, తుడియలూర్, తెలుగుపాలెం, తొండాముత్తూరు, అలందొరే, కండెకావండంచలే, సింగంనెల్లూర్, చిట్టిపాలయం, శ్రవణంపట్టి. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ఈరోడ్డు. | ఈరోడ్డు, భవానీ. | ఈరోడ్ తాలూకా, కొడుముడి, ఉంజలూర్, పానూర్, మొదకురిచి, ఈరోడ్డు, పెరుందరె, అరచలూర్, ఉత్తుకులి; బవాని తాలూకా—అత్తని, అందియూర్, తిరుప్పూర్, అమ్మపెట్టే, కవుందపాడి, బవానీ, కురిచి, పెరియ పులియూర్. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, గోపిచెట్టిపాలియం. | గోపిచెట్టిపాలియం. | గోపిచెట్టిపాలియం, కుగలూర్, పెరుంతలయూర్, శిరువలూర్, కొంగరపాలియం, కళ్లిపట్టి, సత్యమంగలం, ఆలుక్కులి, నల్లైగౌండన్‌పాలియం, కశిపాలియం. |
| అసిస్టాంటు అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, కొళ్లైగాల్. | కొళ్లైగాల్ ... | కొళ్లైగాల్, తెరంపల్లి, సత్తిగాల్, బస్తీపురం, కమకరే, పళయం, కుందూర్, హనూర్. |
| అసిస్టాంటు అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, పల్లడం. | పల్లడం ... | పల్లడం, నూలూర్, యిలవంతి, వదుగపాలియం, కేశనూర్, పులియంపట్టి, పల్లపాలియం, సోమనూర్, శరడివావి, పొంగలూరు. |

| ఉద్యోగుల విలాసములు. | వారుపనిచేయ తాలూకాలు. | పనిచేయు స్థలములు. |
|---|---|---|
| | **కోయంబుత్తూరు జిల్లా—శేషము.** | |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, పొల్లాచి. | పొల్లాచి ... | పొల్లాచి, బి. ఇ. కొత్తూరు ప యాండిపట్నం, తొండా ముత్తూరు, గోపంగళం పొదూర్, నెగమాం, కినత్తు కిడవు, కోవిల్‌పాళయం, వడక్కిపాళయం, శిర నల్లూరు, ఆనమలే. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, తిరుప్పూర్. | తిరుప్పూర్, కంబో డియా ప్రత్తి పని. | పెరుమనల్లూర్, యిట్టివిరంపాళి యం, తిరుప్పూర్. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ఉడమలపేట. | ఉడమలపేట ... | ఉడమలపేట, కొమరలింగం, కర తోలువు, అండియూర్, కల్లిపాలియం, పెద్ద పుంపట్టి రామచంద్రపురం, వలవాడి, కుమారపాలియం. |
| | **నీలగిరి జిల్లా.** | |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, కూనూర్. | కూనూర్ ... | ... |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ఉదకమండలం. | ఉదకమండలం ... | ... |

## II. అసిస్టాంటు డైరక్టరు ఆఫ్ అగ్రికల్చర్ సేలం.

| | **సేలం జిల్లా.** | |
|---|---|---|
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, అత్తూరు. | అత్తూరు ... | అత్తూరు, కట్టుకొట్టై, తిడ పూర్, మల్లియాకరై, ఉళి పురం, పెద్ద నాయకప్పా ళెం, కుతపూర్, కొత్త వాడి. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ధర్మపురి. | ధర్మపురి సబ్-సర్కిలు. | అడమన్‌కోట్టై, పెన్నాగరం, పాలకోడ్, తిరుమలవాడి, కరిమంగళం, ధర్మపురి, పాపరపత్తి, ఇండూర్. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, హొసూర్. | హొసూర్ సబ్-సర్కిలు. | మాతిగిరి, కెలమంగలం, బా లూర్, బెరిగై, ముదుకొంగ పల్లి, తల్లి, సూలగిరి, శే శనకొట్టు. |

| ఉద్యోగుల విలాసములు. | వారుపనిచేయు తాలూకాలు. | పనిచేయు స్థలము. |
|---|---|---|
| | నేలం జిల్లా—శేషము. | |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, కృష్ణగిరి. | కృష్ణగిరి సబ్-సర్కిలు. | కృష్ణగిరి, బార్‌గూర్, వరత్తనపల్లి, జగదేవిపాలియం, కావేరిపట్నం, పయ్యూరు, కుడుంబపల్లి. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, నమక్కాల్. | నమక్కాల్ సబ్-సర్కిలు. | నమక్కాల్, ఎరుమైపట్టి, ముతుగపట్టి, లద్దివడి, పరమత్తి, వేలూరు, మోహనూరు, కాలప్ప నాయకన్‌పట్టి. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, ఓమలూర్. | ఓమలూర్ సబ్-సర్కిలు. | ఓమలూర్, నడువపట్టి, కదయంపట్టి, పూసరిపట్టి, మేచేరి, పగలపట్టి, కరుప్పూర్, వీరమంగళం. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, రాసిపురం. | రాసిపురం సబ్-సర్కిలు. | రాసిపురం, పుదుపత్తి, వెణ్ణాలపత్తి, ఆయిపాలియం, ముంచవడి, తాత అయ్యంగార్‌పత్తి ఆలవాపత్తి, పోన్‌కురిచి. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, శేలం. | నేలం సబ్-సర్కిలు. | నేలం, శూరమంగళం, మల్లూర్, వీరపాండి, అయోధ్యాపట్నం, కరిపత్తి, కన్నంకురిచి, సోదాపురం. |
| అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు, తిరుచెంకగోడు. | తిరుచెంకగోడు, సబ్-సర్కిలు. | తిరుచెంకగోడు, మాలసముద్రం (తూర్పు), వైకుంఠం, మంగళం, ఈదపాడి, ఎమపల్లి, కరువేప్పంపత్తి, ఉంజనేరిమిట్ట. |

పైని ఉదహరించిన ఆఫీసర్లకు ముఖ్యపని యేమనగా, వ్యవసాయపు పద్ధతులలో క్రొత్తగా కనిపెట్టబడినమంచి విధానములు రైతులకు బోధపరచుటయు, చేసి చూపించుటయు, ప్రదర్శనములు చూపించుటయు, ఉపన్యాసము లిచ్చుటయు, డిపార్టుమెంటువారు ప్రచురించిన ప్రచురణలు, పంచి పెట్టుటయు, మొదలగునవి. ఆమంచి వ్యవసాయపు పద్ధతులేమనగా.—

(1) ఇనుపనాగళ్లు, గొర్రులు, గుంటకలు మొదలగు వానిని నుపయోగించి నేలను బాగుగా సాగుచేయుట.

(2) భూమిలోని పదును పోకుండాలోతుగాదున్నుట, మెరక పల్లములు సరి చేయుట, అవసరమయినచోట్ల వర్షమునీరు భూమిలో ఇంకుటకు గట్లువేయుట.

(3) కూలిపని తగ్గించు, పనిముట్లలో పనిచేయుట అనగా దున్నుట, విత్తనమును జల్లుట. ఎడశేద్యముచేయుట మొదలగు పనులకు ఖర్చు తక్కువయ్యే మార్గములు చూపించుట.

(4) పశువులగెత్తము ఎక్కువగా కూడబెట్టి గోతులలో నిలవచేయుట, పచ్చి ఎరువుకు పనికివచ్చు పంటలను పెంచుట, ప్రస్తుతములో చాలని పశువుల పెంటతోపాటు సాధారణముగా దొరకు చెత్తచెదారములు కుళ్లపెట్టి మంచిగెత్తమును తయారు చేయుట.

(5) ముఖ్యమయిన పంటలకు, స్థూలపు తెరువులతోపాటు, సూక్ష్మపు తెరువులు తగురీతిని, తక్కువ ఖరీదుకు ఎక్కువలాభముండునట్లు వేయుట.

(6) వరి, జొన్న, బోడి, ప్రత్తి, చెరుకు, వేరుశనగ, మొదలగుపంటలలో మంచివంగడములను పంచిపెట్టుట.

(7) పశువుల అభివృద్ధికిగాను ఆంబోతును పెంపించుట, పశువులకు యుక్తమైన డాణా పెట్టించునట్లు రైతులను ప్రోత్సాహము చేయుట, మాగుడుగడ్డి వగయిరాలను తయారుచేయుట.

(8) వ్యవసాయపు దినుసులు రైతులకు లాభకరములుగా అమ్ముటగురించి మంచిపద్ధతులు కనిపెట్టుట.

(9) బూజు తెగుళ్లను, పురుగులవల్ల వచ్చుబాధలను నివారించు మార్గములను తెలుపుట.

ఈ పై నుదహరించిన సంగతులు క్రొత్త స్థలములలో వ్యవసాయభివృద్ధి పరచలి సంఘములు స్థాపించి, వాటిసహాయమువల్లనున్ను, రయితుల సహాయమువల్లనున్ను ప్రబలముచేయబడుచున్నవి. క్రొత్త సంగతులు మొదట చెప్పునప్పుడు, అవి చిన్న చిన్న రయితులమళ్లలో గవర్నమెంటువారి డబ్బుతో తనిఖీచేయబడుచున్నవి. రయితునకు లాభకరమగు స్థిరమైనమంచి అభివృద్ధిపనులు రయితుల మళ్లలోవారి ఖర్చులతో వారికి ఆదర్శన రూపకముగా చూపింతురు. ఇట్లు చూపించిన క్రొత్త విషయములను చాలామంది రయితులు అవలంభించేటట్లు బోధనచేయుదురు. ఇప్పటికి చాలామంది యీ అభివృద్ధి విషయములు అవలంభించుచున్నారు. కాని యింకనూ అందరునూ అవలంభించుటకు అవకాశమున్నది !

## ఇంతవరకు అభివృద్ధికాంచిన ముఖ్య విషయములు.

పనిముట్లు :—కొన్ని సంవత్సరముల క్రిందట మేలయిన పనిముట్లు, ధరలు హెచ్చుగా ఉండుటచేత, సాధారణ రయితులు కొనుక్కొనుటకు అవకాశము లేకుండెను కాని యీ పనిముట్లు హిందూదేశములో తక్కువధరలకు ప్రతి రయితునకు కొన వీలుగనుండునట్లున్ను వివిధ పరిస్థితుల కుపయోగించునట్లు వివిధ రకములు పనిముట్లు తయారుచేయబడుచున్నది. 1934-35 వ సంవత్సరంలో వివిధ పనిముట్లు యొక్క పని 2495 సార్లు చూపించబడినది. అందువలన 462 పనిముట్లు ముఖ్యముగా నాగళ్లన్ను, వాటియొక్క నక్కులు 1035 న్ను అమ్మడమయినది.

నక్కలయొక్క అమ్మకము, ఎంతవరకు యీ నాగళ్లు ఉపయోగించుచున్నారో తెలియచేయును. తక్కావి, అప్పులు సులభముగా యిచ్చుటవల్ల యీ నాగళ్లు మీద రయితులుకూడ కొనగోరుచున్నారు. 1934-35 సంవత్సరంలో 143 రయితులకు రూ 1,598 లు అప్పులు యీయడమయినది.

ఎరువులు.—1934-35 వ సంవత్సరములో పశువులగెత్తము తగురీతిని భద్రపరచుట, చెత్తచెదారములు కుళ్లపెట్టి గెత్తముచేయుట మొదలగు విషయములు గూర్చి ప్రచారణచేయుటవలన 1,064 ఎరువు గోతులు రయితులచే తయారుచేయబడినవి. పచ్చిఎరువు పంటలను వేయుట చాలా అభివృద్ధి అగుచున్నది. కాని చాలా మంది రయితులు పచ్చి ఎరువు విత్తనములకు, డిపార్టుమెంటు మీదనే ఆధారపడి ఉన్నారు. 1934-35 సంవత్సరంలో 14,319 పౌన్లు పంచిపెట్టబడినవి, సూత్ష్మపు యెరువులుకూడ చాలనెక్కువగా ఉపయోగించుచున్నారు. అవి కంపినీలే విక్రయించుచున్నారు. డిపార్టుమెంటువారు యీ విషయములో వివిధపంటలకు తగు విధముగా యీ ఎరువులు కలిసి వుపయోగించుట బోధ పర్చుచున్నారు. ఈ మిశ్రపు యెరువులు సహకార సంఘముల ద్వారా పంచిపెట్టించుచున్నారు. ముఖ్యముగా నీలగిరిలో 1934-35 సంవత్సరములో 721,948 పౌనులు సప్లయి చేయించడమయినది.

పంటలు.—గతసంవత్సరములో, ముఖ్యముగా, వరి, ప్రత్తి పంటలలో మంచి రకముల విత్తనములను పంచిపెట్టుట ముఖ్యపనియయివుండెడిది. ఆ విత్తనములు చాల మట్టుకు వీస్తరించెను.

కంబోడియా ప్రత్తిపంటకు కోయంబత్తూరు జిల్లా అగ్రస్థానమని చెప్పవచ్చును. ఈ ప్రత్తి తిరువూరు మార్కెట్టులో గొప్ప ప్రఖ్యాతిగాంచియున్నది. ఇటీవల యీ జిల్లాలో బట్టల మిల్లులుకూడ హెచ్చగుచున్నవి. అందువలన యీ పంట అభివృద్ధి విషయమై డిపార్టుమెంటువారు ఎక్కువ శ్రద్ధ తీసుకొనుచున్నారు.

సి ఓ. 2. అనే రఖము కంబోడియా పత్తిలో ఘనమైన రఖము. కల్తీలేని విత్తనము రానురాను ప్రతి సంవత్సరము హెచ్చుగా కోరబడుచున్నది. వర్తకులు నమ్మకమయిన మంచి విత్తనములు సప్లయి చేయలేక పోవుటచే డిపార్టుమెంటువారు ఒక అసిస్టేంటు డైరెక్టరునున్ను, ఏడుగురు డిమాన్‌స్ట్రేటర్లునున్ను అవనాసి, పల్లడం తాలూకాలలోయున్న విత్తనపు శేరీ (Seed farm) లలో మంచి విత్తనములు తయారుచేయుటకు వుంచినారు. ఈ విత్తనపు శేరీ (Seed farm) లోభాగము, పైభాగము అను రెండు భాగములుగా చేయబడినది. లోభాగము 1,000 ఎకరములున్ను, వ్యవసాయపు డిపార్టుమెంటువారి ఆధిపత్యముక్రిందనే పనిచేయబడుచుండును. పై భాగము 6,000 ఎకరములకు పైగా వుండును. లో భాగము యీ పైభాగమునకు చాలినంత విత్తనము నిచ్చుచుండును. ఈ పైభాగమునకు ఇండియన్ సెంట్రల్ కాటన్ కమిటీ వారు కొంత ద్రవ్యసహాయమును చేయుచుందురు. ఈ భాగము తిరుప్పూర్ కోఆపరేటివు ట్రేడింగు సొసయిటిద్వారా డిపార్టుమెంటల్ ఉద్యోగస్తులే చేయించుచుందురు. ఈ శేరీయొక్క ముఖ్యోద్దేశము కల్తీలేని C.O. 2 కంబోడియా ప్రత్తి విత్తనమును కోయంబత్తూరు జిల్లా అంతటను వ్యాపింపజేయుట. ఈ స్కీముయొక్క లాభమును చాలామంది ఎక్కువగా శ్లాఘించుచున్నారు. ప్రతివారును యీ జిల్లాలో యీ వరి

మిలా సంవత్సరములలో కంబోడియా ప్రత్తియొక్క మంచిగుణములు పెంపొందినవని ఒప్పుకొనుచున్నారు. 1934-35 వ సంవత్సరంలో యీ డిపార్టుమెంటువారున్ను, తిరుప్పూరు కాటన్ ట్రేడింగు సొసయిటీయున్ను మొత్తముమీద 1,069,439 పౌనుల కల్తీలేని C.O. 2 ప్రత్తి విత్తనము పంచిపెట్టడమయినది. అయినను రయితులకు కావలసినంత విత్తనము అందినదికాదు.

ఈ డిపార్టుమెంటువారు ఉడమల్‌పేట తాలూకాలో సి-7 అను మంచి రకము కరుంగని ప్రత్తి విత్తనము తయారుచేయుటకు 800 ఎకరములలో కరుంగని ప్రత్తిని సీడ్ ఫారంలుపెట్టి, ఆ విత్తనము వర్షాధారమువల్ల ప్రత్తి పండించే ప్రదేశములకుయిచ్చుచున్నారు. 95,802 పౌనుల సి-7 కరుంగణి ప్రత్తి విత్తనములు 1934-35 వ సంవత్సరములో పంచిపెట్టబడినది.

కోయంబత్తూర్ ప్రత్తి ఉత్పత్తి స్థానములో కొత్త రకములు కంబోడియా, కరుంగణి, ఉప్పం ప్రత్తి రకములు ఈ జిల్లాలో తనిఖీచేయడమగుచున్నది.

చెరుకు.—రానురాను మన దేశములో పంచదార ఎక్కువగా తయారుచేయుటయందు ఆశక్తి కలుగుచున్నది. ఈ సర్కిలులో కోయంబతూరు, సేలం జిల్లాలలో చెరుకు అభివృద్ధికి ఎక్కువ అవకాశములున్నవి. ముఖ్యముగా కోయంబత్తూరు జిల్లాలో చెరుకు రెండుసారులు వేయుదురు. 1934 వ సంవత్సరంలో ఒక పంచదార మిల్లు ఒకటి స్థాపించబడినది. కోయంబత్తూరు జిల్లాలో చెరుకువేసే రయితుల పరపతి సంఘము ఒకటి చెరుకు వ్యవసాయములో అభివృద్ధి మార్గములు పరిశోధించి తెలియజేయుటకు స్థాపించబడినది. కోయంబత్తూరు చెరుకు పరిశోధన స్థానములో తయారుచేయబడిన కొత్త చెరుకు రకములు యీ జిల్లాలో లాభకరముగా ప్రవేశపెట్టబడినవి. ఈ చెరుకు రకములు రెండువిధములు. సన్నరకములు, ఉరవ రకములు. సన్న రకములు ఎక్కువ గట్టిగనుండి, నీరు తక్కువగాయుండు ప్రదేశములలోను యిదివరకు చెరుకు వ్యవసాయమునకు పనికిరావు అనుకొనిన ప్రదేశములలోను పండించుటకు వీలగుచున్నవి. 1934-35 వ సంవత్సరంలో యీ డిపార్టుమెంటువారు 246,669 ముచ్చెలను పంచిపెట్టిరి. సన్నరకములలో C.O. 213 సి.ఓ. 290 ఉరవ రకములలో W.P.O. 417 సి.ఓ. 419 ఎక్కువ లాభకరములుగానుండునట్లు తెలుసుకొనబడినవి. కొత్తగా స్థాపించబడిన చెరుకువేశే రయితుల పరపతి సంఘముద్వారా యీ రకముల నభివృద్ధిపరచి ఎక్కువ రయితులు యీ రకములు వేసేటట్టు ప్రయత్నములు చేయబడుచున్నవి.

వరి.—17 పెద్ద పంట రకములును, ఆరు రెండవ పంట వరిరకములును, మొత్తము 28,305 పౌనులు విత్తనములు 1934-35 వ సంవత్సరంలో డిపార్టుమెంటువారిద్వారా పంచిపెట్టబడినవి. ఈ రకములు జి.ఇ.బి. 24, సి.ఓ. 1, సి.ఓ. 3, సి.ఓ. 5 ముఖ్యముగా రయితులచే కొనియాడబడి వేరువేరు పేర్లతో పిలువబడి ఎక్కువ విస్తీర్ణములో పెట్టబడియున్నవి. ఈ రకములు రయితులలో నొకరివద్దనుండి మరియొకరికి తమంతటతామే వ్యాప్తిచేయుటచే యీ రకములక్రింద 1934-35 వ సంవత్సరంలో 28,877 ఎకరములున్నట్లు లెక్కించబడినది.

కోయంబత్తూరు చిరుధాన్యోత్పత్తిస్థానమున తయారుచేయబడిన ఇ.సి. 593 చోడి రకము రయితుల చోడిరకములకన్న ఎక్కువ పంట నిచ్చుచున్నదని పేరు పొందినది. 1934-35 వ సంవత్సరంలో సేలం జిల్లాలో 2,216 పౌనులు యీ చోడి

విత్తనములు పంచిపెట్టబడినవి. ఈ జిల్లాలోనే 1 హెచ్. 22 అను మైసూరు రఖము చోడికూడా చాలా ఎక్కువగా ప్రబలి 7,000 ఎకరములలో ముఖ్యముగా వర్షాధారమువల్ల పండే భూములలో నున్నది.

జొన్న-గంటె-సామలు-గోధుములు మొదలయినవాటిలో క్రొత్తరఖములు వాటియొక్క మంచిచెడ్డలు కనుక్కొనుటకు తనిఖీ చేయబడుచున్నవి.

బంగాళాదుంపలు (ఉర్లగడ్డలు).

నీలగిరి జిల్లాలో రయితులకు యిది ముఖ్యమయిన పంట. ఈ డిపార్టుమెంటువారు తెగుళ్లులేని ఎక్కువ పంటయిచ్చెడి విత్తనమును తయారుచేసి కూనూరు, ఉదక మండలములోని వున్న శీడ్ ఫారములద్వారా పంచిపెట్టుచున్నారు. ప్రస్తుతములో గ్రేట్ స్కాట్ అను రఖము ఎక్కువ ప్రీతిగాయున్నది. రోయల్ కిడ్నీ, బెక్రు షాన్ అను రఖములు ఒకమాదిరిగానున్నవి. 980 మణుగుల విత్తనకును శీడ్ ఫారంలో వేయుటకు యీయబడి 64,694 పౌనుల విత్తనము 1934-35 సంవత్సరములో రైతులకు పంచిపెట్టబడినది.

చమురుగింజలు (Oil seeds).—వేరుశనగ యీ సర్కిలులో ముఖ్యమయిన చమురుగింజల పంట. ఈ పంటలో ఏ-1125 అనే క్రొత్త రకము అనేకచోట్లపెట్టి తనిఖీచేయబడుచున్నది.

పశువులు.—1934-35 వ సంవత్సరంవరకు మంచి రకముల ఆంబోతులను, తగిన స్థలములలో యుంచినమొడల గవర్నమెంటువారు ఆ ఆంబోతుల సంరక్షణకొరకు కొంతమదుపు (Premium) యిచ్చెడివారు. డిపార్టుమెంటువారు లోకల్ బోర్డులకు గవర్నమెంటు ఇనిస్టిట్యూషన్లకు యిచ్చిన 7 ఆంబోతులుగాక 20 ప్రిమియములు యిచ్చుచున్న ఆబోతులు పశువుల అభివృద్ధికొరకు యీ జిల్లాలో వుంచినారు. ఇప్పుడు కూడా మంచి ఆంబోతులను పెంచువారికి ప్రిమియము యిచ్చుచున్నారు. 1935-36 వ సంవత్సరంనుండి యిట్లుగాక కోయంబత్తూరు జిల్లా బోర్డువారిద్వారా గవర్నమెంటువారు నమ్మకమయినవారికి మంచి ఆంబోతులను పశువుల అభివృద్ధికొరకు సప్లయి చేయుచున్నారు. ఇట్లు యిచ్చిన ఆంబోతులు రెండు సంవత్సరములు సరిగా పనిచేసిన మొడల పెంచినవారి అధీనమగును. గవర్నమెంటువారున్ను, జిల్లా బోర్డువారున్ను ఖర్చుపెట్టిన డబ్బువల్ల తక్కువకాలములో ఎక్కువ ఆబోతులను సప్లయిచేయుటకు వీలై, వాటివలన కొద్దికాలములోనే మంచి రకముల దూడలు అభివృద్ధిచెందుటకు అవకాశము వున్నవి. వెటర్నరీ డిపార్టుమెంటువారి సహాయమువల్ల పల్లెటూర్లలోనుండు తక్కువ జాతి కోడెలకు సులభముగా అపాయములేకుండ బర్డీజోన్ యిమాస్కులేటరువలన విచ్చలు తీయబడుచున్నవి.

ఇతర విషయములు.—ఈ పైన చెప్పబడ్డ అంశములుగాక వ్యవసాయపు ఉద్యోగస్తులు వ్యవసాయపు పనిముట్లుకూడ సప్లయి చేయగలుగుదురు. కొన్ని వారివద్ద డిపోలలో దొరకును. మిగిలినవి పైనుంచి తెప్పించియిచ్చెదరు. ఈ సర్కిలు డిపోలలో సాధారణముగా దొరకు వస్తువులు జాపితా యీ క్రింద వ్రాయబడినది. వ్యవసాయ డిపార్టుమెంటు ఉద్యోగస్తులు ప్రజోపకారముకొరకు నియమింపబడియున్నారు. ముఖ్యము రయితుల సహాయముకే నియమింపబడినారు. అందువల్ల రయితులు వీరి సహాయము ఎల్లప్పుడును తీసికొనవలయును.

పశువైద్య శాఖ.—కోయంబత్తూరులోను, సేలంలోను జిల్లా వెటర్నరీ ఆఫీసర్లు వున్నారు. వీరిక్రింద అనేక అసిస్టాంటు పశువుల డాక్టర్లున్ను, టూరింగు డాక్టర్లున్ను గలరు. వీరి జాబితా ఈ కేలండరులో చివర గలదు. పశువుల జబ్బులనుగురించి యీ ఉద్యోగస్తుల సలహాలను తీసుకొనవలయును.

సహకార శాఖ.—సహకార పరపతి సంఘముల తాలూకు డిప్యూటీ రిజిస్ట్రారుకు కోయంబత్తూరు నివాసస్థానమయియున్నది. కోయంబుతూరు, నీలగిరి జిల్లాలు వారి అధికారముక్రింద నున్నవి. సేలం జిల్లాకు వేరు డిప్యూటి రిజిస్ట్రారు యున్నారు.

పారిశ్రామిక శాఖ.—ఒక అసిస్టెంటు యిండిస్ట్రీయలు యింజనీరుగారు కోయంబత్తూరులోనున్నారు. వీరు సేలం, కోయంబత్తూరు, నీలగిరి, మలబారు, దక్షిణకన్నడం, ఉత్తర ఆర్కాడు, చిత్తూరు, కడప, అనంతపురం జిల్లాలలోని పనుల జూచుచుందురు.

ఎనిమిదవ సర్కిలులోయున్న డిపోలులో దొరుకు వస్తువులువాని ధరలు.—

పనిముట్లు.—ప్రతి వ్యవసాయపు డిమాన్‌స్ట్రేటరువద్దను, రైతులకు అమ్మకమునకై యీ క్రింద పనిముట్లను నిలువచేయబడును:—

| వస్తువులయొక్క పేరు. | | ధర. | | |
|---|---|---|---|---|
| | | రూ. | అ. | పై. |
| మెష్టను నాగలి నె 11 రు క్రొత్త రకం ... | ... | 7 | 0 | 0 |
| డిటో షేరు మాత్రం ... | ... | 0 | 8 | 6 |
| డిటో నె 25 రు ... | ... | 4 | 8 | 0 |
| డిటో నె 25 రు షేరు మాత్రం ... | | 0 | 5 | 9 |
| డిటో నె 26 రు ఒకమేడిది ... | ... | 8 | 12 | 0 |
| డిటో నె 26 రు నక్కుతోచేరిన షేరు 1 కి... | | 1 | 2 | 3 |
| నక్కు మాత్రం ... | ... | 0 | 3 | 6 |
| హెచ్.ఎమ్. గుంటక నె 0 రు ... | ... | 4 | 2 | 0 |
| డిటో 6 అంగుళములు తిన్నని పలుగు | ... | 1 | 5 | 0 |
| హెచ్. ఎమ్. గుంటక నె 1 రు ... | ... | 7 | 2 | 0 |
| డిటో 15 అంగుళముల వంకర పలుగు | ... | 2 | 9 | 0 |
| డిటో గుంటక నె 2 రు ... | ... | 13 | 8 | 0 |
| డిటో డిటో 24 అంగుళముల వంకర పలుగు. | | 3 | 10 | 0 |

రైతులు యింతకు పూర్వము తెప్పించుకొన్న నాగళ్లకుకూడా యేవైన వలయుచో వ్యవసాయ డిమాన్‌స్ట్రేటర్లు తెప్పించి యిచ్చెదరు.

సేలం జిల్లా.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9″ తిన్నని పలుగు ... | ... | ... | 1 | 14 | 0 |
| 12″ డిటో డిటో ... | ... | ... | 2 | 2 | 0 |
| 12″ వంకర డిటో ... | ... | ... | 2 | 4 | 0 |

| వస్తువులయొక్క పేరు. | ధర. | | |
|---|---|---|---|
| | రూ. | అ. | పై. |
| 18" తిన్నని పలుగు ... ... ... | 3 | 0 | 0 |
| 36" డిటో డిటో ... ... ... | 5 | 5 | 0 |
| 48" డిటో డిటో ... ... ... | 5 | 13 | 0 |

విత్తనములు.—ఈ క్రింద చూపబడి విత్తనములు డిపోలలో, అవి వేయుకాలము లలో దొరకును. వాటి ధరలు అడిగి తెలుసుకొనవచ్చును.

వరి.—జి.యి.బి. 24, Co. 1 to Co. 11, అడుతురై నె 3, 4, 5, 11 ర్లు.

జొన్న.—పెరియ మజల్, తెల్ల జొన్న, కొత్త రకములు.

చోడి.—యి.సి. 593, ఎచ్. 22 (సేలం జిల్లాకు మాత్రం).

పత్తి.—Co. 2, కంబోడియా, Co. 7, కరుకాగన్ని.

వేరుశనగ.—ఎ.హెచ్. 25.

పచ్చిరొట్ట విత్తనములు—జీలుగ, వెంపలి, జనుము, నీలి, పిల్లి పెసర,

ఉర్లగడ్డలు.—డిపోలు "నీల్‌గిరీస్"లో మాత్రమేయున్నవి.

ప్రచురణలు.—గ్రామస్థుల పంచాంగములు తదితర డిపార్టుమెంటు ప్రచురణలు వాటిమీద వ్యవహరించిన ధరలకు దొరుకును. (యీ క్యాలండరు చివర వాటి లిస్టు యున్నది.)

## (బి) పరిశోధన.

వ్యవసాయ కళాశాలకుచేరి సెంట్రల్ ఫారము అను పేరుగల ఒక పెద్ద వ్యవసాయ పరిశోధన స్థానముకలదు. ఇచ్చట వరి, జొన్న, చెఱకు, ప్రత్తి పైరులను వృద్ధి చేయుటకుగాను వేరు వేరు శాఖలున్నవి. ఈ శాఖలు ఆయా పైరులలో ఆరితేరిన ఒక్కొక్క సర్కారు ఉద్యోగస్థుని క్రిందయున్నవి. ఈ షైరీలు కోయంబత్తూరునకు పశ్చిమమున సుమారు మూడు మైళ్ళ దూరమునందున్నవి. ఆయా సస్యములలో హెచ్చు పంటు నిచ్చురకములను, రోగములంటుని రకములను తయారుచేయుటకుగాను, అభివృద్ధికరములగు వ్యవసాయపు పద్దతులను పరిశోధనలుచేసి కనుకొనుటకును, పశువుల నభివృద్ధి చేయుటకును ప్రయత్నములు జరుగుచున్నవి.

ప్రేక్షకులు ఎల్లప్పుడును రావచ్చును.

## సెంట్రలు ఫారం కోయంబత్తూరు.

ఈ ఫారం సుమారు 400 ఎకరముల విస్తీర్ణముగలది. అందు అనేక రకముల నేల లుగలవు. నల్లరేవడి, ఎఱువు, మిశ్రమరేవడి సొట్టు నేలలు, తోట భూములు, దంప నేలలు, నొయ్యల్-యేటినుండి కాలువగుండ చెరువుకు వచ్చు నీటివలన పల్లపుభూమి సాగగుచున్నది.

ఈ ప్రకారముగా అనేక విధములైన పరిస్థితులు ఆ ఫారం కనబరుచుచున్నది. సంవత్సరపు పొడవున ఏదో యొక పైరు నేలమీద కనబడుచునేయుండును. అందుచే

విద్యార్థులకును, పైరులలో ఆరితేరిన సర్కారు ఉద్యోగస్థులకును, నేర్చుకొనుటకును, పని చేయుటకును కావలసినంత అవకాశముగలదు—

(1) ఫారం ఆఫీసు ఆవరణలో పశువులను కట్టు వివిధ పద్ధతులు, ఎరువుభద్రపరచు మాదిరులు కాననగును.

(2) పనిముట్లు ప్రదర్శనస్థాన మొకటి కలదు. అందు మనరాజధానిలోని ఆయా జిల్లాలలోని వ్యవసాయపు పరిస్థితుల కనువగు పనిముట్లు కాననగును.

(3) చొప్పకత్తెర, ప్రత్తిరాట్నము, నూర్పిడి యంత్రము ఎగరపోత యంత్రము, గానుగపిండి గుండచేయు యంత్రము మొదలగునవిగూడ గలవు.

(4) నానావిధముల ఆయిల్ యింజనులు నూతులవద్ద అమర్చబడియున్నవి, అవిగాక మోటలుగూడ నీరు తోడుటకు నుపయోగింపబడుచున్నవి. ఇవి రెండును ఇతర నీరుతోడు యంత్రములతో తైపారు వేయుటకు నుపయోగించుచున్నవి. వీనిలో ఒక పంపింగు ప్లాంటు కాలేజి హాస్టేటులో నివసించు 1,200 జనులకు కావలసినంత నీటి వసతి కలుగజేయుచున్నది. ఆ నీరు సున్నపు గచ్చుతో యెత్తుగా కట్టబడిన ఒక తొట్టిలో నిల్వ జేయబడుచున్నది. అది పరిశోధక నిలయమునకు దక్షిణ భాగమందున్నది.

(5) ఫారములో చూడదగిన ముఖ్యమైన పైరులు.—జొన్న, చోడి, ప్రత్తి, అరటి, చెరుకు, వరి, పచ్చి మేత పైరులు, పచ్చి రొట్ట ఎరువు పైరులు అయియున్నవి. ప్రతి సంవత్సరము ప్రతి పంటలోను అనేక రకములు పైరుచేయుచున్నారు. ఫలవృక్ష వ్యవసాయమును, కూరకాయల వ్యవసాయమును అనుకూలముగ జరుగుచున్నవి.

## ప్రచారమువల్ల జరుగు పనుల స్వభావము.

విత్తనములు పంచిపెట్టుట.—పంటలోనుంచి యెంచి అభివృద్ధి చేయబడిన వంగడములు, అధికముచేసి రైతులకు పంచుచున్నారు.

వరి.—జి.యి.బి. 24, కోయంబత్తూరు నె 1, 3, 2, 6, 7, 8 ర్లు, ఆడుతురై 11.

చోడి.—ఇ.సి. నె 593 రు.

చెరుకు.—జావ నె 247 రు, సి.ఒ. నె 213 రు, పి.ఒ.జె. నె 2878 రు, సి.ఒ. నె 281, 285, 290 ర్లు.

ప్రత్తి Co. కంబోడియ.— నె 2,1742, 1267, 920 ర్లు, కరుంగన్ని—నె 7, 546 ర్లు.

పెరియమంజల్ జొన్న.—ఎ.యస్. నె 29, 1098 ర్లు.

## నానావిధములైన విత్తనములు.

పచ్చిరొట్ట పైరులగు జనుము, పిల్లి పెసర విత్తనములు అమ్మబడుచున్నవి. అనేక రకములైన అరటి పిలకలు అనేక జిల్లాలనుండి తేబడి, యీ సంవత్సరము వేయబడినవి. వాటియొక్క తారతమ్యములు కనిపెట్టబడి, లాభకరమైనవి వృద్ధిచేయబడును. ఫలములు, కూరగాయలుపండించుటవల్ల గలుగు లాభములు కాలీఫ్లవరు, కాబేజి, టమాటో, అత్తి పండు పంటలవల్ల ప్రదర్శింపబడుచున్నవి.

6. డక్కని సంకరజాతి పశువుల మంద యొకటి గలదు.—ఆవులు, ఆంబోతులు, దూడలు, అందుతో నవీన పద్ధతుల ననుసరించిన డెయిరీయును గలవు. అందులో విశేషముగా పాలనుండి విద్యార్థులచే వెన్న చేయబడి, అందువల్ల నవీనమైన పరిశుభ్రమగు పద్ధతులు తెలుసుకొనబడుచున్నవి. దీనితో ఇట్లు కోళ్ళ పరిశ్రమకూడ ఒక భాగముగా జరుపబడుచున్నది.

7. విద్య గరపుటకుగాను యొక పశువులయాసుపత్రిగలదు. అందు సర్కారు ఆవులను, యెద్దులనుగాక యితరుల పశువులనుకూడ చికిత్స చేయబడును.

8. సంవత్సరముల తరబడి పెరిగెడి పచ్చమేత పైరుల సాగు ముఖ్యమైన విషయము. గిన్నిగడ్డి, ఏనుగ గడ్డి, లూసర్ వీనిని సంవత్సరపు పొడవునను పెంచుదురు. జొన్న, మొక్కజొన్న యివి పాడియావుల మేత నిమిత్తము క్రమముగా అప్పుడప్పుడు పండించుపోదురు.

9. సైలేజి రూపకముగా పలువిధములగు పచ్చి మేతలను నిలువజేయుట యిందు ముఖ్య విషయము. మిగిలిపోయిన పచ్చిమేతయును, తినదగిన యితరకసువును యీ విధముగా నిల్వ చేయబడుచున్నవి.

10. పనికిరాని వస్తువులను అనగా చెత్త చెదారములను యెరువుగా మార్చుట, మామూలుగా ఫారంనందు జరుగుచున్నది.

11. మనుష్యుల మలమును ఉపయోగకరముగాజేయు "యాక్టివేటెడ్‌స్లడ్జి" పద్ధతి ఎస్టేటులో పరీక్షింపబడుచున్నది. ఇది మలమును చవకగాను, పరిశుభ్రమైన విధముగాను ఎరువుగా మార్చువిధము. మనుష్యుల మలమును, పూడ్‌రెట్టుగా మార్చెడు పూర్వపు పద్ధతి మారి యిది అమలులోనికి రావలసియున్నది.

12. ముఖ్యముగా గమనించవలసిన కొన్ని అంశములు యేమనగా :—(a) పొలము దున్ని తయారుచేయుట పరిస్థితుల ననుసరించి యుపయోగించు "ట్రాక్టర్లు" రెక్కరేకులుగల విధమగు యినుపనాగళ్ళ వాడుక, వాటి అమర్పు, మళ్లను తయారుచేయుట జనవరి లగాయతు ఆగస్టువరకు వేరువేరు ఋతువులయందు హెచ్.యం. గుంటకలను, జూనియర్ హోయును, రెండు రెక్క రేకుల నాగలి, సాంపెసన్ హ్యారో, డిస్కు హ్యారో కెంబ్రిడ్జిరోలరు, అను యుపయోగకరమైన పనిముట్లు వాడుకచేయుట చూడవచ్చును. కొన్ని ఋతువులయందు జనుమువంటి పచ్చిరొట్ట పైరును రివర్సిబిల్ సింగిల్ డిస్కునాగలి లేక విక్టరి నాగలితో దున్నుట గమనించతగినది.

(b) వరుసలుగా విత్తనములు వేయుట.—గొర్రుతో విత్తుట, వరుసల మధ్య సాగుచేయు పనిముట్లపని, జూలైనుండి సెప్టెంబరువరకున్ను, నవంబరు నెలలోనున్ను.

(c) వరి ఊడ్పు.—మెట్టు దుక్కితోను, నీటిలో దుక్కితోను ఆకుమడి తయారుచేసి, అందు విత్తనములు పల్చగా పోయు విధములు, నష్టములేకుండ, లాభకరమగునట్లు నాటుట జూన్ నుండి ఆగస్టు వరకు.

(d) పచ్చిరొట్ట యెరువు పైరులు.—వాటిని పెంచుట, కలియదున్నుట, పల్లపు నేలలలో ఫిబ్రవరి నుండి జూన్ వరకు, తోట నేలలలో మే నుండి ఆగస్టు వరకు.

(e) చెరుకుగానుగ ఆడుట.—"సింధువాహి" పొయ్యిని కట్టుట, మంచి నాణ్యమైన బెల్లమును తయారు చేయుట—ఫిబ్రవరి లగాయతు ఏప్రిల్ వరకు.

## పైరుల పట్టిక.

తోట భూమి—

| | |
|---|---|
| మార్చి మధ్యనుండి జూలై మధ్యవరకు... ... | చిత్రజొన్న. |
| జూన్ మొదటినుండి సెప్టంబరు మధ్యవరకు ... | చోడి. |
| నవంబరు మధ్యనుండి ఫిబ్రవరి మధ్యవరకు ... | గోధుమ. |
| ఆగస్టు మధ్యనుండి అక్టోబరు మధ్య మొదలు ఫిబ్రవరి మధ్యవరకు. | పొగాకు. |
| జూన్ మధ్యనుండి జూలై నెలాఖరు మొదలు ఫిబ్రవరి నెలాఖరువరకు. | మిర్చి. |
| సెప్టంబరు మొదటినుండి మే నెలాఖరు వరకు ... | కంబోడియాపత్తి. |
| ఏప్రిల్ నుండి జూన్, జూన్ నుండి ఆగస్టు, సెప్టంబరు నుండి నవంబరు, నవంబరు నుండి జనవరి, ఫిబ్రవరి నుండి ఏప్రిల్ వరకు. | మేత కుజొన్న పైరు. |

మెట్ట భూమి—

| | |
|---|---|
| జూలై 15 నుండి ఫిబ్రవరి 28 వ తేదివరకు ... | కంది. |
| జూలైనుండి అక్టోబరు వరకు ... ... | గంటి. |
| ఆగస్టు మొదటి నుండి డిసెంబరు 31 వ తేది వరకు ... | పెరియమంజలు జొన్న పైరు. |
| అక్టోబరు 1 వ తేది నుండి మే 30 తేది వరకు ... | మెట్టపత్తి (కరుం గన్న ఉప్పము). |
| నవంబరు 15 వ తేది నుండి ఫిబ్రవరి 28 వ తేది వరకు. | సెనగలు. |

దంప భూమి—

| | |
|---|---|
| జూన్ 15 వ తేది నుండి జూలై 31 వ తేది వరకు జూలై 31 వ తేది నుండి జనవరి 31 వ తేది వరకు. | వరి. |
| ఫిబ్రవరి 15 వ తేదినుండి మరుసటి సంవత్సరం మార్చి 31 వ తేది వరకు. | చెరుకు. |
| జూలై 15 వ తేదినుండి మార్చి 31 వ తేది వరకు ... | పసుపు. |
| మే 1 వ తేదినుండి జూలై 31 వ తేది వరకు ... | పచ్చి ఎరువు కొరకు జనుము. |
| ఏప్రిల్ 15 వ తేది నుండి జూలై 31 వ తేది వరకు... | జీలుగ. |

## చిరుధాన్యోత్పత్తి స్థానములు, కోయంబతూరు.

చిరుధాన్యోత్పత్తి స్థానమునందలి యుద్యోగస్థులు, మన రాజధాని బీదసాదల ఆహారపు సస్యములను వృద్ధిచేయు పనియందు నిమగ్నులైయున్నారు. చిరు ధాన్యములలో ముఖ్యమైనవి జొన్న, గంటి, రాగి, కొర్ర ఈ పంటలను చాలామట్టుకు మెట్టనేలలైనను కొంతభాగము మాత్రము నీటి ఆధారమునను పండించుచున్నారు. నవంబరు లేక డిసంబరు నెలలలో ఈ పుత్పత్తి స్థానమునకు వచ్చినయెడల మెట్టు పైరులు పూతలోనో లేక కోత దగ్గరనుండు తరుణముననో చూడవచ్చును. మార్చి సెప్టెంబరు నెలలలో నీటి ఆధారమున పండిన రాగి చూడవచ్చును. జూన్ నెలయందు (వైశాఖము)

నీటిజొన్న యుండును. ఈ కాలములో రయితులు ఎప్పుడే లెంచినను ఈ స్థానము నందు పెరుగుచుండు ఆయా పంటలందలి పలురకములను జూచుటకును ఏ రకపు పైరు ఎక్కువ పంటనిచ్చునో యని గనుగొనుటకు ప్రతి పైరునందును పెక్కురకములు, ఒకటితో నొకటి పోల్చి నిర్ణయించు రీతులను, పైరుల తత్వమును గురించి సంపూర్ణ జ్ఞానము సంపాదించుటకు చేయుచుండు ప్రయత్నములను గురించి తెలిసికొనుటకును పైరుల లక్షణములు వంశ పరంపరముగ అవతరించుచుండు క్రమముల నిర్ణయించు విధులను తెలిసి కొనుటకు వీలుగనుండును.

దీతకొన్ని కాలములందు పైర్లయందు పూవులువిచ్చు విధములును, కంకియందలి పూవులుపూయు వివరమును కనుగొనుటయును, పూలయందలి పురుషేంద్రియముల నాయథ సహాయముచే నూడదీసి ఒక రకము పైరునందు వేరొకరకపు పైరు పుప్పొడి చేగర్భోత్పాదనముచేసి సంకరపు విత్తనములను పుట్టించి ఈ విధానముచే పంటలు వృద్ధి పరచుట కెట్టి ప్రయత్నములు సలుపబడుచున్న వోకూడ జూడనగును. ఇవన్నియు జూడనగు విషయములు. ఇంకను పరిశోధనాలయములలో పైరులయందు నిత్యమును గమనింపబడు విషయములన్నియు జాగ్రత్తగా స్థిరముగ నుండునటుల వ్రాసియుంచు పద్ధతులను, గమనించిన విషయములకు పరస్పర సంబంధములను కని పెట్టు రీతులను చూడవచ్చును. ఈ పనులన్నియు పైర్లయందు శాశ్వతమైన అభివృద్ధి కనుపరచుటకై ఆత్యావశ్యకములని వేరుగ చెప్పనక్కరలేదు. ఈ పైనుదహరించిన విషయములన్నియు గమనించిన ఈ చిరుధాన్యోత్పత్తి స్థానమును, దర్శింప వచ్చినవారందరును, ఇచ్చట పైర్లన్నియు నెంత జాగ్రత్తగ పరిశీలింపబడుచున్నవో, సమగ్ర పద్ధతుల మూలమున పంటలు సందియములేక వృద్ధియగుట కెట్టి యవకాశము లున్నవో గ్రహింపవచ్చును.

## ప్రత్తి యుత్పత్తి స్థానము, కోయంబతూరు.

ఇది సెంట్రలు ఫారమున కుత్తరపువైపున నంటియున్నది. ఈ యుత్పత్తి స్థానమున 1922 వ సంవత్సరమున ప్రత్తికి సంబంధించిన జన్య విషయములను, మరియు వ్యవసాయ విషయములను పరిశీలింపబలయనను నుద్దేశ్యముతో ప్రారంభింపబడినది. అది యిప్పుడు 87 యకరముల విస్తీర్ణముగలదైయున్నది. అందు 30 యకరములు నల్లరేవడి భూమియు, 57 యకరములు ఎఱ్ఱభూమియు గలది. అందు 22 యకరములు నూతి ఆధరవు కలిగియున్నది.

### ఏమి చూడవలయును ? ఎప్పుడు చూడవలయును ?

రైతులుగాని, మరి యితరులుగాని, పశువుల పేడ ఎరువు భద్రపరచు విధమును, కలుపు పెరగకుండా సమర్థించు విధమును సంవత్సరము పొడవునను చూడగలరు.

మే-జూన్ నెలలలో ప్రత్తిమోళ్లు పీకివేసి, చెత్తగోతులలో ఊరదొక్కుట, పచ్చి ఎరువులను దున్నుట, వేసవి వానలకు వెనుక పెరుగు కలుపుతీసి వేయుటకుగాను, బే డుహ్యారోతో దున్నుటయు చూడవచ్చును.

ఆగస్టు మాసమందు కంబోడియా ప్రత్తికి ఏర్పరుపబడిన పొలములలో సాళు దీసి కాలువలు వేయుదురు. పొలమునందలి పరిశోధనాలయములలో మచ్చుకొరకుతీయు ప్రత్తి రేచుల పొడవును దూదిపరిమాణమును నిర్ణయించు పద్ధతులు గమనించవచ్చును.

సెప్టంబరు మాసములో, తోట భూములయందు కంబోడియా ప్రత్తి విత్తనములు విత్తబడి నీరు పెట్టబడును.

8

అక్టోబరు నెలలో పూర్వోత్తరపు వర్ష మారంభించగానే మెరకభూములయందు ప్రత్తి గొర్రులతో విత్తబడును.

నవంబరు, డిశంబరు, జనవరి నెలలలో ప్రత్తి పంటలకెడనేద్యము చేయబడును.

ప్రత్తి మొక్కలలో వేరు మొదలు చిగురు పర్యంతము, లక్షణములు పరిశీలించి, ఆయా వంగడముల స్వచతను గమనింతురు. ఇతర చెట్ల యొక్క పుప్పొడి దెచ్చు పురుగులు చొరనీయకుండ పూవు కొనలు జిగటమన్నుతో అద్దివేయుదురు. ఈ కాలమందె మొక్కలు పెంచేవిధములుకూడ చూడవచ్చును. ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ నెలలలో ప్రత్తి యేరుదురు. ప్రత్తి విత్తనముల స్వచ్ఛత చెడకుండుటకున్న పెంచబడిన మొక్కల పంట ప్రత్యేకముగ తీసి జాగ్రత్త పెట్టుటకును నవలంభించబడు జాగ్రత్తతోగూడిన ఉపాయములు చూడవచ్చును:

జొన్న కోతగాలు యీ కాలమందే లోతుగా దున్ని వేయబడును.

ప్రస్తుతము యీ దిగువ అంశములు పరిశీలించుచున్నారు :—

(1) ఎంచుటవల్ల మంచి పంటయిచ్చు మొక్కలను విడదీయుట.

(2) ఉన్న రకములు సంకరము చేయుటవల్ల వృద్ధి నొందించుట.

(3) ఎంచబడిన మొక్కలయొక్కయు, వంగడముయొక్కయు పంటను దేశవాళి రకముల ప్రత్తితో పైపారు వేయుట.

(4) ప్రత్తి విత్తనపు బరువు, చెట్టు తెగుళ్లను జయించు శక్తి వీని పారంపర్యత.

(5) వెనుకటి పంటవల్ల ప్రతి పంటకు కలుగు లాభ నష్టములు.

(6) స్టెమ్‌వీవిల్ వల్ల ప్రత్తికి కలుగు నష్టములు నివారించుటకు సాధనములు కనుగొనుట.

(7) కందులలోను, సెనగలలోను మంచిమంచి వంగడములను పెంచుట.

(8) నీటి పారుదలకు ప్రత్తి ఎదుగుటకుగల సంబంధము తెలుసుకొనుట.

## వరియుత్పత్తి స్థానము, కోయంబత్తూరు.

వరి యుత్పత్తిస్థానము 1915 వ సంవత్సరములో స్థాపించబడినది. ఇది కోయంబత్తూరు సెంట్రలు ఫారమునకు నైఋతి మూలముగా, కోయంబత్తూరు తాలూకాకు చేరిన పెరిస్యా గ్రామమగు వేదపట్టిలోనున్నది. నరసంపట్టి చెరువుగట్టు ప్రక్కనుండు రోడ్డు మూలముగాగాని, చెరకు యుత్పత్తి స్థానముగుండాగాని పోయినచో వరియుత్పత్తి స్థానమునకు సులభముగా పోవచ్చును.

1915 వ సంవత్సరము స్థాపించబడి, 1919 వ సంవత్సరములోను, 1930 వ సంవత్సరములోను చేర్చబడిన పొలములతో సహా, 35 ఎకరములు 33 శెంట్లు విస్తీర్ణమును గలిగియున్నది.

### చూచున వేవి ? వానికి తగిన తరుణము లెయ్యవి ?

జూన్-జూలై.—సాధారణ సాగుబడి, ఎవరి ' గారి (హిందూస్థాన్) యినప నాగలితో దున్నుట, పచ్చియాకు యెరువులను పడగొట్టి దమ్ముచేయుట, ఆకు మళ్లను తయారుచేయుట, చల్లికలు, మెట్ట దంప ఆకు మళ్లు, రాలిక వ్యత్యాసములను చూచుటకు పోయు ఆకుమళ్లు తయారుచేయుట పరసంపర్కమువలన పుట్టిన వడ్ల గింజలను తపంటి తొట్లలలో మొలక కట్టుక.

జూలై, ఆగస్టు.—ఊడ్పు (నారు నాటుట), వ్యత్యాసములను చూచుటకుగాను వివిధరకముల యెరువులను చేలకువేసి వానియొక్క ఫలసాయపు తేడాలను గమనించు పద్ధతులను గ్రహించుటకుగాను చిన్నచిన్న సారువలలో వూడ్చుట, సేద్యపు పద్ధతుల తారతమ్యములను చూచుట.

సెప్టంబరు, అక్టోబరు.—ఈ రాజధానిలో పైరుచేయు సుమారు 500 వరి రకములయొక్క సహజ లక్షణములందలి వ్యత్యాసములను పరిశీలించుట, ఒకే రకమునుండి వచ్చిన వివిధ వంగడములు, తేలిక వరుల యీనికలు, సంకరములనుండి పుట్టిన మొలకయొక్క గుణములను పరీక్షలు చేయుట.

నవంబరు.—ముఖ్యమైన వరి రకములన్నియు యీనికలలోనుండును. ఒక రకముయొక్క పురుషావయచ్ఛేదముచేసి మరియొక రకముతో సంయమముచేయుట, లక్షణ పరిశోధన, మొక్కలయొక్క వివిధ భాగములలో రంగువుండుట, లేకపోవుట మొదలుగాగల పరీక్ష ; వరిమొక్కయొక్క దుబ్బుచేయుట, యెత్తు, ఫలితముకువచ్చు కాల పరిమితి, వెన్నుయొక్క పొడవు, గింజయొక్క ప్రకృతి, స్థితి, పరిమాణము, ఆకృతి పొల్లు గింజ లేర్పడుట మొదలుగాగల ఆర్థిక లక్షణములను వివిధ జాతులలో పరిశోధనముచేయు కాలమగుటవలనను, తేలిక వరుల కోత కాలము గనుకను యీ పరిశోధన స్థానమును చూచుట కిదియే మంచిసమయము.

డిసంబరు, జనవరి.—పై నుదహరించిన పరీక్షలు పెద్ద వరులలో చేయుట ; వరి పడిపోవుటకు కారణములు తత్సంబంధమైన పరిశోధనలు విత్తనములకై వరి మొక్కలను యేరుట, ఒంటి మొక్కల నెంచుట, కోత, పరిశోధన మళ్లయందలి సస్యముయొక్క కోత నూర్పు.

ఫిబ్రవరి.—విత్తనములను యెండబోసి శుభ్రముచేసి రైతులకు జిల్లా ఉద్యోగస్థులకు పంపుట.

మార్చి, మే.—జొన్న, మొక్కజొన్న, సూర్యకాంతము మొదలుగాగల పశువుల మేతకు పనికివచ్చు పైరులను మరియు జీలుగ, జనుము మొదలుగాగల పచ్చియాకు యెరువునకు పనికివచ్చు వేసవి సస్యములను బావులదగ్గరనున్న పొలములయందు పెంచుట.

## వివిధ విధానముల పరిశీలనలు.

(1) రైతుల వరి రకములనుండి మంచి జాతులను విడదీయుట. ఉత్పత్తిస్థానము లుండు ప్రదేశములు కాక యితర ప్రదేశములలోనుండు రకములలోనుండి మంచి వంగడములను విడదీయుట.

(2) వివిధ రకముల సంయోగమువలన, మంచి లక్షణములు గలిగిన క్రొత్త రకములను నేర్పరచుట.

(3) రైతుల రకములలోనుంచి యేర్పరచిన స్వచ్ఛ జాతులను సంకరము నిమిత్తమై నిలుపుకొనుట.

(4) నీటి కట్టు శోధన.—వరి పంటకు యెంత నీరు పట్టునో కనుగొనుట.

(5) వునాస మధ్య పెద్ద పంటలచేలు పడిపోవుటకు కారణములను పరిశీలించుట.

(6) వరి జాతుల పంట సంబంధమైన లక్షణములకును, భౌతిక లక్షణములకును గల సంబంధములను పరిశీలించుట.

(7) నూతన విధమున రాశిక తారతమ్యములను కనిపెట్టుట.

(8) ఎరువుల పరిశోధన వ్యవసాయ పద్ధతుల పరిశోధన వరి ఆకునకు ఎరువు వేయుట ఊడ్చినతర్వాత వేయుట. వాటి తారతమ్యము ఎరువులు వేయవలసిన సమయము వరి ఊడ్పునకు వేయవలసిన విధము వరినారు ఊడ్పుసమయమున కావలసిన వయస్సు వెదజల్లుట పూడ్చుట వగైరాలగురించి.

## హొసూరు లైవు స్టాక్ రిసర్చ్ స్టేషన్.

ఈ రీసర్చ్ స్టేషనులో చూడవలసినది యేది? దాని నెప్పుడు చూడవలయును? ఈ రీసర్చ్ స్టేషనని పేరువహించియుండు ఫారం సేలం జిల్లాలో హొసూరు తాలూకా యందు హొసూరునకు మూడు మైళ్లదూరము మత్తిగిరియను గ్రామమువద్దనున్నది. ఇది మొదట 96 సంవత్సరములు ఆర్మీరిమౌంటు డిపో (Army Remount Depot) వారి అధీనంలోయుండి 1924 వ సం॥ సెప్టంబరు 1 వ తేదిన మదరాసు గవర్నమెంటువారివలన పశువృద్ధిచేయు స్థానముగా తీసుకొనబడియున్నది.

వివరణము (Description).—ఇందులోని నేలలు బంకమన్ను, గులకరాతితో కలసి యెక్కువ సత్తువను కలిగియున్నది. దీనియొక్క విస్తీర్ణము 1,659·91 ఎకరములు. దీనిలో 65 ఎకరముల నేల మూడు వర్షాధారపు చెరువుల నీటి పారుదలకనుకూలమైయున్నది. ఈ నేల మంచి నల్ల రేగడితోను, బంకమట్టితోను కలిసి సాధారణముగా 'మసాలా' తోట (Lucerne Garden) యని పిలువబడుచున్నది. ఈ మసాలా తోటను 35 చిన్న చిన్న పొలములుగా విభజించి అందు మసాలాకు (Lucerne) రోడ్సు గ్రాస్ (Rhodes grass) జొన్న (Cholam) మొదలగువాటిని యొకటివెంబడి మరియొకటి పైరు పెట్టుచున్నారు. పొలములకు పెద్ద చెరువులనుండి కాలువల మూలముగా నీరు పారింపబడును.

ఈ ఫారములోని గొప్ప పచ్చిక మైదానము 46 ఖండములుగా (Paddocks) విభజింపబడియున్నది. వాటిలో అన్ని దిక్కులయందున్ను, వగస (Vagai), చింత (Tamarind), మామిడి (Mango) సరుగుడు (Casuarina) మొదలగు వృక్షములతో కూడిన చక్కని బాటలు చూచుటకు మిగుల రమ్యమైయున్నది. ఈ ఫారము చక్కని కిత్తనార కట్టవను గలిగియున్నది. ఆయా ఖండములు (Paddocks) చుట్టును యిత్తర ముండ్ల కంచెలచే చుట్టబడియున్నవి. ఇందులో సుమారు 3,000 చందనపు (Sandal wood) మొక్కలు వుండడమేకాక, యింకను చాలనారు పెంచబడుచున్నది.

నేల సాధారణముగా దక్షిణమునుండి ఉత్తరమునకు వాటముగలిగియున్నది. ఈ ఫారములో మిగుల పున్నతప్రదేశము పల్లపు ప్రదేశముకంటె 80 అడుగులు ఎత్తుండును. ఇవి సముద్ర మట్టముకంటె మిట్ట ప్రదేశమునందు 3,005 అడుగులున్ను, పల్లపు ప్రదేశమునందు 2,925 అడుగులున్ను యెత్తుగలిగియున్నది. ఈ రీతిగా యుండడము వల్ల యీ ఫారము గొప్ప యింగ్లీషు శృంగారవనము (Large English Park) యొక్క పోలిక గలిగియున్నది.

ఈ స్టేషనుయొక్క ముఖ్యాశయమేమనగా, మేలైన పశువులను వృద్ధిచేసి రైతుల యొక్క మందలను అభివృద్ధిచేయుటకు మంచి ఎడ్లులను సరఫరాచేయడమే. అయినను సంకర (Cross breeds) జాతులలోగూడ కొన్ని పాడి ఆవులు వెలకు దొరకును. కొన్ని సమయములందు ఫారము నందావశ్యములేని పశువులు అమ్మబడును. ఈ ఫారములో యొక చిన్న క్షీరశాల (Dairy) కూడ వున్నది. ఈ క్షీరశాల లాభమునిమిత్తం నడిపించడములేదు. ఇది ముఖ్యముగా పశువృద్ధి శాస్త్రమున విద్యార్థులను తర్బీతు చేయు స్థలముగా యుండుటవల్ల, పాలలో చాలభాగము దూడలకే వినియోగించబడును. మిగత పాలు అట్లేగాని, వెన్న తీసిగాని, నెయ్యి చేసిగాని అమ్మబడును.

కాంగయం తెగ (Kangayam).—ఇవి దక్షిణ మద్రాసు రాజధానిలో మిక్కిలి శ్రేష్టమైనది ఈ జాతి పశువులు కుదిమట్టముగానుండును. కాళ్లు పొట్టిగానుండి యెక్కువ పని చేయగలిగియున్నవి. కాంగాయం ఆవులు సామాన్యముగా తక్కువపాలు యిచ్చునప్పటికిని, యెక్కువపాల నిచ్చు పశువులుకూడ కొన్నిగలవు. ఈ స్టేషను పశువుల తెగ లక్షణములకు హాని కలుగకుండ క్షీరాభివృద్ధికి ప్రయత్నములు చేయబడు చున్నవి.

సింధి తెగ (Scindhi).—ఇవి కరాచి (Karachi) ప్రాంత్యములనుండి తేబడినవి. ఇవి యిండియాలో క్షీరోత్పత్తికి ప్రశస్తమయినవని యెంచబడుచున్నవి. ఇవి పొట్టిగాను, కుదిమట్టముగానుండి మద్రాసు రాజధానిలో (Madras Presidency) అన్ని చోట్లను వృద్ధియగుచున్నట్లు తోచుచున్నది. ఈ స్టేషను ముఖ్యాశయము యిట్టి యెక్కువ పాలిచ్చువాటిని వృద్ధిచేయడమున్ను, పడమటి తీర ప్రాంత్యములకు ఆబోతుల నివ్వడమునునైయున్నది.

ఒంగోలు తెగ (Ongole).—ఇది రాజధానిలో ప్రసిద్ధికెక్కినది. దీని వాసస్థలము సర్కారులు (Circars). ఈ తెగ పశువులు పాలకును, పాటునకును గూడ అనుకూలమైనవిగా యీ రాజధానిలో పేరు పొందియున్నవి. ఈ మంద యీ ఫారమునందు తాత్కాలికముగ నుంచబడియున్నది.

సంకరపు తెగ (Cross beeds).—ఈ మందలు స్వదేశపు పశువులలో సింది (Scindhi), సనివాలు (Sanhiwal) మొదలగు తెగలలోను ఆవులను ఐరుషయిరు యెద్దు (Ayreshire) లచే దాటించడమువల్ల నిర్మింపబడియున్నది ఈ స్టేషనులో బెంగుళూరు తెగ, కోయంబత్తూరు తెగ యని మరి రెండు మందలున్నవి. బెంగుళూరు తెగ ముఖ్యముగా పరిశోధనకును, కోయంబత్తూరు తెగ కోయంబత్తూరులో యుండు వ్యవసాయ కళాశాల డెయిరీ (Dairy at the Agricultural College)కి పాలు సరఫరాచేయుటకును ఏర్పాటు చేయబడినవి.

బళ్లారి గొర్రెలు (Bellary Sheep).—వీని పేరు సూచించు లాగుననే యీ మంద బళ్లారినుండి తేబడినది, ఈ పరిశోధనయొక్క అభిప్రాయము తెల్లని ఉన్ని గొర్రెలున్ను మంచిమాంసమునిచ్చు గొర్రెలను వృద్ధిచేయడమే. వీనికి సంబంధించిన పరిశోధనలు (Experiments) యెక్కువ ఉత్సాహమును కలిగించుచున్నవి. మంచి జాతి పొట్టేళ్లు యిచ్చట దొరకును.

### చక్కని వున్నినిచ్చు బళ్లారి గొఱ్ఱెపోతులు.

హొసూరు పశుపరిశోధనా శాలలో పై చెప్పబడిన మంచి ఉన్నినిచ్చు గొఱ్ఱె పోతులు కొన్ని అమ్మబడును.

అవి తెల్లని (నల్లతలగల) మందలోనుంచి ఏరుకొనబడినవి ఒక్కొక్క గొఱ్ఱె, సగటున సాలుకు 110 తులములున్ను, పోతు 160 మొదలు 280 తులములున్ను, ఉన్ని నిచ్చును. సగటున నడి వయస్సున వున్న పోతు సుమారు 120 పౌనులు తూకముండును, సంవత్సరముదాటిన పోతు 10 మొదలు 15 రూపాయలవరకు వుండును. వివరము కావలసినయెడల హొసూరి పశుపరిశోధన శాలాధికారికి వ్రాసి కనుగొనవచ్చును.

కోళ్లు.—ఈ పరిశోధనా శాలలో కోళ్లు అచ్చ తెల్లవి (White leghorns) అచ్చ ఎఱ్ఱవి (Rhode Island Reds), తెలుపు నలుపు (Light Sussex), అను మూడురకములు శీమకోళ్లు వున్నవి. ఈ రకముల యోగ్యతను పరిశీలించుటకు ఒక్కొక్క రకమునకు ఒక్కొక్క పిట్టను ప్రత్యేకముగా కమ్మివేయబడును. గ్రుడ్లు పెట్టుటకు తెల్లవి శ్రేష్ఠమైనవి. ఎఱ్ఱవి, మాంసమునకు గ్రుడ్లకుకూడా పనికివచ్చును. తెలుపు, నలుపువి మాంసమునకే శ్రేష్ఠమైనవి.

పై జాతులచే గుడ్లను పొదిగించరు. యంత్రసహాయ్యముచే గుడ్లను పొదిగించి స్వదేశీకోడి సహాయముచే పెంచెదరు. గుడ్లను కోళ్లను సరసమైన ధరలకు అమ్మెదరు.

### కోడి, కోడిగ్రుడ్ల వివరము.

ఈ క్రింద కనుబరచిన శీమకోళ్లు రకములున్నవి :—

(1) అచ్చ తెల్లవి (White leghorns).
(2) అచ్చ ఎఱ్ఱవి (Rhode Island Reds).
(3) తెలుపు నలుపు (Light Sussex).
(4) అచ్చ నలుపు (Black Minorcas).

### స్వదేశీ రకములు-చిటగాంగు.

కోడి గుడ్లును, కోడిపిల్లలు. పెద్దవి క్రింద కనుబరచిన ధరలకు అమ్మబడును. మద్రాసు రాజధానిలో ఎచ్చటనైనను పంపుటకు ఖర్చుల నిమిత్తం డజను 1 కి అ 10 లు అధికము యిచ్చుకొనవలెను.

| | రూ. | అ. |
|---|---|---|
| గుడ్లు పొదుగుటకు డజను 1 కి ... ... | 2 | 0 |
| గుడ్డు 1 కి ... ... ... ... | 0 | 3 |
| గుడ్లు, తినుటకు డజను 1 కి ... ... ... | 0 | 1 |
| ఒక్కదినము వయస్సుగల పిల్ల 1 కి ... ... | 0 | 4 |
| వారము 1 కి ... ... ... ... | 0 | 8 |
| నెల 1 కి ... ... ... ... | 1 | 0 |
| మూడు నెలల వయస్సుగల కోడిపుంజు 1 కి ... ... | 1 | 8 |
| డిటో. పెట్ట 1 కి ... ... | 2 | 0 |

6 మొదలు 8 నెలల పుంజు 1 కి రూ 3 లు మొదలు ఆరువరకు, వాని జాతి బరవు ననుసరించియుండును.

6 నెలల వయస్సుగల పెట్టి రూ 4 మొదలు 5 వరకు వానిజాతి బరువు ననుసరించి యుండును.

షరా.—

(1) రైలువద్దకు చేర్చు ఖర్చులు బుట్ట ఖర్చులు పంపబడు కోళ్ల సంఖ్య ద్వారమున ననుసరించియుండును.

(2) పంపబడు కోళ్ల ఖరీదు, బుట్ట ఖరీదు, రైలు ఖర్చులు ముందుగా పంపితేనే ఆర్డరు అంగీకరించబడును.

దయచేసి యీ క్రింది చిరునామాకు వ్రాయండి.

పశు పరిశోధనా శాలాధికారి,

హెూస్సూరు ఫారం పోస్టు.

పందులు (Pigs).—బర్క్‌షయిర్ పిగ్స్ (Berkshire pigs) అను నొక మంచి జాతి పందులున్నవి. ఇవి డయిరీయందును, తర్కారి తోటలయందును, ప్రయోజనము లేక త్రోసివేయబడు పదార్థములతో పోషింపబడును. మగపందులను సంసర్గమునకును, చంపడమునకు కీతర పందులను అమ్మబడును.

సాగుబడి నేలలు, పచ్చిక బయళ్లు (Arable land and Pasture).—పశువుల మేత కనుకూలమైన బీళ్లున్నప్పటికిని వానికి తోడు సాగుబడి నేలకూడ అవశ్యకమై యున్నది. గిని గ్రాసు (Guinea grass), రోడ్సు గ్రాసు (Rhodes grass) జొన్న (Cholam), మొక్క జొన్న (Maize), మసాలా (Lucerne), మొదలుగాగల మేత పైరులు సంవత్సరము పొడుగునను పెంచబడుచున్నవి. మేతపైరులలో చాల భాగమును కత్తిరించి గోతులలో వేసి సైలేజి (Silage) చేసి పొలములందు మేత తక్కువైనప్పుడు పయోగింపబడును.

ఈ ఫారము చూచుటకై యెల్లప్పుడును ప్రజను సంతోషపూర్వకముగ ఆహ్వానించడమే కాక యిందులో విద్యార్థులను తర్ఫీతు చేయుటకును, పశువుల మేత సస్యములను పండించుట, నేకరించుట మొదలగు పద్ధతులను నేర్చుకొనుటకు కావలసిన సదుపాయములు చేయబడియున్నవి.

## వ్యవసాయ పరిశోధక స్థానము, నంజనాడు.

ఇది 1917 వ సంవత్సరమున స్థాపించబడెను. ఈ వ్యవసాయ స్థానము కురుతు కులికిని నంజనాడుకును మధ్యగా నున్నది. ఈ ఫారమునకు మంచి రోడ్డున్నది గాన మోటారులలో సులభముగా పోవచ్చును. ఈ రోడ్డు గవర్నరు షోలా రోడ్డులో నుండు ఆండిక్స్ కార్నరువద్ద చీలిపోవుచున్నది. ఉదకమండలమునకు ఫారమునకును 10½ మైళ్ల దూరము. ఫారముయొక్క విస్తీర్ణము 159 96 ఎకరములు. అయితే సుమారు 35 ఎకరములు మాత్రమే సాగునకు తేబడినవి. ఈ ఫారముండిన చోటులో పూర్వము తుప్ప, గడ్డ మొదలగునవి దట్టముగా పెరిగియుండెను. కొంతవరకే సాగు చేయబడియుండెను. నీలగిరికొండలలో నుండు పొలములవలెనే యీ ఫారము పొలమును వున్నది. రెండు ఎకరముల ప్రదేశము తప్ప తలిమ్మ భూమియంతయు మెట్ట ప్రదేశము. ఊర్ల గడ్డలు విస్తారముగా సైరు చేయబడుచున్నవి.

2. పరిశోధింపబడుచున్న వివిధాంశములు—

(1) అనేకరకముల బంగాళాదుంపలను పరీక్షించి నీలగిరి పరిస్థితుల కనుకూలించునట్టియు, తెగుళ్లను లక్ష్యపెట్టనట్టియు రకముల బెంచుట.

(2) ప్రత్యేకపు కుదుళ్లనుండి విస్తరమును కట్టుటచే అస్లైంచిన రకముల స్వచ్ఛతను కాపాడుట.

(3) వివిధములగు ఎరువు మిశ్రణములను పరీక్షించుట.

(4) తగిన పరివర్తనమును, వుత్తమమగు సాగు పద్ధతిని కనిపెట్టుట.

(5) మంచి ఫలితము నిచ్చుటకుగాను విత్తనపుదుంపలకు దగిన సంస్కారము చేయుట.

## చూచునదేమి ? ఎప్పుడు చూడవచ్చును ?

డిశంబరు, జనవరి.—రెండవ బంగాళీదుంప పంటను త్రవ్వుట విక్టరీ సాబూల్ నాగళ్లతో భూమిని లోతుగా దున్నుట.

ఫిబ్రవరి, మార్చి.—విక్టరీ నాగలితో లోతుగా దున్నుట గడ్డలను చితుకకొట్టుట. కలుపు లేవకుండ హెచ్.యం. గుంటక తోలుట. నీరుకట్టి బంగాళదుంప నాటుట.

మార్చి, ఏప్రియల్—దుంప పాతుటకు రెండురెక్కల నాగలితో సాళ్లు తోలుట. ఎరువులు కలిపి చల్లుట. పెద్దపంట దుంపలను పాతుట. సామ, ల్యూపినులను గోరుతో చల్లుట.

మెయి, జూన్.—చక్కగ ఎదిగిన బంగాళదుంప తోట. దానిలో యినుప పనిముట్లతో, ఒంటియెద్దునకట్టి, మన్ను ఎగవేయుట కలుపుతీయుట. సాగులో హెచ్. యం. గుంటక తోలుట.

జూలై.—పచ్చిరొట్ట పైరులను భూమిలో దున్నివేయుట. భూమిని రెండవ బంగాళదుంప పైరునకు తయారుచేయుట.

ఆగస్టు, సెప్టంబరు.—పెద్దపంట బంగాళదుంప త్రవ్వుట. అమ్మకమునకు, విత్తనమునకు బంగాళదుంప యేర్చుట. రెండవపంట నాటుట ల్యూపిను పైరు గింజపట్టియుండును.

సెప్టంబరు, అక్టోబరు—సామ, ల్యూపిను, రెండవ బంగాళదుంప పైర్లు చూడనగును.

నవంబరు, డిశంబరు.—సామ, ల్యూపినులు కోయుట, నూర్చుట.

సంవత్సరం పొడుగునను.—శుద్ధమగు పశువుల గత్తము తయారుచేయుట. పశువులను మేపుట. దుంప వ్యవసాయమునకు ముఖ్య అవసరమగు పనిముట్లు. క్రొత్త భూములను సాగులోనికి తెచ్చుట. బంగాళదుంపలను నిల్వచేయుట. పశువుల మేతకొరకై వేసిన "కికూ్య" గడ్డి బీళ్లు.

సై. జి. కృష్ణారావు నాయుడు,
అఫిషియేటింగు వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు,
ఎనిమిదవ సర్కిలు.

## 3. నీలగిరి పరిశోధన పండ్లతోటలు.

### పండ్లు.

నీలగిరి జిల్లాలో వ్యవసాయ శాఖకు చేరినవి మూడు పరిశోధన పండ్ల తోటలు గలవు. అవి యేవి యనగా, కూనూరు పోమలాజికలు స్టేషను, బర్లియారులోను కల్లారులోను నుండు పరిశోధన పండ్ల తోటలు.

2. కూనూరులోనుండు పోమలాజికలు స్టేషనుతో చేరినది 'సిమ్సు పార్కు'. ఈ తోట సముద్రమట్టమునకు 5,800 అడుగుల యెత్తున నున్నది. ఇది 1920 వ సంవత్సరములో స్థాపించబడినది. దీనిలో యెండ ప్రదేశములలోను, కొంత శీతల ప్రదేశములలోను, పండు ఫలసరకుల చెట్లు, అనగా ఆపిలు, బేరిపండ్లు, ప్లమ్ములు, పీచి పండ్లు, జామి పండ్లు, అత్తిపండ్లు, నారింజ రకములు మొదలగు జాతులు పైరు చేయబడుచున్నవి. సర్కారు వ్యవసాయశాఖవారు, యీ తోటల నుంచుటకు ముఖ్యకారణములు, దక్షిణ హిందూదేశములోని కొండ ప్రదేశములలో బాగుగా వచ్చు ఫలజాతులను పరిశీలించుట, బాగుగా వచ్చు పండ్లచెట్లను వృద్ధిచేసి అనేక ప్రదేశములలో వ్యాపింపచేయుట, చెట్లను కత్తిరించు విధములు, ఒక జాతి చెట్టుతో మరియొక దానిని కలుపు విధములు మొదలగునవి పరిశీలించుట. సీమ రకములలో చేరిన 'ప్లమ్ము' జాతులలో, జపానుదేశపు రకము లిదివరలో బాగుగా వచ్చినవి. వాటిలో నైదు దినుసులు వాట్ల తారతమ్యముల ప్రకారము నీ దిగువ వివరింపబడినవి.

(1) 'హేలు' (2) రూబియో' (3) 'షిరో' (4) 'సట్సూను' (5) 'కేల్సి' అందులో మొదటి మూడు దినుసులు మే నెలలో ప్రజలు నీలగిరి ప్రదేశమునకు వేసవికాలములో మంచితరుణమున పంపబడుచున్నవి. కాబట్టి యెక్కువ లాభము నిచ్చును. 'రూబియో' అను రకము 'జామ్' తయారుచేయుటకు చాల నుపయోగము. 'షిరో' యను రకము భోజనాంతరములో తినుటకు అతి శ్రేష్టము. 'హేలు' అను రకము పై చెప్పిన రెండు విధముల నుపయోగపడుచున్నది.

ముప్పది రకముల ఆపిలును పరిశీలింపబడుచున్నవి. అందులో "రోము బ్యూటి", "ఐరిషు పీచి", "విక్టర్ స్టీను", అను రకములు చాల శ్రేష్టము. ఈ జాతులు మిగుల రుచ్యములగు పండ్ల నిచ్చును

జపానురకపు పెర్సిమను బాగుగా వచ్చుచున్నది. అయితే యీ జాతి యీ ప్రదేశములో నంటుకట్టి వ్యాపింపచేయుటకు వీలులేదు.

"ప్లమ్ము" రకములను "పీచి" మొలకలకు అంటు కట్టెదరు (మొగ్గంట్లు) మసిలి క్రాబ్ ఆపిలు చెట్లయందుండి తీసిన పిల్లలకు, ఆపిలు మొక్కలను అంటు కట్టెదరు. బేరిచెట్లను, చీనా బేరిచెట్ల మొక్కలకు అంటు కట్టితే చాల శ్రేష్టము. చీనాదేశపు బేరి కొమ్మలకు శీఘ్రముగా వేరుపట్టును.

కొన్ని ముఖ్యములయిన పండ్ల చెట్ల ధరలు యీ క్రింద వివరింపబడినవి:—

| | | రూ. | అ. | పై. | |
|---|---|---|---|---|---|
| నారింజ, సీమపంపరపనస అంట్లు | ... | 2 | 0 | 0 | ఒక్కొకటి. |
| అన్ని రకముల ప్లమ్ములు ఒకటికి | ... | 1 | 8 | 0 | నవంబరు నుండి ఫిబ్రవరి వరకు దొరకును. |

| | | రూ. | అ. | పై. | |
|---|---|---|---|---|---|
| ఆపిలు మూడు రకములు | ... | 1 | 8 | 0 | నవంబరు నుండి ఫిబ్రవరి వరకు దొరకును. |
| బేరిచెట్లు 6 ఉత్తమ రకములు | ... | 1 | 8 | 0 | డిటో. |
| పీచి 2 ఉత్తమ రకములు | ... | 1 | 8 | 0 | డిటో. |
| పెరిమోయరు మొక్కలు | — | 0 | 4 | 0 | సంవత్సరము పొడుగునను దొరకును. |

ఈ తోటను చూడగోరువారు, అసిస్టాంటు ఫారము మేనేజరుగారికి కొద్దిరోజులకు ముందుగా తోట ప్రదర్శనమునకు వ్రాసుకొనవలయును. పండ్ల చెట్లను పెంచుటలో నా సక్తియుండువారు కూనూరు పట్టణమునకు వచ్చినప్పుడు యీ సర్కారువారి తోటనుచూచి తీరవలయును. మే నెల లేక జూన్ నెలలో పండ్లు చెట్లయందు బాగుగా పండు సమయముకాన యీ నెలలలో చూచుట కతిరమ్యముగా నుండును. దానిని చూచుటగాక, కూనూరు వ్యవసాయ పరిశోధన స్థానము యెదటనే నిర్మించి యుండు ప్రదర్శన శాలనుకూడ చూడవలయును. దానిలో పండ్ల చెట్లకు తగులు జాడ్యముల గురించియు, వాటి నివారణ గురించియు, బాగుగా తెలిసికొనవచ్చును. మేనేజరుగారన్నియు విశదీకరింతురు. తోటలో పండిన పండ్లు, విత్తనములు మొదలగునవి కొనవచ్చును. వ్యవసాయమునకు సంబంధించిన సర్కారువారు ముద్రించిన పుస్తకములు వెలకు చిక్కును. మరికొన్ని చిన్న పొత్తము లుచితముగా దొరకును.

3. బర్లియారు పరిశోధన పండ్లతోట కూనూరి గాటుదగ్గర టోలుగేటువద్దనున్నది. అది సముద్రమట్టమునకు 2,500 అడుగుల యెత్తుగానున్నది. ఈ తోటయందు యెండ ప్రదేశములలో పెరుగు పండ్ల చెట్లును వాసన ద్రవ్యములు సాగుచేయడుచున్నవి. వాసనద్రవ్యములలో జాజికాయ, లవంగపట్ట మొదలగునవియును, పండ్లలో మంగుస్తాను, నారింజ, లాంగ్‌స్టాట్, లిచి, మొదలగునవి పైరు చేయబడుచున్నవి. 'పారా' రబ్బరు చెట్టుకూడ యిచ్చట బాగుగా పెరుగును. ఈ ప్రదేశములోని మిగుల ప్రాచీనమైన రబ్బరు చెట్లలో నొకటి యీ తోటలో చేరిన మరియొక చిన్న తోటలోనున్నది. ఈ చెట్టు 1882 వ సంవత్సరమున నాటబడెను.

ఇదివరలో బాగుగా రాని మంగుస్తాను మొక్కలు, యిటీవల వందలకొలది యీ తోటలో తయారు చేయబడెను. దీనివేరు చాల లోతుగా పోవుచున్నది గాన నారుమళ్లను లోతు దుక్కిచేసి, పొడవుగానుండు మేదర బుట్టలలో వేరునకు హాని లేకుండా మొక్కలు పెట్టబడును. లోతు దుక్కి లేకపోవుటచేతను, మొక్కలను కురుచగా నుండు గోలెములలో నుండుటచేతను, వేర్లు చెడిపోయి చెట్లు చచ్చిపోవును. డజను రూ 2 లు వంతున విక్రయించినప్పటికిని కొనుట కనేకములయిన మనుష్యులున్నారు. సంవత్సరమునకు ఒక చెట్టు 50 రూపాయల లాభము నిచ్చును. అట్లు అనేక సంవత్సరములు లాభము రాగలదు. ఈ చెట్లు కాపు పట్టుటకు, పది పదునయిదు సంవత్సరము లయినప్పటికిని వీటిని పెంచుట చాల లాభకరము.

4. కల్లారు పరిశోధన పండ్లతోట ప్రాతగాటు రోడ్డు, క్రొత్తగాటు రోడ్డు కలియు చోటులో మేటుపాలెమునకు 5½ మైళ్ల దూరములోనున్నది. రెండుగాటు రోడ్డు కలియుచోటున, అనగా తోటకు పోవుచాటు ప్రాతగాటు రోడ్డు నందుండి చీలిపోవు చోటునందు ఒక పోలీసు బోర్డు కనబడును. కాబట్టి యీ తోటను కనుగొనుట

కేలాటి కష్టమును లేదు. మరియు వలయువారు క్యూరేటరుగారికొక వారమునకు మునుపు వ్రాసినచో, తోటను చూచుటకు కావలసినంత సహాయము చేయుదురు.

ఈ తోట సముద్రమట్టమునకు 1,400 వేలడుగుల యెత్తు. ఇది 1901 వ సంవత్సరమున స్థాపించబడెను. సర్కారువారి యభిప్రాయము మొదట, మలేయా దేశములో పండు మిగుల విలువగల 'దూరియన్' అను పండును వృద్ధిచేయవలసిన దనియుండెనట. అయితే రబ్బరు చెట్లను గురించి విశేషముగా నభిప్రాయము గలిగినది గనుక, 'పారా', 'శీరా', 'కాస్టిల్లోవా' యను రకముల రబ్బరు చెట్లు నాటబడినవి. మరియును, యీ చెట్ల విస్తీర్ణము కోసము రబ్బరుపాలు తీయుటలోను, పరిశోధనలు చేయుటకు వీలుగానుండెను. కొన్ని సంవత్సరములకు మునుపు రబ్బరుచెట్లు చాలవరకును తీసివేసి పండ్ల చెట్లు నాటబడినవి. ఈ పండ్ల చెట్లు చాలవరకును కాపుకు వచ్చినవి. సపోటా చెట్టు ఒకటి వృక్షమై విపరీతముగా పండ్లు నిచ్చుచున్నది. ఈ చెట్లు వగైరాలు బాగుగా వ్యాపించుచున్నవి. వలయువారు తీసికొని పోవుచున్నారు. పండ్ల చెట్లలో మంగుస్తాను, సపోటా, నారింజ, అవకడో, బొప్పాయి, మామిడి, లీచీ, శీతాఫలము రకములు, నిమ్మ వగైరా రకములు మొదలగునవి పరిశీలింపబడు చున్నవి. అనాస రకములుగూడ విశేషముగా పరిశీలింపబడుచున్నవి. మరియు, మూలికలును, నారతీయునటువంటి చెట్లును పెంచబడుచున్నవి. సుమారు, 50 సంవత్సరములుగా దక్షిణదేశపు ప్లాంటర్లకు చాల కష్టము నిచ్చు ఇపికాక్వానా చెట్లుకూడ పైరు చేయబడుచున్నవి. కంటికి సుందరమగు చెట్లు తోటలో ననేకములుగా నున్నవి. వీటిని చూచుటచే మనస్సున కాహ్లాదము కలుగును. ఇదివరలో చెప్పిన కల్లారు, బర్లియారు తోటలలోనుండు చెల్లా, చెట్టు ఒక్కటి 4 అణాలనుండి రూ 2 లు వరకు చిక్కును. చెట్లయొక్క వివరమును కోరువారు ఉదకమండలములోనుండు క్యూరేటరుగారికి అ 4 లు పంపినచో ఒక క్యాటలాగు పోస్టుద్వారా ముట్టును.

ఎఫ్. హెచ్. బుట్చర్,

క్యూరేటర్, బొటానిక్ గార్డెన్స్, ఉదకమండ్.

---

### 4. ఇనుప నాగళ్ల నుపయోగించువారికి సలహా.

1. మీ పొలమునందలి నేలకును, అందు చేయవలసిన పనికిని తగిన రకపు నాగటి నెంచుకొనుడు. మీ తాలూకా వ్యవసాయ ప్రచారకునితో సంప్రతింపుడు. ఇసుక నేలలకు బంక నేలలలో నుపయోగించు రెక్కరేకులు పనికిరావు. కంకర నేలలలోను యిసుక నేలలలోను ఉక్కు నాగళ్లకంటె అరుగుదల తక్కువగనుండు ప్రత్యేకముగ కనపరచిన 'చిల్డు' నాగళ్ల నుపయోగింపుడు.

2. నేలయొక్క స్థితిని గమనించి, సరియైన పదుననే దున్నుడు. కొన్నివిధముల నేలలను పదును హెచ్చుగనున్నపుడు దున్నుచోమన్ను రెక్కరేకును సులభముగవదలదు. పదును తక్కువగనున్నపుడు దున్నుచో గడ్డలేర్పడును. ఇట్టి విపరీతపు స్థితిగతులందు గూడ పనిచేయుటకు ప్రత్యేక తరహాల నాగళ్లు గలవుగాని మీ సామాన్యపు రకపు నాగటితోనే తగిన పదును కనిపెట్టి దున్నుకొనుట మంచిది.

3. ప్రతి దినము నాగటి నుపయోగింపకముందు మరల దిమ్మలన్నియు బిగిగానుండు నట్లు చూడవలెను.

4. దుక్కి అనుకూలముగానుండునట్లు నాగటిని సరిగా పన్నవలెను. ఇందువలన పశువులకు భారము తగ్గును. తగినంతపని జరుగును. నాగలి మొనమాత్రము ఆని నడచునట్లు పన్నగూడదు. నాగటిమడమ అంతయు నేలపైనాని నడువవలెను. ఇట్లు నడచునపుడు కూడ నాగటికర్రు నేలలోనికి దిగునట్లు నిర్మింపబడియుండును. నాగటి కర్రు మొనమాత్రమే ఆనునట్లు నాగటిని పన్నుచో, రెక్కరేకు పైకెత్తిపెట్టుకొనియుండి దుక్కి అనుకూలముగ నుండదు. నాగటికర్రు మొన త్వరలో అరిగిపోవును.

5. ఎడ్లను రెంటిని ఎంత దగ్గరగనుండునట్లు పూచిన నంతమంచిది. ఏటికోలగాని దానికి బదులుగ నుపయోగించు గొలుసుగాని కాడికి కట్టుచోటు నాగటి కెదురుగనెంత సూటిగనున్న నంతమంచిది. పశువులు ఎడముగ పూయబడి, ఏటికోల కట్టబడుచోటు నాగటి కెదురుగ లేక విస్తారముగ నొకప్రక్కనుండుచో, చాలు వెడల్పు హెచ్చుగా నుండుటకై, దానిని నేలప్రక్కకు వంచవలసివచ్చును. అట్లుచేయుచో రెక్కరేకు సరిగా పనిచేయదు. నాగటి యడుగుభాగము ముందువెనుకలకును, ప్రక్కలకును గూడ మట్టముగనుండి నడువవలెను.

6. గొలుసుకట్టి లాగింపబడు కురుచ కోలగల నాగళ్లతో తలచక్రము నుపయోగించుచో. దానివలన నాగటి చాలు లోతును హెచ్చించుటకును, తగ్గించుటకును యత్నింపకుడు. లోతును, కురుచ ఏడికోల చివరనున్న కల్లెమును సరిగా నమర్చుటవలనగాని పశువులను దూరముగ పూయుటవలనగాని సరిపుచ్చుకొనవలెను. పిమ్మట చక్రము నిందుకు తగినట్టు నేలపై ఆనునట్లు మాత్రమే అమర్చవలెను.

7. నాగటికర్రుగాని, దానిమొనగాని అరిగిపోగానే క్రొత్త కర్రునుగాని క్రొత్త మొననుగాని అమర్చవలెను. అరిగిపోయిన కర్రుతో పనిచేయుచో పశువులకు భారమెక్కువగును. దుక్కియు బాగుగనుండదు. రెక్కరేకెప్పుడును నున్నగనుండునట్లు జూచుచో దానికి మన్నంతగా అంటుకొనక సులభముగ పడిపోవుటచే పశువులకు భారము తగ్గును. రెక్కరేకును శుభ్రముచేయుటకు దానిని రాతిముక్కతో గోక కూడదు. అట్లు చేయుచో గీతలుపడి నునుపు తగ్గును.

8. మీ నాగళ్లకు విడి భాగములు కావలయుచో నాగటిని గూర్చిన వివరములను సాధ్యమైనంత విపులముగ వ్రాయవలెను. నాగటినిచేసిన కంపెనీ పేరును, నాగటి యొక్క పేరును, నంబరునుకూడ వ్రాయవలెను. ఇవి నాగటిమీద నెచటనో వ్రాయబడియుండును. ఈ వివరములు దొరకనిచో అరిగిపోయిన భాగమునుగాని దాని చిత్రమునుగాని మీ లేఖతో పంపుడు.

9. దుక్కికాలము ముగిసిన పిమ్మట నాగటిని బాగుగ శుభ్రముచేసి రెక్కరేకునకును, ఇతర అరగుదలగల భాగములకును చమురురాచి జాగ్రత్త పెట్టవలెను.

10. ఇకముందు యినుప నాగళ్లను కొనువారు ఈ పంచాంగమున అనుమతి యొసగబడిన నాగళ్ల పట్టికనుండియే తమకుగావలసిన నాగటి నెంచుకొనవలెను. ఆ పట్టికలోగాని కొన్ని రకముల నాగళ్లు వ్యవసాయ శాఖవారి డిపోలలోగూడ విక్రయమునకు దొరకును.

యస్. జి. చార్లి,

వ్యవసాయ శిల్పశాస్త్రజ్ఞుడు, కోయంబత్తూరు.

## 5. వ్యవసాయశాఖవారిచే పరీక్షింపబడి అంగీకరింపబడిన నాగళ్లు.

1. కూపరు నె 25 రు.—ఇది సతారాలోని కూపర్ ఇంజనీరింగు వర్క్సులో తయారుచేయబడుచున్నది. తేలికయినది. ప్రధాన భాగము పోత యినుముతోను రెక్క రేకు ఉక్కుతోను చేయబడును. కర్రు పోత పోయబడి చలిపదును పెట్టబడును. గుల్లగనుండు యిసుకకొండి నేలల కిది పనికివచ్చును. నాగటి చాలు 4 అంగుళములవరకు లోతును, 5 అంగుళములవరకు వెడల్పును వుండును. సామాన్యపు కర్ర నాగటిలోవలె నొకే యేడికోలయు మేడియు నమర్చి దున్నవచ్చును. మిగుల చిన్న పశువులైనను లాగగలవు. వెల నాగలి (యినుప భాగములు మాత్రము) ఒక విడి కర్రుతో సహా రూ 4-8-0 లు, విడికర్రు ప్రత్యేకముగ రూ. 0-5-6 సతారాలో కూపర్ ఇంజనీరింగు వర్క్సులోగాని వ్యవసాయ ప్రచారకుల డిపోలలోగాని దొరకును.

2. ఘూర్గరు నె 2 రు—ఇది కిర్లోస్కార్‌వాడెలో కిర్లోస్కారు సోదరుల వలన తయారుచేయబడుచున్నది. పై నాగటివలెనే యుండును. చెన్నపురి రాజధానిలోనే స్టేషనుకైనను లేక ప్యారీ కంపెనీవారి డిపోలలోనైనను వప్పగింతకు వెల రూ 4-4-0 లు. విడికర్రు అ 10 లు. చెన్నపురిలో ప్యారీ కంపెనీవారివద్దగాని యితర స్థలములందు వారి డిపోలలోగాని దొరకును.

3. కూపరు నె 11 రు.—ఇదియు సతారాలో కూపరు ఇంజనీరింగు వర్క్సులో తయారగుచున్నవి. తేలికయయిన ఉక్కు నాగలి. కర్రుపోత పోయబడి చలిపదును పెట్టబడును. గరుప నేలలకును, జిగురు నేలలకును తడిగానున్నపుడు నాగట కంటుకొను నేలలకును మిగుల ననుకూలముగాన ముఖ్యముగ సిఫారసుచేయబడుచున్నది. దమ్మునకు కూడ పనికివచ్చును. మంటిని బాగుగకోసి తిరుగవేయును. చాలు 5 అంగుళముల లోతును 7 అంగుళముల వెడల్పును గలిగియుండును. సామాన్యపు నాగటిలోవలె యేడి కోలయు మేడియు నమర్చి యుపయోగింపవచ్చును. చిన్న పశువులుగూడ లాగగలవు. పశువులకు భారమనిపించదు. ఇనుప భాగములు మాత్రము వెలకు రూ 7 లు విడికర్రు చలిపదును పెట్టినది అ 9 లు మాత్రమే. మెరుగుపెట్టని రెక్క రేకు రూ 2-4-0 లు మెరుగు పెట్టినది రూ 2-12-0 లు. సతారాలో కూపర్ ఇంజనీరింగు వర్క్సులోగాని వ్యవసాయ ప్రచారకుల డిపోలలోగాని దొరకును.

4 కిర్లోస్కారు నె 14 రు.—ఇదికూడ కిర్లోస్కార్ వాడెలో కిర్లోస్కారు సోదరులవలన జేయబడుచున్నది. కూపరు నె 11 రు నాగటిని బోలియుండును. కిర్లోస్కార్‌వాడె స్టేషనుకు వప్పగింతకు ఇనుపభాగములకు మాత్రము వెల రూ 7 లు. కిర్లోస్కార్ వాడెలో కిర్లోస్కార్ సోదరులవద్ద దొరకును.

5. రాన్సమ్సు 'జాట్'.— ఇది రాన్సమ్సు, సిమ్సు, జఫ్రీసు కంపెనివారివలన ఇంగ్లండులో తయారుచేయబడుచున్నది. నాగలి ఏక పోత పోయబడి కర్రు మాత్రము చలిపదును పెట్టబడును. సామాన్యపు నేలలలో నన్ని పనులకును పనికివచ్చును. 6 అంగుళముల లోతును, 8 అంగుళముల వెడల్పునుగల చాలు చేయును. సామాన్యపు నాగటివలె నొక మేడికర్రయు యేడికోలయు నమర్చిగాని కురుచ యేడికర్రయు రెండు ఉక్కుమేళ్లను అమర్చిగాని వుపయోగింపవచ్చును. మధ్యమ పరిమాణపు పశువులు గావలయు . కర్రు చివర అరిగిపోయినపుడు మార్చదగిన నక్కు గలదు. కలకత్తాలో వప్పగింతకు యినుప భాగముల ఖరీదు సుమారు రూ 22-8 0 లు.

విడిక్రరు రూ 1-8-0 లు. విడినక్కు అ 6 లు. కలకత్తాలో జస్సప్ కంపెనీవారివద్ద దొరకును.

6. రాన్సోమ్సు మన్సూర్.—ఇదియు పై కంపెనివారిచేతనే చేయబడును. జాతు నాగటినే బోలియుండును కాని యిందు రెక్కరేకు యెడమవయివునసుండును, ఆ కంపెనీ వారివద్దనే అదే వెలకు దొరకును.

7. కూపర్ నె 26 రు.—ఇది సతారాలో కూపర్ ఇంజనీరింగు వర్కుసులో తయారగుచున్నది. ఏక పోతపోయబడి చలిపదును పెట్టబడిన నాగలి అన్ని పనుల కును పనికివచ్చును. సామాన్యపు నేలలన్నిటిలో ముఖ్యముగ యిసుక నేలలలో మంచి పనిచేయును. 6 అంగుళముల లోతును, 8 అంగుళముల వెడల్పుగల చాలుచేయును. పొడవు యేటికోలయు ఒంటి మేడియు అమర్చిగాని కురుచ యేటికోలయు జంట వుక్కు మేడియు నమర్చిగాని వుపయోగించదగును. మధ్యమ పరిమాణముగల పశువులు గావల యును. క్రరు చివరమార్చ వీలగు నక్కుగలదు. ఇనుప భాగములు మాత్రము వెల రూ 8-12-0 లు, విడిక్రరు నక్కు సహా రూ 1-1-0 లు, విడి నక్కు రూ. 0-3-6, విడిక్రరు మాత్రము రూ. 0-10-0. సతారా కూపర్ ఇంజనీరింగు వర్కుసులోగాని వ్యవసాయ ప్రచారకుల డిపోలలోగాని దొరకును.

8. కిర్లోస్కారువారి 'జమీందార్'—ఇదియు కిర్లోస్కార్‌వాడిలో కిర్లో స్కారు సోదరులచే చేయబడుచున్నది. కూపర్ నె 26 రు నాగటిని బోలియుండును. చెన్నపురి స్టేషనువద్దగాని ప్యారీ కంపెనీవారి డిపోలలోగాని కురుచ క్రరయేటి కోలతోను, జంటు మేళ్లతోను రూ 25 లు, చలిపదునుపెట్టిన విడిక్రరు రూ 1-4-0 లు, విడి నక్కు అ 10 లు. చెన్నపురిలోని ప్యారీ కంపెనిలోగాని యితరచోట్లవారి డిపోలలో గాని దొరకును.

9. రాన్సోమ్సు విక్టరీ.—ఇది పైన చెప్పబడిన జాతు, మాన్సూర్ నాగళ్లు చేయు కంపెనివారిచేత చేయబడుచున్నది. అంతయు వుక్కుతో చేయబడును. కురచ యేటికోలయు ఒంటి లేక జంట మేళ్లనుకూడ వుక్కుతోనే చేయబడును. గరుప నేలలకును బంక నేలలకును అనుకూలించును. ఆరు అంగుళములలోతును, 9 అంగుళ ములవెడల్పునుగల చాలు చేయును. ఒక జత పెద్ద యెద్దులుకావలెను. కలకత్తాలో వప్ప గింతకు జంట మేళ్లతో రూ 35 లు. ఉక్కుక్రరు రూ 2-12-0 లు. విలియము జాక్సు, నెకిండు లైను బీచి, చెన్నపట్నంలో దొరుకును.

యం. జి. ఛాగ్లీ,
వ్యవసాయ సిల్ప పరిశోధకుడు.

---

## 6. ఎరువును సంగ్రహించు సమస్యనుగురించి సలహా.

జనసంఖ్య హెచ్చు అగుటవలన సాధారణముగా సాగులోనుండు భూములనుండి తీవ్రమైన సేద్యముచేసి, మంచి ఫలితము నిచ్చు విత్తనపు జాతులను వాడుకచేసి యెక్కువ పంటలను తీయుట అవశ్యకమైనది. ఈ కారణమువలన యెరువు సంపాదించుట రాను రాను బహుకఠినమైన సమస్యగా నేర్పడుచున్నది.

పంటలు భూమినుండి యెక్కువ ఆహారము, తీసివేయునప్పుడు, తిరిగి మనము తగిన యెరువు వేయనియెడల నిలవమీద భూములు బీదగిలి చెడిపోవును.

2. మొక్కల యాహారములో ముఖ్యాంశములైన భాస్వరమును, అంగ సంబంధమైన పదార్థములును మన భూములలో తక్కువ. కల్పితపు యెరువులు నేలలో తగినంత అంగసంబంధమయిన యే పదార్థము లేనప్పుడు వేసినయెడల మేలుకన్న యెక్కువ హానిచేయును. గనుక మన భూములలో కల్పితపు యెరువులు వేయుట కనుకూలించుటకును కూడా నత్రజని నిచ్చుటకును మనము మరింత అంగసంబంధమయిన పదార్థమును వేయవలెను. ఈ పని గానుగపిండి వేయుటవలన చేయవచ్చునుగాని, ఖరీదు హెచ్చగుటవలన సాధారణపు రయితులకు సాధ్యపడదు. అతనికి అందుబడిగా నున్నది పశువుల యెరువొక్కటే. పశువుల యెరువుయొక్క పరిమాణమును స్వాభావమును అభివృద్ధి చేసినయెడల యీ సమస్య కొంతవరకు తీర్మానమగును. ఎందుచేతనన మంచి పశువులయెరువులో స్వల్పముగా భాస్వరపు యెరువును, పొటాషు యెరువును చేర్చిన యెడల అది బలవంతమైనదియు సంపూర్ణమయినదియు నగును.

ఇట్టి సందర్భములలో పశువుల యెరువుయొక్క పరిమాణమును, స్వాభావమును అభివృద్ధిచేయుటకు రయితు యెట్టి కష్టమయినను పడవచ్చును. ప్రస్తుతపు అశ్రద్ధతో కూడుకున్నటువంటి పద్ధతి వెంటనే వదిలిపెట్టి యీ దిగువ నుదహరింపబడు పలువిధములయిన పద్ధతులను అవలంబించవలెనని రయితునకు హెచ్చరికీయబడుచున్నది. వాటిలో నేది సాధారణపు పద్ధతికన్న లాభమో దానిని వాడుకలో పెట్టుకొనవచ్చును.

(ఎ) గచ్చుకొట్టపు పద్ధతి — ఈ పద్ధతిలో పశువులను మంచి గచ్చు కొట్టములో కట్టుదురు. దీనిలో నేల మేతదొనెనుండి మూత్రము పారెడు కాలువప్రక్కకు కొంచెము యేటవాలుగను, నీరింకనిదిగను వుండును. మూత్రము పారెడు కాలువద్వారా మూత్రము బైటనున్న రొచ్చుగుంటలోనికి కారిపోవును. ఈ గుంటకూడ నీరింకనిదిగ నుండవలెను పైన మంచి మూత వుండవలెను. ఇది నిండినప్పుడు మూత్రమును తీసి యెరువు గుంటలో పోయుదురు. ఎరువు గుంటకూడ రొచ్చుగుంటవలె నీరింకనిదిగ నుండవలెను. పైన యెండవానలనుండి కాపాడుటకు మంచిపాక వేయవలెను. కొన్ని సమయములందు మూత్రపు కాలువ తిన్నగా యెరువు గుంటలోనికే వుండును. నిలవపైన యీ పద్ధతి చాల లాభకరమయినది.

(బి) విడికొట్టపుపద్ధతి.—ఈ పద్ధతిలో సాధారణముగా ఒక జత పశువులకు సరిపోవు నంతంత చిన్న గదులక్రింద భాగింపబడును. అడుగుభాగము నేలమట్టముకన్న 2 అడుగులు మొదలు 2½ అడుగులలోతు త్రవ్వబడియుండును. గోడలు ఇటుకలతోనూ, సున్నముతోనూ కట్టబడును. అడుగున నేల నీరింకనిదిగ నుండును. మేత క్రిందకుమీదికి కదల్చుటకు వీలుగానుండు తొట్టెలలో వేయబడును. ప్రతిదినము పేడను చదరముగా నెరిపి దానిపైన తినగా మిగిలినదంతయునుగాని చెత్తనుగాని వేయుదురు. ఎండు ఆకులు, కలుపు మొక్కలు, యితర పాడి పదార్థములుకూడ కొద్దికొద్దిగా వీటిపైన వేయవచ్చును. పశువులు విడిగా తిరుగునప్పుడు మూత్రము అన్ని ప్రక్కలను సరిగా చెత్తలోనికింకును. అప్పుడప్పుడు వారలంటుకొంచము నీరుజల్లి బాగుగ తొక్కవలెను. దీనివలన యెరువు సరిగా మగ్గును. ఈ పద్ధతిలో యెరువు వృద్ధిఅయి మంచి ఫలవంతమయినదగును.

ఈ పద్ధతి డెల్టా ప్రాంతములలో నీటిమట్టముపైగా నుండుటవలన అంత అనుకూలమైనదిగాదు.

(సి) పొడిమంటి పద్ధతి.—ఈ పద్ధతిలో పశువుల పాకలోని నేలపైన 6"—9" వరకు పొడిమంటిని జల్లుదురు. కాని 6"—9" లోతునేల త్రవ్వి దానిలో పొడి మంటిని గుల్లగా వేయుటమంచిది. పేడ, కసవు ప్రతిదినము తీసి యెరువు గుంటలో వేయుదురు. మూత్రము పొడి మంటిలోనికింకును. నేల నప్పుడప్పుడు త్రొక్కలించి పొడిపొడిమన్ను పైకివచ్చునట్లు చేయుదురు. మన్నంతా మూత్రముతో పూరునంత వరకు యిట్లు చేయుదురు. అటు తరువాత యీ మంటినితీసి యెరువుగుంటలో వేయుదురు. ఇది ఖర్చు తక్కువైన పద్ధతయినను మంచి ఫలితము నిచ్చును.

ఎరువు గుంటకుపైన ఎండవానలనుండి కాపాడుటకు యేదైన ఒకవిధమైన పాకను వేయవలెను. పేడ, పుచ్చు, మన్ను వగైరాలు గుంటలో సరిగా నెరుపవలెను.

(డి) గట్టినేల రొచ్చుకాలువ పద్ధతి.—ఈ పద్ధతిలో పశువులు పాకలోని నేల కంకరతోనయినను, రాతి పలకలతోనయినను గట్టిగ నీరింకనిదిగ చేయవచ్చును. మేత దోనెనుండి వెలుపలవైపుకు కొంచము యేటవాలుగ నుండవలెను. దిగువవైపు 1 అడుగు వెడల్పు 9 అంగుళముల లోతుగల కాలువ త్రవ్వి దానిలోనికి మూత్రము పశువులు నిలుచు స్థలమునుండి కారిపోవునట్లు బహు చిన్న చిన్న పిల్ల కాలువలు కావలసినన్ని తీయవలెను. పెద్ద కాలువ నీరింకనిదిగ నుండుట మంచిది. ఈ కాలువలో నేవైన అంగసంబంధమైన చెత్త, యెండాకులు, కలుపు మొక్కలు కళ్లములోని చెత్త మొదలయిన వాటతో మూత్రమింకుటకుగాను నింపవలెను. ఈ చెత్త మొదలయినది కుళ్లుటకు ప్రారంభించినను రొచ్చుతో నిండినను దానిని తీసి యెరువు గుంటలో వేసి మరల అటువంటి చెత్తతో కాలువ నింపవలెను. ఈ పద్ధతివలనకూడ ఖర్చు తక్కువ, ఫలమధికము.

ఎరువు గుంట యీ పద్ధతిలోకూడ పొడిమంటి పద్ధతివలెనే వుండవలెను. పైన పాక వేయుటకు వీలులేనప్పుడు యెరువు గుంటచుట్టూ వర్షపునీరు లోనికిపోకుండా మంటి కట్టపోయవలెను. పశువుల యెరువు మంచిపంటకు యెక్కువ పేరు పొందిన యెరువు. అట్టి ప్రాముఖ్యతకు ముఖ్యమైన నత్రజని యెండతగిలినయెడల గాలిలోనికి పోవును. ఈ నష్టము తగ్గించుటకు పైన పల్చగా నొక వరుసమన్నగాని గడ్డిగాని వేయవలెను.

అపుడపుడు పేడతోకూడ పల్చగా నొక్కొక్క వరుస పచ్చియాకులు వేయుటవలన యెరువుయొక్క గుణము చెడకుండ యెరువును వృద్ధిచేయవచ్చును. పాడియాకులు కళ్లములోని చెత్త మొదలయిన అంగసంబంధమైన పొడిపదార్థములుకూడ వేయవచ్చును కాని వేయుటకుముందు పదునుచేయవలెను. గుంటలో వేసిన పదార్థము సరిగా నెరపవలెను. యిది ముఖ్యము.

టి. బుధవిదేయ రావు,
వ్యవసాయపు డిప్యుటి డైరెక్టరు.

---

## 7. ఉత్తర సర్కారుల్లోని బత్తాయి, నారింజ, నిమ్మ వగైరా తోటల విశ్రాంతియు, కాపునుగురించిన యంశములు.

ఈ క్రింద వివరించిన యంశములు తోటయజమానుల యుపయోగమునకై అనుభవముపై వ్రాయబడినవి :

(1) వర్షాకాలములో తోటయందు నీరు నిలువకుండ చూడవలెను. అవసరమైనచో 1½—2 అడుగులు లోతు గల కాలువలను చెట్ల వరుసలకు మధ్య త్రవ్వవలెను. కాలువలలోని నిలువ నీరు పైకిపోవుటకు మట్టము సరిపోనియెడల ఆర్కిమిడియక్ స్క్రూతో నీరు అప్పుడప్పుడు తోడుచుండవలెను.

(2) వర్షాకాలాంతమున, భూమి బాగుగా ఆరువరకు తోటను దున్నకూడదు. రేవడి మట్టి నేలందు భూమి పగులువరకు వేచియుండి తరువాత గుద్దలి లేక గొర్దాళికముతో త్రవ్వవలెను.

(3) ప్రతిచెట్టు చుట్టూవున్న మన్ను 4 మొదలు 8 అడుగులు వైవారము వరకు వ్రేళ్లు తెగకుండగా త్రవ్వవలెను. ఆరు అంగుళములలోతువరకు మన్నుతీసి వెలుపలచుట్టూ పోయవలెను. అట్లు చేసినచో క్రింది భాగము వెలువడి, ఆ చెట్టునకు విశ్రాంతి కలుగజేయును.

(4) చెట్టునకు సరియయిన విశ్రాంతి నిచ్చిన తరువాత అనగా ఆకులు వడలుటకు ఆరంభించిన పిదప పాదులనుండి త్రవ్విన మన్నుతో ఎరువు కలిపి పాదులను నింపవలెను.

(5) బత్తాయి నారింజ వగైరా చెట్లకు పశువుల గెత్తము వేయరాదు. కాపు ప్రారంభించుటకు పూర్వము రెండుసంవత్సరములనుండియైనను దీనిని వేయుట మానవలెను. ఈ యెరువు వేసిన యెడల "మొదలు చీకు" తెగులు (ఫుట్‌రాట్) వచ్చునని కనుగొనబడినది. చెట్టు 1 కి 3—6 పౌనుల అమ్మోనియం సల్ఫేట్ ఎరువున్ను 30 మొదలు 60 పౌనులు లేక 2—4 తట్టల గొర్రె పెంటయు వేయుట మంచిది. రెండు మొదలు నాలుగు తట్టల బూడిదను శ—1 బండి ఆరిన వండ్రు మన్నును కలిపి వేయవలెను.

(6) ఎరువు వేసిన పిదప ఒక పర్యాయము నీరు పూర్తిగా కట్టవలెను. తరువాత చెట్టు పూతకు వచ్చువరకు కొంచము కొంచముగా నీరు కట్టుచుండవలెను. పిమ్మట పిందె కట్టువరకు నీరు కట్టుట మాననైనను మానవలయును. లేనియెడల కొంచముగా తడుపుచుండవలెను. తరువాత నీరు కట్టుటకు ఆరంభించి ఎండలు ముదిరిన కొలది చరు ఎక్కువగాను, తరుచుగాను కట్టవలెను.

(7) ఈ జాతుల చెట్లకు సాధారణముగా ఫిబ్రవరి మొదలు మార్చి మాసముల వరకు పూత సమయము కావున జనవరి మాసము మధ్య యెరువు వేయుట, నీరుకట్టుట చాలా ఉత్తమము. ఆకాలమునకు ముందే చెట్లు సరియయిన విశ్రాంతి పొందిన సూచనలు కనబడుచో కొంచము ముందుగనే అట్లు చేయవలెను.

(8) తగిన కాలమున విశ్రాంతి యిచ్చుటవల్లను, ఎరువు వేయుటవల్లను, నీరు కట్టుటవల్లను, పూత కాలముకన్న త్వరలోగాని ఆలస్యముగాగాని వచ్చునటుల చేయగలము. దానివలన కాయలు దొరకు కాలము యెక్కువ కాగలదు.

(9) వర్షములు ముగిసిన వెనుక (చెట్లకు విశ్రాంతి యివ్వకుండగను ఎరువు వేయకుండగను) నీరు కట్టుటవలన చెట్లు సకాలమున పూయకుండచేసి, పూతకాలము

దాటినపిమ్మట తోట నారగట్టి మరల తొలకరిలో ఎరువువేసి నీరుకట్టుచో అవి పిమ్మట పూచి మార్చి మొదలు మే వరకు పండ్లు లభించునట్లు రెండవకాపు కాయింపవచ్చును.

(10) నీరు బాగుగా ఇంకు నేలలందు, స్వల్పముగా వర్షించు సంవత్సరములలో చెట్లు సెప్టెంబరు, ఆక్టోబరు మాసములలోకూడ పూయునట్లు చేయవచ్చును. ఇందు కొకనేల ముందుగా ఎరువు యెక్కువగా వేయవలెను.

జి. జోగిరాజు,
వ్యవసాయ అసిస్టెంటు డైరెక్టరు.

---

## 8. పులిచే ప్రత్తిని నిషేధించు చట్టమును గురించిన సూచన.

ప్రప్రథమమున పులిచే ప్రత్తిని మధ్యపరగణాలనుండి తిరునెల్వేలి జిల్లాలో రహితులు ప్రవేశపెట్టిరి. గత మూడు సంవత్సరములలో యీ ప్రత్తి పంట పెచ్చు పెరిగెను. పులిచే సత్తి చాలా తగ్గురకము. ప్రత్తి విడ కురుచగను, ముదుగగనునుండును. అయితే ఎక్కువగా తూగును. ఈ ప్రత్తిని బజారులో వ్యాపారస్తులు బంగళా ప్రత్తి (Bengals.) యందురు. తిరునెల్వేలి ప్రత్తికిని, పులిచే ప్రత్తికిని తారతమ్యముచూడ పులిచే ప్రత్తి చాలా తగ్గురకము. ఇంతవరకును పులిచే ప్రత్తిని యితర మంచి ప్రత్తి రకములలో యెక్కువ తూకము వచ్చుటకు కల్తీచేయుచుండిరి.

2. బొంబాయి టెక్నలాజికల్ పరిశోధనాశాలాధికారులు పరిశుద్ధమైన కరుంగన్ని ప్రత్తిలో పులిచే ప్రత్తిని కలిపిన యేరకము దారము వచ్చునో పరీక్ష చేసి యీ దిగువ కనుపరచిన పట్టికను ప్రచురించిరి :—

| | |
|---|---|
| కల్తీలేని కరుంగన్ని ప్రత్తి (సి 7 ... | 30 నంబరు దారము. |
| 90 వంతులు కరుంగన్ని ప్రత్తి, పదివంతులు పులిచే ప్రత్తి. | 20 ,, |
| 80 వంతులు కరుంగన్ని ప్రత్తి, యిరువది వంతులు పులిచే ప్రత్తి. | 16 ,, |
| 70 వంతులు కరుంగన్ని ప్రత్తి, 30 వంతులు పులిచే ప్రత్తి. | 16 నంబరు దారము. |
| 60 వంతులు కరుంగన్ని ప్రత్తి, 40 వంతులు పులిచే ప్రత్తి. | 14 ,, |
| 50 వంతులు కరుంగన్ని ప్రత్తి, 50 వంతులు పులిచే ప్రత్తి. | 12 ,, |
| కల్తీలేని పులిచే ప్రత్తి ... ... | 8 ,, |

3. పై విధముగా కల్తి జరుగుచుండుటవలన శుభ్రమైన తిరునెల్వేలి ప్రత్తిని పండించు రయితుకు లాభము లేకపోయెను. కాబట్టి రయితుకు సహాయముచేయు నుద్దేశ్యముతో సర్కారువారు మధుర, తిరునెల్వేలి, కోయంబత్తూరు, రామనాడు

జిల్లాలలో పులిచే ప్రత్తిని పండించకూడదని చట్టమును చేసిరి. ఈ చట్టమును 1932 వ సంవత్సరములో ప్యాసుచేసి అందులోని నిబంధనలను అమలులోనికి తెచ్చిరి.

4. చట్టములోని ముఖ్య నిబంధనలు 4, 5 సెక్షనులలో నిమిడియున్నవి. ఆ నిబంధనల సారాంశమును యీ క్రింద కనుపరచినాము :—

చట్టములోని 4 వ సెక్షను నిబంధనలు.

(ఎ) పులిచే ప్రత్తి యితర ప్రత్తితో కలిపిగాని, కల్తీచేయకగాని పండించ కూడదు.

(బి) పులిచే ప్రత్తి యితర ప్రత్తితో కల్తీచేయకూడదు.

(సి) పులిచే ప్రత్తితో కల్తీచేసిన యే యితర ప్రత్తిని కొనిపుంచినను, అమ్మినను ప్రత్తి నిషేధపు చట్టము క్రింద సర్కారువారు శిక్షింతురు. మొదటి తప్పిదమునకు యిరువది రూపాయలు, రెండవ తప్పిదమునకు యేబది రూపాయలు జరిమానా వేయుదురు.

చట్టముయొక్క 5 వ సెక్షను ననుసరించి వ్యవసాయపు డిపార్టుమెంటు జిల్లా వుద్యోగస్థులు (Gazetted Officers) పులిచే ప్రత్తిని పైరు చేయు రయితుల స్వంత ఖర్చులతోటి పులిచే ప్రత్తి మొక్కలను లాగివేయుంచవలెను. పులిచే ప్రత్తికాని, దూదికాని, విత్తనములుకాని రయితులవద్ద గనుగొన్నట్టయిన తమపై అధికారులకు తెలియచేయవలయును.

5. పులిచే ప్రత్తి పంటకు రయితులే ప్రధాన కారణము గాన వారు యీ ప్రత్తి విత్తనములను, యితర యే ప్రత్తి విత్తనములతోను కల్తీచేసి విత్తకూడదు. వారికి పులిచే ప్రత్తి విత్తనములకు యితర ప్రత్తి విత్తనములకు భేదము తెలియనట్లయిన తమ వూరికి దగ్గరగానున్న వ్యవసాయబోధకుని సహాయము కోరవచ్చును. శుద్ధమైనప్రత్తి విత్తనములను వ్యవసాయ డిపార్టుమెంటువారి సహాయముతో పొందవచ్చును.

---

## 9. మన తోటలలోని కొన్ని సామాన్యపు చీడలు, వాని యదపు.

ఫలారామములందును, పూలతోటలందును, కూరవెరల్లయందును సామాన్యముగ గానవగు కొన్ని చీడలను అదపులో నుంచుటకు సులభసాధనము లేవైన గలవాయని రాజధానియందలి వివిధప్రాంతములనుండి లేఖలు వచ్చుచున్నవి. కావున, అట్టి చీడలను నివారించుటకు యీ క్రింద నీయబడు సలహాలు వుపయోగకరముగనుండునని తలచబడుచున్నది.

చీడల నన్నిటిని రెండు అనుకూలమగు తరగతులుగ విభజింపవచ్చును. అందు ఆయా యుద్భిజ్జ భాగములను కొరికిగాని, చింపిగాని, నమలిగాని నాశనము చేయువాని తరగతి యొకటి. మొక్కల రసమును పీల్చుకొని వానిని శోషింపచేయు వాని తరగతి మరియొకటి. మిడతలు, వండు పురుగెలు గొంగళి లేక పచ్చ పురుగులు మొదలగు భక్షక కీటకములు మొదటి తరగతిలో చేరును. మొక్కలకు బట్టు నల్లి జాతులు,

పొలుసు పురుగులు, పిండి పురుగులు, మొదలగు రసాస్వాదక కీటకములు రెండవ వర్గతిలో చేరును.

## రసాస్వాదక కీటకములు.

(i) మొక్కలకు బట్టుపేలు. వీనికి బంక అనికూడ పేరు. అరవమున అనుకుణి అందురు ఇంగ్లీషున ప్లాంటు లైసు (Plant lice) అందురు. వీనిచే చెరుపబడని మొక్కలు మిగుల అరుదు. ఇవి సామాన్యముగ సంఘములుగ గానవగును. లేత చిగుళ్లు, ఆకులు, మొగ్గలు, పూవులు మొదలగు మృదువగు భాగములందు తరుచ గానవగును. ఈ పేలు విస్తారముగ బట్టినపుడు చిగుళ్లుగాని మొగ్గలుగాని చాల నష్టపోవును. ఆకులు చుట్టుకొనిపోవును, లేత కొమ్మలు ఎదుగుట మానును. క్రమముగ చీడపట్టిన భాగములు వడలి యెండిపోవును. బాగుగ పరిశీలించినచో, పేనుకు మూడు జతల కాళ్లును, ఒక జత స్పర్శకములు (feelers) ను, తలయందొక తొండమును గానవగును. ఇవిగాక వెనుక ప్రక్క యుండెమున కిరుపార్శ్వములందును రెండు గొట్టములను బోలియుండు మించులుండును. ఇవి తేనె గొట్టములు. వీని నుండి పేను ఒక విధమగు మధుర ద్రవమును వెలువరించును. దీనివలననే చీమలు విస్తారముగ నాకర్షింపబడును. పేలలో చాల భాగము రెక్కలు లేనివిగ నుండును. ఇవి మెల్లగ మాత్రమే సంచరింపగలవు. ఇట్టి పేలవలన బాధింపబడు సామాన్యపు జాతి అనుపమొక్క. పేలకొలది పేలు లేత కాడలను, కొమ్మలను, పూవులను పూర్తిగ గప్పివేసియుండుట తరుచు కానబడును. ప్రత్తి పొగాకు, వంగ, గోబి (cabbage) ముల్లంగి, అవిశె, గులాబీ, మామిడి, నారింజ యివియన్నియు నీ చీడకు తరుచు లోనగుచుండును.

(ii) పిండి నల్లులు.—పేలవలెనే యివియు మొక్కలను చెరుపును. కాని యివి వేరు రూపముగలవి. వీని మృదువగు శరీరముపై పిండివంటి పదార్థము కప్పియుండును. కొన్నిటిలోనిది పలుచగను, కొన్నిటిలో విస్తారముగను నుండును. కొన్నిటిలో నిట్టి పదార్థము కీటక శరీరమునుండి తోకలుగ పెరిగియుండును. ఈ ఆచ్ఛాదనమునుండియే యీ కీటకములకీ పేరు గలిగెను. ఉద్యానవనములలో క్రోటనులకును యితర జాతులకును తరుచుపట్టు తెల్లని మృదువయిన పురుగు యీ పిండి నల్లి జాతికి సామాన్యోదాహరణము. ప్రత్తి, వంగ, మామిడి, చెఱకు, అనాస, సీమవంగ మొదలగు జాతులను వేర్వేరు జాతుల పిండినల్లులు పట్టుచుండును.

(iii) పొలుసు పురుగులు (Scale insects) :—పై రెంటివలె నివియు మొక్కలకు హానిచేయును. ఇవి పైకి జీవ రహితములుగ గనబడును. వీని పూర్ణదశలోనివి సామాన్యముగ మొక్కలనంటి వాని యుపరితలమున పొలుసులవలె గానబడును. అవి చిగుళ్లకును, కొమ్మలకును యితర లేతభాగములకును బట్టును. ఫలవృక్షములును కాఫీ, తేయాకు మొదలగు పారిశ్రామిక సస్యములును వీనివలన విస్తారముగ నష్టము నొందును. కొండలపై కాఫీ తోటలకు బట్టు గోధుమరంగు పొలుసును, ఆకుపచ్చ పొలుసును యీ పొలుసు పురుగులకు ప్రసిద్ధమైన యుదాహరణములు. క్రోటను, జామి, దబ్బ, వేప, తుమ్మ, మామిడి మొదలగు జాతులపైనగూడ పరిచయముగల పొలుసు పురుగుల గానవగును.

రసమును పీల్చు కీటకములలో తోటలలో తరచుగా నగునవి పై మూడు విధములయినవే. అప్పుడప్పుడు యితర విధముల రసాస్వాదక కీటకములుగూడ కొన్ని గానరావచ్చును.

## భక్షక కీటకములు.

ఇవి పయినీ పేర్కొనబడిన రసాస్వాదక కీటకములంత సామాన్యముగ గానరావు అంత చలపాదించునవియు గావు. ఇందు ముఖ్యమైన వీ క్రింద పేర్కొనబడును.

(i) ఆకులను దిను వండు పురుగులు.—ఇందు రాత్రులందు గులాబీ మొదలగు తోటలందలి మొక్కల యాకులను దిని వేయు వండు పురుగులును, వంగచెట్లకు బట్టు అక్షింతల పురుగులును, గుమ్మడిపండు పురుగులును, గోబి, ముల్లంగి మొదలగు జాతులకు బట్టు దోమలవంటి చిన్న వండుపురుగులను ధాన్యాదులకు బట్టు నుసి పురుగులను యీ తరగతిలో చేరును. వీనిలో కొన్నిటి డింభములు. ఆయా జాతుల వేళ్లకును, కొమ్మలకును కాండములకును గూడ హానిచేయును.

(ii) గొంగళి లేక పచ్చ పురుగులు.—ఇందు చాల తరగతులు గలవు. కొన్ని రోమములుగాని ముండ్లుగాని గలిగియుండును. వీనికి గొంగళి పురుగులని పేరు. కొన్ని నునుపుగ నుండును. వీటికి పచ్చపురుగులని పేరు. కొన్నిటిలో తలపై కొమ్ము లుండును. కొన్ని నడచునపుడు వెన్నుపైకి లేవనెత్తి మరల ముందుకు సాగును. ఇట్టి వానికి జలూకములని పేరు. వీనిలో ననేక రంగులు గలవియు వేర్వేరు స్వభావములు గలవియు రకములు గలవు. కొన్ని ఆకులను మొగ్గలను తినును. కొన్ని మొక్కలను నేల మట్టమునకు గొరికివేయును. మరికొన్ని మొక్కల కాండములను పండ్లను దొలుచును. ఈ తరగతి కీటకములు డింభదశలోనే మొక్కలకు చెరుపు చేయును గాని పూర్ణదశ నొందిన శీతాశోక చిలుకలుగాని దీపపు పురుగులుగాని నష్టమును గలుగచేయవు.

(iii) మిడుతలు, ఆకులను కత్తెరించు తేనెటీగలు.—మిడుతలు సామాన్యముగ లేత మొక్కలను నాశనము చేయును. కొన్ని జాతుల యీగలు (సామాన్యముగ తేనె నిచ్చునవి కావు) గులాబీ, తంగేడు మొదలగు జాతుల ఆకులను గత్తెరించి తమ గూళ్లకు తీసికొనిపోవును.

## నివారణోపాయములు.

చీడలవలని నష్టమును తొలగించు కొనుటలో నవిపట్టకుండచేయుట, పట్టినపిమ్మట వానిని నాశనము చేయుటకంటె యెపుడును సులభము. వ్యవసాయదారుడు తన సస్యముల నెల్లపుడు శ్రద్ధతో చూచుచు, అనుభవమువలన యెప్పుడే చీడపట్టునో ముందుగ నూహించి అవి విజృంభించకుండ ముందుగనే ప్రతీకారము చేయవలెను. చీడకనబడగనే పనిపట్టు నెడల చాలచీడలను పురుగులను చేతితో నేరివేయుట, వలలతోగాని, సంచులతోగాని పట్టుట, నేలను గొప్పుత్రవ్వుట. చీడపట్టిన భాగములను చేదించుట మొదలగు సులభోపాయములచేతనే జయింపవచ్చును. ఇట్టి చాకగను, సులభముగ చేయదగినట్టి పను లుపచరించనపుడే వాని నాశనముకొరకు మందుల నుపయోగింపవలెను. మందుల నుపయోగించుటలోగూడ తరుణములో పనిపట్టినయెడల చాలపనియు, సొమ్మును కూడ వచ్చును. ఇట్లు చేయగలుగుటకు ఆయా చీడ పురుగుల స్వభావమును జీవిత విధానమును తెలిసికొనుటకూడ ఉపయోగకరము.

కీటక నాశనమున కుపయోగింపబడు మందుగూలుడ రసాస్వాదక జాతులకును భక్షక జాతులకును వేర్వేరుగ నుండవలెను.

రసాస్వాదక కీటకములపై సామాన్యముగ స్పర్శనాశనులు అనదగు మందులుపయోగింపవలెను. ఇవి కీటకముల శరీరము నంటినపుడు, వాని యూపిరి సలుపనీయకుండ చేయుటచేగాని, వాని శరీరమున నుద్రేకము గలిగించిగాని వానిని జంపును. ఇటు వానిని జంపు మందులలో సామాన్యమైనవి:—

(i) సబ్బు నీళ్లు.—సామాన్యపు కడ్డీ సబ్బు కరగించిన నీరు మృదువగు శరీరము గల పేలను, రెక్కల పిండి పురుగులను నాజూకైన డింభములను నాశనముచేయుటను మిగుల లఘువయినట్టియు చవుకయైనట్టియు స్పర్శనాశని. సోడా సబ్బు కంటె పొటాషు సబ్బు నీటిలో బాగుగ గరగి సులభముగ పిచికారీ చేయవీలగును. ఒక పౌను సబ్బును 5, 6 గాలనుల (కుంచముల) నీటిలో కరగించిన పేలకును యితర మృదువగు కీటకములకును తగినమందగును.

(ii) కిరసనాయల్ పాలు.—ఇది కీటక నాశనమగు మందులలో చాల పురాతనమైనది. ఇది యెప్పటి కప్పుడీ క్రింది విధముగ చేసికొనవచ్చును.—అర పౌను సబును సన్నముగ తరిగి, 1 గాలను మరుగుచున్న నీటిలో వేసి కరగించవలెను. మంట తీసివేసి, ఆ సబ్బు నీటిలో 2 గాలనుల కిరసనాయిల్ పోసి రెండును బాగుగకలిసిపోయి పాల రూపము వచ్చువరకు బాగుగ చిలుకవలెను. పిచికారీతో మరల మరల నందే పిచకారీ కొట్టుచుండినచో నిట్లు రెండును కలసి పాల రూపము వచ్చును. సరీగా తయారు చేసినయెడల నీ మిశ్రమము కొంతకాలము నిల్చియుండును. అవసరమైనప్పుడెల్ల దీనికి 15—20 రెట్లు నీటిని గలిపి పిచికారీ చేయవచ్చును. నాశనము చేయవలసిన చీడను బట్టికూడ నింద కిరసనాయల్ కొంచెము హెచ్చుగగాని తక్కువగగాని కలుపవచ్చును. ఉపయోగించు నీరు వచ్చ నీరయినయెడల సబ్బును కొంచెము హెచ్చుగ నుపయోగింపవలెను. ఈ మందు పిచికారీ చేసినప్పుడు చీడ పురుగుల కంటుకొనుటకుగాను దీని నుపయోగించుటకు ముందు, ఒకటి రెండు ఔన్సుల సరేసుకూడ నిందు కరగించుట మంచిది.

(iii) చేపనూనె రోజిన్ సబ్బు.—ఇది మలబారు జిల్లాలోని కాలికట్టునందలి కేరళ సబ్బు ఫ్యాక్టరీలో చేయబడి పౌను 5 అణాల చొప్పున విక్రయింపబడు కీటకనాశని. ఇది నలుపుతోగూడిన గోధుమ వర్ణము గలిగి మెత్తగ నుండును. దీనిని చల్లని నీటిలోనే కరగించి యుపయోగించవచ్చును. అన్ని రకముల రసాస్వాదక కీటకములకును బనికివచ్చును. ముఖ్యముగ పేలు, పొలుసు పురుగులు మామిడి చెట్లకు బట్టు తేనె మంచు పురుగులు వీని కుపయోగింపదగును. ఒక పౌను సబ్బును సామాన్యముగ 8 గాలనులనీటిలో కరిగించవచ్చును. చీడ పురుగు పైపొర మృదుత్వమునుబట్టి హెచ్చు సబ్బునుగాని, తక్కువ సబ్బునుగాని ఉపయోగింపవచ్చును. కఠినమగు పొలుసు గల జాతులకు 4, 5 గాలనులలోనే 1 పౌను సబ్బును కలుపవచ్చును. కొన్ని సందర్భములలో రెండవసారిగాని, మూడవసారిగాని యీ నీటిని చల్లవలసి యుండును. ఇట్లు చేసినచో వెనుకగా పొదిగిన పిల్లలును, తొల్లిసారి చల్లినపుడు మందు అంటని పురుగులును కూడ నశించును.

(iv) పొగాకు కషాయము.—పొగాకును తత్సంబంధమగు నితర ద్రవ్యములును మనకు లభించు కీటక నాశనులలో ప్రశస్తమైనవిగ పరిగణింపవచ్చును. పొగాకునుండి తయారుచేసిన మందులు వేర్వేరు నామములతో విక్రయింపబడుచున్నవి. కాని సామాన్యోపయోగమునకు కావలసి వచ్చినపుడెల్ల మనమే పొగాకు కషాయమును చేసికొని

యుపయోగించుకొనవచ్చును. ఒక పౌను పొగాకును (పొగాకు కాడలు పొడి మొదలగు విసర్జింపబడిన భాగములే చాలును) ఒక గాలను నీటిలోవేసి అరగంటసేపు మరుగబెట్టిగాని, ఒక దినము చల్లని నీటిలో నానబెట్టిగాని యీ కషాయమును సిద్ధము చేయవచ్చును. ఈ కషాయమున 4 అవున్సుల కడ్డీ సబ్బునుగూడ కరగింపవలెను. ఇట్లు కలిపిన మిశ్రమము చల్లబడిన పిమ్మట 6, 7 రెట్లు నీరు కలిపి చీడపట్టిన మొక్కలపై పిచికారీ చేయవలెను. ఇది పేలును, పింజె నల్లులను, పట్టిన అన్ని మొక్కలకును పనికివచ్చును. ముఖ్యముగ ఆకులకు దుర్వాసన గలుగు ననుభయముచే, కిరసనాయల్ గాని, చేపనూనె సబ్బుగాని యుపయోగింపవీలులేని సస్యములకిది యుపయోగించదగును. పొగ తోటలకే తరచు పేను పట్టుటచే వానికి ఈ మిశ్రమము ఉపయోగకరము. సబ్బు, పొగాకు కషాయముతో కలిపినప్పుడు ఆ మందును పడినచోట వ్యాపింప చేయుటయే గాక, పొగాకునందలి విషద్రవ్యము (Nicotine) యొక్క కీటక నాశకత్వమును వృద్ధి పొందించును. ఈ రాజధానిలో పొగతోటలకు బట్టు పేలను నాశనముచేయుటకీకషాయ మిటీవల విస్తారముగ నుపయోగింపబడుచున్నది. సులభముగ లభించుటచేతను, చాల జాతుల రసాస్వాదక కీటకముల కమోఘముగ పనిచేయు మందుగ నుండుటచేతను, కీటక నాశనులలో దీనికామందు చాల ప్రాముఖ్యత గలుగుననుటకు సందేహము లేదు. సున్నముతోగాని, నీరు సున్నముతోగాని కలిపిన పొగాకు పొడుము లేత మొక్కలపైగాని, కురుచగ నెదుగు మొక్కలపైగాని చల్లినయెడల వానికి చీడలు పట్టకుండ కాపాడును. మిగుల చిన్నవిగను మృదువుగను నుండు జాతుల కీటకములకు పొగాకు పొగపెట్టిన నవి నాశనమగును.

పై మందులను భక్షక కీటకములుకూడ పట్టకుండ చేయుటకుగాని, వానిని నాశనము చేయుటకుగాని కొన్ని సందర్భములందుపయోగింపవచ్చును. కాని, యింతకంటె కడుపులోనికి బోయి చంపు మందుల నుపయోగించుటయే మంచి పనిచేయును. వ్యయమును తక్కువయగును. ఈ మందులను కీటకములు తిను ఆహారమున చేర్చినచో నవి దానితో వీనిని గూడదిని చచ్చును. ఈ మందులు రసాస్వాదక కీటకముల కుపయోగింపవు. ఈ మందులు చాలవరకు పాషాణ సంబంధములు. అందు ముఖ్యమైనవి కొన్ని యీ దిగువ పేర్కొనబడును.

సీస పాషాణము.—దీనినె ఉల్లిపాషాణమనికూడ అందురు. ఇది సీస అసిటేతము సోడియ పాషాణము వీని సంయోగమువలన తయారుచేయబడుట తెల్లని ద్రవ్యము. నీటిలో కరుగదు. మొక్కలకు హానిచేయదు. పొడిగాగాని నీటిలోకలిపిగాని సులభముగ నుపయోగింపవచ్చును. ముద్దగగాని, పొడిగాగాని పౌను 1 కి సుమారు ఒక రూపాయి చొప్పున దొరకును. ఒక అవున్సు ముద్దనుగాని 2/3 అవున్సు పొడినిగాని 4 గాలనుల నీటిలో కలిపి యుపయోగింపవచ్చును. కొంచెము హెచ్చుగ కలిపినను హాని లేదు. కొంత బెల్లపు పాకమును సున్నమునుగూడ కలిపి ఉపయోగించిన నీమిశ్రమము మరింత పనిచేయును. ప్రతి పౌను పాషాణమునకును 3 పౌనుల సున్నమును 6 పౌనుల బెల్లపు పాకమును చేర్పవచ్చును. పొడి నుపయోగించుచో నొక పౌను పొడితో 10, 15 పౌనుల బూడిదనుగాని, ముగ్గునుగాని, రోడ్డు దుమ్మునుగాని, యితర ఆమ్లక్షార స్వభావములులేని ద్రవ్యపు పొడినిగాని కలిపి చల్లవలెను. ఇతర మందులకంటె ప్రియమైనను ఆకులను మాడ్చకుండ పనిచేయుటలోను, బాగుగ మొక్కల కంటుటలోను ఇది మిన్నయగుటచే సురక్షితమును, ప్రజాహితమైనట్టియు మందుగనున్నది. ప్రపంచమంతటను నిది అనుకూలముగ బనిచేయుచున్నది.

ఖటిక పాషాణము.—ఇది కొంచమించు ఉల్లి పాషాణమువలెనే యుండును. ఇది యతెల్లని పొడి రూపమున పౌను అ 12 లు చొప్పున అమ్మబడును. ఉల్లి పాషాణముకంటె కొంచెము చౌక. దానివలెనే ద్రవరూపమునగాని, పొడిగాగాని చల్లవచ్చును.

ఇట్లు లోనికిబోయి చంపు మందుల నన్నిటిని, కీటకముల కెరలుగగూడ పలు విధములుగ నుపయోగింపవచ్చును. కొరుకు పురుగులు, నేలలో నుండు కీటకములు, మిడతలు, చీమలు, జట్టి మిడతలు మొదలగువాని కిట్టి యెరలను బెట్టి చంపవచ్చును. సామాన్యముగ బంగాళాదుంపలు, తవుడు, పిండి మొదలగువానితో, బెల్లపు పాకము మొదలగునవి కలిపి ఆకర్షవంతములుగ చేసిన మిశ్రమములతో నీ పాషాణమును కొద్దికొద్దిగ కలిపి కీటకములు సంచరించుచోట కొంచెము కొంచెము పడవైచినచో నవి వానిని దిని చచ్చును.

ఈ మందుల నుపయోగించుటలో నవి తీవ్రమగు విషద్రవ్యముల గ్రహించవలెను.

వానివలన, మనుష్యులకును, పశువులకును యితర పెంపుడు జంతువులకును హానిలేకుండ చేయుటకు తగినంత శ్రద్ధ తీసికొనవలెను. ఈ మందుల సీసాలపైగాని డబ్బాలపైగాని 'విషము' అని చీటివ్రాసి యంటించవలెను. పూచీగల మనుష్యులే వీనితో సంబంధము గలిగియుండవలెను. సామాన్యముగ నీ మందులను జల్లిన 3, 4 వారములలో నీ విషము మొక్కలనుండి పూర్తిగపోవును. కావున పిమ్మట వాని యాకుల నుపయోగించుటవలన నపాయముండదు కాని యీ మందులను జల్లిన మొక్కలను కూరగాయలను గాని పండ్లనుగాని బాగుగ కడిగి యుపయోగించుట మంచిది.

## సామాన్యపు సూచనలు.

వాతావరణము అనుకూలముగ లేనపుడు యీ మందు నీళ్లనుగాని పొడినిగాని చల్లకూడదు. హెచ్చుగాలియున్నపుడుగాని, హెచ్చుగ వర్షము గురియునపుడుగాని వీని చల్లిన ప్రయోజనము అంతగాలేదుగావున లేతమొక్కలపై మంచు తడియుండు ఉదయపు కాలముననే పొడిని చల్లవలెను. ఇట్లు చేసినచో పొడి మొక్కలకు బాగుగనంటును. ఈ మందులను, పొదుపుగ జల్లి తగినంత లాభమును బడయుటకు తగిన యంత్రసామగ్రిని ఉపయోగింపవలెను. మందు నీటిని చల్లుటకు పిచికారీలును, పొడిని చలుటకు గాలి తిత్తులును పొగ బెట్టుటకు వేరు యంత్రమును కావలెను. తోటలుగల వారి యంత్రసామగ్రిలో తగిన వానిని, కొన్ని మందులును నిల్వయుంచుకొనుట అనుకూలము. వివిధములగు యంత్రములు అమ్మకమునకు దొరుకును.

ఇతర వివరములు తెలిసికొనగోరువారు కీటక శాస్త్రజ్ఞుడు, లాలీ రోడ్డు పోస్టు, కోయంబత్తూరు అని వ్రాయవలెను.

---

## 10. దక్షిణ హిందూస్థానములో నూతనముగ తేనెటీగలను పెంచువారలకు కొన్ని సూచనలు.

స్వభావ సిద్ధములగు సదుపాయములు గలుగు చోట్లయందు నవీన పద్ధతులపైని తేనెటీగలను పెంచుట చాలా లాభకరము. సాలునకు ఒక తేనెటీగ గూడునుండి మొత్తము టీన 12 మొదలు 15 పౌనులవరకు తేనె తీయవచ్చును. పుప్పొడియు, మకరందము తేనెటీగకు స్వభావమగు ఆహారములు కాన, ఎక్కువగా వ్యవసాయము జరుగుచు సం

వత్సరము పొడుగునను పంటలు వుండే స్థానములయందు వీటిని పెంచుట లాభకరము—తేనెటీగలు సాధారణముగా ఏ పుష్పముననుండి అయినా వాటి ఆహారమును గ్రోల గలవు. కాని కొన్నినుండి ఎక్కువగా ఆహారమును తీసుకొనగలవు. మొక్కజొన్న, జొన్న, గంటె, సూర్యకాంత పుష్పము, ఆముదము యీ చెట్లనుండియు, అలంకారమునకై పెంచు తెంకేస మొదలగు చెట్లనుండియు, తేనెటీగలకు పుష్పరజస్సు లభించును. మరియు ప్రత్తి, చింత, వేప, అరటి చెట్లకు తేనెటీగలుపోయి అమృతమును గ్రోలును.

స్వదేశపు తేనె టీగలలో వేటిని పెంచవలెను.—తేనెను జాగ్రత్తపెట్టు స్వభావము గల తేనె టీగలు నాలుగు విధములు. (1) కొండ తేనె టీగ (Rock bee). (2) ఇండియన్ తేనె టీగ (Indian bee). (3) చిన్న తేనె టీగ (Little bee). (4) డామారు తేనె టీగ (Dammar bee). వీటిలో రెండవ రకము అనగా యిండియన్ తేనె టీగయే పెంచుటకు సాధ్యమైనది. మిగిలిన వానిని వాటి దుష్టస్వభావముచేతగాని తేనె ఎక్కువగా జాగ్రత్తపెట్టలేకపోవుటచేగాని పెంచుట లాభకరముకాదు.

తేనె టీగల పట్టులను తీసి వాటిని గూళ్లలో పెట్టి పెంచు విధానము.—తేనె పట్టులు వెలకు దొరకుట కష్టముగాన, నూతనముగా తేనెగూళ్లను పెంచువారు పట్లయందలి రాణి (ఆడు) యీగలను దాని స్వాభావికమగు స్థలములనుండి తీసి వాటిని కల్పితమైన గూళ్లయందు పెట్టి పెంచి అలవాటు చేయవలెను. ఇండియన్ తేనె టీగల పట్లు చాలా చీకటిగానుండు పెద్ద చెట్లతొర్రలలోను, పెద్ద గోడలలోనుండు బీటలలోను వుండును. వాటిని కల్పితమగు గూళ్లకు మార్చుటకు, పొగను పెట్టి వూది, ఆ తేనె పట్టును ఒక్కొక్కటిని తీసి, కల్పితపు గూడులో వేరువేరుగా నమర్చుతూ చట్రములకు అరటి నారతో కట్టవలెను. తరువాత తేనె టీగలను కల్పితపు గూడునకు మార్చవలెను. తేనె టీగలలో రాణి ఈగ ముఖ్యము. కాబట్టి దానిని నిపుణతతో పట్టి గూడులో చేర్చినయెడల, మిగిలిన యీగలన్నియు వెంటనే గూడులో చేరును. రాణి యీగకును, మిగిలిన యీగలకును భేద మేమనగా, రాణి యీగ మిక్కిలి పెద్దది, నడుము పెద్దదిగా నుండును, మిగిలిన యీగలు చిన్నవి, నడుముపైని గీరలుండును, కాళ్లు నల్లగా వుండును. రాణితో యీ ఈగలకుగల ఐకమత్యమువల్ల ఆ రాణి యీగ వెంటనే యివి యెదుగుచుండును. రాణీ ఈగను కనుగొనలేనప్పుడు, తొర్రలోని ఈగ సమూహములను చేతితో మెల్లగా ఊడ్చి గూడులోనికి తోలవలెను. ఈ విధముగా కొన్ని ఈగపట్టులనుపట్టి స్థిరపడిన పిదప వాటినుండి హెచ్చుగ తేనె సంపాదించుటకును వాటిని మంచిస్థితిలో కాపాడుటకును, తేనె టీగల జీవితమును, వాటి స్వభావములను, వాటి శత్రువులను వాటికి ఆహారమునిచ్చు పద్ధతులును యింకా వాటిని గూర్చి తెలుసుకొనవలసిన విషయములన్నిటిని కనుగొనవలెను.

యంత్రసామగ్రి పని ముట్లు.—నవీనపద్ధతులపైని తేనె టీగలను పెంచుటకు అధమపక్షము కావలసిన పనిముట్లు ఏవనగా, (1) కల్పితమైన తేనె టీగల గూడు, (2) తేనె తీయుటకు యంత్రము. ఈ యంత్రమువల్ల తేనెను శుభ్రముగా తీయుట వీలగుటయేకాక, గూళ్లలో మిగలకుండా అంతా తీయుటకు వీలగును. కల్పితమైన తేనె టీగల గూడులలో తేనె టీగల సంతానము అభివృద్ధిచేయుటకును, తేనె వేర్వేరుగా అరలలో గూళ్లలో నుంచుటవలనను కష్టము లేకయే తేనె తీయుటకు వీలగును. కల్పితమైన తేనె టీగల గూడులలో అరలు తీయుటకు వీలగుటచేత వానిని అప్పుడప్పుడు పైకి

తీసి తేనె టీగల అభివృద్ధిని కనుగొనుటకు వీలగును. తేనె పట్టులను కోసి, చేతులతో నలిపి అశుభ్రముగా తేనెను తీయు ప్రాచీనపు అలవాటుకన్న, తేనె తీసెడు యంత్రము ద్వారా తీసినయడల, శుభ్రమైన తేనె వచ్చుటయే కాకుండా, తేనె పట్టు చెడకుండును కల్పితమైన తేనె టీగలగూడును, తేనె తీసే యంత్రమును కాకుండా, నూతనముగా తేనె టీగలను పెంచువారు, ముఖములపైని కప్పుకొనువలయును, చేతికి తొడుగుకొనుటకు గుడ్డసంచులను కూడా సంపాదింపవలెను. ఇవి వుండుటవల్ల తేనె టీగలపోట్లను తప్పించుకొనవచ్చును. వీటితో అలవాటుపడిన పిదప యివి లేకయే పని జరుపుకొనవచ్చును.

కోయంబత్తూరులోనున్న కీటక శాస్త్రిజ్ఞుల క్రింద బాగా నడుపబడుచున్న తేనె టీగల పెంచు స్థానము కలదు. ఎవరికైనను సలహాలు కావలసిన యడల వారు సలహా యిచ్చుటయే కాక, సహాయముకూడా చేసెదరు. డిసెంబరు నెలనుండి మార్చి నెల వరకు విద్యార్థులకు యీ విషయమై ఉచితముగా యీ విద్య నేర్పెదరు. ఈ క్రింది సామానులు సర్కారువారి కీటక శాస్త్రిజ్ఞులవద్ద వాటికెదురుగా వివరించిన ధరలకు దొరకును.

| | | రూ. | అ. |
|---|---|---|---|
| (1) | పేకు కర్రతో తయారుచేసిన తేనె టీగల గూడు, పట్లు చట్టముతో సహా (ఒకటికి). | 4 | 8 |
| (2) | తేనె తీసే యంత్రము (ఒకటికి) ... ... | 7 | 0 |
| (3) | పొగపెట్టు సాధనము ... ... | 3 | 0 |

ఇంకా యితరవిషయములనుగూర్చి సలహాలను వలయువారు "కీటక శాస్త్రిజ్ఞులు లాలీ రోడ్డు పోస్టు కోయంబత్తూరు" అని వ్రాసిన, జవాబును పొందగలరు.

---

## 11. మొక్కలకు తగులు రోగములను నివారించు కొన్ని సాధారణమైన పద్ధతులు.

మనము పెంచు పైరులు, జంతువులు, కీటికములవల్లనే కాక, పలువిధములగు రోగములచే బాధింపబడుటవలన, రయితులకు చాల నష్టము కలుగుచున్నది. వీటికి తెగుళ్లని చెప్పుదురు. ఈ తెగుళ్లు రాకుండుటకు తగిన మార్గములను కనుగొనుట అత్యావశ్యకము. ఇందులో మొదటిది పైర్లుగాని, చెట్లుగాని వాటికి తగిన ప్రదేశములయందు పెంచుట ముఖ్యము. మనము యెల్లప్పుడును చెట్లు బాగుగ అభివృద్ధిచెంది యెక్కువ ఫలమునిచ్చు ప్రదేశములలో పెంచుటయే కాక, ఆరోగ్యముగా నుండునట్లు జూడవలెను. చెట్లు అభివృద్ధికి రావలయునన్న మొక్కలు ఆరోగ్యముగా నుండవలెను. అటుగాక ఆరంభదశయందె ఫలమపేక్షించిన చెట్ల ఆరోగ్యము చెడిపోవును. చెట్ల పెంపకములో మనము అశ్రద్ధవహించినయెడల వాటిలో యితర జాతిమొక్కలు పెరుగును. విలయైన ప్రతి సంవత్సరము ఎక్కువఫలము నిచ్చు కాఫీ, నారింజచెట్లు త్వరగా రోగ పీడితములగుచున్నవి. ఇట్టి స్థితియందు, వాటిలో యితర మొక్కలు పెరిగి అసలు మొక్కలను చంపివేయును.

### తెగుళ్లను అపుదలచేయు కొన్ని పద్ధతులు.

(1) పరిశుభ్రత ముఖ్యముగా గమనించవలెను.

(2) పైరుల మార్పుదల.

(3) విత్తనము శ్రేష్ఠమైనదిగా యేరుట.

(4) రోగములకు లోబడని పంట పెట్టుట.

(5) రోగనివారణార్థము మందుల నుపయోగించుట.

(ఎ) విత్తనములకు.

(బి) మొక్కలయొక్క కొమ్మలకు.

చెట్ల అభివృద్ధికిగాను ముఖ్యముగా గమనించవలసినవి రెండు పద్ధతులు. ఇందులో మొదటిది సారవంతమైన భూమిని యేర్పరచుట. చెట్లకు హానికలుగచేయు చెత్తను తీసివేయుట రెండవది. చెట్లకు రోగమును తగులకుండ నుంచుటకు ముఖ్యముగా రోగము తగిలిన చెట్లను తీసివేయవలయును. రోగము తగిలిన మొక్కలు, పండ్లు, ఆకులు, కొమ్మలు మొదలయినవి రోగమును కనుగొన్నప్పుడే తీసివేసినయెడల యెక్కువగా చెరుపు రాదు. రోగనివారణ చేయవలయునన్న రోగము తగిలిన మొక్కలను లాగి కాల్చుటయే ముఖ్యమగుపని. ఇది సాధ్యముకానియెడల లోతైన గొయ్యిత్రవ్వి అందులో రోగము తగిలిన మొక్కలనువేసి, దానిపైన సున్నపుపొడిసి చల్లి మట్టితో కప్పివేయవలయును. రోగనివారణార్థము, రోగము తగిలిన మొక్కలు తీసివేసినట్లు ఎన్నియో దృష్టాంతము లివ్వవచ్చును. తాటి, మరియు కొబ్బెర చెట్లకు మొవ్వ (Bud-rot) రోగము తగిలినప్పుడు, మొవ్వులను కత్తిరించి, ముక్కలుగా చేసి కాల్చివేయుదురు. టెంకాయ చెట్లకు బంకరోగము (Bieeding disease) తగిలినప్పుడు బంక కారు స్థలమును, ఉలితో చెక్కివేడి తారునుపూసి, చెక్కివేసిన పదార్థమును కాల్చివేయుదురు. నారింజ, నిమ్మ చెట్లకు తగులు పుల్లవిరుగురోగమును డైబాక్ (Die-back) అందురు. అప్పుడు రోగము తగిలిన కొమ్మలను కత్తిరించి కాల్చివేయుదురు. కత్తరించిన ప్రదేశములో వేడితారును పూయుదురు. నారింజచెట్లకు రోగము తగిలినప్పుడు పై విధముగానే చేసి కత్తరించిన స్థలమునకు "బోర్డో" అనుమందును పూయుదురు. పోకచెట్లకు "మహాలీ" (Mahhali) అను రోగము తగిలినప్పుడు, చెట్లనుండి వ్రేలాడుచున్నట్టియు, క్రిందరాలి పడినట్టియు కొమ్మలను వర్షాకాలమునకు మునుపే తీసివేసిమందు చల్లవలెను. ప్రత్తి, కందిచెట్లకు రోగము తగిలినప్పుడు మొక్కలను సమూహముగా తీసివేయవలయును. చెట్ల వేరులకు రోగము తగిలినప్పుడు తక్కువ చెట్లచుట్టుగా త్రవ్వవలయును. ఇట్లు చేసినట్లయిన ఆరోగ్యముగానున్న చెట్లకు రోగముతగలదు. రోగముతగిలిన మొక్కలనుదిబ్బన గుంటలలో వేయకూడదు. సాధ్యమైనంత మట్టుకు రోగము తగిలిన మొక్కలను ఒక స్థలమునుండి మరియొక స్థలమునకు తీసికొని వెళ్లకూడదు. ఎందుకనగా రోగము తగిలిన వరిగడ్డి, రాగిగడ్డి రోగములేని పొలములలోనికి తీసికొనివెళ్లిన, ఆరోగ్యముగా నుండు పంట చెడిపోవును. పొలములో పనిచేయు కూలీలు వక పొలమునుండి మరియొక పొలములోనికి అంటు రోగమును వ్యాపింపచేయకుండ జూడవలయును.

మనుష్యులకు వచ్చు ప్లేగు, కలరా, అమ్మ, పశువులకు వచ్చు దొమ్మ రోగముల వలెనే వృక్షజాతులకు తగులునట్టి రోగములు కంటికగుపడవు. పై చెప్పిన రోగనివారణ పద్ధతుల నవలంభించుటకు చుట్టుప్రక్కల రయితుల సహాయము అత్యావశ్యకము. ఒక జాతికి చేరిన ఇట్టి సహాయము సులభసాధ్యము కాకపోయినను దుర్లభము కాదు. సస్యముల రయితులు మతాభిమానముతోనైనను యిట్టి పనులయందు సహాయపడెదరు. రోగనివారణ చట్ట ఆరోగ్యమును వృద్ధిచేయుటలో యిట్టి సహకారము లేనట్లయిన రోగనివారణ చట్ట మావశ్యకము.

మొక్కలను ప్రత్యేకముగా నుంచుట.—క్రొత్త దేశమునుండి విత్తనములను తెచ్చినప్పుడు, అట్టి విత్తనములు రోగపీడితములాయని మొదట గమనించవలెను. ఆ విత్తనములు "ఫ్యూమిగేట్" (Fumigate) చేసి అనగా విత్తనములలోనుండు రోగసంబంధమైన బీజములను నశింపుచేసిన తర్వాత నాటవలెను. మొక్కలు యితర దేశములనుండి తెచ్చినప్పుడు వాటిని ప్రత్యేకముగా నాటి, అవి రోగపిడితములా, కావా అనునది పరీక్షించవలెను. రోగమువలనని తెలిసినట్టయితే మొక్కలన్నియు తీసివేసి వాటిని కాల్చివేయవలయును.

పైరు మార్పును (Rotation of crops).—ఈ పైరుమార్పులు ముఖ్యముగా పైరులపైనుండు రోగమును నివారించుటకు. తెగులు బీజమును అనేక సంవత్సరములు భూమిలో పాతుకొనియుండును. అట్టి భూమిలో పంటపెట్టినట్లయిన తప్పక మొక్కలకు రోగం తగులును. వేరు సెనగకు పట్టు (Rhizoctonia) అను శిలీంధ్రము తమలపాకు తీగకు పట్టు (Phytophthora) ఫిటోఫతోరా అను శిలీంద్రము. దీనికి నిదర్శనము దీని నివారణకు త్రోవ ఆ భూమిలో మరియొక పంట పెట్టుటయే. ఈ శిలీంద్రమునకు అసాధ్యమైన పైరులు ఆ భూమిలో పెంచిన, ఆ శిలీంద్రము ఆహారములేక చచ్చిపోవును. బంగాళాదుంపలకు పట్టు శిలీంద్రముగూడ భూమిలో చాలా కాలముండును, నీలగిరిలో బంగాళాదుంపలను వకే భూమిలో పండించుటవలన రోగము అభివృద్ధియై పంటహీనముగా పండుచున్నది.

కొన్ని సమయములయందు మంచి విత్తనములను ఎంచుకొనుటవలన తెగుళ్ల ఆపవచ్చును. తెగుళ్ల తగిలిన విత్తనములు నాటినట్లయిన వక పొలమునుండి మరియొక పొలమునకు తెగులు వ్యాపించును. చిక్కుడు చెట్లకు యీ రీతిగానే తెగులు తగులును. విత్తనము చూచుటకు తెగులులేనట్లు కనుపడినను తెగులు తగిలిన కాయలలో విత్తనములకు తెగులుండును. మందులో యీ విత్తనములు నానుటమంచిది. శుద్ధమైన విత్తనములు కాయలనుండియే తీసుకొనవలయును. కాయలు రంగువారి యుండినట్లగపడిన పారవేయవలయును. చెరకుపైన అగపడు పొడతెగులు చెరకు విత్తనమునుండియే బయలుదేరును. శుద్ధమైన చెరకు విత్తనము నాటిన రోగమంటదు.

తెగుళ్లకు లోబడని వంగడముల నెంచుట.—కొన్ని వంగడములకు తెగుళ్లంతగా పట్టవు, మరికొన్నిటికి సాధారణముగా పట్టును. మరికొన్నిటికి అప్పుడప్పుడు పట్టును. యత్నమువలన యీ జాతులలో రోగము తగలని వంగడములను ఎంచుకొనవచ్చును. ఆయాసస్యముల తత్వము శీతోష్ణస్థితివల్లను, భూగుణమువల్లను మారవచ్చును. తెగులుకు అవకాశమివ్వని ఒక మొక్కను రెండు రకముల ప్రదేశములలో నాటినట్లయిన ఒక భూమిలోని మొక్కలకు తెగులంటును. మరియొక భూమిలో నాటిన విత్తనములకు తెగులంటదు. తెగుళ్ల కాస్పదమివ్వని వంగడములు వరి, చెరకులలో అనేకములున్నవి. వరి ధాన్యములలో జి.టి.బి. నె 24 రు వరి, (సి.ఓ. 4) సి.ఓ. నె 4 రు ధాన్యమునకు తెగులంటుట అరుదు. కోయంబత్తూరులో తెగుళ్లకు ఆస్పదమివ్వని "కారంగు" వరిని పరిశోధించుట ముగియుచున్నది.

తెగులంటు నీయకుండుటకుగాను, విత్తనములకును, వృద్ధియగుమొక్కలకును మందునుపయోగించుట యత్యావశ్యకము. ఈ విధముగా మందు నుపయోగించుటవలన తెగులు నాపవచ్చును. కొన్ని రకముల మందులు విత్తనములకంటియుండు తెగులు బీజములను గంధకము మొదలగు మందులు నీళ్లలో కలపక, విత్తనములకు పట్టించినయెడల, వానికంటియున్న సూక్ష్మమైన తెగుళ్లను, బీజములను చంపివేయును. జొన్నకు పట్టు కాటుక తెగులును, ధ్వంథము చేయవలయునన్న విత్తనములను మైలుతుత్తము ఇత్యాది


MADRAS PRESIDENCY
JANUARY
FEBRUARY
MARCH
APRIL
MAY
JUNE
JULY
AUGUST
SEPTEMBER
OCTOBER
NOVEMBER
DECEMBER
SOUTH ARCOT.
TANJORE, MADURA AND RAMNAD.
TINNEVELLY, MALABAR
SOUTH KANARA, COIMBATORE & SALEM
GODAVARI, KISTNA, NORTH ARCOT.
KISTNA
GUNTUR
GODAVARI
ANANTAPUR SALEM & MADURA
N.CIRCARS, BELLARY, SALEM COIMBATORE & S.KANARA
N.ARCOT, S.ARCOT.
COCHIN, MALABAR & S.KANARA
ANANTAPUR
SALEM & MADURA
BELLARY & KURNOOL
KURNOOL, & MALABAR
KISTNA, TRICHINOPOLY
GODAVARI, COIMBATORE
GODAVARI, GUNTUR, TANJORE.
RAMNAD & TINNEVELLY
COIMBATORE, MADURA, RAMNAD
N.CIRCARS, CEDED DISTRICTS, SALEM, COIMBATORE
MALABAR
1
2
3
4
5
6
7
8
9

మందు నీళ్ళలో తకపవలయును. విత్తనములకు శుద్ధిచేయుటకు మైలుతుత్తము మంచి మందు. అయితే యీ మందు నీళ్లు మొక్కలపై చల్లిన ఆకులు మాడిపోవును. దీనిని ఆపుటకు మైలుతుత్తముతో సున్నము కలుపవలయును. దీనినే "బోర్డో మిక్స్చర్" (Bordeaux mixture) యందురు. దక్షిణ ఇండియా పరిస్థితులనుబట్టి యీ బోర్డో మిక్శ్చరును అనేక విధములుగా వాడుచున్నారు.

(1) పోకచెట్లకు మహాలీ లేక కోనె రోగమునకు.
(2) మిరపగుపట్టు ఫ్రూట్-రాట్ (Fruit rot) మరియు డైబాక్ రోగమునకు.
(3) పసుపు అల్లమునకు పట్టు ఆకు తెగులు (Leaf spot).
(4) కాఫీచెట్లకు తగులు తుప్పు రోగము (Rust and black-rot).
(5) రబ్బరు చెట్లకు తగులు ఆకు రాల్చు రోగము.
(6) ద్రాక్షచెట్ల పైనవచ్చు పాలరోగము (Mildew).
(7) మామిడిచెట్లకు వచ్చు పండ్లు రాల్చు రోగము (Fruit fall).
(8) నారింజ, నిమ్మకు తగులు రోగము.
(9) దానిమ్మచెట్లకు తగులు, పండ్లు కుళ్ల రోగము.
(10) బంగాళాదుంపలను నాశనము చేయు తెగులు.
(11) తమలపాకులపై కనుపడి "విల్టు" అను రోగము.

పై రోగనివారణకు బోర్డో మిక్శ్చర్ మందు అందరకు విదితమైనను, "బర్గండి మిక్శ్చర్" (Burgundy mixture) సున్నము, గంధకము కలిపిన నీరు, పొటాసియం సల్ఫైడ్, గంధకపు పువ్వులు యిత్యాది మందు కూడ విత్తన పరిస్థితులనుబట్టి వాడుదురు. గంధకపు పొడియు ద్రాక్ష, అత్తిచెట్లకు తగులు రోగ నివారణలకు ముఖ్యమైనమందు. ఇప్పుడిప్పుడు మైలుతుత్తము, గంధకములో తయారుచేసిన అనేకమందులను బజారులో విక్రయించుచున్నారు.

తెగులు తగిలిన తర్వాత దానిని నివారించుట కష్టసాధ్యముగాన కృషీవలులు ముందుగానే జాగ్రతపడి తెగులు రానీయకుండగనే కృషి సలుపవలయును. పై చెప్పిన తెగుళ్లే ముఖ్యముగా పంటలు నాశనము చేయునవి. ఫలానా తెగులని నిర్ధారణ చేసి, దానికి నివారణోపాయమును కనుగొనుటకు, కోయంబత్తూరులోనున్న శిలీంధ్ర శాస్త్రజ్ఞునికి వ్రాసుకొనవలయును.

యస్. సుందరరామన్,
సర్కారు శిలీంధ్ర శాస్త్రజ్ఞుడు.

---

## 12. పశుగ్రాసమునకు తగినట్లు పశువులను పెంచుడు.

**పశుగ్రాసమునకు తగినటులనే పశువుల గెత్తము వచ్చునుగాని, పశువుల సంఖ్యతో గెత్తము ఎక్కువ కాదు.**

పశువులనగా గెత్తము నిచ్చు యంత్రములు. పశువులు ఎంత తిండి తినునో సుమారు అంత మలమూత్రమును విడుచునని నవీన పరిశోధనలు తెలుపుచున్నవి. పశువులను ఎక్కువగా పెంచుటవల్ల ఎక్కువగా ఎరువు వచ్చునను నమ్మకము చాలా పొరపాటు. రైతుకు ఎంత వున్నదో అతనికి వున్న పశువులద్వారా అంతే ఎరువుకూడా వచ్చును. రోజునకు పశువుల గ్రాసము ఒక పశువునకు 15 పౌనులు చొప్పున 10 టన్నుల జొన్నజాడు, రెండు జతల పశువులకు ఒక సంవత్సరమునకు చాలును. ఇది సంవత్సరమునకు 10 టన్నుల ఎరువును యిచ్చును. దీనికి బదులుగా మూడు జతల పశువులును, రెండు ఆవులును,

ఆపై 10 టన్నుల మేతమీదనే సంవత్సరమును మేపినయడల, మనకు 10 టన్నుల ఎరుక వచ్చును. మరియు, పశువులకు తగిన ఆహారము లేకుండుటవల్ల అవి శుష్కించుటయే కావే చనిపోవుటకూడా క్రమముగా తటస్థించును. ఇది జరిగినయడల రైతునకు చాలా నష్టము ఒక రొట్టె ఒకని ఆకలిని మాత్రము తీర్చును; నలుగురి ఆకలిని తీర్చజాలదు. అదిగా పశువులకుకూడా వర్తించును. హిందూదేశములో పశువుల సంఖ్య చాలా ఎక్కువయే యున్నది. వాటిలో తగిన మేతలేక పనికిరానివిగా యున్నవి. నూటికి 80 వుండును. సమముగా మేత వున్నయడల 40 ఎకరముల భూమి వ్యవసాయము చేయుటకు దత్త మండలములలో 4 ఎడ్లు చాలును. అదే మేతతో ఎనిమిది పశువులను పెంచు రైతు, తన 40 ఎకరములను సమయమునకు సాగు చేయుటకు కష్టపడును. కాబట్టి మీదగ్గర వున్న పశువులసంఖ్యను తగ్గించుటకు మార్గములను కనిపెట్టి, కొద్ది పశువులనే బాగా మేపి, వాటివల్ల పనిని హెచ్చుగా తీసుకొనుడు. హెచ్చు ఎరువునకై ఎక్కువ పశువులు వుండవలెనను అభిప్రాయమును మరచిపోవుడు.

కె. అంబికాచరను,
వ్యవసాయపు ప్రచారకుడు, హిందూపురము.

---

## 13. బూజు తెగుళ్లు పట్టినప్పుడు చికిత్స చేయుటకు ముఖ్యమైన మందులు.

### I. బోర్డో మిశ్రమము. 1% ఘాటుకలది.

| | | | |
|---|---|---|---|
| మైలుతుత్తము | ... | ... | 5 పౌనులు. |
| గుల్ల సున్నము | ... | ... | 5 ,, |
| నీళ్లు ... | ... | ... | 50 గాలనులు. |

ఒక కొయ్య తొట్టిలోగాని మట్టి తొట్టిలోగాని లేక రాగి పాత్రలోగాని 25 గాలనుల నీరుపోసి దానిలో మైలుతుత్తమును కరుగునట్లు చేయవలయును. ఇంకొక పాత్రలో గుల్ల సున్నమును వేసి కొంచెము నీరుపోసి తడిపి మెత్తని ముద్దయగునట్లు చేయవలెను. ఇందు గడ్డలు యేమాత్రమును ఉండగూడదు. ఇట్లు మెత్తని ముద్దగా చేసిన వెనుక మిగతా నీరంతయు పోసి బాగుగా కలుపవలెను. పిమ్మట ఈ సున్నపు పాలను నెమ్మదిగా మైలుతుత్తపు ద్రావకములో కలుపవలెను. కలుపునప్పుడంతయూ ద్రావకము శుభ్రముగా కలియపెట్టుచుండవలెను.

ఇట్లు సిద్ధముచేసిన మిశ్రమమునందు ఒక చేకత్తినిగాని లేక ఒక ఇనప ముక్కను గాని ముంచినయెడల దానికి రాగి రంగు అంటకూడదు. రాగి రంగు అంటినయెడల మరికొంత సున్నపునీరు చేర్చవలెను. తిరిగి చేకత్తి మిశ్రమములో ముంచినప్పుడు దానికి రంగు యేమి అంటకూడదు.

### II. పటిక బోర్డో మిశ్రమము.

| | | | |
|---|---|---|---|
| మైలుతుత్తము | ... | ... | 4 పౌనులు. |
| పొటాషు పటిక | ... | ... | 4 ,, |
| సున్నము... | ... | ... | 6 ,, |
| నీళ్లు ... | ... | ... | 50 గాలనులు. |
| కేసినను ... | ... | ... | 1 పౌను. |

50 గాలనుల మందు తయారు చేయుటకు—

(a) ఒక కొయ్య తొట్టిలోగాని మట్టి తొట్టిలోగాని లేక రాగిపాత్రలో గాని 4 పౌనుల మైలతుత్తము 4 పౌనుల పొటాషు పటిక వేసి, 24 గాలనుల నీరుపోసి దానిలో అవి కరుగునట్లు చేయవలెను.

(b) 24 గాలనుల నీటిలో 5 పౌనుల సున్నము శుభ్రముగ కలుపవలెను. పిదప పై రెండు మిశ్రమములు బాగుగా కలియపెట్టుచూ ఒక దానిలో ఒకటి కలుప వలెను.

ఒక గాలను నీళ్లలో ఒక పౌను కేసీను నానపెట్టి ఇది సున్నపు నీళ్లలో కరుగునట్లు చేయవలెను. (1 గాలను నీళ్లలో 1 పౌను సున్నము కలుపవలెను.) తరువాత, ఈ మిశ్రమమును పై పటిక బోర్డో మిశ్రమముతో కలుపవలెను.

## III. సున్నపు గంధకము.

50 గాలనుల మందు తయారుచేయుటకు యీ క్రింద పేర్కొనబడినవి కావల యును (స్టాకు సొల్యూషను) :—

| | | | |
|---|---|---|---|
| సున్నము | ... | ... | 50 పౌనులు. |
| గంధకపు పొడి | ... | ... | 100 ,, |
| నీళ్లు ... | ... | ... | 50 గాలనులు. |

50 గాలనుల మందు తయారుచేయుటకు వలయునన్ని నీళ్లు ఒక ఇనప పాత్రలో గాని లేక సత్తు పాత్రలోగాని (రాగిపాత్రము పనికిరాదు) పోసి కాగపెట్టవలెను. ఈ నీరు మరుగుచున్నప్పుడు సున్నము వేసి బాగుగా కలియపెట్టవలెను. పిమ్మట గంధ కపు పొడి చేర్చి కలియపెట్టుచుండవలెను. సుమారు ఒక గంటవరకు యీ ద్రావక మును కాగపెట్టవలెను. ఈ ద్రావకము అడుగున తెట్టెకట్టి పైన నారింజ ఎరుపు రంగును కలిగియున్నప్పుడు దింపి ఒక ముతక గోనె సంచిలో వేసి వడియకట్టవలెను. ఇదియే స్టాకు సొల్యూషను (మూలద్రావకము). దానిని వలయునప్పుడు నీటితో కలిపి ఉపయోగించుచుండవలెను. క్రొత్తగా నరికిన కాండమునకు పిచికారీ చేయవల యునన్న యీ మూలద్రావకమును 5 భాగముల నీటితో కలిపి ఉపయోగించవలెను. చెట్ల ఆకులమీద, కొమ్మలమీద పిచికారీచేయుటకు యీ మూలద్రావకమును 15 భాగ ముల నీటితో కలిపి ఉపయోగించవలెను.

ముఖ్యగమనింపు.—స్టాకు సొల్యూషను (మూలద్రావకము) గాలిత గలని పాత్రలలో నింపి ఉంచి నిలవ చేసుకొనవచ్చును. యీ స్టాకు సొల్యూషను పైన కొద్దిగా కిరసనా యిలు పోసి యుంచినయెడల దీనికి గాలివలన ఏమియు చెరుపు కలుగదు.

## IV జొన్నకు పట్టు కాటుక తెగులును నివారించుటకు గంధకము ఉపయోగించుట.

విత్తనమునకు ఉంచిన గింజలమీద గంధకపుపొడిని చల్లవలెను. గంధకపు పొడి గింజలలో బాగుగా కలుపవలెను. అన్ని గింజలకు యీ పొడి అంటునట్లుగా చూడ వలెను. 60 పౌనుల గింజలు యీ పొడితో కలుపవలయునన్న 4 ఔన్సుల గంధకపు పొడి కావలసియుండును.

పూర్వము చేసినట్లుగా మైలతుత్తము నీళ్లలో విత్తనములు ముంచుటకన్న పై విధముగా మందు చల్లినయెడల కొన్ని లాభములు కలవు.

(1) విత్తనములు పొడిగా ఉన్నప్పుడు గంధకపుపొడి చల్లవచ్చును.

(2) ఏ కాలమందైనను పొడిచల్లి విత్తనముల నిలవచేసుకోవచ్చును

(3) ఇట్టి విత్తనము ఎన్ని నెలలైనను నిలవయుండును.

(4) దీనివలన మందు ఎక్కువ తగిలినది, తక్కువ తగిలినది అను భయము లేదు.

(5) మైలతుత్తపు నీళ్ల ఖర్చు ఎకరమునకు 6 పైసలు అగుచుండగా ఇది ఒక పైసయే అగును.

యస్. సుందరరామన్,

సర్కారు శిలీంధ్ర శాస్త్రజ్ఞుడు.

---

## 14. చెరుకు పొడ తెగులు.

చెరుకు పండించు దేశములలో కొన్ని సంవత్సరములనుండి చెరుకుకు తగులు పొడ తెగులు కనుగొనబడెను. హిందూదేశములో పెక్కు రాజధానులయందు యీ తెగులు కనుగొనబడినది. 1923 వ సంవత్సరములో తొలిసారి యీ తెగులు చెన్న రాజధానిలో కనుగొనబడినది. తూర్పు గోదావరి, ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాటు, చిత్తూరు, చెంగల్పట్టు, కోయంబత్తూరు, తిరుచినాపల్లి, మలబారు జిల్లాలలో కొన్ని భాగములందు యీ తెగులు కొద్దికొద్దిగా నున్నట్లు తెలియవచ్చినది.

రోగచిహ్నములు.—చెరుకు తగినట్లు యీ తెగులుయొక్క నైజమేమన ఆకులపైన ఒకవిధమైన పొడలేర్పడును. దూరమునుండి ఎక్కువ తెగులు తగిలిన తోటలు ఆరోగ్యమైన పసరు రంగుగాకాక పసుపు పచ్చగా కన్పించును. దగ్గిరగా చూచిన యెడల ఆకులపైన లెక్కలేని తెల్లని మచ్చలు లేక పచ్చటి మచ్చలు ఉండుటవల్లనూ ఈ పాలిపోవుట కలుగును. ఎప్పుడును యీ తెగులు ఆకులపైనే కన్పడును. కొన్ని చెరుకులలో ఆకులు ముదిగిన కొద్ది ఈ మచ్చలు బాగుగా కన్పించవు. అందువలన ముదురాకులలో ఈ తెగులు కన్పించుట కష్టము. అందుచేత మొవ్వులోని లేతాకులపైని ఈ తెగులుయొక్క చిహ్నములు పొరపాటుపడకుండ కనుగొనవచ్చును. అవి ముఖ్యముగా ఆకులు విడగానే కనబడును. కొన్ని చెరుకు జాతులలో ముదురాకులమీద ఒక విధమైన పొడలు కన్పించును. ఇది పొడతెగులువలన కాక యితర కారణముల వలన కలుగును. లేతాకులమీద ఏమి యుండదు. కనుక తెగులు పొడ తెగులు అవునా కాదా అని నిశ్చయముగా తెలిసికొనవలెనన్న మొవ్వులోని ఆకులను తనిఖీచేయవలెను. పూర్తిగా తగిలిన పాండురోగము కాదుకదా అని తెలిసికొనవలెను. ఏలన పాండురోగములో ఆకులు పాలిపాలి తెల్లగాగాని, పసుపు పచ్చగాగాని యుండును. ఈ రోగము తక్కువగానున్న యెడల ఆకులపైని పొడుగుగా పచ్చని జీరలు కల్పించదు.

రోగకారణములు.—ఇదియొక విసూచి (వైరస్) వలన కలుగును. బహుతీక్షణమైన భూతద్దముతోనయినసూ దానిని కనుగొన లేము.

పొడతెగులువలన కలుగు నష్టము, పరిమితి.—ఈ తెగులు చెరుకును చంపదు. రోగము ముదిరినయెడల చెరుకుగెడ ఎండిపోయి తొక్క పగులును. పెక్కు సంవత్సర

ములనుండి యీ తెగులు వ్యాపించియున్న దేశములలో చెరుకు పంట చాలా భాగము తగ్గినది. తలిపరంబ వ్యవసాయ పరిశోధన స్థానములో చేసిన పరిశోధనవలన ఈ దిగువ వివరములు తేలినవి :—

(1) అధమము నూటికి 10 వంతులు చెరుకు తూకము తగ్గును.

(2) కండచక్కెర చాలా భాగము తగ్గును.

(3) తెగులు తగిలిన చెరుకులలో తేనె బెల్లము ఎక్కువగును. (ఇది అంత మంచి సూచన కాదు).

ఈ తెగులు ఎట్లు వ్యాపించును.—ఈ దిగువ కారణములవలన వ్యాపించును :—

(1) తెగులు తగిలిన విత్తనములవలన.

(2) రసముపీల్చు పురుగులవలన.

తెగులు తగిలిన కుదురులనుండి తీసిన విత్తనము సాధారణముగా ఈ తెగులును వ్యాపింపచేయును. పురుగులు యీ విషము తెగులు తగిలిన గెడలనుండి తమకాటువలన యిరుగుపొరుగు తోటలలోని మంచి గెడలకు కొంచెము దూరములో వ్యాపింపచేయును.

నివారణ పద్ధతులు.—ఈ తెగులుకు మందులేదు. ఈ తెగులు అన్ని విధములయిన భూములలోనూ, అన్ని శీతోష్ణస్థితులలోనూ కూడా తగులును. ఎట్టి ఎరువువేసి, ఎట్టి సేద్యము చేసినను తగులును. మంచి ఫలితము సమకూర్చవలెనన్న యీ దిగువ పద్ధతులు అవలంభించవలెనని సలహా యివ్వబడుచున్నది :—

(1) తెగులులేని ప్రదేశములనుండి కాని తెగులు తగలని కుదురులనుండి కాని విత్తనము యేరవలెను. ఆకులు కోయకముందే విత్తనము యేరవలెను. ఆకులపైన పొడచిహ్నములు కనపడినయెడల ఆ కుదురు వదలివేయవలెను.

(2) నాటిన తరువాత లేత మొక్కలు అప్పుడప్పుడు జాగ్రతగా తనిఖీచేయవలెను. ఎక్కడైనా తెగులు కన్పించినయెడల వెంటనే ఆ మొక్కలను పీకి రోగము పురుగులమూలమున వ్యాపించకుండ నాశనము చేయవలెను. తెగులు తగిలిన చెరుకునుండి మంచి చెరుకుకు తెగులు బహు వేగముగా వ్యాపించును. ఇది మొక్కలు బాగా ఎదుగు కాలములో (అనగా మొదటి 5 మాసములలో) సంభవించును. ఈ కాలము అయిన తరువాత తెగులు వ్యాపించుట తగ్గును. కనుక లేతవయస్సులో జాగ్రతగా నుండవలెను. తోటలో తీవ్రముగా తెగులు తగిలినయెడల అంత చెరుకూ గానుగాడి బెల్లము చేయవలెను. విత్తనముగా వాడకూడదు.

అటుతరువాత తోటలో తెగులు తగిలిన చెరుకు తునకలు, పాతకుదురులు, కలుపు మొక్కలు యేరి పారవేయవలెను. తిరిగి తెగులు తగలకుండ పైరులు మార్చి వేయవలెను తెగులు తగిలిన చెరుకులను తిరిగి అదే చేలో యే కారణము చేతనయినను ఎదుగనీయకూడదు.

(3) ఈ దిగువ వివరించిన జాతులు యీ తెగులుకు లొంగిపోవును :—

సి.ఓ. 213 పూవను-వెళ్లె-ఎర్రమారీసు-జావా హెబ్బాలు-బి 3412.

ఈ చెరుకులు వేసినప్పుడు తెగులునుండి జాగ్రతగా కాపాడవలెను.

వ్యవసాయపు సర్కిల్ ఉద్యోగస్థులకుగాని కోయంబత్తూరులోని మైకాలజిస్టు కాని చెరుకు వేయు రైతులవలనయిన లేక యీ సంగతిలో శ్రద్ధగలవారివల్లనయిన

రిపోర్టులు పంపబడినయెడల డిపార్టుమెంటువారికి ఈ తెగులు ఎటులు వ్యాపించుచున్నదో, ఎప్పుడెప్పుడు వచ్చుచున్నదో తెలియగలదు.

ఎస్. సుందరరామన్,
సర్కారు మైకాలజిస్టు.

---

## 15. అనవసర వృక్షములు, వానిని సులభముగా నశింపజేయు పద్ధతి.

అనవసరమేగాక అపాయముచేయు మొక్కలు కొన్ని స్థలములలో పెరుగుచున్నవి. వానిని తుదముట్టించు సులభపద్ధతులకొరకై చాలామంది జనులు నిరీక్షించుచున్నారు. ఈ రాజధానిలోనుండు కొన్ని గొప్పదేవాలయములు వేలకొలది ధనము వ్యయముచేసి కట్టించిన సుందరభవనముల స్థంభములు, గోపురములు మొదలగువానిలోను రాళ్ళ కట్టురాళ్ల మధ్య స్థలములలోను మై మొక్కలు పెరిగి సన్నని వ్రేళ్లేర్పడునట్లు చేయుచున్నవి. అవి కొలది కాలములోనే పెరిగి పెద్దవై దుర్భేద్యమగుచున్నది. తుదకు వ్రేళ్లు పెద్దవైనప్పుడు గోడలు మొదలగునవి బలహీనతజెంది క్రింద పడిపోవుచున్నవి.

కట్టడములు అటువంటి నష్టములపాలు కాకుండునట్లుచేయ ఒక రసాయనపదార్థము దొరుకుచున్నది. అది మొలకలనయినను, పెద్ద చెట్లయినప్పటికిగాని సులభముగా నాశనముచేయును. సర్కారు భవనములపై ఆధీనముగలవారు గొప్ప మేడలుగలవారు కృషికులు యీ రసాయన ఔషధమును వాడుకలో బెట్టి, నష్టముల దొలగించు కొందురని ఆశించుచున్నాను.

ఈ మందుపేరు ఆట్లాను వృక్షనాశిని. ఇది ఒక పైంటు లేక అర్థ పైంటు డబ్బాలలో అమ్మబడుచున్నది. ఒక పైంటు డబ్బా రూ 2-2-0 లు, అర్థ పైంటు డబ్బా రూ 1-4-0 లు చొప్పున కల్లికోటలోనుండు మెసర్సు పియర్సు లెసిలి అండు కంపెనివారిదగ్గర, వారి బ్రాంచి ఆఫీసులవద్ద దొరుకుచున్నది. ఈ మందు పాషాణము కాబట్టి పశివాండ్రకు, తెలియనివారికి అందనట్లు దాచవలయును.

### ఉపయోగించు పద్ధతులు.

1. భూమినుండి ఒక అడుగు ఎత్తు మించకుండునట్లు ప్రకాండపు చర్మమును కొంచెము దారుభాగముతో వలయాకారముగా నాలుగంగుళముల వెడల్పున తీసివేయుము.

2. ఇట్లు పట్టతీసిన భాగమున యీ మందును కుంచెతో పూయును. మెత్తని పట్టగల వృక్షములకు ఒక భాగము మందునకు మూడు భాగములు నీళ్లను కలిపి ఉపయోగించవచ్చును. ఈ ఔషధమును చెట్టువేళ్లలోనికి సులభముగా ప్రవేశించుటకు భూమికి ఒక అడుగు ఎత్తుకు మించకుండ వేయవలయును. ఈ ద్రావకము వృక్షకాండమును ప్రవేశించి తుదకు వేళ్లు మొదలగువానిలోనికి పోయి కొలది కాలములోనే చెట్లను నశింపచేయుచున్నది. చెట్టుయొక్క వయస్సునుబట్టి ఈ ద్రావకము 3—7 దినములలో చెట్టును నాశనముచేయును. కఠినమైనటువంటిదారు భాగముగల వృక్షమును చనిపోవుటకు కొంతకాలము ఎక్కువ తీసికొనును.

ఎస్. సుందరరామన్,
సర్కారు, మైకాలజిస్టు.

## 16. పచ్చనికంచే (Live fence) (ఛాయా పటములతో).

కృషీవలుడు సేద్యముచేయుటకు పొలమును విర్పరచిన తర్వాత పశువులు చొచ్చుటకు వీలులేకుండునట్లును, దొంగలకు ఆస్పదము లేకుండునట్లును కంచెవేయుట ముఖ్యమైన పని. బీద రయితుకుకూడ సులభసాధ్యమగునట్లు వంద సంవత్సరములనుండి నాగదాళి (prickly-pear) కంచెకు అనుకూలముగా నుండెను. ద్రవ్యనష్టము లేక మెట్ట భూమిలోనయినను అది పెరుగుచుండెను. అయితే దానినుండి మనకు నష్టము హెచ్చుగానుండెను. సేద్యమున కనుకూలమైన పొలములలోనికి ఆక్రమించుకొని పాములకు నివాసయోగ్యముగా నుండెను. దానిని నిర్మూలము చేసిన "కొచినియల్" "Cochnial" అను పురుగు మనకు ఉపకారి. సేద్యమునకు తగినది యెక్కువ నేలను నాగదాళి ఆక్రమించుకొనియుండెను. దానిని నిర్మూలనము చేసినందున ఆ నేలనంతయు దుక్కిచేసి అందులో ఫలమును పండించుచున్నారు. దానికి సమానమైన కంచెను కనుగొనుటకు కష్టముగానున్నది. ముఖ్యముగా కంచెవేయుటకు తగిన వస్తువులు లేని స్థలములలో యీ కష్టము యినుమడించినది.

కంచెకు తగిన కొన్ని జాతులు యీ క్రింద పేర్కొనబడినవి :—



(1) Balsemodendron Berryii—(ముల్లుకిలవై)— పటములు 1, 2.— ఇది కంచెకు మంచి జాతి. ఇందులో ముండ్లు కలవి, ముండ్లులేనివి రెండు జాతులు కలవు. ఈ రెండుజాతులు కొమ్మలునాటిన చిగురెత్తి పెరుగును. వర్షాకాలముకి ఆరంభమగుటకు ముందు దీనిని నాటవలయును. ఈ కంచెను మంచి తరుణములో కత్తెరించిన యెడల చూచుటకు అందముగానుండును. కత్తెరించిన రెమ్మలను యెండబెట్టిన వంటచెరకుగా నుపయోగపడును.

(2) Euphorbia Royleana (బొంతకళ్లి)—మూడవ పటము.— ఇది రాతి నేలలలోను, చౌటి నేలలలోను ప్రధానముగా పెరుగును. దీని కాండము అయిదు కోణములుగలిగి, కండగలదిగానుండును. దానికి ముండ్లుండును.

(3) Euphorbia Antiqurom (చతురకళ్లి)—నాల్గవ పటము.—ఇది హిందూ దేశములో మెట్ట భూములలో సాధారణముగా పెరుగును. దీనిని సాధారణముగా కంచెగా నుపయోగింతురు. తూర్పు బంగాళా దేశములోను, ఆసాములోను దీనిని పవిత్రమైన చెట్టుగా నెన్నుకొని తోటలచుట్టు పెంచుదురు. కొమ్మలను నాటిన యిది చిగురించి వృద్ధియగును.

(4) Euphorbia Tirucalli—(పాలకళ్లి లేక తిరుగుకళ్లి) ఏడవ పటము.—దీనికి చిన్నవిగాను, మృదువుగాను, గుండ్రముగాను ఉండు రెమ్మలుండును. దీనిపాలు విరేచనములగుటకు మందుకుగా ఉపయోగపడును. ముఖ్యముగా పశువుల కుపయోగపడును. దీని పాలు కంటబోపడిన నొప్పికలుగునుగాన పశువులు యీ కళ్లిని చెనకవు. వర్షాకాలము ప్రారంభదశలో దీని కొమ్మలను పూడ్చిన నాటుకొనును.



(5) Agave Americana American Aloe (కిత్తనార)—ఐదవ పటము. ఇది మంచి కంచె
—దీనిని సాధారణముగా రైలు కత్తాళి (Rail kattali) యందురు. ఈ నార
గా నుపయోగపడును. దీనిని నాటిన తర్వాత అంత శ్రద్ధ అవసరములేదు. పెరుగును.
పగ్గములు చేయుట కుపయోగించును. చిన్న మొక్కలు నాటిన యిది
దీనిని వర్షాకాలములో గనిమలమీద నాటుదురు.

(6) Agave Sisalana (చిన్న కిత్తనార)—ఆరవ పటము.—ఇది కిత్తనార
కంటె చిన్నదిగానుండును. మొక్కలను నాటిన యిది వృద్ధియగును. వర్షాకాల
ములో గనిమెలపైన మొక్కలను నాటుదురు. మొక్కలు నాటిన తర్వాత దీనిని
జాగ్రత్తగా చూడనవసరములేదు. దీనినుండి తీయు నార కిత్తనారకంటె మృదువుగాను,
గట్టిగానుండును.

యస్. యస్. కుళందైస్వామి పిళ్ళై,
వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, అయిదవ సర్కిల్, తిరుచునాపల్లి.

## 17. కోళ్లను పెంచుటవలన ఉపయోగములు.

మాంసము కొరకు కోళ్లను, కోడిగ్రుడ్లను ముఖ్యముగా వాటిని తినువారు ప్రతి దినపు భోజనములోను ఉపయోగింతురు. ఈ రోజులలో, ముఖ్యముగా పట్టణముల చుట్టుప్రక్కల కోళ్లకును, వాటిగ్రుడ్లకును చాలా గిరాకిగాయున్నది. అట్టి చోట్ల ప్రజలు ఎక్కువ శ్రద్ధతో కోళ్లను పెంచుచున్నారు.

2. కొంతమంది కోళ్లను సరదాగా కాలక్షేపమునకు పెంచుదురు. కొందరు కోడిపందెములకు పెంచుదురు. మరికొందరు వాటినుండి లాభములు తీయుటకు పెంచుదురు. కోళ్లను పెంచి లాభము పొందువారికి ఈ క్రింద ఒక చిన్న వ్యాసము ఈయబడినది. కోళ్లను గృహోపయోగములకుకూడా ఉపయోగింపవచ్చును. దానినుండీ లాభను సంపాదించు తరుణము వచ్చినప్పుడు ఆ పనిని శ్రద్ధతో చేయకపోవుటకు కారణము లేదు ?

3. కోళ్లు సాధువులు. సులభముగా పెంచవచ్చును. కావున మొగవాండ్రు పొలములో పని చూచుకొనుటకు వెళ్లినప్పుడు ఆడువాండ్రుగాని పిల్లలుగాని వాటిని చూడవచ్చును.

4. కోళ్లను పెంచుట ప్రతివారును చేయగలిగినపనియే. బీదరైతులయినను వాటిని పెంచి లాభము సంపాదించవచ్చును. పెద్ద పట్టణములోని జనులయినను వలసినంత స్థలమున్నయెడల వారు కొన్ని కోళ్లను పెంచవచ్చును. ఈ పద్ధతిని "పెరటిలోకోళ్లను పెంచుట" అందురు. కొంచెము శ్రద్ధతోను, సరియైన మేతతోను మొదలగు కొన్ని సౌకర్యములతోను పెంచిన ఇది చివరకు మన ఆదాయమునకు తోడ్పడును.

5. బాగుగా మేతపెట్టి పెంచబడుచున్న కోడిపెట్ట మాసమునకు అ 5 లు విలువ గల తిండితిని సుమారు అ 11 లు విలువగల గ్రుడ్లను పెట్టును. కావున ఒకడు 30 కోళ్లను పెంచినయెడల నెలకు దాదాపు రూ 11 లు లేక సంవత్సరమునకు రూ 130 లు సులభముగా సంపాదించగలడు. ఈ ఆదాయము ఒక పంటమీదవచ్చు ఆదాయమునకు సమము కాదా ?

6. మామూలు వ్యవసాయముతోపాటు కోళ్లను పెంచుట తప్పక లాభకరము. కోళ్లు పనికిరాని పదార్థములను, ధాన్యములను, పొలములోనుండు కాయగూరలను తిని బ్రతుకును.

7. కోళ్లను సస్యములు కోసినతరువాత మొళ్లలో విడిచి పెట్టవచ్చును. అవి రాలిపోయిన గింజలను తినును. లేనియెడల ఆ గింజలు వృథా అయిపోవును. ఈ విధముగా పనికిరాని పదార్థములను ఉపయోగము చేయవచ్చును.

8. కోళ్లు మనము కనిపెట్టలేని పురుగులను, గ్రుడ్లను తినును, రాబోవు సస్యములకు చీడపట్టకుండ సహాయపడును.

9. లేతచేలమీద మొక్కలు ఒక అడుగు ఎత్తు పెరిగిన తర్వాత కోళ్లను విడిచి పెట్టవచ్చును. అవి సస్యవృద్ధికి నష్టము కలుగజేయు పురుగులను, కీటకములను తినును. ఈ విధముగా కోళ్లకు అగుతిండి ఖర్చుకూడ కొంచెము తగ్గును. కోళ్లయొక్క ఎరువు చాల విలువగలది.

10. వ్యవసాయదారులకు కోళ్లను పెంచుటకు, వారి వ్యవసాయమునకు అనేక విధములుగ సహాయపడును. కావున యీ పనిని చేయుటకుముందు, "పశువుల డిప్యుటి డైరెక్టరు, హొసూరు, పశువుల ఫారము పోస్టాఫీసు" కు వ్రాసిన కావలసిన సలహాలన్నియు యివ్వబడును.

11. హొసూరులోనున్న లైవ్‌స్టాకు పరిశోధన స్థానములలో కోళ్లను పెంచు బ్రాంచి ఒకటిగలదు. అచ్చట దేశవాళి విదేశకరముల కోళ్లను పెంచుచున్నారు. అది నేర్పుగల మనుష్యుల అధిపత్యము క్రిందనున్నది. వారు ప్రేక్షకులకు సలహాలు కూడ యివ్వగలరు. గ్రుడ్లు పొదుగుట, స్వాభావిక పద్ధతి, కల్పిత పద్ధతిని కోడి పిల్లలకు మేతపెట్టుట, వాటిని పెంచుట, జాతిని వృద్ధిచేయు పెట్టలను మేపువిధము, వాటిని వృద్ధిచేయు విధము, వివిధములగు వసతులేర్పరచు పద్ధతులు అవలంభింపబడు చున్నవి. చూడగోరువారు యెల్లప్పుడును చూడవచ్చును.

12. కోళ్లను, కోడిగ్రుడ్లును చాలమందికి కావలయును. వారందరికి అతిస్వల్ప ధరలో సాధ్యమైనంతవరకు ఫారంవారు సప్లయి చేయగలరు. అచట పెంచబడు జాతు లేవన :—

1. తెల్ల లెగారన్సు.
2. రోడ్ ఐలెండు రెడ్సు.
3. లైట్ సస్సెక్సు.
4. నల్ల మినోర్కాసు.
5. చిట్టగాంగులు.
6. దేశవాళీలు.

ప్రతి జాతిలోను కొన్ని కోళ్లను ఏరి అవిగడచిన సంవత్సరములో పెట్టిన గ్రుడ్ల సంఖ్య ఈ క్రింద తెలుపబడినది :—

| జాతి. | | పెట్టల సంఖ్య. | సగటున ఒక సంవత్సరములో ఒక పెట్ట పెట్టిన గ్రుడ్లు. | అధికముగా పెట్టిన పెట్టయొక్క గ్రుడ్లు. | స్వల్పముగా పెట్టిన పెట్టయొక్క గ్రుడ్లు. |
|---|---|---|---|---|---|
| తెల్ల లెగారన్సు | ... | 12 | 184 | 236 | 158 |
| రోడ్ ఐలెండు రెడ్సు | ... | 9 | 157 | 181 | 135 |
| లైటు సస్సెక్సు | ... | 6 | 143 | 196 | 109 |
| నల్ల మినోర్కాసు | ... | 3 | 149 | 167 | 114 |
| చిటగాంగులు | ... | 3 | 134 | 149 | 116 |
| దేశవాళి (తెల్లిచెరి) | ... | 5 | 110 | 141 | 85 |

ఆర్. డబ్ల్యు. లిటిల్‌వుడ్,
పశువుల డిప్యుటి డైరెక్టరు.

హెచ్. నరహరి రావు,
కోళ్ల అసిస్టెంటు.

## 18. కోళ్లు స్వతస్సిద్ధముగా గ్రుడ్లను పొదుగు విషయము.

స్వతస్సిద్ధముగా పొదుగుట.—కోళ్లను కొంచెము సంఖ్యలో అనగా 100 పిల్లల వరకు పెంచదలుచుకొనినవారికి, స్వాభావిక మార్గమే, అనగా పెట్ట గ్రుడ్లపై అనుగుటయే యుచితమగు పద్ధతి.

పెట్ట పొదగ నెత్నించుటకు చిహ్నాలు.—పొదగుట పక్షి జాతిలో ఆడు పక్షికి నైజగుణమైయున్నది. ప్రకృతియందు జాతి యుత్పత్తికిగాను, పెట్ట గ్రుడ్లపై పిల్లలయ్యేవరకు అనుగుట మానలేని భావమైయున్నది. నాటు కోడి మూడు, నాలుగు దఫాలలో ఒక్కొక్కసారి 10 మొదలు 15 గ్రుడ్లవరకు పెట్టును. తోడనే కోడి ఆ గ్రుడ్లనుండి పిల్లలను జేయు నపేక్ష జెందియుండును. అట్టి యపేక్ష జెందిన కోడి ఈ దిగువ నుదహరించిన చిహ్నాలు కలిగియుండును :—

(1) గ్రుడ్లు పెట్టడము మానుట.

(2) ముని చీకటిగాయున్న యొక మూలకు బోయి నిశ్శాంతిగానుండుట, గూడుకట్టుటకు యత్నించుట.

(3) మనిషి చెంతకు వచ్చిన రోమాంచమగుట, మారు రీతిని కూయుట.

(4) ఆకలి లేమి.

(5) కోడి జుట్టు, గూబలు ప్రత్యుత్పత్తికరమగు యంగములు చిన్నవగుట.

(6) శరీరమందు వెట్ట బుట్టుట.

(7) ముఖమందు తేటు తగ్గుట.

సాధారణముగా పెట్ట క్రింద గ్రుడ్లు 21 దినములలో పిల్లలగును. పొదిగెడు పెట్ట ననుసరించి ఈ కాలము హెచ్చుగాని తగ్గుగాని కావచ్చును. పొదుగుట కపేక్షించు పెట్ట ఇతర జాతుల కోళ్ల గ్రుడ్లుకూడ అనుగును.

గ్రుడ్లు పిల్లలగు కాలము.

| | | |
|---|---|---|
| కోడి | ... ... | 21 దినములు. |
| పొట్టి బాతు, టర్కీ కోడి | ... | 28 డిటో. |
| పెద్ద బాతు ... | ... | 30 డిటో. |

పొదిగెడు పెట్ట.—అనుగుటకు గ్రుడ్లు వేయునపుడు, పెట్ట పొదుగునవస్థ జెందియున్నదో లేనిదో కనుగొనవలయును. లేనియెడల కొన్ని దినములలోనే పెట్టగూడు విడిచిపోవును. ఏదైన యొక పెట్ట అట్టి యవస్థ జెందియున్నదా లేదాయని తెలిసికొనుటకు, మచ్చుకు ఒకటి రెండు గ్రుడ్లుగాని లేక గ్రుడ్లు రూపముగా జెయబడిన ఒక బొమ్మగాని తట్టలో పొదగుటకు వేసి చూడవలయును ; పెట్ట క్రమముగా వాటిపైన కూర్చొని యున్నయెడల పెట్ట యుక్తమైనదని గ్రహించవలయును.

పెట్ట నెన్నువిధము.—ఆరోగ్యమైనదియు, పేలుగాని తవుటి పురుగులుగాని లేనట్టిదియు, పరిమాణమున మధ్య రకముగా యున్నటువంటి పెంపుడు పెట్ట నెన్నుకొనవలయును. కాళ్లకు ఆరు గలిగిన కోళ్ల నెంచగూడదు. కొన్ని పెట్టలు తఱచుగా బెదిరి, పైకి వదలినపుడును, అనుగుటకు కూర్చుండ బెట్టినపుడును, గ్రుడ్లను పగుల గొట్టును. కనుక పొదిగెడు పెట్టలను సరియైన వలసా కావాయని తెలిసికొని తప

యోగించవలెను. సంతతియందపేక్షకలవైనను, అనుగునపుడు గ్రుడ్లు పగులుటనుబట్టి, పొడుగు కాళ్ల కోళ్లకంటె పొట్టికాళ్ల కోళ్లు మేలు.

పెట్ట కెన్నిగ్రుడ్లు వేయవలెను.—అన్యదేశపు జాతిలో అంత పెద్దది చిన్నది కాని పెట్ట గ్రుడ్ల పరిమాణము ననుసరించి 10 మొదలు 12 గ్రుడ్లు వరకును దేశవాళి పెట్ట 8 మొదలు 10 వరకును పొదగును. పెట్ట అనుగుటకు వేసిన అన్ని గ్రుడ్లను తన క్రింద ఇముడ్చుకొనునట్లు చూడవలయును. గ్రుడ్లను పైకి క్రిందికి మార్చునపుడు, ఏమరుపాటున ఒకటి రెండు బయటవదలివేయుటకు హేతువైనపుడట్టి గ్రుడ్లు నెమ్మకొనును. కనుక పొదగుటకు తన క్రింద ఇముడ్చుకొనుట కవకాశము గలిగి నన్ని గ్రుడ్లను మాత్రమే పెట్టకు వేయుటక్షేమకరము.

ఒక పెట్ట ఎన్ని గ్రుడ్ల నొకసారి పొదగగలదను విషయము, పెట్ట పరిమాణము ననుసరించియు, జాతి ననుసరించియు నుండును.

| | | అన్యదేశపు జాతి పెట్ట. | నాటు పెట్ట. |
|---|---|---|---|
| కోడి గ్రుడ్లు | ... | 10 మొదలు 12 | 8 మొదలు 10 |
| పొట్టి బాతు | ... | 7 „ 8 | 6 |
| పెద్ద బాతు | ... | 5 „ 6 | 4 మొదలు 5 |
| టర్కీ కోడి | ... | 5 „ 7 | 4 „ 5 |

గూడు.—గూడుకట్టుట సులభమగు విషయమైనప్పటికి, యీ పని ఎక్కువశ్రద్ధతో గూడు కొన్న విషయము. 18 అంగుళములు చతురముగలిగి ముందుప్రక్కన మీటగలిగిన ద్వారమమర్చబడిన యొకపేకేజి పెట్టితో గూడు తయారుచేయవచ్చును. ఆ పెట్టె యడుగున తేమగలిగిన ఇసుకయు, దానిపైన గడ్డియు, గడ్డిపైన పేలురాకుండుటకు కట్టె బూడిదయు నుంచవలయును.



యుండును. మఱియు చేతితో వాటిని పెంకునుంచి వెలుపలదీసినపుడు పిల్లలకు ప్రమాదము జరుగును.

ముగింపు.—క్రొత్తగా పుట్టినపిల్లలను, తల్లిని యింకొకచోటికి మార్చుటకు మరియొక పెట్టె గూడు యవసరము. పెట్టకు మేత యీయవచ్చును గాని పిల్లలకు రెండు దినములవరకు ఆహారమీయగూడదు. పిల్ల బయలువెడలుటలోపల గ్రుడ్డులో చాన యంతయు సంగ్రహించును. గనుక యిదియే దానికి కొన్ని దినములవరకు పోషించు ఆహారముగా వర్తించును. అందువలన పిల్లలకు విస్తారము తిండి పెట్టకూడదు. పెట్టినచో అజీర్ణ, నీళ్ల విరేచనములు మొదలగు సంకటములకు పాలగును. గోధుమ, మొక్కజొన్న, జొన్న ధాన్యముల మెత్తని నూక, బియ్యపు నూకలు పిల్లలకు మొదటి యాహారముగా నీయవచ్చును. పిల్లలకు 'ఓటు' ధాన్యపుపిండి శ్రేష్టమైన యాహారము. పెట్ట పిల్లలకు మేత యేరుకొనుట, నీరు త్రాగుట నేర్పును. మనము చేయవలసినది వాటికి మంచినీడలో యుండుటకు యేర్పాటును, పేలు, తవుడు పురుగులు పట్టకుండా జేయుట మాత్రమే.

గ్రుడ్లు పిల్లలగుటకు తేమ, వేడిమి, గాలి ముఖ్యము. పెట్ట గ్రుడ్లనుపొదుగుటకు పూర్వము దేహమందు రక్త మతిత్వరితముగ ప్రవహించుటచే దేహమందు వెట్ట యధికమగును. ఈ వేడిమి గ్రుడ్లను 103° నుంచి 104° వరకు నుంచుటయందు సహాయమొనర్చును.

గ్రుడ్డు మామూలుగా నిలుచురీతి నుంచేయెడల గ్రుడ్డులో చందమామ పైకియుండును. చందమామ సొనకంటె తేలికయగుటచే మొదటిది రెండవదానిమీద తేలును. ప్రకృతియందు వెట్ట వేడిమి చందమామకు తగులుటకుగాను చందమామ గ్రుడ్డులో పైభాగమాక్రమించునటుల సృష్టింపబడెను.

ప్రతిదినమును పెట్టను తిరుగుటకు వదలునపుడు అది 10 లేక 15 నిమిషములలో తిరిగి గూటిని జేరును. పొదుగుటకు కూర్చొనుటకు పూర్వము గ్రుడ్లను కదిపి త్రిప్పును. గ్రుడ్లొకే పార్శ్వమున నిలిచినచో చందమామ గ్రుడ్డుయొక్క పెంకునకు లోభాగమున అంటుకుపోవుటయు, యేర్పడవలసిన పిల్ల నశించుటయు సంభవించును.

పెట్ట పొదగుకాలమున స్వాభావికముగ ఎట్లు గ్రుడ్లను కదిపి త్రిప్పునో మనుష్య సహాయమువలన తయారుచేయబడు అనుగు యంత్రములును గ్రుడ్లకిట్టి పరిస్థితులు గల్పించి పిల్లలను చేయును.

ఆర్. డబ్ల్యు. లిటిల్ వుడ్,
డిప్యూటి డైరక్టరు, పశు శాఖ.
హెచ్. నరహరి రావు,
కోళ్ల అసిస్టెంటు.

---

## 19. కోడి గ్రుడ్లను పొదిగించుట, కోడిపిల్లలను పెంచు పద్ధతి.

కోళ్లను వృద్ధిచేయవలెనన్న, గ్రుడ్లను పొదిగించుట, పిల్లలను పెంచుట అనునది రెండు ముఖ్యమైన విషయములు. ఇది రెండు పద్ధతులుగా విభజించబడినది. (1) కోళ్లు తమంతట తాము గ్రుడ్లను పొదుగుట, పిల్లలను పెంచుట, (2) సాధకములతో కోడిగ్రుడ్లను పొదిగించుట, వాటియొక్క పిల్లలను పెంచుట.

కోళ్లను వృద్ధిచేయవలెనని ఆశ కలిగినవారు మంచి బుద్ధికుశలత, జాగ్రత, ఓరిమి పొంది చిన్న చిన్న విషయములయందుకూడ జాగరూకతతో చూడవలెను.

కోళ్లు తమంతటతాము గ్రుడ్లను పొదుగుట, పిల్లలను పెంచు పద్ధతి.—ఒకేమారు యెక్కువ గ్రుడ్లను కోళ్లు పొదగకుండా మామూలు పద్ధతిని కోళ్లు పిల్లలనుచేయుట సృష్టి విధానమునుబట్టి మనుజునిచే గుర్తింపబడుచున్నది. కోడి గ్రుడ్లు బహువిధములగు కష్టములను పొంది పిల్లలుగా వెలువడినందున వెంటనే సూర్యరశ్మి మొదలగు వెలుతురుకు ఎదలకుండ తమంతట తాము గూళ్లు వదలిపోవలెనని శక్తి కలిగినపుడే వాటిని ఎదలవలెను. కోడి గ్రుడ్లు పిల్లలుగా తయారగునప్పటికి ఒక శుభ్రమైన గూడు తయారుచేసి, తల్లితోపాటు పిల్లలనుకూడ ఆ గూడులోనే వుంచవలెను. కోడి గూళ్లు వెలుతురు పడేలాగున మంచి పద్ధతులమీద తయారుచేయవలెను.

తల్లి కోడికిన్ని, పిల్లలకున్ను పేలుపట్టి బాధింపబడకుండుటకుగాను అంటురోగ నివారణ మందులను కలిపిన బూడిదలో అప్పుడప్పుడు పొర్లుటకు తల్లి కోడికి అవకాశమిచ్చుచుండవలెను.

ఒక్కొక తల్లి కోడికి గ్రుడ్లను పొదుగుటకంటె పిల్లలను జాగరూకతతో పెంచుటయందు యెక్కువ సామర్థ్యత కలిగియుండును.

ఒక మంచి తల్లి కోడి తన పిల్లలతోపాటు యితర కోళ్ల పిల్లలనుకూడ 15 మొదలు 20 వరకు పెంచగలుగుటకు సామర్థ్యత కలిగియుండును. తల్లి కోడికి తన పిల్లలను పెంచు పద్ధతి తెలుసునని మనము అశ్రద్ధచేయక, ఆ పిల్లలను గ్రద్దలుచే తన్నుకుపోకుండగనూ, పాములు వగైరాలుచే యెత్తుకుపోకుండగనూ తగు యేర్పాట్లు మనము చేయవలెను. ఈ పై కష్టములను దొలగించవలెనన్న ఒక గూడును యేర్పాటుచేయుట మంచిది.

చల్లటిగాలి తగిలే స్థలమునందుగాని, పచ్చిక బయళ్లయందుగాని పై చెప్పిన గూళ్లు కట్టకూడదు.

సాధకములతో కోడిగ్రుడ్లను పొదుగుట, పిల్లలను పెంచుపద్ధతి.—ఈ పద్ధతిని కోడిగ్రుడ్లను పొదుగుటకు, పిల్లలను పెంచుటకు వేడిని కలుగజేయు ఒక యంత్రము యెక్కువ యుపయోగముగానున్నది. స్వభావసిద్ధముగా తల్లి కోడి గ్రుడ్లను పొదుగుట, పిల్లలను పెంచుట చాల సులభమైన పద్ధతి. కాని యంత్రపు పద్ధతిని పెంచుటలో తల్లి కోడికంటె యెక్కువ జాగ్రతతో మనుష్యుడు పెంచవలెను. ఎక్కువ గ్రుడ్లను ఒకేమారు జాగ్రతగా పొదిగి, పిల్లలను పెంచుటలో యెక్కువ సదుపాయములు కలుగజేయుటకు యంత్రసహాయము యెక్కువ అవసరము. "ఫాస్టర్ మదర్సు", "బ్రూడర్సు" "హోవర్సు" యీ యంత్రములు పై విషయములో యెక్కువ ఉపయోగకరములు. ఎలక్ట్రిసిటీవల్లగాని, నూనివల్లగాని, బొగ్గువల్లగాని వేడిచేయబడు కోళ్లగూటిలో ఒక పెట్టెని "ఫాస్టరు మదరు" అనియు, "బ్రూడరు" అనియు అందురు.

ఒక దీపమువల్ల క్రిందనుంచి వేడిచేయబడు కోను మోస్తరుగా ఒక రాయితో తయారుకాబడి దానివల్ల వేడిని కలుగజేయు యంత్రమును "హోవరు" అందురు.

బజారులో అనేక పద్ధతులైన "ఫాస్టరు మదర్లు" "బ్రూడర్లు" కూడ కలవు. వ్యాపారమునుబట్టి వీటి వుపయోగమును చేయుదురు. 50 లేక 60 పిల్లలను పెంచు

టకు తక్కువ కిమ్మతుగల నిప్పులేని "బ్రూడర్లు" చిన్న ఫారమునకు తయారుచేయ వచ్చును. దానిలో పిల్లలయొక్క వేడిజేతనే అవి పెంచబడును.



వెల్తురు కన్నములు.



నెక్లను.



కన్నములు ఒకటి తరువాత ఒకటి వుండవలెను.

ఫాస్టరు మదరు.

“ ఫాస్టరు మదరుయొక్క పద్ధతి ”.—3 అడుగులు పొడుగు $1\frac{3}{4}$ అడుగుల వెడల్పు, $1\frac{1}{2}$ అడుగుల లోతుగల కర్రతో తయారుచేసిన ఒక పెట్టె 35 పిల్లలను పెంచుటకు సరిపోవును. ఆ పెట్టెయొక్క అడుగువార, కప్పులాగ వుండవలెను. అడుగున గాలివెళ్లుటకు బొత్తలుండవలెను. పిల్లలు గుంపులుగుంపులుగా జేరుటకు ఆ పెట్టెయొక్క నాలుగు మూలలు గుండ్రముగా వుండవలెను. పది అంగుళములు యెత్తుగల బల్లమీద ఆ పెట్టెను తయారుచేయవలెను. ఆ పెట్టెప్రక్కన 9″ × 3″ అంగుళముల గాలి వెళ్లుటకు పోవుటకు వుపయోగముండులాగున ఒకమూత యేర్పాటుచేయవలెను. పెట్టెయొక్క అడుగు భాగములో యెండుగడ్డి ముక్కలుగా కోసి మెత్తగావుండుటకు వుంచవలెను.

కోడి పిల్లలు పెద్దవగుకొలది, వాటి సంఖ్య తగ్గించవలెను. మొదటి వారము 35 మొదలు 40 వరకు, రెండవ వారము 30, మూడవ వారము 25, నాలుగవ వారము 20 వరకు తగ్గించవలెను.

ఈ పద్ధతి “ బ్రూడరు ”లో స్థలవిషయమున జాగ్రత్తగా చూడవలెను. పిల్లలు గుంపులుగుంపులుగాచేరిన అవి బాగుగా రొదుగుటకు అవకాశముండదు. కావున ఎక్కువ పిల్లలను ఈ “ బ్రూడరు ”లో వుంచకూడదు. ఈ పద్ధతి “ ఫాస్టరు మదరు ” ఈ రాజధానిలోని పర్వత ప్రదేశములోతప్ప తక్కినచోట్ల యెక్కువ వుపయోగముగా వుండును.

మరియొక పద్ధతిగల “ ఫాస్టరు మదరు ” లేక “ ఆఫరుమదరు ” 4′ × 3′ × 2′ అడుగుల కొలతగల పెట్టె. ఈ పెట్టెలోపల ఒక తీగెవలన అమర్చవలెను. పెట్టెలో పలకను తీగె ప్రక్క మధ్య యెండు గడ్డిముక్కలను వేయవలెను. ఇట్టి యేర్పాటు చేయుటయొక్క ఉద్దేశ్యమేమనగా, కోడి పిల్లలకు చిన్నతనములో వెచ్చగా వుండుటకును, పెద్దవి అగుగొలది వేడి నెమ్మది నెమ్మదిగా తగ్గుటకును, అయిదు మొదలు ఎనిమిది వారములవరకు కోడి పిల్లలను పెట్టెలో వుంచవచ్చును.

కోడిపిల్లల మేపు.—మొదటి వారము మొదలు మూడు వారములవరకు కోడి పిల్లలలో చావు యెక్కువగానుండునని అనుభవమువల్ల తెలియుచున్నది. ఈ గడువులోనే, వాటిని జాగ్రతగా పెంచవలెను. ఈ సమయమందు వాటికి వేడి కలుగచేయు సదుపాయములేగాక, పిల్లలు తగు పక్షులుగా తయారగుటకు సరియైన మేతకూడ సకాలములో యిచ్చుచుండవలెను. వాటికి హెచ్చుకాకుండా తగుమాత్రపు మేతమాత్రమే యిచ్చుచుండవలెను. వాటిని ఆకలితో వుంచుట మంచిది. అది మేతకొరకు తొందరగా వెదకుకొనుచుండును. కోడిపిల్లలకు బాగుగా పెరుగుటకు తగుమాత్రము వేడినిచ్చు మేత పెట్టుచూ పెంచవలెను. కోడి పిల్లలకు మొట్టమొదట గోధుమ లేక నూకలు, బాగుగవిసిరి వాటితో వాటికి మేత ప్రారంభించవలెను. ఓటుమీలుపిండి దొరికినయెడల వాటికి మొదటి రెండు వారములవరకు మంచి ఆహారము.

పిల్లలకు దగ్గరలో అందులాగున మేత బల్లలమీద యేర్పాటుచేయవలెను.

పిల్లల తల్లిలేని సమయములో, సాధ్యమైనంతవరకు పిల్లలుమేతకొరకు వచ్చుటకు వేలితో బోర్డుమీద ధ్వనిచేయుచు వాటికి మొదటనే మేతతినుటనేర్పవలెను. రెండువారములవరకు రోజుకు రెండుసార్లు చొప్పున బాగుగ ఉడకపెట్టిన కోడిగుడ్లను చిన్నచిన్న ముక్కలుగా తరిగి రొట్టెముక్కలలో కలిపి కోడిపిల్లలకు ఆహారముగా యిచ్చుచుండవలెను. పరిశుభ్రమైన నీరు పిల్లలు తాగుటకు యెల్లప్పుడు వాటిదగ్గర వుంచుచుండవలెను. సాధ్యమైనయెడల వెన్నతీసిన పాలుగాని, మజ్జిగగాని వాటికి మంచి ఆహారము.

పచ్చిమేత.—కోడిపిల్లలు బాగుగా పెరుగుటకు మొదటి రెండు మూడు వారముల వరకు అనగా అవి తమంతట తాము యెగిరి పచ్చగడ్డిమేతకు వెళ్ళేవరకు పచ్చిమేత మంచి ఆహారము.

మేతయొక్క పద్ధతులు.

| కోడిపిల్లలయొక్క వయస్సు. | మేపు. | పానము. |
|---|---|---|
| 36 గంటలవరకు ... | ఆహారము లేదు .. ... | వెచ్చగానుండు 'బ్రూడరు'లో నుంచవలెను. |
| పది దినములవరకు వయస్సు కలిగిన కోడి పిల్లలు. | 'ఓటుమీలు' లేక 'బాగుగ విసరిన మొక్కజొన్న' లేక 'గోదుమ నూక' లేక 'విసిరిన బియ్యం' ఆయా స్థలములయందు దొరుకునట్టివి. రోజు 1 కి అయిదుసార్లు చొప్పున ఉదయం 6 గంటలకు, 9 గంటలకు, 11 గంటలకు, మధ్యాహ్నం 1 గంటకు, సాయంత్రం 4 గంటలకు కొంచము కొంచముగా పెట్టవలెను. | పరిశుభ్రమైన నీరుగాని, వెన్నతీసిన పాలుగాని నీటిలోకలిపిన మజ్జిగ. |
| 10 మొదలు 20 దినముల వయస్సు కలిగిన పిల్లలకు. | పైని చెప్పిన పద్ధతిని గింజ ఆహారము ఉదయం 11 గంటలకు బాగుగ ఉడకపెట్టినకోడి గుడ్లను ముక్కలుగా తరిగి రొట్టె ముక్కలతో కలిపిన ఆహారము. చెద పురుగులనుకూడ ఆహారముగా ఉపయోగించవలెను. | డిటో. |

| కోడిపిల్లలయొక్క వయస్సు. | మేపు. | నీటిపదార్థములు. |
| --- | --- | --- |
| 20 రోజులు మొదలు ఒక నెలవరకు. | పై చెప్పిన గింజ ఆహారము మొరుముగానుండునట్లు విసిరిపెట్టవలెను. కూరగాయల ఆకులు వాటిముందు కట్టవలెను. పెంకుముక్కలుగాని బొగ్గుగాని ఎల్లప్పుడు వాటిముందు ఉంచవలెను. | పరిశుభ్రమైన నీరుగాని వెన్నతీసిన పాలుగాని నీటితో కలిపిన మజ్జిగ. |
| 4 మొదలు ఆరు వారములవరకు. | గింజల ఆహారము 3 పర్యాయములే పెట్టవలెను. (ఎక్కువగా మృదువుగానుండకూడదు.) పై విధముగనే పెంకు ముక్కలు, బొగ్గు ఎల్లప్పుడు వుంచవలెను. | డిటో. |
| 6 వారములు మొదలు 3½ నెలవరకు. | 30 పౌనుల గోదుమ తవుడు, 30 పౌనుల బియ్యపు తవుడు, 30 పౌనుల చోడి పిండి, 10 పౌనుల వేరుశెనగ పిండి, 10 పౌనుల చేపల పొడి, 3 పౌనుల లోహము పొడి, 1 పౌను లవణము, రెండు మాసములవరకు రెండు వంతుల గోధుమ తవుడుతో పై వాటితో కలిపిన ఆహారము. తక్కిన 1½ నెలకు ఒక వంతుతో కలిపిపెట్టవలెను. పై జెప్పినవాటితో కాయకూరలు ముక్కలుగా తరిగికలిపిపెట్టవలెను. రోజు విడిచి రోజు ఒక నెలదాటిన పిల్లలకు ఉడకపెట్టిన అన్నము గొడ్డు మాంసముతో కలిపిపెట్టవలెను. పెంకు ముక్కలు, బొగ్గు ఎప్పుడు వాటిదగ్గర వుంచవలెను. | డిటో. |

త్రాగుటకు నీరు.—మట్టికుండలో మంచి శుభ్రమైన నీటినిపోసి కొంచము "పొటాసియం పర్మంగనేటు" కలిపిపెట్టవలెను. దినదినము సూర్యరశ్మిలో కోడి పిల్లలను ఉంచుచుండవలెను.

నడతలు.—విశాలమైన స్థలము ఏర్పరుపవలెను. సరియైన తిండి పెట్టవలెను. బలహీనమైన పిల్లలను జాగరూకతతో చూడవలెను. అట్లు చేయనియెడల పొడుచుకొనుట ఆరంభించి చెడిపోవును. పుంజు పిల్లలను, పెట్ట పిల్లలను పోలిక తెలియగనే వేరువేరుగా వుంచవలెను.

11

సంచారము.—విశాలమైన స్థలములలో ఒక మైలు విస్తీర్ణముగల చోటున వాటిని వదలిపెట్టవలెను.

సమాప్తి.—కోళ్లను వృద్ధిచేయవలెనన్న, యే సమయమందు యెట్టిదిచేసిన లాభక రమో ఆలోచించి అట్టి సమయములయందు తగు పనులను చేయవలెను.

ఆర్. డబ్ల్యు. లిటిల్‌వుడ్,
పశువుల డిప్యూటి డైరెక్టరు.

హెచ్. నరహరి రావు,
కోళ్ల అసిస్టెంటు.

---

## 20. అబోతులను స్వంతముగా పెంచువారికి సర్కారువారిచ్చు పారితోషికములను పొందుటకు గమనించవలసిన షరతులు.

1. అబోతులను చెన్నపురి వ్యవసాయపు డైరెక్టరుగారు అంగీకరించవలయును.

2. దానికి సరియైన మేతపెట్టి శుభ్రమైన సాలలో మంచిస్థితిలో నుంచవలెను.

3. అబోతు దాటువిషయమై తెలుపునట్టి ఒక పుస్తకమును యీ క్రిందివిధముగా నుంచవలయును :—

| పొర్లు తారీఖు. | ఆవు యజమానుని పేరు, మైవిలాసము. | వసూలుచేయబడిన రుసుము. | దూడ వర్ణన (మగ, ఆడ, రంగు మొదలుగా గలవి). |
|---|---|---|---|
| | | రూ. అ. పై. | |

4. అబోతు సంవత్సరమునకు అధమము 40 మొదలు 80 మారులు దాటవలెను. అది చిన్నదైనట్లైన పారితోషికము పొందుటకు యిరువదియైదు సారులు దాటవలయును.

5. అబోతును ఒకరుగాని సంఘముగాని ఉంచుకొనవచ్చును.

6. అబోతు దాటినందుకు రుసుము దాని యజమానుడు చుట్టుప్రక్కల పరిస్థితులనుబట్టి వసూలు చేయవచ్చును.

7. అబోతున కిచ్చు పారితోషికము వ్యవసాయ డిపార్టుమెంటు ఆఫీసరుల యిష్టముపైన మూడు సంవత్సరములు యివ్వవచ్చును.

8. ఒక స్థలములో ఒక ఆబోతుకంటె యెక్కువ వుంచుకొనుటకు వీలులేదు.

ఆబోతునకు యివ్వవలసిన ఆదరణ.—ఆబోతు మందలో సగముపెట్టన్న సంగతి మనస్సునందుంచుకొని యితర పశువులకంటె ఆబోతుయందె యెక్కువ ఆదరణ చూపవలెను. ఎందుకనగా దానిపై వెచ్చించిన సొమ్ముకు తగినంత బలముగను, బాగుగను పెరుగు దూడలను పొందవలెను.

ఆబోతును క్రొత్త స్థలమునకు తీసికొని వెళ్లగనే సాధారణముగా మేత సరిగా మేయదు గాన, ఆపరిస్థితులకు అలవాటు పడువరకు ఒకటి రెండు వారములవరకు అవులను దాటనివ్వకూడదు.

పశువుల కొట్టము.—ఆబోతును బాగుగా పెంచుటకు ముఖ్యమైన యంశము తీక్ష్ణమైన ఎండయును, వర్షమును, చలిగాలియు తగులకుండునట్టియు, బాగుగా వెలుతురు, గాలి చొచ్చునట్టియు, పది అడుగుల వెడల్పు, పది అడుగుల పొడవుగల సాల యుండవలయును. సాలలో మేతకు తొట్టి యుండవలయును. నేలపై కడపరాళ్లు (కాలు జారకుండుటకు గంటుకొట్టినవి) పరచిన వుత్తమము. ఇది సులభముగా కడిగి శుభ్ర పరచుటకు వీలగును. కంకరనేల మంచిదేను, అయితే కడుగుటకు వీలులేదు. సాల ప్రతిదినము శుభ్రము చేయవలయును.

మేత పెట్టుట.—అబోతువలన గొప్ప లాభము పొందవలయునన్న దానికి సారవంతమైన మేతను పెట్టవలయును. దానికి ఎట్టి మేత యివ్వవలయు ననునది యీ క్రింద కనుపరచినాము:—

### 1. ఎక్కువ సారులు దాటు పెద్ద రకపు ఆబోతు.

(1)

1 పౌను గానుగ పిండి.
2 పౌనుల వులవలు.
1 పౌను ప్రత్తి గింజలు.
2 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

(2)

2 పౌనుల గానుగ పిండి.
1 పౌను వులవలు.
1 పౌను ప్రత్తి గింజలు.
2 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

### 2. మధ్యరకపు ఆబోతు.

(3)

2 పౌనుల గానుగ పిండి.
1 పౌను ప్రత్తి గింజలు.
3 పౌనుల తవుడు.
15 పౌనుల యెండు మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

(4)

2 పౌనుల వులవలు.
1 పౌను ప్రత్తి గింజలు.
3 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

(5)

2 పౌనుల గానుగ పిండి.
1 పౌను జొన్నలు లేక సజ్జలు.
3 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

(6)

1 పౌను గానుగ పిండి.
2 పౌనుల ఉలవలు.
3 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత లేక 50 పౌనుల పచ్చి మేత.

(7)

2 పౌనుల ప్రత్తి గింజలు.
1 పౌను ఉలవలు.
1 పౌను పప్పులపైనుండి దీసిన పొట్టు.
2 పౌనుల తవుడు.
15 పౌనుల యెండిన మేత.

ఆబోతు సరిగా మేత మేయనప్పుడు ఆహారము తగ్గించవచ్చును. పై జెప్పిన మేతను రెండు సమభాగములుచేసి ప్రాతఃకాలము, సాయంత్రము యివ్వవలయును. కాల పట్టిక యీక్రింద సూచించినారము.

**ప్రాతఃకాలము.**

6-30 ఘంటలకు కొట్టమును శుభ్రపరుచవలయును.
7 నుండి 7-45 ఘంటలవరకు దేహపరిశ్రమ.
7-45 ఘంటలకు నీరు.
8 ఘంటలకు సగము మేత.
9 ఘంటలకు ఆబోతును కడిగి శుభ్రపరచుట.
11 ఘంటలకు 5 పౌనుల యెండిన మేత.

**సాయంత్రము.**

5 నుండి 5-45 ఘంటలకు దేహ పరిశ్రమ.
5-45 ఘంటలకు నీరు.
6 ఘంటలకు మిగిలిన సగము సారమైన తిండి.
6-30 ఘంటలకు మిగిలిన 10 పౌనుల యెండిన మేతగాని, పచ్చి మేత గాని.

గానుగ పిండిని పన్రెండు ఘంటల కాలము నీళ్లలో తడుపవలయును. ఉలవలను ఉడికించవలయును. వారమునకు రెండు మూడు సారులు తిండిలో కొద్దిగా బెల్లము చేర్చవచ్చును.

పశువులను శ్రద్ధగా పెంచవలయునన్న సకాలమునకు తిండి పెట్టవలయును.

పరిశ్రమ.—ఆబోతునకు సరియైన దేహపరిశ్రమ యివ్వని యెడల సోమరియై తృప్తికరముగా దాటదు. దేహపరిశ్రమ యివ్వనియెడల దాని గిట్టలు పొడవుగా పెరిగి చక్కగా నడువజాలదు. కఠినమైన నేలపై చక్కగా నడిపించవలయును. ఆబోతు గిట్టలు కురుచగా నుండునట్లు కత్తిరించవలయును.

మాలీసు చేయుట.—ఆబోతు చర్మము మృదువుగా నుండుటకును, వేలు పట్టకుండుటకును చక్కగా మాలీసు చేయవలయును. అప్పుడప్పుడు సబ్బు నీటితో కడుగవలయును.

ఆబోతు దేహముపై పురుగులు కనుపడిన క్రెసోల్ (Cresol) అను ద్రావకముతో వారమునకు రెండు లేక మూడు మారులు కడుగవలయును. మొదటి తూరి కడిగిన పేల గ్రుడ్లు పగిలి పిల్లలు చచ్చిపోవును. రెండవ తూరికి పేలన్నియు చచ్చిపోవును.

ఆవులను దాటించుట.—ఆవు వెంట ఆబోతును పరుగెత్తించకూడదు. ఆవు వెంట ఆబోతు పరుగిడిన ఆవునకును, ఆబోతునకు అలత కలుగును. ఆబోతు శక్తిహీనత కలదై తృప్తికరముగా దాటలేదు. ఆవు గర్భము ధరించదు.

ఆవు సరియైన ఋతువులో నుండినట్లైన ఆబోతు ఒకమారు దాటిన చాలును. ఆబోతు అలత చెందిన చక్కగా దాటదు. అట్టి స్థితిలో ఆబోతువలన మనకు హెచ్చు లాభము రాదు.

## ఆబోతులను పెంచుటకు పారితోషికపు నిబంధనలు నడపించు విధానము.

ఆబోతును పశువృద్ధి శాఖవారు లేక ఆయా జిల్లా అగ్రికల్చరల్ డిప్యూటి డైరెక్టరుగారుగాని అంగీకరించవలయును. ఆబోతు యే వ్యవసాయాధికారిచేనైనను తనిఖీ చేయబడుటకు అన్నిసమయముల యందును సిద్ధముగా నుంచియుండవలెను. పారితోషికము నిచ్చుటకు పూర్వము డిప్టి డైరెక్టరుగారుగాని, లేక ఆయన చేతిక్రింద వారుగాని ఆబోతు పొర్లు రిజస్టరును తనిఖీచేసి, వాని నుంచుపద్ధతి అంగీకారమైన యెడల వంద రూపాయల నిచ్చుటకు సిఫార్సు చేయవచ్చును. (యేబది రూపాయలు ఆబోతును శ్రద్ధతో కాపాడినందుకు, యేబది రూపాయలు ఆబోతు తృప్తికరముగా పొర్లి నందుకు) నిబంధనలను చక్కగా గమనించకపోయినను, ఆబోతును మంచి స్థితిలోనుంచి నట్లైన నూరు రూప్యములకంటె తక్కువ మొత్తమును సిఫార్సు చేతురు. ఈ గ్రాంటును ఆబోతును తనఖీచేసి సంవత్సరాంతరమున నిత్తురు. పరిస్థితులనుబట్టి ఒక ఆబోతునకే మూడు సంవత్సరములు గ్రాంటు నివ్వవచ్చును. ఈ మూడు సంవత్సరముల నియమము మూడు నాల్గు సంవత్సరముల కొకతూరి ఆబోతును మార్చి దగ్గర సంబంధము వలన వచ్చు నష్టములను తొలగించుటకు అవశ్యకము.

---

గవర్నమెంటు ఆబోతులను జిల్లా బోర్డులకు, మ్యునిసిపాలిటీలకు, పంచాయతీలకు, సహకార సంఘములకు యితర స్థానికసంస్థలకు ఎరువుగా నిచ్చుటకు షరతులు.—

(ఎ) ఆబోతును ఎరువుగా నిత్తురు.

(బి) జిల్లా సంఘము, మునిసిపాలిటీ, పంచాయతి లేక సహకార సంఘములపై అధికారులు ఆబోతును పెంచుటకును, సాల మొదలగునవి చూచుటకును, పూచీగా నుండవలెను.

(సి) ఆబోతును సాలలో మంచిస్థితిలో నుంచవలెను. ఈ దిగువ కనుపరచిన మేతగాని, దానికి సమానమైన మేతగాని దినమునకు రెండుమార్లు సగము సగము పెట్టవలెను :—

2 పౌనుల బియ్యపుతవుడు.
2 పౌనుల పగులకొట్టిన ప్రత్తి గింజలు.
1 పౌను నీళ్లతో తడిపిన వులవలు.
20 పౌనుల చొప్ప లేక గడ్డి.

లేక

2 పౌనుల పొట్టు.
1 పౌను ప్రత్తి గింజలు.
2 పౌనుల గానుగ పిండి.
20 పౌనుల జొన్న చొప్ప.

(డి) ఆబోతును పశువుల మందలో మేయుటకు విడచిపెట్టకూడదు. ఋతువులోనున్న ఆవులను ఆబోతు దగ్గరకు తీసుకొనివెళ్లి వీలైన ఒక చిన్న ఆవరణములో దాటించవలెను.

(ఇ) ప్రతి దాటునకు సంఘమువారు కొద్దిగా రుసుము వసూలు చేయవచ్చును. ఉచితముగా దాటించిన సర్కారువారికి ఆక్షేపణ లేదు.

(ఎఫ్) ప్రతి సంవత్సరమును ఆబోతుతో యెనుబది మారులకంటె యెక్కువగాను యేబది మార్లకంటె తక్కువగాను దాటించకూడదు. ఆబోతును ప్రదర్శించుటకు సంతలకును, జాతరలకును తీసికొని వెళ్లవచ్చును. అయితే అట్టి స్థలములయందు పశువులకు జబ్బులు లేకుండవలయును.

(జి) ఏ వేళనైనను వ్యవసాయ డిపార్టుమెంటు ఉద్యోగస్థులు ఆబోతును తనిఖీ చేయుటకు వీలుండునట్లుంచవలెను.

(హెచ్) లోకల్ బోర్డువారు, సంఘమువారు, ఆబోతు యెవ్వరి స్వాధీనములో నుండునది యెచ్చటనుండునది. డిప్టి డైరెక్టరుగారికి తెలియజేయవలయును.

(ఐ) ఆబోతు జబ్బుపడిన దగ్గరనున్న పశువైద్యశాలాధికారికి తక్షణమే తెలియజేసి తగిన చికిత్స చేయించవలెను.

(జె) వ్యవసాయ స్థానమునుండి ఆబోతు వెళ్లు స్థలమునకు అగు ఖర్చులు సంఘమువారే భరించవలయును. ఆబోతు సరియైనది కానియెడల మరల పశువుల ఫారమునకు పంపివేయవచ్చును. ఇందుకు తగిన ఖర్చులు సంఘమువారే భరించవలెను.

(కె) ఆబోతును సరియైన స్థితియందుంచకపోయినట్టయిన వ్యవసాయపు డిపార్టుమెంటువారు, దానిని వెనుకకు పంపకోరుదురు. అట్టి సందర్భములో దాని కగు ఖర్చులు సంఘమువారే భరించవలెను.

(ఎల్) ఒక వూరిలో ఒక్కొక్కరికి ఒక ఆబోతుకంటె యెక్కువ యివ్వబడదు.

---

## 21. ఆరిందా వ్యవసాయకులను, మేస్త్రీలను పాలము కూలీలను తయారుచేయుట.

కొద్దిమంది వ్యవసాయకులను, మేస్త్రీలను, పొలము కూలీలను ప్రత్యేక వ్యవసాయపు పనులయందుగాని, ఫారములమీద సామాన్యపు వ్యవసాయ యంత్రముల వాడుకయందుగాని, తరిఫీదు చేయుటకు వ్యవసాయ డిపార్టుమెంటు సిద్ధముగానున్నదని సర్వసామాన్యముగా తెలిసియున్నట్లు కనబడదు.

2. రయితులకు అభివృద్ధి పద్ధతులను ప్రదర్శించుటలో శ్రేష్టమైన పద్ధతి, వారి స్వంత పొలములలోనే యట్టి పద్ధతులను జరిపి చూపించుటయని యనుభవమువలన తెలిసినది. డిపార్టుమెంటువారు యీ విషయములో చాలవరకు పనిజేసిరి. యింకను చేయ

చున్నారు; కాని ఫారములమీద కొద్దిమందిని తయారుచేయుటకు వీలగును. అట్టి తరిఖీదునకు కొంతమంది భూస్వాములు తమ జీతగాళ్లను పంప యిష్టముండవచ్చును.

3. అట్టి తరిఖీదునకు యీ దిగువ తరగతి మనుష్యులుమాత్రమే తీసికొనబడుదురు:

(1) వాస్తవముగా పొలముమీద పనిచేయుచు వ్యవసాయపు పనులయందు అనుభవము గలవారు. (2) ఫారము కూలిలతో కలసి పనిచేయుటకు సిద్ధముగనున్నవారు. దరఖాస్తు పెట్టుకొనినవారినందరిని తయారుచేయ ప్రయత్నించరు. కాని యీ దిగువ కనబర్చినంతమంది పుజ్జాయింపున ప్రస్తుతము తృప్తికరముగ తయారుచేయ వీలగును:—

| | | | |
|---|---|---|---|
| కోయంబత్తూరు... ... | 4 | అనకాపల్లి ... ... | 6 |
| హగరి ... ... | 2 | గుంటూరు ... ... | 2 |
| నంద్యాల ... ... | 2 | కాసరగోడు నీలేశ్వరు ... | 4 |
| సామర్లకోట ... ... | 4 | హెబ్బానూరు ... ... | 4 |
| పాలూరు ... ... | 4 | తలిపరంబా ... ... | 2 |

ఈ ట్రెయినింగు అనంతరం నౌఖరీలు దొరకుననే నమ్మకముగలవారిని, అనగా వారి యజమానులవలన యీ ట్రెయినింగుకు పంపబడినవారిని ముఖ్యముగా ముందు తీసికొనెదరు మేనేజరుగారికి లోబడి తీసికొనబడినవారు విధేయులై, దిట్టముగాను సరిగాను పని చేయవలెను. అట్లు చేయనియెడల ప్రిన్సిపాల్‌గారుగాని డిప్యూటి డైరెక్టరుగాని ట్రెయినింగుకాలము ముగియకమునుపే యింటికి పంపివేసెదరు. దారి రాకపోకలకు అగు చార్జీలను వారే భరించి, నివాసమునకు స్థలమువారే యేర్పాటు చేసికొనవలెను, కాని ఫారములో యిచ్చే రేటు ప్రకారము వారు చేసిన పనికి కూలి పుట్టును. ట్రెయినింగు అనంతరం పనులను వారే సంపాదించుకొనవలెను. డిపార్టుమెంటువారు వారికి పనులను యివ్వరు. ఈ ట్రెయినింగు పొందుటవలన తమ విలువ హెచ్చినదను విషయము వారు జ్ఞాపక ముంచుకొనవలయును. అందుచే వారు సామాన్యపు కూలిలకన్న పనికి యెక్కువ అర్హులు.

4. నూనె యింజనులు, మోటారులను నడుపు విషయములు సాధారణముగా డిపార్టుమెంటువారు నేర్పరు.

తరిఖీదుచేయు అంశముల విశదము యీ దిగువ వివరింపబడినది:—

| స్థానము. | అనుభవపూర్వకముగా నేర్పబడు అంశములు. | నేర్పుటకు కావలసిన కాలము సుమారు. |
|---|---|---|
| కోయంబత్తూరు. | దున్నుట—యినుప నాగళ్లయొక్క యుపయోగము—వాటిని సరిచేయుట. | 1 నెల-పశువులను గూడ అలవాటు చేయుటకు పంపవచ్చును. |
| | గొర్తిని వేయుట—విత్తనపు గొర్రు నుపయోగించుట. | 1 నెల-ఆగస్టు 15 మొదలుకొని సెప్టంబరు 15 వరకు. |
| | బెల్లము కాచుట ... ... | 1 నెల-ఏప్రిల్‌గాని, మే గాని. |

| స్థానము. | అనుభవపూర్వకముగా నేర్పబడు అంశములు. | నేర్పుటకు కావలసిన కాలము సుమారు. |
|---|---|---|
| | వరినాటుట—నారుమళ్లను తయారు చేయుట, విత్తులు చల్లుట, నారు పెంచుట, ఒంటి మొక్క నాటుట—పచ్చియాకు ఎరువులను సాగు చేయుట. | 2 నెలలు ఏప్రెల్, జూలై. |

(మగవాళ్లతో ఆడువాళ్లుకూడ వచ్చినయెడల ఆడవాళ్లకు ఒంటి మొక్కనాటుట, తూర్పారబట్టు యంత్రముయొక్క వాడుక అందు తయారు చేయబడుదురు.)

| | | |
|---|---|---|
| హగరి ... | నల్లరేగడ భూములలో "గాలోస్" నాగలి, నల్లరేగడ నాగలి మొదలగు బరువు నాగళ్ల నుపయోగించుట. | మార్చి మొదలుకొని ఆగస్టు వరకు. |
| | తోట భూములలో "విక్టరీ నాగలి" వంటి సామాన్యపు బరువుగల నాగళ్లను ఉపయోగించుట. | జనవరి మొదలు ఏప్రిలు వరకు. |
| | జొన్నకు కాటుక తెగులు రాకుండా గింజలను తయారుచేయుట. | అక్టోబరు. |
| | మెట్టపొలములోని చెత్తను తీసివేయుటకును, మెట్టభూములను శుభ్రముగా నుంచుటకును గుంటక నుపయోగించుట. | జూను మొదలు సెప్టంబరు వరకు. |
| | పెద గొర్రులను యుపయోగించుట. | సెప్టంబరు, అక్టోబరు. |
| | రాతి గుండుతో జొన్న కంకులను నూర్చుట. | ఫిబ్రవరి, మార్చి. |
| | ఉల్లి, చోడి—జరీబు సాగు ... | జూను మొదలు ఫిబ్రవరి వరకు. |
| నంద్యాల ... | పశువులు చాలులో నడవకుండుటకుగాను వంపు యేడికోలగల "గాలోసు" నాగలిని, నల్ల రేగడ నాగళ్లను వుపయోగించుట. | ఫిబ్రవరి మొదలు జూలై వరకు. |
| | జొన్న విత్తనముల నేరుట ... | సెప్టంబరు. |
| | మెట్ట భూములలోని చెత్తను తీసివేసి శుభ్రముగ నుంచుటకు గుంటకను తోలుట. | మే మొదలు జూలై వరకు. |
| | పెద గొర్తిని వేయుట ... | ఆగస్టు-సెప్టంబరు. |

| స్థానము. | అనుభవపూర్వకముగా నేర్పబడు అంశములు. | నేర్పుటకు కావలసిన కాలము సుమారు. |
|---|---|---|
| | రాతి గుండుతో జొన్న కంకులను నూర్చుట. | జనవరి-ఫిబ్రవరి. |
| గుంటూరు ... | దున్నుట—ఇనుప నాగళ్లను వాడుట—సరిచేయుట. | 1 నెల-జూను మొదలు సెప్టెంబరులోగా. |
| | గొర్రు తోలుట—పెద గొర్తినివేయుట. | 15 రోజులు-జూలై-అక్టోబరులలోగా. |
| | ఎడ్లతో పాపటము తోలుట—జూనియర్ హో అనే పనిముట్టుతో పాపటము తోలుట. | 15 రోజులు సెప్టెంబరు మొదలు జనవరి లోపుగా. |
| | పశువుల యెరువును నిలవచేయుట (పెట్టె పద్ధతి). | సంవత్సరములో యెప్పుడైన 1 వారము. |
| | చొప్పనరుకు యంత్రములో పని చేయుట. | డిటో. |
| | పొగాకు సరుకుచేయుట ... | 1 నెల-ఫిబ్రవరి-మార్చి |
| | శుభ్రమగు పత్తిని తీయుట ... | 15 రోజులు మార్చి-ఏప్రిలులో. |
| | కాటుక తెగులు తగులకుండా జొన్న విత్తనముల నేరుట. | ఎప్పుడైనా-ఆ పద్ధతి తెలియువరకు. |
| | మిరప, పొగాకు, నారుమళ్లను తయారుచేసి విత్తనములను చల్లుట. | 10 రోజులు - జూలై ఆగస్టులలో. |
| అనకాపల్లి ... | పనిముట్లు—డిపార్టుమెంటువారిచే ఆమోదించబడిన యినుప నాగళ్లను వాడుట—సరిచేయుట. | సంవత్సరములో యెప్పుడైనను 1 వారము, కాని డిసంబరు మొదలు జూలయివరకు ముఖ్యముగా. |
| | నీళ్లతోడే మోట—పశువులను, మనుష్యులను తయారుచేయుట. | డిసంబరు మొదలు ఆగస్టు వరకు యెప్పుడైనను 1 వారము. |
| | వరి—నారుమళ్లు తయారుచేయుట, ఆకుతీయుట, పొదుపుగా నాటుట—పచ్చియాకు యెరువులను సాగుచేయుట. | 3 నెలలు-జూన్ 15 వ తేది మొదలు సెప్టెంబరు 15 వ తేది వరకు. |
| | విత్తనములు కట్టుట ... | డిశంబరులో 1 వారము. |

| స్థానము. | అనుభవపూర్వకముగా నేర్పబడు అంశములు. | నేర్పుటకు కావలసిన కాలము సుమారు. |
|---|---|---|
| అనకాపల్లి—శేషము. | చెరుకు—గడ్డపలుగుతోగాని యినుప నాగళ్లతోగాని చెరుకు నాటుటకు భూమిని తయారుచేయుట—నీరును పొదుపుగా వాడుటకును వరుసను నాటుటకును బోదులు కాలువలు చేయుట. | మార్చి 1 వ తేది మొదలు ఏప్రిల్ 1 వ తేదీలోగా యెప్పుడయిన 10 రోజులు. |
| | సింధువాహీ పొయ్యి అభివృద్ధి చేయబడిన గోదావరి పొయ్యిలను కట్టుట—తెల్ల బెల్లమును తయారు చేయుట. | ఫిబ్రవరి మొదలు ఏప్రిలు వరకు. |
| | వాసములు పాతి, ఆకుచుట్టి కాలువలు త్రవ్వి గానుగపించిని వేయుట. | 15 జూన్ మొదలు 15 సెప్టంబరువరకు 3 నెలలు. |
| సామర్లకోట ... | వరి—నారుమళ్లను తయారుచేయుట, విత్తులు చల్లుట, ఆకు తీయుట, ఒక్కొక్క మొక్క నాటుట, పచ్చియాకు యెరువులను సాగు చేయుట. | 3 నెలలు-మే, జూన్, జూలై. |
| | చెరుకు—బెల్లము కాచుట—వరుసగా నాటుట. | 2 నెలలు-ఫిబ్రవరి మొదలు యేప్రిల్ వరకు. |
| పాలూరు ... | వరి విత్తనములు కట్టుట ... | ఆగస్టు-సెప్టంబరులో 1 వారము, జనవరి-ఫిబ్రవరిలో 1 వారము. |
| | మాగాణి పొలములలో పచ్చి ఆకు యెరువు విత్తనములను చల్లుట. | మార్చి-ఏప్రిలులో 1 వారము, మే నెలలో 1 వారము. |
| | పచ్చి ఆకు యెరువులను పడదున్నుట, మాగాణి పొలములలో తేలిక యినుప నాగళ్లయొక్క యుపయోగము. | జూను నెలలో 1 వారము, జూలై-ఆగస్టులలో 2 వారములు |
| | పలచని నారుమళ్లను పెంచుట ... | మే నెలలో 1 వారము, జూలై-ఆగస్టులలో 10 రోజులు. |
| | వరి ఒంటి మొక్క నాటుట ... | జూను నెలలో 1 వారము, సెప్టెంబరు-అక్టోబరులలో 15 రోజులు. |

| స్థానము. | అనుభవపూర్వకముగా నేర్పబడు అంశములు, | నేర్పుటకు కావలసిన కాలము సుమారు. |
|---|---|---|
| సాలూరు—శేషము. | యంత్రముతో వరి తూర్పారబట్టుట. | ఫిబ్రవరిలో 15 రోజులు. |
| | అపరాలను గొర్తినివేయుట—ముక్కోణపు "హరో" తోను దంతులతోను పైపాటు చేయుట. | జూను నెలలో 1 వారము, జూలై నెలలో 1 వారము. |
| | సజ్జ పైరును యంత్రముతోకోసి రాతి గుండుతో కంకులను నూర్చుట. | ఆగస్టు-సెప్టంబరు 10 రోజులు. |
| | చోడి కంకులను రాతిగుండుతో నూర్చి తూర్పారబట్టుట. | మార్చి-ఏప్రిల్‌లో 1 వారము, ఆగస్టు-సెప్టంబరులలో 1వారము. |
| | చెరుకుకు విక్టరీ నాగలితో బోదులు జేసి భూమిని తయారుచేయుట. | ఫిబ్రవరి-మార్చిలో 1వారము సుమారు. |
| | చెరుకు కొట్టుట, శక్తి యంత్రముల తో ధనుగ యాడుట, సింధు వాహి పొయ్యిలలో బెల్లంకాచుట. | మార్చి-యేప్రిల్‌లో 15 రోజులు. |
| | చెరుకు నాటుట ... ... | డిటో. |
| | చెరుకుకు "జూనియర్ హెూ" అను పనిముట్టుతో పైపాటుచేయుట. | మేలో 1 వారము, జూనులో 1 వారము. |
| కాసరుగోడు, నీలేశ్వరు, పిల్లి కోడు. | కొబ్బరితోటల వ్యవసాయము ... | 1 సంవత్సరము. |
| హొసూరు ... | గొడ్ల మేతను పైరుచేయుట—ఎండబెట్టుట—పశుగ్రాసమాగుడు చేయుట—పశుపోషణ—పశువుల పాలన—జాతులు—రకములు——పశుచికిత్స—ప్రాథమికపని. | 1 సంవత్సరము. |
| తలిపరంబా ... | మంచి పనిముట్లను వాడుట—పలుచని నారుమళ్లను పెంచుట మెట్టవ్యవసాయములో యభివృద్ధి పద్ధతి—మిరప, అల్లం మొదలగు యెక్కువ ఆదాయమువచ్చు పైర్లను సాగుచేయుట—మిరియపు మొక్కలను నాటుట—వాటికి పాదులు కట్టుట—సగటున వరి విత్తనములను యేరుట. | మే మొదలు అక్టోబరు వరకు. |
| | చెరుకు నాటుట—గానుగ ఆడుట—బెల్లము తయారు చేయు పద్ధతి. | డిసంబరు-జనవరి. |

కోయంబత్తూరునకు లావీ రోడ్డు పోస్టాఫీసు వ్యవసాయ కళాశాల ప్రిన్సిపాలు గారికిని, హగరి, నంద్యాలలకు బళ్లారిలోనున్న 3 వ సర్కిలు వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారికిని, అనకాపల్లి సామర్లకోటలకు, విశాఖపట్టణంలోనున్న 1 వ సర్కిలు వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారికిని, గుంటూరునకు గుంటూరులోనున్న 2 వ సర్కిలు వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారికిని, పాలూరునకు, సెంటుథామసు మౌంటులోనున్న 4 వ సర్కిలు డిప్యూటీ డైరెక్టరుగారికి, హోసూరుకు పశుశాఖ వ్యవసాయ డిప్యూటీ డైరెక్టరుగారికిని, కాసరగోడు, తళిపరంబా నిలేశ్వరులకు కోయంబత్తూరులోనున్న ఆయిలు సీడ్సు స్పెషలిస్టుగారికిని ప్రవేశించుటకు దరఖాస్తులను, పంపుకొనవలయును. పై యుద్యోగస్థులు మనుష్యులను తీసుకొను కాలమును గురించియు, అచ్చట నివాసవసతులను గురించి యేదైనను సంజాయిషి కావలసినయెడల నిచ్చెదరు.

---

## 22. రహితులకిచ్చే అప్పులు, ఇతర సౌకర్యములు.

భూములు బాగుచేసుకొను నిమిత్తము అప్పులనిచ్చుటకు సర్కారువారు 1883 వ సంవత్సరములో యేర్పాటుచేసిన శాసనము ననుసరించియు, రహితులకిచ్చే అప్పులను గురించి 1884 వ సంవత్సరములో పుట్టిన శాసనము ననుసరించియు, యేర్పరచిన రూల్సు యీ క్రింద వివరింపబడినవి. ఇట్టి సదుపాయములున్నవనియే తెలియనటు వంటి రహితుల యుపయోగార్థమునకై ముఖ్యముగా వ్రాయబడినవి :—

రూలు I.—భూమి ఖామందులకును భూమిని సాగుచేయుచున్న వారికినికూడ అప్పులీయబడును.

(a) భూములను బాగుగచేసికొను నిమిత్తము అప్పులనిచ్చు శాసనము. బావులు, చెరువులు త్రవ్వించుకొనుటకు లేక మరమ్మతు చేయుటకు, బీడుగానున్న గయాళ భూములను బాగుచేసుకొనుటకు, భూములయొక్క క్రయము అమరకము శాశ్వతముగా హెచ్చింపదగు యే పనికయినను యీ అప్పులీయబడును.

(b) వ్యవసాయదార్లకు అప్పులిచ్చు శాసనము.—విత్తనమునకు కావలసిన గింజలు, దుక్కిపశువులు, ఆబోతెద్దులు కొనుటు, క్రొత్తగా స్వాధీనపరచుకొని సాగుకు తెచ్చుకున్న భూములవద్ద యిండ్లు తిరిగి కట్టుకొనుటకు, పశువుల కొట్టముల వేసు కొనుటకు, అగ్నివలనగాని, వరదలవలనగాని నష్టబడిన యిండ్లను కట్టుకొనుటకు, పాడి పశువులకు వ్యవసాయ పశువులకు కావలసిన మేపు, ప్రత్తిగింజలు కొనుటకు, పొలమున కెరువుకొనుటకు, చెరుకు గానుగలుకొనుటకు, బెల్లమువండే పొయ్యిలు కట్టుటకు, నీళ్లయంత్రములు కొనుటకు, కరవువచ్చి తిరిగి మంచికాలము వచ్చువరకు జీవించుటకు కావలసిన ధనమును ఈ ఆక్టుక్రింద అప్పు లిచ్చెదరు.

ఈ క్రింద నుదహరించిన ఏ ఫల వృక్షములకైనను పైరు చేయుటకు ఆక్టుక్రింద అప్పులిచ్చెదరు :—

కాఫీ, కొబ్బెర, మామిడి, పనస, చీనీ లేక జారింజ, నిమ్మ, సీతాఫలం, జామి, దానిమ్మ, అత్తి, ద్రాక్ష మొదలగునవి.

రూలు II.—రెవిన్యూ డిపార్టుమెంటులో డిప్యుటి తహశీల్‌దారు హోదాకు తక్కువగాని ఆఫీసర్లు యీ ఋణములు యివ్వవచ్చును.

రూలు III.—నూటికి సంవత్సరమునకు రూ 6-4-0 లు చొప్పున వడ్డీ వసూలు చేయబడును. (అనగా రూపాయకు నెలకు ఒక పైసా.) కరువు ఋణములకు మాత్రము వడ్డీ నూటికి రూ 3 లు బీదలని నిశ్చయముగా నమ్మినప్పుడు కలెక్టరుగారు ఆ ఋణములను వసూలుచేయక విడిచిపెట్టవచ్చును. కొన్ని ముఖ్యవిషయములకు మాత్రము వడ్డీ తగ్గించికాని అసలు వడ్డీలేకుండాకాని ఋణములిచ్చుటకు ఒక్క లోకల్ గవర్నమెంటువారికి మాత్రము అధికారము కలదు.

రూలు X.—ఈ అప్పుల సహాయమున ప్రారంభించిన పని ఋణము తీసికొనినవాని స్వాధీనము తప్పి ఏ కారణములచేత చెడిపోయినను రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్లు, జిల్లా కలెక్టర్లు బోర్డువారు వసూలుపోగా మిగిలిన ఋణమును కొంతగాని అంతగాని విడిచిపెట్టుటకు అధికారము కలిగియున్నారు.

రూలు XI.—గ్రామ సంఘమునకుగాని, లేక ఒక రయితుల సమూహమునకుగాని వారివారి పేర సర్కారు లెక్క దాఖలా ప్రకారము వుండు భూములమీద చెల్లించే పన్నుకు 5 రెట్లకు మించని ఋణము వారియొక్క మొత్తము ప్రత్యేక పూచీలపైని వారందరకు సంబంధించిన చెరువులు బాగుచేసుకొనుటకుగాని పెద్ద కట్టలువేయుటకుగాని జిల్లా కలెక్టరుగారు ఇవ్వవచ్చును.

రూలు XXV.—అప్పు అడుగువారికి శ్రమలేకుండ చేయుటకుగాను, కలెక్టర్లు డిప్యుటి తహశీల్‌దార్లు, స్వతంత్ర డిప్యుటి తహశీల్‌దార్లు గ్రామములకు వెళ్లి అక్కడనే ఋణధనము నీయవలసినట్లుగా సర్కారుత్తరువు చేసియున్నారు.

2. నాగళ్లు మొదలయిన వ్యవసాయ పనిముట్లు, ట్రాక్టర్లు, గుంటకలు, పెద గొర్రులు, చెరుకు గానుగలు మొదలయినవి కొనుటకుగాను వ్యవసాయ డైరక్టరుగారు అప్పులిచ్చెదరు.

3. ఇదేవిధముగా యిండస్ట్రీసు డైరక్టరుగారు ఆయిల్ యింజనులు, పంపులు కొనువారికి ఋణములీయవచ్చును. తక్కావి మేన్యుయల్‌నందు తప్సీలుగా రూల్సు యున్నవి.

4. ఒక అసామి ఒకేసారిగాని, అప్పుడప్పుడు అనగా దఫదఫాలలోగాని అనేక ఋణములు తీసికొనవచ్చును. కాని వాటికి ప్రత్యేక ప్రత్యేక పనులను ప్రత్యేక ప్రత్యేక జామీనులును ఉండవలెను. ప్రతి ఒక్కపని వేరువేరు అప్పు దరఖాస్తు ప్రత్యేక ప్రత్యేక శాంక్షనును పొందవలెను.

5. భూమి ఖామందులుకాని, భూమియొక్క అనుభవభుక్తములలో నున్నవారు కాని యీ ఋణములను కోరునపుడు తమ దరఖాస్తులను సమీపమునందున్న వ్యవసాయాధికారికి పంపుకొనవలెను. అప్పుడు వారు తమ అభిప్రాయముతో ఆ దరఖాస్తులను అందుకు సంబంధించిన ఆఫీసర్లకు పంపుదురు. ఈ అభిప్రాయములో వారు ఈ ఋణము రయితుకు నిజముగా అవసరమా? జరూరా? అను విషయము విచారించి వ్రాయుదురు.

## రెవిన్యూ బోర్డువారి స్టాండింగు ఆర్డరు.

## 19-B దరఖాస్తు రూల్సు ప్రకారము మంజూరు చేయుటకు వీలుపడని పొరంబోకులలో రహితులు చెట్లువేసి పెంచుట.

1920 వ సంవత్సరపు XV ఆక్టు ప్రకారము ఏర్పాటు కాబడిన గ్రామ పంచాయతీల స్వాధీనములలో లేనటువంటి పొరంబోకులలో వంటచెరుకు, పచ్చి ఆకు యెరువు, కలప సామానులు సంపాదించుకొనుటకుగాను రహితులు చెట్లువేసి పెంచుకొనవచ్చును. కాని అట్లు చేయుటకుముందు వారు లయిసెన్సు సంపాదింపవలయును. అట్టి లయిసెన్సులు దిగువ షరతులకు లోబడియుండును—

(i) ఇంతకుముందే విలువైనటువంటి చెట్లు సర్కారువి వుండినచోట్ల క్రొత్త చెట్లు వేయకూడదు. ఎందుచేతననగా కొంతకాలమునకు సర్కారు చెట్లు ఏవైనవి, రహితువేసి పెంచినచెట్లు ఏవైనవి విడదీయుట కష్టము.

(ii) చెట్లు వేయుటకు ముందు తహశీల్‌దారువద్దనుండి కాని డిప్యూటీ తహశీల్‌దారువద్దనుండిగాని అనుమతి పొందవలెను. డి.పి.డబ్ల్యు. డిపార్టుమెంటువారి స్వాధీనములోనున్న పొరంబోకులను వారి అనుమతిలేక చెట్లువేయుటకుగాను రయితులకు రెవిన్యూవారు శాంక్షను యివ్వకూడదు. అట్లు అనుమతినిచ్చుటకు ముందు డి.పి.డబ్ల్యు. వారు అవసరమనితోచిన మరికొన్ని కట్టుబాట్లను విధింపవచ్చును.

(iii) భూమియొక్క హద్దులు, ఏ జాతిచెట్లు, ఏవి, ఎన్ని వేయునది లైసెన్సులో స్పష్టముగా వుదహరించవలెను.

(iv) ఈ చెట్లువేయుట కనుమతి పొందినంతమాత్రమున భూమియందెంత మాత్రము హక్కు కలుగనేరదు.

(v) భూమిచుట్టు కంచె ఏమి వేయకూడదు. కాని ఏమొక్క కామొక్కకుమాత్రము కంచవేయవచ్చును. కాని ఎక్కడయినను ఒకచోట చుట్టూ కంచవేయుటకు కలెక్టరుగారు కొంతకాలమువరకు వుత్తరమీయవచ్చును. నాగజెముడు యెన్నడూ కంచగావేసి పెంచకూడదు.

(vi) గవర్నమెంటువారి కక్కర కలిగినపుడు రహితు వేసుకొన్న చెట్లకు ఏమి ముజరా యివ్వకనే తీసివేయవచ్చును. కాని తీసివేసిన చెట్లను పబ్లికు వేలము వేయించి ఆ వచ్చిన వేలపు సొమ్మును లయిసెన్సుదారున కిచ్చెదరు. లయిసెన్సుదారు కోరిన పక్షములో ఆ చెట్లవలన వచ్చిన కలప యావత్తు వానికే యిచ్చెదరు.

(vii) చెట్లువేయుటకిచ్చిన నియమితకాలములోపల చెట్లు పాతకపోయినను పాతినతర్వాత వాటినిగురించి లయిసెన్సుదారు తగు శ్రద్ధ తీసికొనకపోయినను లయిసెన్సు రదుచేయవచ్చును.

(viii) ఆ చెట్లయొక్క ఫలసాయమును లయిసెన్సుదారు అనుభవింపవచ్చును. ఆ చెట్లయొక్క కలపకూడా సర్కారువారికేమి ఫీజు కట్టకుండా అనుభవింపవచ్చును. కాని ఫలవృక్షముల విషయములో మాత్రము, అవి ఫలసాయమునకు వచ్చినవెంటనే వాటికి సాధారణముగా సర్కారుపన్ను విధించే జాతులకు మాత్రము 'త్రీ పట్టాలను' తీసికొనవలెను.

(ix) చెట్లు కొట్టుటకు ముందు తహశీల్‌దారుయొక్క గాని, డిప్యూటి తహశీల్‌దారుయొక్క గాని ఆర్డరు పొందవలెను. కాని అట్టి ఉత్తరువు సాధారణముగా అడిగిన తక్షణమే యిచ్చెదరు.

(x) గ్రామ పంచాయత్తీలు పొరంబోకులకు దరఖాస్తు పెట్టుకొనేయెడల అందులో కొద్దిమార్పులు కావలసియుండును.

2. లయిసెన్సు ఫారము XII అపెండిక్సు A లో వ్రాసియున్నది.

3. మీకు దగ్గరవుండే అగ్రికల్చరల్ ఆఫీసరుకు దరఖాస్తు పంపుకోవలయును. ఈ సమపాయమును పొందగోరువారికి, వారి తరపున వ్యవసాయ డిపార్టుమెంటు ఆఫీసరు చెట్లువేయుట కుత్తరువు తెప్పించియిచ్చును.

## గడ్డి విషయమై సదుపాయము.

కోయంబత్తూరు, సేలం, తిరుచునాపల్లి, తంజావూరు జిల్లాలో బేళ్లుగాకట్టిన గడ్డిని ఒక స్టేషనునుండి మరొక స్టేషనుకు పంపునపుడు "సౌతిండియా రైల్వే" అధికారులు మైలుకు, మణుగుకు 3 పైసాల చొప్పున చార్జిచేయుదురు.

ఈ సమపాయమును పొందగోరు రహితులు వారికి సమీపముననుండు వ్యవసాయ డిపార్టుమెంటు ఆఫీసరుకు దరఖాస్తు పంపుకొనవలయును. తిరుచునాపల్లిలో వుండే చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటుగారికి దరఖాస్తులు సరాసరికూడా పంపుకొనవచ్చును.

## ప్రత్యేక అప్పు నిబంధనలు.

1. వ్యవసాయము చేయతగిన భూమియొక్క హక్కుదారుడైనను, అనుభవములోనున్నవాడైనను వ్యవసాయ యంత్ర సామగ్రికొనుటకుగాని అట్టి సామగ్రిని వుపయోగించుటకు ముందు భూమికేమయిన బాగులుచేయుటకుగాని అప్పులుకావలసినవారు వ్యవసాయశాఖ డైరెక్టరుగారికి దరఖాస్తు పంపుకోవలెను.

2. వ్యవసాయ యంత్రసామగ్రి అనగా దుక్కి, కోత మొదలగు పనుల కుపయోగించునట్టిన్ని, పంటను మార్చుటకు అనగా చెరుకు ఆడుటకు కావలసిన గానుగ వగయిరా సామగ్రి అని తెలిసికొనవలయును.

3. అగ్రికల్చరల్ డైరక్టరువారికి రూ 10,000 లవరకు ఒక్కొక్క దరఖాస్తుదారునికి అప్పుయిచ్చుటకు అధికారము గలదు.

4. సాలుకు నూటికి ఈ అప్పులకు వడ్డీ రూ 6-4-0 లు.

5. తీసికున్న అప్పులు సంవత్సరమునకు ఇంతని స్థిరపరచిన ప్రకారము చెల్లించవలెను. ఇవి అసలు వడ్డీ విడుదలకు రెంటికిని చెందియుండును.

6. అప్పు యెన్ని సంవత్సరములలో తీర్చవలసినదియు సంవత్సరమున కెంత సొమ్ము అసలు వాయిదాల్కింద చెల్లించవలసినది డైరక్టరువారు నిర్ణయింతురు. ఈ ఋణముతోనొన్న వస్తువుయొక్క నాణ్యముగురించిన్నీ, యిచ్చిన జామీను సరిపడునా లేదా అను విషయమును గురించిన్నీ అప్పు తీసికొన్నవాని సదుపాయము గురించిన్నీ డైరెక్టరుగారు ఆలోచింతురు. కాని అట్టి కాలపరిమితము యింతకు యెప్పుడును మించదు.

| | | |
|---|---|---|
| I. భూమి తణఖాపైన | ... | 20 ఏండ్లు. |
| యంత్రసామగ్రిపైన | ... | 2 ,, |
| స్వంత జామీనుపైన | ... | 2 ,, |

7. అప్పు షరతులకు వ్యతిరిక్తముగా అప్పుదారు నడచుకొనునట్లు డైరెక్టరు గారు అభిప్రాయపడినయెడల తగు కారణములు కనుపరుస్తూ బాకీయుండు అప్పు మొత్తమును ఖర్చులు వగయిరాలతోటి వసూలు చేయవలసినదిగా డైరెక్టరుగారు వుత్తరువు చేయుదురు. ఈ వుత్తర్వును చలాయించుటకు వుత్తర్వు నకలును బయానా దారు భూములుండు ప్రదేశముయొక్క కలెక్టరుకు పంపబడును. కలెక్టరువారు యీ వుత్తరువు ప్రకారం పయిగము వసూలుచేయుదురు.

సేద్యమును అభివృద్ధిపరచుటకుగాను సర్కారువారు రయితులకు కొన్ని సదు పాయములు చేసియున్నారు.

కొన్ని పయిర్లకు నీటి తీరువ వసూలు చేయకూడదని వుత్తరవు చేసియున్నారు.

డిపార్టుమెంటువారు ప్రతి సంవత్సరం జారీచేయు గ్రామస్తుల పంచాంగములో పశువులమేతకున్ను ఎరువు కొరకున్ను, నీలి, పెసర, జీలుగ, జనుము, వెంపలి మొద లయిన పయిర్లను పెట్టుటవలన రయితుకు కలుగు లాభమును విమర్శన చేసియుయు న్నారు. ఇదియుగాక అచ్చువేసిన విడి కాగితములు సహా ప్రచురపరచుచున్నారు. వీటి పట్టిక గ్రామస్తుల పంచాంగము చివర కాగితముమీద వేయబడియున్నది. అయి నను యింకా రయితులకు, యీ పయిర్లు వేయుటకొరకు సర్కారువారు చేసిన యుదారత్వము తెలియనందున, రయితుల మేలుకొరకు ఈ సమాచారములు తిరుగా ప్రచురింపబడుచున్నది.

ఆకు పయిరు సాధారణముగా తరి భూములయందు వేయుదురు. కొందరు ఆ పయిరునుకోసి మిగిలిన భూములయందు వేయుదురు. కొందరు అదే భూమియందు దున్ని వేయుదురు. పై పద్ధతులతో భూమిలోనికి ఆకే దున్ని వేయుట మేలయినది. కొందరు యీ పైర్లను ఖుష్కి భూములలో వేసి కోసి తరి భూములకు వాడుదురు.

ఈ పయిర్లకు విత్తనములు చల్లునప్పుడున్ను తరువాత కొన్ని రోజులవరకున్ను తేమ భూమియందు వుండవలెను. కనుక ఒంటికారు వరి భూములలో వరి పయిరు కటాయ మణికి కొన్నిరోజులు ముందుగాగాని లేక వరి కటాయని అయిన తక్షణముగాని ఆకు పయిరు గింజలు చల్లవలెను. లేనియెడల వరి పయిరుగాని యితర వరిపయిరు నాటు టకు పూర్వముగాని ఆకుపయిర్లు చల్లవలెను. ఆకు పయిర్లకు కొన్ని సమయముల యందు నీరు కట్టవలసినదిగా తటస్థపడుట సాధారణమే.

ఇదివరలో ఆకుపయిర్లకు నీరు కట్టినయెడల నీటిపన్ను చార్జి కాబడుచువుండినది ఎరువు ఆకువలన రయితులకు కలుగు అమిత మేలును గమనించి, సదరు పయిర్లను పెట్టి ఆకు పయిర్లకు నీరు పారించుకొన్నందుకు, తీర్వ జాస్తిగాని, ఫసలీ జాస్తి, నీటి పన్ను గానీ విధింపకూడదని సర్కారువారు వుత్తరవు పాలించియున్నారు. కనుక రయితులు ఎరువు ఆకు ఫలితమును, తనకు ఎక్కువగా వుండినయెడల, యితర రయితులకు అమ్ము కొనవచ్చును. ఎరువు ఆకుపయిరు తరి భూములయందు ముందువేసి తరువాత వేసిన వరిపయిరు పండనిచో రయితులు ముజరా (రెమిషన్) అడుగవచ్చును. ముజరా యిచ్చునప్పుడు ఆకుపయిరునుండి రయితుకు గలిగిన లాభము లెక్కకురానేరాదు.

పశువుల మేతకుగాను పయిర్లకు అకు పయిర్లకువలెనే నీటితీరువలేదు. అయితే మేత పయిర్లను విత్తనము పట్టునట్లు చేసినను యితరులకు అమ్మినను, నీటితీరువ వసూలుకాబడును.

పశువుల మేతకొరకు గడ్డిపైరును వరిభూములలో వేసినయెడల, నీరు వుచితముగా కట్టుకొనవచ్చును. సర్కారు నీరు వుచితముగా (1) వరి కోతకాగానే ఎరువుకొరకు తడపుటకున్ను, (2) నీరు సమృద్ధిగావుండు కాలమందు చవుటి భూములనుండి వుప్పును పారదోలుటకు రెండు సంవత్సరములవరకున్ను, (3) రెండవ కారు కాలమందు ఒంటికారు చౌటి భూములను బాగుచేయుటకున్ను యివ్వబడును. రయితు పై సందర్భముల యందు వుపయోగించు నీటికి పన్నులేదు.

క్రింద కనపరచిన వుద్యోగస్తులనుండి ఆకుపైర్ల విషయమై రయితులు కనుగొనవచ్చును :—

వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, 1 వ సర్కిలు, విశాఖపట్నం.

| | |
|---|---|
| డిటో | 2 వ సర్కిలు, గుంటూరు. |
| డిటో | 3 వ సర్కిలు, బళ్లారి. |
| డిటో | 4 వ సర్కిలు, సెంటు తామస్ మౌంటు. |
| డిటో | 5 వ సర్కిలు, తిరుచినాపల్లి. |
| డిటో | 6 వ సర్కిలు, మధుర. |
| డిటో | 7 వ సర్కిలు, తెలిచ్చేరి. |
| డిటో | 8 వ సర్కిలు, కోయంబత్తూరు. |

---

## 23. వ్యవసాయ శాఖయందలి శాస్త్రజ్ఞులకు పరీక్షార్థము నమూనాలను పంపుట.

1. మంటిని, ఎరువులను, పృథక్కరణమునకు పంపునపుడును,

2. చేలకు పురుగువల్ల కలుగు నష్టము తెలియజేయుచు, పురుగులను పంపునపుడును,

3. తెగులుపట్టిన మొక్కలను పంపునపుడును,

4. ఆనవాలు పట్టుటకును మొక్కలు వగైరాలను పంపునపుడును, ఈ క్రింది సలహాలను గమనింపదగును.

భూమినుండి మంచి పంటలు పండించదలచు ప్రతి వ్యవసాయదారుడును గమనించవలసిన ముఖ్య విషయములేవనగా.—దుక్కి దున్నుట, సమయానుకూలముగా ఎరువులు వేయుట, నీరుకట్టుట, గొప్పు త్రవ్వుట, పురుగులుగాని బూజు తెగుళ్లుగాని రాకుండ

I. భూమి తణఖాపైన ... 20 ఏండ్లు.
యంత్రసామగ్రిపైన ... 2 „
స్వంత జామీనుపైన ... 2 „

7. అప్పు షరతులకు వ్యతిరిక్తముగా అప్పుదారు నడచుకొనునట్లు డైరెక్టరు గారు అభిప్రాయపడినయెడల తగు కారణములు కనుపరుస్తూ, బాకీయుండు అప్పు మొత్తమును ఖర్చులు వగయిరాలతోటి వసూలు చేయవలసినదిగా డైరెక్టరుగారు ఉత్తరువు చేయుదురు. ఈ ఉత్తర్వును చలాయించుటకు ఉత్తర్వు నకలును బయానాదారు భూములుండు ప్రదేశముయొక్క కలెక్టరుకు పంపబడును. కలెక్టరువారు యీ ఉత్తరువు ప్రకారం పయిగదము వసూలుచేయుదురు.

నేద్యమును అభివృద్ధిపరచుటకుగాను సర్కారువారు రయితులకు కొన్ని సదుపాయములు చేసియున్నారు.

కొన్ని పయిర్లకు నీటి తీరువ వసూలు చేయకూడదని ఉత్తరవు చేసియున్నారు.

డిపార్టుమెంటువారు ప్రతి సంవత్సరం జారీచేయు గ్రామస్థుల పంచాంగములో పశువులమేతకున్ను, ఎరువు కొరకున్ను, నీలి, పెసర, జీలుగ, జనుము, వెంపలి మొదలయిన పయిర్లను పెట్టుటవలన రయితుకు కలుగు లాభమును విమర్శన చేసియేయున్నారు. ఇదియగాక అచ్చువేసిన విడి కాగితములు సహా ప్రచురపరచుచున్నారు. వీటి పట్టిక గ్రామస్థుల పంచాంగము చివర కాగితముమీద వేయబడియున్నది. అయినను యింకా రయితులకు, యీ పయిర్లువేయుట కొరకు సర్కారువారు చేసిన యుదారత్వము తెలియనందున, రయితుల మేలుకొరకు ఈ సమాచారములు తిరుగా ప్రచురింపబడుచున్నది.

ఆకు పయిరు సాధారణముగా తరి భూములయందు వేయుదురు. కొందరు ఆ పయిరునుకోసి మిగిలిన భూములయందు వేయుదురు. కొందరు అదే భూమియందు దున్ని వేయుదురు. పై పద్ధతులతో భూమిలోనికి ఆప్లే దున్ని వేయుట మేలయినది. కొందరు యీ పైర్లను ఖుష్కీ భూములలో వేసి కోసి తరి భూములకు వాడుదురు.

ఈ పయిర్లకు విత్తనములు చల్లునప్పుడున్ను తరువాత కొన్ని రోజులవరకున్ను తేమ భూమియందు వుండవలెను. కనుక ఒంటికారు వరి భూములలో వరి పయిరు కటాయి మణికి కొన్నిరోజులు ముందుగాగాని లేక వరి కటాయిని అయిన తక్షణముగాని ఆకు పయిరు గింజలు చల్లవలెను. లేనియెడల వరి పయిరుగాని యితర వరిపయిరు నాటుటకు పూర్వముగాని ఆకుపయిర్లు చల్లవలెను. ఆకు పయిర్లకు కొన్ని సమయములయందు నీరు కట్టవలసినదిగా తటస్థపడుట సాధారణమే.

ఇదివరలో ఆకుపయిర్లకు నీరు కట్టినయెడల నీటిపన్ను చార్జికాబడుచువుండినది ఎరువు ఆకువలన రయితులకు కలుగు అమిత మేలును గమనించి, సదరు పయిర్లనుపెట్టి ఆకు పయిర్లకు నీరు పారించుకొన్నందుకు, తీర్వ జాస్తిగాని, ఫసలీ జాస్తి నీటి పన్నుగానీ విధింపకూడదని సర్కారువారు ఉత్తరవు పాలించియున్నారు. కనుక రయితులు ఎరువు ఆకు ఫలితమును, తనకు ఎక్కువగా వుండినయెడల, యితర రయితులకు అమ్ముకొనవచ్చును. ఎరువు ఆకుపయిరు తరి భూములయందు ముందువేసి తరువాత వేసిన వరిపయిరు పండనిచో రయితులు ముజరా (రెమిషన్) అడుగవచ్చును. ముజరా యిచ్చునప్పుడు ఆకుపయిరునుండి రయితుకు గలిగిన లాభము లెక్కకు రానేరాదు.

పశువుల మేతకుగాను పయిర్లకు ఆకు పయిర్లకువలెనే నీటితీరువలేదు. అయితే మేత పయిర్లను విత్తనము పట్టినట్లు చేసినను యితరులకు అమ్మినను, నీటితీరువ వసూలకాబడును.

పశువుల మేతకొరకు గడ్డిపైడును వరిభూములలో వేసినయెడల, నీరు వుచితముగా కట్టుకొనవచ్చును. సర్కారు నీరు వుచితముగా (1) వరి కోతకాగానే ఎరువుకొరకు తడవుటకున్ను, (2) నీరు సమృద్ధిగావుండు కాలమందు చవుటి భూములనుండి వుప్పును పారదోలుటకు రెండు సంవత్సరములవరకున్ను, (3) రెండవ కారుకాలమందు ఒంటికారు చౌటి భూములను సాగుచేయుటకున్ను యివ్వబడును. రయితు పై సందర్భముల యందు వుపయోగించు నీటికి పన్నులేదు.

క్రింద కనపరచిన వుద్యోగస్తులనుండి ఆకుపైర్ల విషయమై రయితులు కనుగొనవచ్చును :—

| | |
|---|---|
| వ్యవసాయపు డిప్యూటి డైరెక్టరు, | 1 వ సర్కిలు, విశాఖపట్నం. |
| డిటో | 2 వ సర్కిలు, గుంటూరు. |
| డిటో | 3 వ సర్కిలు, బళ్లారి. |
| డిటో | 4 వ సర్కిలు, సెంటు తామస్ మౌంటు. |
| డిటో | 5 వ సర్కిలు, తిరుచినాపల్లి. |
| డిటో | 6 వ సర్కిలు, మధుర. |
| డిటో | 7 వ సర్కిలు, తెలిచ్చేరి. |
| డిటో | 8 వ సర్కిలు, కోయంబత్తూరు. |

## 23. వ్యవసాయ శాఖయందలి శాస్త్రజ్ఞులకు పరీక్షార్థము నమూనాలను పంపుట.

1. మంటిని, ఎరువులను, పృథక్కరణమునకు పంపునపుడును,

2. చేలకు పురుగువల్ల కలుగు నష్టము తెలిగుజేయుచు పురుగులను పంపునపుడును,

3. తెగులుపట్టిన మొక్కలను పంపునపుడును,

4. ఆనవాలు పట్టుటకును మొక్కలు వ్యగైరాలను పంపునపుడును, ఈ క్రింది సలహాలను గమనింపవలెను.

భూమినుండి మంచి పంటలు పండించవలెను ప్రతి వ్యవసాయదారుడును గమనించవలసిన ముఖ్య విషయములేవనగా.—దుక్కి దున్నుట, సమయానుకూలముగా ఎరువులు వేయుట, నీరుకట్టుట, గొప్పు త్రవ్వుట, పురుగులుగాని బూజు తెగుళ్లుగాని రాకుండ

చేలను కాపాడుకొనుట. వీనిలో ఏ పని సరిగా చేయకపోయినను కొద్దిగానో, గొప్పగానో పంటకు నష్టము గలుగును. గనుక రయితు తనకుగల భూమియొక్క గుణదోషములను తెలుసుకొని దాని లోపములను సవరించుకొను మార్గమునరసి, భూసారమునభివృద్ధిచేసుకొని ఫలసాయమును హెచ్చుచేసుకొనుట ముఖ్యావసరము. ప్రస్తుతము ఎరువుల కంపెనీలద్వారా వెలవడుచున్న ఎరువులు అధికమగుచున్నందున వ్యవసాయదారుడు ఏ ఎరువు ఏ భూమికి ఎంత వాడుక చేయవలయునో అది ఎంతవరకు ఉపయోగించునో అను అంశములు తనంతట తాను తెలుసుకొనలేడు. భూమియొక్క గుణదోషములను ఎరువుయొక్క ప్రత్యేక అవశ్యకతను ఎరుగనిదే, తోచినట్లు వేయుట శ్రేయస్కరముగాదు. ఈ విషయము లన్నిటిలోను వ్యవసాయ సలహానిచ్చి సహాయముజేయుటకు గవర్నమెంటువారు ఒక రసాయన శాస్త్రజ్ఞుని నియమించియున్నారు. వారు భూమియొక్క స్థితిగతులనుగూర్చియు, ఎరువులనుగూర్చియు, చేలు పెరుగుటను గూర్చియు యీ మూడిటియొక్క అన్యోన్య సంబంధములనుగూర్చియు పరిశోధనలు చేయుచుందురు. గనుక యే రయితైనను తన భూమిలోని మట్టినిగాని, దానికి వేయగోరు ఎరువునుగాని ఈ శాస్త్రజ్ఞునికి సరియైన విధముగా పంపినయెడల వీరు దాని గుణదోషములను చక్కగా పరిశీలించి తగిన సలహాలనిత్తురు.

అన్ని విధములైన పైరులకు పురుగులవల్లను, బూజువల్లను నష్టము కలుగుచున్నవి. మెట్ట పయిర్లయందు గనపతు గొంగళి పురుగులును కాయధాన్యములను జెరుపు పచ్చపురుగులను ముఖ్యమైనటువంటి నష్టము కలుగజేయు పురుగులలో కొన్నిటికుదాహరణములు ఈ పురుగులు వేలకొలది హటాత్తుగా బయలుదేరి సస్యములకు మిక్కిలి నష్టమును కలుగచేసి. పిమ్మట కనబడకపోవుచున్నవి. పురుగుయొక్క జీవిత చరిత్రనుగురించి తెలియని వ్యవసాయదారుడు భ్రమజెంది యేమియు చేయుటకు వీలు లేకయున్నాడు. అలాగుననే చెట్లకు సరిగా ఎరువులువేసియు, నీరుకట్టియు, కొన్ని సమయములందు అకస్మాత్తుగా వాడిపోయి చచ్చుటచేత పంటకు నష్టము అగుచున్నది. గనుక రయితులు దిగ్భ్రమ పడుచున్నారు. దృష్టాంతముగా పొగకాయలకు కుళ్లు తెగులు, జొన్నలకు కాటుక తెగులు మొదలయినవి. అవి పయిర్ల సత్తువంతయు హరించి వాటికి హాని కలుగచేయును. తమ పంటలు నాశనమైనప్పుడే రయితులు ఆ సంగతిని తెలుసుకొనుచున్నారు. 'అడుసు తొక్కనేల కాళ్లు గడుగనేల' అనెడు లోకోక్తి ఈ రోగములకును వినియోగింపదగును. పురుగుల బూజు తెగుళ్లుబట్టిన మొక్కలను పంపించినయెడల వాటిని పరీక్షించి కావలసిన సలహాలు యిచ్చుటకుగాను కోయంబత్తూరులోని వ్యవసాయపు కాలేజియందు పరిశోధనార్థము ప్రత్యేకముగా క్రిమిశాస్త్రజ్ఞుడు, శిలీంధ్ర శాస్త్రజ్ఞుడు అనెడి యిద్దరుద్యోగస్థులున్నారు. వీటిని గురించిన అన్ని సంగతులు యీ కరపత్రములో వివరింపబడియున్నవి.

వ్యవసాయమును గురించి సలహాలిచ్చుటకు సమర్థులయిన డిమాన్‌స్ట్రేటర్లు ప్రతి తాలూకా ప్రధాన స్థలములో నియమింపబడియున్నారు. కోయంబత్తూరు కళాశాలలోయుండువారికి వ్రాయుటకు మునుపే సాధ్యమైనంతవరకు యీ వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరులతో ఆలోచించుట మంచిది.

## I. మంటిని యెరువులను తనిఖీకొరకు పంపుట.

తమ పరిశోధనల కాటంకము కలుగచేయకుండునంతవరకు అవకాశమునుబట్టి గవర్నమెంటు వ్యవసాయక రసాయన శాస్త్రజ్ఞుడు వ్యవసాయదార్లు పంపు మంటిని

ఎరువులను, తదితరములను పరీక్షించుచుండును. సలహాల ప్రకారము, నమూనాలు తీయించి పంపించినయెడల యీ క్రింద వివరించిన విధమున రుసుమును చెల్లింపవలసి యుండును :—

(ఎ) మంటి పరీక్ష.—భూమియొక్క ఫలితము దానిస్థితిగతులపై నాధారపడి యుండును. కనుక కేవలము రసాయినిక పరిశీలనమువల్ల భూసారము పూర్తిగా తెలియ నేరదు. భౌతిక విషయములను జీవశాస్త్రి విషయములనుకూడ పరీక్షించవలసి యుండును గాన నమూనా సరిగాతీసి యీ క్రింది తఫ్సీళ్లతో పంపినయెడల తనిఖీచేసి ఆ భూమి బాగుపడుటకు వలయు యెరువులు మొదలగు విషయములగూర్చి సలహా నీయ గలరు.

ఫలితము పరీక్షింపదలచిన పొలమంతటిలోను సమానదూరములోనున్న 10—12 స్థలములు గురుతుపెట్టుకొని అన్నిచోట్లనుంచివచ్చిన మంటిలో నమూనా తీయవలయునే గాని ఏదో ఒక బాగుగాపండేమూలనో పనికిరానిచోటనో తీయకూడదు. మన్నుతీయు నపుడు పైనున్న గడ్డిగాదములు గోకివేసి 9 అంగుళములలోతున ప్రతిచోటను త్రవ్వి ఆ విధముగా అన్ని చోట్లను త్రవ్వితీసిన మంటిని గాలికి ఆరబోయవలెను. పిమ్మట గడ్డలను చితుకగొట్టి బాగుగా కలిపి నెరపి, ఒక్కొక్క పిడికెడు చొప్పున కొన్ని మారులు నమూనా తీయవలెను. సుమారు 5 పౌనులు బరువుగల మన్నును పంపిన చాలును. అది సన్నని గుడ్డసంచిలో వేసి దానిలో పంపేవారిపేరు, విలాసము, నెంబరు (లేక గురుతు) గల ఒక చీటినివేసి కట్టవలెను. ఒక చిన్న గోనె సంచిలో దీనినివేసి బందుచేసి గవర్నమెంటు వ్యవసాయ రసాయన శాస్త్రిజ్ఞుడు, లాలి రోడ్డు పోస్టు, కోయంబత్తూరు, అని పైవిలాసమువ్రాసి పంపవలెను. వారికే యింకొక ఉత్తరములో పొలమునుగూర్చిన యీ క్రింది అంశములన్నియు వ్రాయవలెను :—

(1) మట్టి నమూనా పంపువారి పేరు, విలాసము.

(2) భూమి ఏ జిల్లా, ఏ తాలూకా, ఏ గ్రామములోనిదో.

(3) పొలముయొక్క సర్వే నెంబరు.

(4) అది మెట్ట నేలయా ? తోట నేలయా ? దంప నేలయా ? ఒక పంట పెట్టునదా లేక రెండు పంటలు పెట్టునదా ?

(5) సామాన్యముగా వేయు పైర్లు.

(6) నీటివసతులు.

(7) మురుగుడు నీళ్లుపోవు వసతులు.

(8) ఇదివరలో యెప్పుడెప్పుడు యే పైర్లు వేసియున్నారు ?

(9) రయితు అనుభవమునుబట్టి భూమియొక్క ముఖ్యదోషము లేవి ?

రెండు, మూడు పొలములనుండిగాని ఒకే పొలములోనుండి 2, 3 మళ్లనుంచిగాని మట్టి నమూనాలు పంపునపుడు, వాని గురుతులతోను, తఫ్సీళ్లతోను వేర్వేరు చీటీలను వ్రాసి ఆ నమూనా సంచిలో నుంచవలెను. దానితో నమూనాలు కలసిపోకుండునట్లు జాగ్రత్తగా బందుచేసి పంపవలయును.

(బి) ఎరువుల పరీక్ష.—ఎరువు అంతటిలోనుంచి ఒక పౌనుకు తక్కువగా కుండ నమూనా జాగ్రత్తగా తీసి మొదట కాగితపు సంచిలోవేసి దానిని గుడ్డ సంచి

లోనో డబ్బాలోనో యుంచి బందుచేయవలెను. సున్నపురాళ్లు మొదలగు కొన్ని యెరువులు గాలి సోకుటచేత రసాయనిక మార్పులు చెందును గనుక అట్టి వాటిని గాలి తగలని డబ్బాలోనే పంపవలెను. ఒకవేళ బస్తాలకొలదిని యెరువునుండి నమూనా తీయవలసి యున్నయెడల పదేసి బస్తాలకు ఒక బస్తా చొప్పున మచ్చుకు తీసి యీ మచ్చు యెరువును క్రింద పరచి బాగుగా కలిపి అందుండి ఒక పౌను మాత్రము తుదకు నమూనా పంప వలెను. ఎరువు కొద్దిగా వున్నయెడల బాగా కలిపి మచ్చు సులువుగా తీయవచ్చును.

రుసుము.—తనిఖీచేయుటకు యీ క్రింద నుదహరించిన రుసుము చెల్లింపవల యును. యునైటెడ్ ప్లాంటర్ల సంఘమునకు యిందులో నూటికి 10 చొప్పున తగ్గించ బడి సంఘ కార్యదర్శిమూలముగా సొమ్ము వసూలు చేయబడును. పొలము సాగు చేయు రయితులవద్ద యీ రుసుములో 5 వ వంతు మాత్రమే తీసికొందురు. గనుక యీ సదుపాయమును పొందగోరువారు తామే పొలమును సాగుచేయుచున్నట్లు తెలుపు యోగ్యతాపత్రము తమ జిల్లా వ్యవసాయాధికారి—వ్యవసాయపు అసిస్టెంటు డైరక్టరు వద్దనుండిగాని తమ సర్కిల్ డిప్యూటి డైరెక్టరువద్దనుండిగాని తీసికొని దానిని నమూనా తో వ్యవసాయ రసాయన శాస్త్రజ్ఞునికి పంపవలెను. రుసుము ముందుగా చెల్లింపని వారికి పరీక్షా ఫలితములు తెలుపు నివేదిక వి. పి. గా పంపబడును :—

(ఏ) మట్టి నమూనాలు.

| | | రూ. |
|---|---|---|
| 1 | పూర్తియైన రసాయనిక పరీక్ష (చేల కందుబాటులో నున్న పొటాషు భాస్వరముగూడ నిర్ణయింతురు)... | 25 |
| 2 | భౌతిక పరీక్ష (ఇసుక, బంకమన్ను మొదలైన మంటి రేణువులు నూటికి యన్ని వంతున నిర్ణయింతురు). | 5 |
| 3 | పూర్తియైన రసాయనిక భౌతిక పరీక్ష ... | 30 |
| 4 | చవటి నేలలు (అధిక రుసుము) ... ... | 10 |

(బి) ఎరువులు.

| | | |
|---|---|---|
| 1 | గానుగ పిండి జాతులు (నత్రజని మాత్రమే) ... | 5 |
| 2 | రక్తపు పొడి (నత్రజని మాత్రమే) ... ... | 5 |
| 3 | నైట్రోలిము లేక కాల్సియము సయనమైడు (నత్రజని మాత్రమే) ... ... ... | 5 |
| 4 | సోడియము నైట్రేటు లేక నైట్రేటు ఆఫ్ సోడా (నత్రజని మాత్రము) ... ... ... | 5 |
| 5 | కాల్సియము నైట్రేటు (నత్రజని మాత్రమే) ... | 5 |
| 6 | కైనిట్, మ్యూరియేట్ ఆఫ్ పొటాష్ (పొటాషు మాత్రమే) ... ... ... | 5 |
| 7 | సున్నపు రాళ్లు, సున్నపు పొడి (ఉడికినది—సున్నము బొగ్గుపులుసు గాలి) ... ... | 5 |

| | | | రూ. |
|---|---|---|---|
| 8 | చేపల యెరువు (నత్రజని, భాస్వరము) | ... | 10 |
| 9 | ఎముకల పొడి (నత్రజని, భాస్వరము) | ... | 10 |
| 10 | సూపరు ఫాస్ఫేటు, బేసిక్ స్లాగ్ (మొత్తపు భాస్వరము ద్రావణీయమైన అనగా చేలకు తక్షణం వుపయోగమగు భాస్వరము) ... | ... | 10 |
| 11 | సూరేకారము లేక సాల్టుపీటరు (నత్రజని, పొటాషు). | | 10 |
| 12 | బూడిద (పొటాషు సున్నము) ... | ... | 10 |
| 13 | ఎముకలపొడి, గానుగపిండి కలసిన యెరువులు (నత్రజని, పొటాషు, భాస్వరము) ... | ... | 10 |
| 14 | చేపలు, గానుగపిండికలిసిన యెరువులు (నత్రజని భాస్వరము) ... ... | ... | 10 |
| 15 | చేపలు, గానుగపిండి, పొటాషు క్షారముచేర్చిన (నత్రజని, పొటాషు, భాస్వరము) ... | ... | 16 |
| 16 | నాలుగు మూలద్రవ్యములు గల యెరువుల మిశ్రమములు (నత్రజని, పొటాషు, భాస్వరము, సున్నము) | ... | 20 |
| 17 | పశువుల యెరువులు ... ... | ... | 15 |
| 18 | పచ్చియాకుల యెరువులు ... | ... | 15 |
| 19 | చీకిన ఆకులలములు లేక అన్ని విధములుగా చేరిన పెంట ... ... | ... | 15 |

(సి) పశువుల మేతదినుసులు అనగా గానుగపిండి జాతులు, గడ్డి దినుసులు మొదలయినవి

| | | | |
|---|---|---|---|
| 1 | మేత దినుసులు (తేమ, మొత్తపు మాంసకృత్తులు, సిసలైన ఆల్బుమినములు, చమురు, నార, పిండి పదార్థములు) ... ... | ... | 30 |
| 2 | మేత దినుసులు (పొటాషు, భాస్వరముకూడా తనికీ చేయుటకు అధిక రుసుము) ... | ... | 10 |

(డి) ఇతరములు.

| | | | |
|---|---|---|---|
| 1 | చమురు గింజులు (చమురు మాత్రమే) | ... | 2 |
| 2 | పారుదలకు వుపయోగించు నీరు ... | ... | 10 |

ఫు. రా.—నత్రజనికి ఇంగ్లీషుమాట నైట్రోజను (Nitrogen).

(2) భాస్వరము, స్ఫురము లేక స్ఫురత్వం ఆమ్ల జనిదము అనునవి ఇంగ్లీషులో ఫాస్ఫారిక్ ఆసిడ్ (phosphoric acid) అను మాటకు భాషాంతరీకరణములు. (3) కాల్సియము (Calcium) అనగా, ఖటికము లేక సున్నములోని ముఖ్య ధాతువు.

## II. క్రిమి కీటకాదులవలన కలుగు నష్టమునుగురించి తెలియపరుచుటకును వాటిని పరీక్షార్థము పంపుటకును సలహాలు.

పైర్లనుగాని తోటలనుగాని యందుండు యితర చెట్లనుగాని పురుగులు నాశము చేయనప్పుడును, వానిని పోగొట్టుకొనుటకు తగినమార్గము తెలియనప్పుడును, గవర్నమెంటు క్రిమి శాస్త్రిజ్ఞునికి వ్రాసి తెలిసికొనవలయును. సాధారణముగా క్రిమి శాస్త్రిజ్ఞుడు యీ పురుగులను పోగొట్టుకొనుటకు తగిన సలహాలు యివ్వజాలకయున్నాడు. ఎందువలననగా సాధారణముగా రయితులు గుమి చేయుటకును తరుణము మించి పోయిన తరువాత తెలియపరుచుచున్నారు. ఎక్కువ నష్టము కలిగిన పిమ్మటనే పురుగులను కనిపెట్టుదురు. ఇటువంటి సందర్భమున యేవిధమైన సలహాలు చెప్పుటకును వీలులేదు. చీడలు యెప్పుడును తరచుగా ప్రతి సంవత్సరము అదేకాలమున కనబడును. రైతులు వీటిని కనిపెట్టుచునుండినయెడల వాటివల్ల యే విధమైన నష్టములేకుండ చేయవచ్చును. మరికొన్ని హఠాత్తుగా బయలుదేరును. ఒక సంవత్సరము కనబడిన పిమ్మట అనేక సంవత్సరములవరకు కనబడవు. ఈ సంగతికూడ తగిన తరుణమున గవర్నమెంటు క్రిమి శాస్త్రిజ్ఞునికి తెలియపరచినయెడల సస్యములకు వాటివల్ల కలుగు నష్టములను మాన్పవచ్చును.

నష్టమును కలుగజేయు పురుగులను గురించి తెలియపరచునప్పుడు యీ క్రింద నుదహరించియుండు అంశములను గమనించవలయును :—

(1) తగిన కాలమున తెలియపరచవలయును.

(2) పురుగులను గురించి విశదీకరించ నక్కరలేదు. సందర్భమున్నయెడల బ్రతికియున్న వాటిని పంపవలయును.

(3) వాటిని పంపు పార్సలులో యీ క్రింద చెప్పబడియుండు అంశములన్నియు వ్రాసిన ఒక కాగితము ముక్కను వుంచవలెను :—

1. పంపువారి పేరు, విలాసము.

2. ఊరి పేరు, దగ్గరయుండు రయిల్వే స్టేషను, ఈ పురుగులు కనబడిన తాలూకా, లేక జిల్లా.

3. నాశనము చేయబడిన పైరుల పేర్లు.

4. దేశభాషలో అలవాటుగల పేరు.

5. ఈ పురుగు మొట్టమొదట యెప్పుడు కనబడినది.

6. ఆయా స్థలములలో వాటిని పోగొట్టుటకు తగిన మార్గములు యేవైన వుండినయెడల.

7. ప్రతి సంవత్సరము కనబడుచున్నాదా? లేక క్రొత్తగానా? లేక యిటీవలనా?

8. క్రిమి శాస్త్రిజ్ఞుడు సలహాలు చెప్పుటకు వీలగునట్లు యింక యితర విషయములు యేవయిన యుండినయెడల వాటిని పంపవలెను.

(4) బంగీనీ రిజిస్టరుచేసి తపాలులో బంపకూడదు.

(5) క్రిమి శాస్త్రజ్ఞుని సొంతపేరుబెట్టి విలాసము వ్రాయగూడదు.

బ్రతికియున్న పురుగులను కన్నములు గలిగి, మూతవేయబడిన ఒక డబ్బాయందుంచి పంపినయెడల జాగ్రత్తగా రాగలవు. అందులో కదలకుండా కొంత పచ్చిగడ్డియును, తగినంత ఆహారమును వుంచవలయును.

చిన్న కొమ్మయందును, బోదెయందును, శాఖలయందును, దొలుచుకొని పోవునటు వంటి పురుగులను యేలాగు చెట్లయందు బ్రతికియున్నవో అలాగుననే పంపవలయును.

చనిపోయిన వాటిని సారాయి గల ఒక సీసాలోవేసి పంపవలయును. సీతాకోక చిలుకలు, రెక్క పురుగులు, మొదలగు వాటిని కాగితపు కవర్లయందు రెక్కలను వీపు వైపు మడచియుంచి పంపవచ్చును.

వ్యవసాయదారులు గమనింపవలసినదేమనగా, పురుగులను గురించి వ్రాసిన మాత్ర మున లేక అవిచేయు నష్టములను తెలియచేసినంత మాత్రమునగాని వాటిని పోగొట్టుటకు తగిన సలహాలు యివ్వజాలరు. సకలమును తెలియచేయుట ఆవశ్యకము. లేనియెడల వారికి యేవిధమైన సదుపాయము ఉద్యోగస్థులవలన కలుగనేరదు. ఆలస్యముచేయుట వల్ల వృథాగా కాలముగడుపుటయు ప్రజల డబ్బు వ్యర్థముగుటయు జరుగుచున్నవి. గవర్న మెంటు క్రిమి శాస్త్రజ్ఞులు వ్యవసాయదార్లవద్దనుండి దాదాపుగా వార్ల సస్యములపై రాగలుగు పురుగులను గురించియు అవి ప్రతి సంవత్సరము యే తరుణమున మిక్కుటముగా బయలుదేరుచున్నవియు, వినుటకు యెప్పుడును ఆసక్తులయియున్నారు. ఈలాటి విషయములు మిక్కిలి ఆవశ్యకము. ఎందువలననగా వీటినిబట్టి గవర్నమెంటు క్రిమి శాస్త్రజ్ఞుడు పురుగులను పోగొట్టుటకు తగిన సలహా వెంటనే యివ్వజాలకపోయినను మరుసటి సంవత్సరము అవి బయలుదేరకుండ తగిన యత్నములు చేయగలుగును. అన్ని విధములయిన బంగీలమీదను యీ క్రింది విధముగా విలాసమును వ్రాయవలె ను :—

గవర్నమెంటు క్రిమి శాస్త్రజ్ఞుడు,
వ్యవసాయ పరిశోధన స్థానము,
లాలి రోడ్డు పోస్టాఫీసు,
కోయంబత్తూరు.

## III. బూజు తెగుళ్లు తగిలిన మొక్కలను పరీక్షకుగాను సర్కారు మైకాలజిస్టు గారికి పంపుటకు సలహాలు.

కోయంబత్తూరునందుండు సర్కారు మైకాలజిస్టుగారు వ్యవసాయ విషయముల యందు శ్రద్ధవహించి జనులవద్దనుండి వచ్చు బూజు తెగుళ్లతగిలిన మొక్కలను పరీక్షించు టకును, వాటిని అణచు పద్ధతులను, మరల యీ తెగళ్ల రాకయుండునట్లు తగిన సల హాలు ఇచ్చుటకు యెల్లప్పుడు సంసిద్ధులయియున్నారు. బూజు తెగుళ్ల తగిలిన మొక్క లను పరీక్షించుటయు వాటి విచారణకుగాను యిచ్చు సలహాలకును యేలాటి చార్జి లేకయే ఉచితముగా చేయుచున్నారు. మదరాసు రాజధాని అన్ని ప్రదేశములలో నుండి రయితులు తమ భూములలో పయిర్లకు పట్టు బూజు నమూనాలను పోస్టుద్వారా గాని లేక రయిలుద్వారాగాని పంపుతూ ఈ మైకాలజిస్టుగారి సహాయ్యమును పొంద వచ్చును.

దూర ప్రదేశములనుండి పరీక్షకుగాను పంపబడు నమూనాలు కోయంబత్తూరు చేరునప్పటికి సాధారణముగా బూజులతో నిండిపోవుటవల్ల తెగులు నిర్ధారణ చేయుటకు చాల కష్టమగుచున్నది. కావున యీ దిగువ కనుపరచిన విషయములను జాగ్రత్తగా గమనించినయెడల నమూనాలు సకాలములో తగిన స్థితిలో చేరి పరీక్షకు తగి యుండును :—

A. సామాన్యముగా గమనింపవలసినది (జనరల్).

1. తెగులు తగిలిన మొక్కలను పంపునపుడు వుద్యోగస్థుని పేరునకు పంపకూడదు. వాటిని "గవర్నమెంటు మైకాలజిస్టు, లాలి రోడ్డు పోస్టు, కోయంబత్తూరు" అను విలాసముతో పంపవలెను. అట్లు చేయుటవల్ల వారు గ్రామాంతరం వెళ్లినప్పటికిన్ని, వారిస్థానె నియమింపబడినవారు వాటిని తీసికొని పరీక్ష చేయుటకు వీలుగావుండును.

2. పరీక్షచేయు మొక్కలను తేమగా వున్నపుడు పంపకూడదు. వాటిని కొంచెము అయినను యెండబెట్టి పంపవలయును. తడిగా వున్నవాటిని పంపినయెడల మధ్యకాల ములో బూజు వృద్ధిఅయి యే తెగులో తెలుసుకొనుట కష్టమగును.

3. సాధ్యమైనవరకు బూజు తెగులు పట్టినది మొదలుకొని అంత్యమయ్యేవరకు. చూపు అన్నిమాదిరిల మొక్కయొక్క నమూనాలు పంపవలెను. తెగులు పట్టునప్పుడు ప్రారంభస్థితి, నిండుస్థితి, అంత్య స్థితిని చూపుమాదిరిలు వుండవలెను. తెగుళ్లు గలిగిన ప్రదేశమునుండి యెక్కువ మొక్కలను తీసి అందు జాగ్రత్తగా తెగులుయొక్క అన్ని స్థితులను చూపుమాదిరులను యేరి పంపిన సులువుగా వుండును.

5. తెగుళ్లు తగిలినవాటిని తనికికి పంపు నమూనాను హెచ్చుగా పంపుచుండవలెను. ఇట్లు చేసిన బాగా తెగులు పరీక్షచేయుటకు సులువుఅగును. బాగా తెగులుతగిలినవాటిని హెచ్చుగా పంపక పోవుటవల్ల వాటిని తిరిగి పంపమనుటలో కాలము వృథా అగుటయే గాక కావలసినన్ని దొరకక పోవుటకూడ తటస్థించుచున్నది.

5. తెగులు తగిలిన మొక్క యొక్క పేరు సరిగా తెల్లియనప్పుడు దాని ఆకులను పువ్వులను అద్దుడు కాగితముల మధ్యపెట్టి పరీక్షకు పంపవలెను.

6. ఈ దిగువ అంశములమీద సంజాయిషీకూడ యివ్వవలెను :—

(1) ప్రదేశము, జిల్లా, గ్రామము.

(2) తెగుళ్లపట్టిన భూమి, పరిమితి.

(3) ఈ తెగుళ్లకు దేశభాషలో వాడే పేరు.

(4) తెగుళ్లు గలిగిన మొక్కల పేరు.

(5) తెగుళ్లయొక్క వ్యాప్తి.

(6) ప్రథమములో తెగుళ్లు కనుపించిన తేది.

(7) సంవత్సరములో యే కాలమున తెగులు వృద్ధిగానున్నది.

(8) ఇందుకు పూర్వము తెగుళ్లు తగిలిన దాని చరిత్ర.

(9) తెగుళ్లు వృద్ధియగుటకుకాని, తగ్గుటకుగాని సహాయముచేయు శీతోష్ణ స్థితులు.

(10) తెగులు పోవుటకు ఉపయోగించిన సాధనములు.

(11) వ్యవసాయముచేయు పద్ధతి యెరువువేయు ఆచారము.

B. ముఖ్యముగా గమనింపవలసిన విషయములు (స్పెషల్).

1. పూర్తిగా మొక్కంతేయు చచ్చినప్పుడు యే భాగమునను తెగులుపట్టినదో తెలియనప్పుడు మొక్కంతయు పంపవలెను. చిన్న మొక్కలను పంపవలసినయెడల అద్దుడు కాగితముల మధ్యయుంచి పంపవలెను. చెరుకు మొదలగుపెద్ద మొక్కలను పంపునప్పుడు వాటిని ఎండనిచ్చి గోనెసంచిలో వుంచి రైలులో పంపవలెను. పెద్ద మొక్కలను పూర్తిగా పంపుటకు వీలులేనప్పుడు తెగులు తగిలినదనితోచే భాగములను కోరి పంపవలెను.

2. కొమ్మలు, వేళ్లు వీటిని పంపునప్పుడు కొద్దిగా ఆరనిచ్చిన తరువాత పంప వలెను. కోసిన భాగములకు కొంచము తారుబూయవలెను. ఇట్లు చేయుటవల్లనే యితర పురుగులు ప్రవేశించి మొక్కకు హానిచేయకుండా కాపాడును.

3. ఆకులు, మొక్కలు వీటిని పంపవలసినయెడల వాడిపోకుండ తీసి అద్దుడు కాగితముల మధ్యయుంచి పంపవలెను. లేనియెడల ఎండి ముడుతలు పడిపోవును. అద్దు కాగితమును ప్రతి రోజు మూడు లేక నాలుగు రోజులవరకు మార్చుచుండవలెను. ఎండిన తరువాత వాటిని పెద్ద దళసరి కాగితముల మధ్యవుంచి జాగ్రత్తగా పోస్టుద్వారా పంపవలెను.

4. పండ్లు పంపునప్పుడు సాధ్యమైనంతవరకు—

(ఎ) తెగులులేని పండ్లు.

(బి) తెగులుతగిలినవని సూచనలు చూపు పండ్లు.

(సి) చాలమట్టుకు పాడయి పూర్తిగా కుళ్లకుండా వుండు పండ్లువీని మాదిరు లను పంపవలెను. వైరకముల పండ్లను ఒకే సారి పంపవలసినయెడల ఒక్కొక్క రక మును ప్రత్యేకముగా దూదితోను కాగితముతోను చుట్టి పంపవలెను.

5. పెద్ద చెట్లమీద బయలుదేరు బూజు మొదలగు తెగులు తగిలిన వాటిని పంప వలసినయెడల వాటిని యెండనిచ్చి పల్చటి కాగితమునకు చుట్టిపెట్టెలో వుంచిపంపవలెను.

6. కుక్కగొడుగులు మొదలగు మృదువైనవిగాని పెలుసైన బూజులనుగాని బ్రాండి సారాయి లేక విస్కీలోగాని సీసాలోవుంచి సీలువేసి పంపవలెను.

## IV. మొక్కలను పోల్చుటకుగాను సర్కారు సిస్టమేటిక్ బోటనిస్టు గారికి నమూనాలు పంపుటకు సలహాలు.

1. ఆకులతోను, పుష్పలతోను, పండ్లతోనుండు పూర్తిఅయిన నమూనాలను మాత్రము పంపవలెను. ఏలననగా అట్టివాటినే సరిగా పోల్చుటకు వీలగును. కావున అట్టినమూనాలు పోల్చుటకు పంపునప్పుడు పువ్వులతోను, పండ్లతోను నుండునట్టివిగా చూచి జాగ్రత్తగా పంపవలెను. పువ్వులు లేనివి పంపిన నిష్ప్రయోజనమగును. మొక్కలను ఆకులను బట్టి పోల్చునంతటి విద్యానిపుణత అంతగా ప్రబలియుండలేదు.

2. పోల్చుటకు పంపు నమూనా 18 అంగుళముల పొడవు 12 అంగుళముల వెడల్పుకంటె యెక్కువ వుండగూడదు. ఈ నమూనాను అద్దుడు కాగితము మీద పెట్టి దాని ఆకులను పరచవలెను. దీనిపైన మరియొక అద్దుడు కాగితమునువేసి రెండు దళసరి అట్టల మధ్యపెట్టి ప్రెస్ చేయవలయును. ఒకటికంటె యెక్కువ నమూనాలను

పంపించునపుడు ఒక్కొక్కదాని తరువాతను అద్దుడు కాగితము పెట్టి వాటిపైన క్రింద రెండు దళసరి అట్టముక్కలుపెట్టి అన్నిటిని జంటగాచేర్చి బందు చేసి ఆలస్యము చేయకుండగా వెంటనే రిజిస్టర్డు పార్సెల్ద్వారా కోయంబత్తూరు నందుండు వృక్షశాస్త్రజ్ఞునికి పంపవలెను.

3. ఈ మాదిరిలు హెర్బేరియమ్ చేరునప్పుడు సాధ్యమైనంతవరకు పోల్చుటకు వీలున్నంతటి స్థితిలోను, మంచి అనుకూలమైన స్థితిలోను నుండునట్లుగా ప్రయత్నపడవలెను. లేనియెడల అట్టివాటిని పోల్చుటకు దుర్లభము. బూజు తెగులు, పురుగులు మొదలైనవి ప్రవేశింపకుండునట్లుగా అద్దుడు కాగితములమధ్య పెట్టి బందు చేసి పంపవలయును.

4. గడ్డి మొదలైన చిన్న మొక్కలను పంపునపుడు పూర్తిగా మొక్కలంతయు వేళ్లతో సహా పంపవలెను.

5. మాదిరులతోగూడ యెప్పుడు యీ దిగువ అంశములమీద సంజాయిషి యివ్వవలెను:—

(i) పంపించిన సమూనా యెప్పుడు తీసినది.

(ii) ప్రదేశము, గ్రామము, జిల్లా.

(iii) ప్రదేశముయొక్క యెత్తు (సముద్రమట్టమునకు).

(iv) మొక్కయొక్క స్వభావము (చెట్టా మొక్కా మొదలగునవి).

(v) పువ్వుయొక్క రంగు.

ఇంకా యితర విషయములు యేమైనను ఉండినయెడల తెలియజేయవలయును.

6. కాయ్య కారని మొక్కలైనయెడల యీ మోస్తరుగా చేసినయెడల పంపుటకు అనుకూలమగును. అట్టి నమూనాను కొంచము మొదట ఉడకబెట్టి అధికనీరును తీసివేసి యిదివరలో చెప్పినట్లుగా అద్దుడు కాగితముల మధ్యపెట్టి అణచవలెను.

7. విత్తనములు మాత్రము పంపునపుడు మొదట వాటిని యెండబెట్టి అట్టపెట్టలోగాని, జాజికాయ పెట్టలోగాని పోసి దానిలో కొన్ని నెఫ్తలైన్ ఉండలు వేసి బందుచేయవలెను. అనుకూలపడినయెడల ఆ విత్తనముల చెట్టుయొక్క ఆకు రెమ్మలు పంపవలెను.

8. నమూనాలను పంపునపుడు ఉద్యోగస్థుని పేరునకు పంపకూడదు. వాటిని యీ దిగువ విలాసమునకు పంపవలెను. లేనియెడల జవాబువచ్చుట ఆలస్యమగును.

గవర్నమెంటు సిస్టమేటిక్ బోటనిస్టు,
లాలి రోడ్డు పోస్టు, కోయంబత్తూరు.

---

## 24. వ్యవసాయ కళాశాల.

వ్యవసాయము నేర్పుటకు కళాశాలయొక్క ఉపయోగమేమియని వ్యవసాయమునకు అనుభవమే హెచ్చుగ అవశ్యకమని తెలిసిన వ్యవసాయదారులను, భూమి ఖామందులును తరుచు అడుగుచుందురు. తరతరములనుండియు సంపాదింపబడిన గట్టి యనుభవము మూలమున గలిగిన వ్యవసాయ జ్ఞానము తండ్రినుండి కొడుకునకు యెట్లు కలుగుచున్నదియు వారికి తెలియును. వ్యవసాయ కళాశాలలో నిట్టి యనుభవ జ్ఞాన

మునకు బదులు కేవల పుస్తకజ్ఞానము మాత్రమే గలుగజేయబడునను నపోహచేత తమ కొడుకుల కిట్టి విద్య యవసరములేదని నిశ్చయింతురు. ఇది యిట్లుండ సేద్యమును గురించి అసలే తెలియని కొందరు, విద్యయందే హెచ్చు నమ్మకము గలిగియుండుటచే తమ కుర్రవాండ్రు పుస్తకములు చదివి ఉపన్యాసములను వినుటవలననే వ్యవసాయదారులు అగుటకు వీలగునని తలంతురు.

2. ఈ రెండును అపోహలే. నిజము రెంటిమధ్యను గలదు. పుస్తక పఠనము స్వానుభవమునకు సాటిరాదు. కాని అనుభవ మొక్కటి మాత్రము చాలదు. రెండును చేరిననే వ్యవసాయ విద్య సమగ్రమగును. సామాన్యపు రైతుకు చాల విషయములు తెలియును. కాని అతని జ్ఞానము చాలవరకు అనుభవప్రాయముగనుండును. అనగా అతనికి తెలిసిన విషయములకును, సామాన్య సాంప్రదాయములకును హేతువు తెలియదు. కార్య కారణజ్ఞానముగలిగి చేసిన యేపనియైనను అట్లు తెలియక చేసిన దానికంటె మేలుగనుండు ననుటకు సందేహములేదు. కావున వ్యవసాయ విద్యార్థులకు నేర్పవలయు విషయములలో, మంచి వ్యవసాయ సాంప్రదాయముల మూలతత్త్వము ముఖ్యభాగమని చెప్పదగును. ఇదిగాక సామాన్యమార్గమున అనుభవముచే సంపాదింప వీలులేని వ్యవసాయదారునికమూల్యమగు ప్రత్యేకజ్ఞానముకూడ చాల గలదు. రసాయన సంబంధమగు నెరువులు వాని యుపయోగము, తెగుళ్లు, చీడలు, వీని నివారణ, తైలయంత్రములు, పంపులు మొదలగువాని యుపయోగము, ఇందు కుదాహరణములు.

3. మనమిపుడు వ్యవసాయ కళాశాల యెట్టిదో అది యేమిచేయునో చూతము. వ్యవసాయ కళాశాలయు, పరిశోధనాస్థానమును కోయంబుత్తూరునకు పడమట సుమారు మూడు మైళ్ల దూరమున నున్నవి. విద్య గరపుట కొకటియు, వివిధములగు వ్యవసాయ సమస్యలను పరిష్కరించునట్టియు, ఆయా సమస్యములలో శ్రేష్టములగు వంగడముల నేర్పరచునట్టియు శాస్త్రిపరిశోధకులు పనిచేయుట కొకటియు రెండు ముఖ్యభవనములు గలవు.

4. ఈ కళాశాల సుమారు 500 యకరముల విస్తీర్ణముగల వ్యవసాయ క్షేత్రమునకు నడుమనున్నది. ఈ క్షేత్రమున నల్ల నేలలును ఎఱ్ఱ నేలలునుగూడ గలవు. మెట్ట భూములును, తోట భూములును, చెరువు ఆధారముగల దంప భూములును గూడ గలవు. కాన నీ క్షేత్రమున వివిధ పరిస్థితులమరియున్నవి. సంవత్సరము పొడవునను ఎప్పుడుచూచినను యేవో కొన్ని సస్యములు యీ క్షేత్రమున గానవగును. ఆధునిక యంత్రసామగ్రితో సమర్పబడిన యొక క్షీరశాలయు, పాడిపశువులమందయు యీ క్షేత్రమున గలవు. కమ్మరపు కర్మగారమును, వడ్రపు కర్మాగారమును, ప్రశస్తమగు ననేక పనిముట్లును, యంత్రసామగ్రియునుకూడ గలవు. వీనికి తోడు వెలుపలి పశువులకు గూడ చికిత్సచేయబడు పశు వైద్యశాలగూడ యొకటి గలదు.

5. ఇట్లు కృషీవలుడు తెలిసికొనదగిన విషయములన్నియు నేర్పుటకు యీ కళాశాలయందు సమగ్రమగు నేర్పాట్లుగలవని విశదమగుచున్నది. విద్యార్థులు ఆయా పనులెట్లు చేయదగునో చూపబడును; బోధింపబడును. ఇంతేగాక అన్ని పనులును వారిచే జేయింపబడును. క్షేత్రమునందును, క్షీరశాలయందును, పశువుల దొడ్లలోను, పశు వైద్యశాలయందును, కర్మాగారములందును స్వయముగ పనిచేయుటలోనే వారలచే కాలకాలము గడపబడును. ఇట్లు చేసిననే వారలకు ప్రతి విషయమును సమగ్రముగ దెలియును.

6. వ్యవసాయ పంచాంగపు యిరువది యొకటవ సెక్షను, 119 వ పుటలో చెప్పబడిన ప్రకారము. వ్యవసాయదారుల, మేస్త్రీలకు వ్యవసాయ సంబంధమైన విద్యగరపుటయేగాక కలాశాలలో రెండు విధములైన విద్యనుగరపుదురు.

(ఎ) కొద్దికాలములో నేర్చుకొనువిద్య, (బి) కళాశాలవిద్య.

7. రహితులు తమ పొలములలో సేద్యమును చేయుపద్ధతులను తెలుసుకొనుటకును, గొప్ప భూస్వాములు తమ భూములను అభివృద్ధిచేయుటకుగాను తమకుమారులను తప్పక వ్యవసాయ కళాశాలకు పంపవలయును. స్వల్పకాలపు విద్యనేర్చుకొనగోరువారు కనీసము స్కూలుఫైనలు పరీక్ష నిచ్చియుండవలయును. కళాశాలలో వ్యవసాయమును జాగ్రత్తగా చూచుకొనుట, పశువుల పాడినిసరించి, పశువులను జాగ్రత్తగా పెంచుట క్రిమిసంబంధమైన విషయములు, ఎరువుల విషయము, పంట నభివృద్ధి చేయు విషయములను, బెల్లమును తయారుచేయు విషయము, పండ్లతోటలను పెంచు విషయము, కాయగూరలను పెంచు విషయము యిత్యాది విద్య నేర్పుదురు. గతసంవత్సరములో వ్యవసాయ సంబంధమును మాత్రము నేర్పిరి. రాబోవు సంవత్సరములో మిగిలిన విద్యలనుకూడా నేర్పెదరు. విద్యార్థులకు అనుభవ విద్యనేర్పుటయే ముఖ్యోద్దేశము. ప్రస్తుత మీవిద్య ఉచితముగా నేర్పుదురు.

8. మదరాసు, కోస్తాలోకాని, అన్నామలై యూనివర్సిటిలోకాని యింటరు మీడి యేటుపరీక్ష నిచ్చినవారిని బి.యస్.సి. తరగతిలో చేర్చుకొందురు. ఈ విద్య మూడు సంవత్సరములు నేర్చుకొనవలయును. ఈ విద్య శాస్త్రసమ్మతముగాను, అనుభవ వేద్యముగానుండును. ప్రతి సంవత్సరమును 48 మంది విద్యార్థులను కళాశాలలో చేర్చుకొందురు. మద్రాసు కోస్తాలో అన్ని ప్రదేశములవారిని యిచ్చట చేర్చుకొందురు. ప్రతి సంవత్సరాంతమునందును సర్కారు పరీక్ష జరుగును. విద్యనేర్చుకొనువారు ప్రతి సంవత్సరమును రూ. 120 చెల్లించవలెను.

ప్రతి సంవత్సరమును అయిదుగురు విద్యార్థులకు, ఒక్కొక్కరికి యిరువది రూప్యములవంతున యీ క్రింద చెప్పిన రీతిగా విద్యార్థి వేతననిమిత్తరు :—

(1) తురకజాతివారికి యిద్దరికి,

(2) హీనకులమునుండివచ్చిన విద్యార్థులకు ముగ్గురికి.

9. శాస్త్రిభాగములో పనిచేయుచున్నవారును, బి.యస్.సి. పట్టభద్రులును చెన్నపట్టణమునకు యేర్పరచిన యెమ్.యస్.సి. పట్ట పరీక్షకు చదువవచ్చును. వారు వ్యవసాయ శాస్త్రములో ఆరితేరిన అధికారులక్రింద పనిచేయవలయును. ఇట్టి విద్యార్థుల సంఖ్య చాలాతక్కువ.

10. వ్యవసాయ కళాశాలలో వేరొన్నికతో పరీక్షలో ఆరితేరినవారికి, వ్యవసాయ డిపార్టుమెంటు ఉద్యోగములుకూడ దొరకును.

కళాశాలలో ప్రవేశము—కొద్దికాలము చదువువారు జూను నెల ఒకటవ తారీఖులోపుగను, బి.యస్.సి. పరీక్షకు చదువువారు జూను నెల 15 వ తారీఖులోపుగను అప్లికేషను పంపుకొనవలయును. మార్చినెల మొదటి తారీఖు గడచినతర్వాత కళాశాలలో నేర్పు విద్యనుగురించిన పట్టికను అప్లికేషను ఫారమును తెప్పించుకొనవలయును. కోయంబత్తూరు వ్యవసాయకళాశాల ప్రిన్సిపాలు, లాలీ రోడ్డు పోస్టు, అను చిరునామాకు వ్రాసికొనవలెను.

## 25. చెరువు గట్లను సాగుబడి కుపయోగింపజేయుట.

వరిసాగు యందాధారపడి దుర్దశను జెందుచున్న రైతు, తన ఆర్థిక స్థితిని పెంపొందించుటకు జేయు యత్నములలో, కృషి యందలి మార్పు, అంత సులభ సాధ్యము గాదు. ఒక రీతి నీటిపారుదల కలువడిన, డెల్టా భూముల తత్వము క్రొత్త పంటలకు సామాన్యముగ సరిపడదు. వ్యర్థము లేనట్టి మిత వాడకమున కవసరమగు నీటియుపయోగమునకున్ను, హెచ్చు ఆయకట్టు పరిమాణములకున్ను, పరిపాలనారాబడి యభివృద్ధికిన్ని, ఏర్పరుచబడిన నీటిపారుదల సరణిలు, ఈ యంశములయందెట్టి కొరతను గావింపక, క్రొత్త పైర్ల సాగున కవసరమగునట్లు, త్వరితముగ మార్పొందడము దుర్లభము. మరియు పంటలు పండించునపుడు, వ్యవసాయదారులు, ఒక్క విధముననే కృషి సలుపుటయు, ఒక ఖండమందొకే దినమును పైరును పెట్టుటయు, తదితర సేద్య విషయములో ఐకమత్యముతో ఒకే రీతిని నడచుకొనుటయు అవసరము. కనుక సేద్యగాండ్రు, వాడుకను తప్పి క్రొత్త పద్ధతులకు క్రొత్త పంటలకు సాహసించినపుడు తమ యభీష్టము సిద్ధింపక పూర్వమే అనేక యడ్డంకుల బడనెదరు. వరిసాగు తొలగించి ఎక్కువ నిచ్చునట్టి పైర్లను, తోట పైర్లను పెట్టుట కూహించిన పెక్కండ్రు, ధరలు బాగునప్పుడు మెరకలను తీసి పల్లము చేయుటకు పోయబడిన దిమ్మలను, సాగొర్చి మంచి లాభమును పొందవచ్చును. ఈ రాజధానియందు ప్రతిగ్రామమందు నగుప చెరువు గట్లనుండి, ఇంకను హెచ్చు ఫలితము నొందవచ్చును.

వేసగియందు వరి ఆకు పెంచుట కుపయోగపడెడి ఆకుమడి పేరువులును, మంచినీళ్ల కుపయోగపడెడి చెరువులును, దంపసాగునకు నియమింపబడిన పెద్ద చెరువులను వదలి, తదితర బాపతు చెరువులను, వాటివాటి గట్లయందు, మురుగు బాధలేనట్టియు, విశేష వైశాల్యము గలిగిన నేలగలదు. ఇది ఇంతవరకు సామాన్యముగ సాగొనర్పబడని క్రొవ్విన నేల గ్రామములందు చెరువు హక్కులు సాధారణముగ స్థానిక సంస్థలవి. 1932 వ సం॥ సెప్టంబరు 7 వ తేది నొసగబడిన గవర్నమెంటు రెవిన్యూ జి.ఓ. నె 1873 రు, ప్రకారము (1) స్థానిక సంస్థలు, చెరువుగట్లను, అరటి, శాకములు మొదలగు తాత్కాలిత పంటల కమర్చ వచ్చుననియు (2) నాటినుండి రాబడి సంస్థకు చేరవలయుననియు, అట్టి ఆదాయము చెరువుల నిర్వాహమునకు, మరమ్మత్తు కుపయోగింపవలయును;—అని స్థానిక సంస్థల ఇన్స్పెక్టరుగారిచె తెబడిన ప్రస్తాపము సర్కారువారామోదించిరి.

పశ్చిమ గోదావరి జిల్లా, భీమవరం తాలూకా, పెదమిరం గ్రామమందు చెరువు గట్లను సాగుబడిలోకి దెచ్చుట నొక యంశముగా గ్రహింపబడినది. చెరువునకు కాపుదల లేనిదె లబ్ధిలేదు. కాపుదలకు చుట్టు నొక కంచె ఏర్పరుచవలయును. అయిదడుగుల దూరములో కర్ర రాటలను పాతి, రెండు పిరిలుగల ముళ్ల తంతి నాలుగు వరుసలుగా వేయుటకు, 1680 అడుగుల చుట్టుకొలతకు మూడువందల రూపాలయ్యెను. అనగా కంచకు అడుగు ఒక్కటికి రూ. 0-12-0 వంతున అయ్యెను. ఒక్కటికి రూ. 0-2-10 వంతున ఖరీదు అయ్యే కట్టె రాటలకన్న, ఒక రూపాయవంతున కిమ్మతు అగునట్టి "రీయిన్ ఫోర్సుడు కాంక్రీటు" స్తంభము లుపయోగించిన ఖర్చు తగ్గును; ఏలనన వీటిని పది అడుగుల దూరమున ప్రాతవచ్చును. ఈ యావరణలో, అక్కడక్కడ స్వతసిద్ధముగా మూసుకొనబడు ద్వారములచ్చటచ్చట ఏర్పరుపబడెను.

నవుదూరు గ్రామములో గట్ల పైన సాగుజేయబడిన అరటి, ఉల్లి పైర్ల సంరక్షణకు చెరువు చుట్టును పెద్ద నేపాళములో, నాక సజీవావరణ యేర్పరుపబడెను.

పెదమిర గ్రామమందవలంభింపబడిన పద్ధతిలో గట్టుపైన అరటి పెంచబడెను. లోపలి భాగమందు మధ్యమెట్టున అనాస రకములున్ను (క్యూ, మారిషను), పై మెట్టున కందయు పాతబడెను. గట్టు వెలుపటి భాగమందు, పై మెట్టున బొబ్బాసి చెట్లున్ను, క్రింద ఆముదాలు వేయబడెను. ఈ పైరకు పూర్వము పిల్లిపెసర జల్లడము పాతులు పెట్టడము జరిగెను. ఈ పంటలకు ప్రత్యేక కూలి జనమవసరములేక, చెరువు కాపలా మనిషియే పనులు చాలవరకు చక్కబెట్టుకొనెను.

ఈ దిగువ నుదహరింపబడిన పట్టీ, ఈ పంటలవలన మూడు సంవత్సరములలో వచ్చిన రాబడులను ఇంచుమించుగ దెలుపును.

| ఫసలీ సంవత్సరము. | వరుంబడి రు. | కు రా. |
|---|---|---|
| 1932-33 | 80 | |
| 1933-34 | 60 | వేసగి తీవ్రముగయుండుటచే అరటి తోట చెరుపాండెను. |
| 1934-35 | 50 | డిటో. |

పంచాయితీ బోర్డుల, కొద్దిపాటిలో నుండెడు మూల ధనములకే మొత్తములు వృద్ధి పరచుటకు తోడ్పడును. మరియు చెరువు బాగున కృప యొగపడును. అకునుడ చెరువులు గలిగినవారికిని ఇట్టి ఆదాయములు వ్యవసాయమందు పెట్టుబడి ఖర్చులకు చాల నాశపడును

గట్ల వెడల్పును బట్టి, వాలు ననుసరించెడు మెట్ల సంఖ్యను బట్టి, స్థానిక పరిస్థితుల కవసరమగు మార్పులతో ఈదిగువ వివరింపబడిన క్రమ మనుసరించి మేలొందవచ్చును.

గట్టు వెడల్పును, మెట్లను జూపు నాకరతి.




1. చేమ.
2. అనాస.
3. కంద, పెండలము.

4. అరటి.
5. సీమ వంగ, బెండ మొదలగు కూరగాయలు, తుప్పమల్లి, లేక కంబోడియా ప్రత్తి.
6. బొబ్బాసి.
7. ఆముదాలు.

పూడు, వంద్రు చెరువు మంచి సినపుడు, ఇవి గట్ల పైనెదుగు మొక్కలకు మంచి యెరువగును. గట్లలో భాగమున యున్న పైర్ల నాటి సదుపాయమునకు, చెరువు నాటని చెదరకొట్టి మొక్కల తడుపవచ్చును. గట్టు వెలుపటి భాగమున యున్న పైర్లు నాటి యెద్దడి కోర్చును గనుక, వీటికి వలయు నారిచ్చుటంత శ్రమకాదు.

ములుకుట్ల సత్యనారాయణ బి.ఏ., బి.ఎస్‌సి. ఏజి.,
అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు,
భీమవరం, పశ్చిమ గోదావరి జిల్లా.

---

## II. పశువుల సంబంధము.

### 26. పశువైద్య శాఖయొక్క విధ్యుక్త ధర్మములు.

పైర్లు లాభకరముగ పండించుటకుగాను రయితునకు వ్యవసాయ శాఖ యెట్లు సహాయపడుటకు ఏర్పడియున్నదో పశువృద్ధి, పోషణ, ఆరోగ్యము కాపాడుట, రోగ నివారణమొదలగు పనులను నిర్వహించి సరియైన మార్గముల చూపుటకు రయితులకు పశు వైద్య శాఖ యేర్పడియున్నది. పశువులమీద రయితు తన పెట్టుబడిలో యెక్కువ భాగమును వినియోగించుటవలన పశువుల నష్టమువలన రియితు నష్టపడును. మన దేశములో ముఖ్యముగా అంటు జాడ్యములవలన, పశువులు ప్రతి సంవత్సరము చాల నశించుచున్నవి. పశువులు చచ్చుటవలన కలుగు నష్టమేగాక, వాటికి తగులు రోగములవలన శాశ్వతముగ పనికి ప్రతిబంధకము కలుగునుగాన దీనివలనకూడా కానరాని నష్టము కలుగుచున్నది. పశువులకు తగులు రోగములు చాలయున్నవి. ఇందులో దొమ్మ, రక్త అపారిశుద్ధ్యము, నోటికి కాలికి తగులు రోగము యీ మూడును యెక్కువ అపాయకరమైనవి. వ్యవసాయ అభివృద్ధికి తోడ్పడు పశువుల వృద్ధికి భంగము కలుగుచేయు పై మూడు రకముల రోగములు సామాన్యముగ అన్ని చోట్లను యెక్కువగా కలుగుచుండుటచే పై రోగముల విషయములో రయితులకు చేతనైనంత సహాయమును చేయుట పశువైద్యశాఖయొక్క ముఖ్య ధర్మము.

ఆయా జిల్లాల అవసరములనుబట్టి రయితుల సహాయముకొరకు, రాజధాని యంతను నిపుణులైన పశువైద్య డాక్టరులు ఉంచబడియున్నారు. అందులో చాలమంది ముఖ్య స్థలములయందు పెట్టబడిన పశువైద్య ఆసుపత్రులలో యుందురు. ఇదిగాక జిల్లాకు ముగ్గురుగాని ఇంకా యెక్కువమందిగాని, గ్రామములయందు తగిన మందులతోను, పరికరములతోను, సమయములో రయితులకు సహాయమొనర్చుటకుగాను సంచారము చేయుదురు. ఈ పంచాంగములో వేరొకచోట రాజధానియందు నెలకొల్పబడిన పశు వైద్య ఆసుపత్రులును, సంచారముచేయు డాక్టరులు యేయే స్థలములలో మకాముగా యుందురో వాటి పేర్లను కానబడును. పై నుదహరింపబడిన వారలనుండి రయితులకు వలయు సహాయము యెల్లప్పుడును పొందవచ్చును. ఈ దిగువ నుదహరింపబడిన ఆఫీసర్లనుండి కూడా అన్ని పశు విషయములో తగు సలహా ఆయా జిల్లాలవారు పొందవచ్చును :—

| | | |
|---|---|---|
| చెన్నపట్నము జిల్లా రయితులు. | వేపరీలోయందు పశువైద్య కళాశాల అధిపతి, | చెన్నపట్నం. |
| గంజాము, విశాఖపట్నం జిల్లా రైతులు. | జిల్లా పశువైద్య అధికారి, | విశాఖపట్నం. |
| పశ్చిమ, తూర్పు గోదావరి. ... డిటో. | డిటో. | రాజమండ్రి. |
| కృష్ణా, గుంటూరు ... డిటో. | డిటో. | బెజవాడ. |
| నెల్లూరు, కడప ... డిటో. | డిటో. | నెల్లూరు. |
| బళ్లారి, కర్నూలు ... డిటో. | డిటో. | బళ్లారి. |
| అనంతపురం, చిత్తూరు... డిటో. | డిటో. | మదనపల్లె. |
| చెంగల్పట్టు, దక్షిణ ఆర్కాడు. ఆ జిల్లా రయితులు. | జిల్లా పశువైద్య అధికారి, | చెన్నపట్నం. |
| ఉత్తర ఆర్కాడు, సేలం. డిటో. | డిటో. | వేలూరు. |
| కోయంబత్తూరు, నీలగిరి. డిటో. | డిటో. | కోయంబత్తూరు. |
| మలబారు, దక్షిణ కన్నడం. డిటో. | డిటో. | కల్లికోట. |
| తిరుచనాపల్లి, తంజావూరు. డిటో. | డిటో. | తిరుచునాపల్లి. |
| మధుర, రామనాడు, తిరునల్వేలి. డిటో. | డిటో. | మధుర. |

పశువైద్యశాఖ రాజధాని అధికారి,
చెన్నపట్నం.

## 27. పిచ్చలు తీయుట (Castration).

ఈ పని మొగ జంతులకు తమయొక్క జాతి వృద్ధిపరచకుండుటకున్నూ ఆడవాటిని దాటకుండా యుండుటకున్నూ చేయబడును.

ఇది జంతువుల వృద్ధికొరకు పాటుపడువానికి చాలా ముఖ్యమైన అంశము. ఎందుకనగా యెన్నబడిన మొగ జంతువులను వాడుటవల్లను, వీటని తగు ఆడవాటితో కలుపుటవల్లనున్నూ వానికి యెక్కువ ఫలము కలుగుటకు వీలు కలుగును. పిచ్చలు తీయుట పాటుబడు జంతువులకుగూడ ముఖ్యముగానున్నది. ఏలననగా ఆటువంటి జంతువులు పనిలో బాగా కృషి చేయుటయు కాకుండా, తమ జాతియొక్క యితర మొగ జంతువులతోను, ఆడ జంతువులతోను పనిలోగాని లేక పని లేనప్పుడుగాని కలసి మెలసి యుండుటకు చాల వీలుగా యుండును.

పొట్టేళ్లలో యీ విధముగా చేసినయెడల వాటి వున్ని చాలా మృదువుగాయుండి యెక్కువ విలువ కలదియగును. ఈ పని మొగ జంతువులయొక్క విత్తులుకోసి తీసి వేయుట లేక విత్తులయొక్క నరములను వత్తుటవల్ల ఆ విత్తులు నిస్సారమై పోవుట యున్నై యున్నది. ఈ దేశములో బుడ్డలు కొట్టుట చెక్కుచోట్లను వాడుకలో యున్నది. అది యెట్లనగా విత్తులనుగాని వాటి నరములనుగాని కోయకుండా రెండు రాళ్ల సందునగాని లేక యితర కఠినమైన వస్తువుల సందునగాని వాటిని యుంచి అవి చితికి మెత్తబడేవరకు కొట్టుట. ఈ విధముగా చేయుట సాధారణముగా అరఘంట సేపు పట్టును. ఇంత కాలమును జంతువు చెప్పతరముగాని బాధను అనుభవించును. పూర్వము జంతువులను బుడ్డకొట్టి బాధ పెట్టుటకు కారణము యుండినను యుండవచ్చునుగాని యిప్పుడు గవర్నమెంటువారు ప్రతి జిల్లాకు పశువుల డాక్టర్లను యేర్పాటు చేసియున్నారు. వీరు జాడ్యము మొదలైనవి చికిత్స చేయుటయందేకాక శాస్త్రియుక్తముగా

పిచ్చలు తీయుటయందుకూడా నేర్పబడియున్నారు. కావున తెలివిగల రయితులు యికముందు వారి జంతువులకు బుడ్డకొట్టించి వాటిని బాధ పెట్టించుటకు ఒప్పుకొనగూడదు. పశువుల డాక్టరు యీ ఆపరేషను పెక్కు విధములుగా చేయగలడు. అందులో ఒకటి పిచ్చలు కోసి తీసివేయుట. ఇది సాధారణముగా గుర్రములలో చేయబడుదు. పశువులలో యీ ఆపరేషను యిప్పుడు విత్తులు తీసివేయకుండా నెత్తురు రాకుండా చేయవచ్చును. ఇది ఏక పెద్ద పనిముట్టువల్ల చేయబడును. దీని పేరు 'బర్డి జోయి మాన్యు లేటరు' ఇది ఒక పెద్ద పటకారును పోలియుండును. దీని పిడివద్ద కొద్దిబలము వుపయోగించిన యెక్కువ బలముతో నొక్కునట్లు యేర్పాటుచేయబడియున్నది. ఇది మూసినప్పుడు నొక్కుటకు ఏర్పాటు అయిన భాగములు ఒక దానికొకటి సందులేకుండా కలసికొనియుండును. అందువలన వీటి సందున ఏమి యుంచినప్పటికి అది అంతయు నలిగిపోవును. దీనివల్ల ఒక్కొక్క నరమును నిమిషమాత్రము నొక్కుటచేత పిమ్మట బీజములు హరించుకొనిపోయి జంతువులు నపుంసకత్వమును పొందును. ఈ ఆపరేషను అయిన తర్వాత ఏ విధమైన చికిత్సయు అవసరములేదు. గిల్లలు, బుడ్డ వకటి రెండు రోజులు మాత్రమే వాచియుండి క్రమేణా హరించుకొనిపోవును. జంతువులకు జ్వరముగాని లేక మరికయొక బాధకాని కలుగదు. గనుక వెంటనే దానిని మందలో తోలవచ్చును. కొద్ది రోజులు అయిన తర్వాత పనికూడ చేయించుకొనవచ్చును.

బుడ్డ కొట్టుటకంటె బర్డిజో పనిముట్టు, వుపయోగించుటలో యీ క్రింద వుదహరింపబడిన సులువులు కలవు.

(1) బుడ్డ కొట్టుటకు వక అరఘంట పట్టును, బర్డిజో పనిముట్టువల్ల రెండు నిమిషములలో పని అయిపోవును.

(2) బుడ్డ కొట్టిన జంతువు కొన్నివారములు వాపువల్ల బాధపొందును. పెక్కు సమయములలో వాపుతీయక, గడ్డకట్టి మానుటకు యెక్కువ కాలముపట్టును. బర్డిజో పనిముట్టుతో చేసిన వాపు కొద్దిగాయుండును. ఆ వాపు వకటి రెండు రోజులలో తగ్గిపోవును.

(3) బుడ్డ కొట్టినప్పుడు జంతువు పడు బాధ చూచుటకు శక్యము కాకుండా యుండును. ఆ అవస్థ చూచినవారికే తెలియును. కాని బర్డిజో పనిముట్టువల్ల కలుగు బాధ బహు స్వల్పము.

(4) బర్డిజో పనిముట్టువల్ల చేయబడు ఆపరేషను కొద్ది కాలముపట్టును కనుక జంతువుకు మత్తుమందు యిచ్చుట వాడుక లేదు. కాని రయితు కోరినయెడల పశువుల డాక్టరు మత్తుమందు యిచ్చి ఆపరేషను చేయగలడు. అప్పుడు జంతువుకు ఆ కొద్ది బాధకూడా యుండదు.

(5) ఈ ఆపరేషను జంతువుకు ఏ వయసులోనైనా చేయవచ్చును.

తమ పశువులకు పిచ్చలు తీయించవలెనని కోరియున్న ప్రతి రయితుకున్ను యీ నూతన పద్ధతి వచ్చునని తలంచెదము. పశువుల డాక్టరు కావలసినప్పుడు వారి మకాముకుగాని లేక దగ్గిరయున్న పశువుల ఆసుపత్రికిగాని లెక తహశీల్దారుగారి ద్వారాగాని వ్రాయవలెను.

## 28. పెద్దరోగము—మేకరక్తముతోవేయు టీకాలు.

పెద్దరోగము లేక పశువుల ప్లేగు అను పశు జాడ్య మా రాజధానిలో బహు తీవ్రమైన అంటువ్యాధి అని రైతులందరకు విశదముగా తెలియును. ఈ వ్యాధి ప్రారంభించినయెడల వ్యాధితగిలిన పశువులన్నియు మరణించును. ఇందుమూలముగా రైతులకు చాల నష్టముకలుగును.

2. పశువులకీవ్యాధివలన ప్రమాదము కలుగకుండుటకు గవర్నమెంటు పశు వైద్యులు 'ద్వంద్వ' టీకాలు (Simultaneous.) వేయుదురు. అనగా ఈ వ్యాధితగిలికుదిరిన పశువునుండి తీసిన రక్తముతో తయారుచేయబడిన రసమును వ్యాధినుండి కాపాడదలచిన పశువులకు చర్మముక్రింద "ఇంజక్టు" చేయుచు దీనితోపాటి ఈ వ్యాధితగిలి తీవ్ర జ్వరముతోనున్న పశువునుండి తీసిన రక్తమునుకూడ 'ఇంజక్టు' చేయుదురు.

3. ఈ వ్యాధి తగులకుండ చేయుటకు ఒక నూతన సూక్ష్మపద్ధతి కనిపెట్టబడెను. మేకలకు పెద్దరోగము అరుదుగావచ్చుట రైతులకు తెలియును. ఈ వ్యాధి మేకలకు వచ్చినప్పటికిని వానిలో మరణసంఖ్య కొద్ది. దీనివలన మేకలు ఈ వ్యాధిని భరించుశక్తి కలవని తెలియుచున్నది. పెద్దరోగముతో బాధపడుచున్న పశురక్తమును తీసి మేకలకు ఇంజక్షను చేయబడును. అటుతరువాత జ్వరముతో ఉన్నప్పుడు ఆ మేకల రక్తమును తీసి పశువులకు ఇంజక్షన్ చేయబడును. ఈ మేకరక్తముతో ఇంజక్షన్ చేయబడు పశువులకు కొద్ది జ్వరమురావచ్చును. ఈ జ్వరము బర్రెలలో హెచ్చు. తీవ్రముగా నుండునుగాని క్రమముగా తగ్గును.

ఈ పద్ధతివలన కలిగిన వ్యాధి నిరోధికత ద్వంద్వ టీకాపద్ధతివలన కలిగిన దానివలె నేయుండును.

అనేకవేల పశువులకు టీకాలు పెద్దరోగము తగిలిన మేక రక్తముతో వేయబడెను. మరణసంఖ్య లెక్కింపరానంత, తక్కువగనులడెను. ఈ మేక రక్తముతో వేయు టీకాలపద్ధతి చాల సులభమైనది వేయుటకు సునాయాసముగాను యుండును ఈ పద్ధతివలన ధన వ్యయ మధికముకాదు.

4. కావున రైతులకు సలహానిచ్చునదేమనగా, పశువులకు మేక రక్తముతోనే టీకాలు వేయించుకొనవలయును.

---

## 29. సీరం ఇన్స్టిట్యూటు, మద్రాసు.

ఈ చెన్నరాజధానియందలి పల్లెటూళ్లలోను పట్టణములయందును సివిల్ వెటెరినరి డిపార్టుమెంటువారు పశువులకు సంభవించు ముసర (పెద్దచీడ. పారుడు రోగము, సరకు) గొంతుమాద (గుడిపెట్టు) జబ్బవాపు, దొమ్మ మొదలగు ప్రాణాపాయమైన అంటు వ్యాధులను టీకాలువేసి ఆపుచున్నారని యెల్లరకును తెలిసిన విషయమే అయినను మద్రాసులో సీరం యిన్స్టిట్యూటును నూతనముగ స్థాపించుటవలన యీ విషయములో చాల వుపయోగకరమనుసంగతి అనేకులకు యింకను తెలియదుగాబట్టి యందుమూలమున ఆ విషయమును యెల్లరకును విశదపరచుచున్నాము.

2. ముసర (పెద్దచీడ, పారుడురోగము లేక సరకు) అను అంటువ్యాధి చాల కాలమునుండి మన రాజధానిలో ప్రబలుచున్నది. ప్రతి సంవత్సరము వేలకొలది పశువులు యీ జాడ్యమువల్ల చనిపోవుచున్నవి. ఈ జాడ్యము తలిగిన తరువాత ఔషధ

చికిత్సవలన ప్రయోజనములేదు. కాబట్టి యీ జాడ్యము తగులకుండ ముందుగా టీకాలు వేయించి పశువులను రక్షించుకొనుట యుక్తము. ఈ జాడ్యముగల ప్రదేశములలో పశువులకు టీకాలువేయుటకు కావలసిన రసిక (Serum) ను ముక్తేశ్వరములో స్థాపింపబడిన ఇంపీరియల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ వెటెరినరి రిసెర్చి (The Imperial Institute of Veterinary Research) నుండి పూర్వము తెప్పించుచుండెడివారు. కాని మనకు కావలసినంత రసిక (Serum) అంత దూరప్రదేశమునుండి తెప్పించుటవలన చాల ద్రవ్యము వ్యయమగుచుండెను. అట్లు అమితద్రవ్యమును వ్యయపరచుచుండినప్పటికిని మనకు కావలసినంత రసిక (Serum) సకాలమున దొరకుచుండెడిది కాదు. అందుచేత పశువులను రక్షించుట దుర్లభముగానుండెను. ఈ కష్టములను తొలగించు నిమిత్తమును మనకు కావలసినంత రసిక (Serum) ను మన రాజధానిలోనే చౌకగాను తయారు చేయుటకొరకు తీర్మానింపబడెను. మద్రాసు ప్రభుత్వమువారు ఆ తీర్మానమునకు ఒప్పుకొని 1932 వ సం॥ ఏప్రిల్ 7 వ తారీఖున సీరం ఇన్స్టిట్యూటును స్థాపించిరి.

3. 1935 వ సం॥ మార్చితో అంత్యమగు మూడు సంవత్సరములలో మన రాజధానియందు కావలసిన ముసర జాడ్యరక్షణ రసికయును (Anti-rinderpest Serum) ముసరజాడ్య బీజముగల రక్తము (Rinderpest Virus) నున్ను తయారు చేసి నిరాటంకముగా డాక్టర్లకు సప్లయిచేయుటవలన 325,000 పశువులకు ద్వంద్వ టీకాలు (Serum simultaneous method of inoculation) వేసి ముసర జాడ్యము నుండి రక్షింపబడినవి. ఈ కారణముచేత మన రాజధానిలో ముసర జాడ్యము క్షీణదశకు వచ్చియున్నది. పూర్వమువలె యీ జాడ్యమువల్ల పెక్కు పశువులు చనిపోవుటయునులేదు. ఈ రసిక (Serum) ను యిచ్చటనే తయారుచేయుటవలన సర్కారువారికి కొన్ని లక్షల రూపాయిలుకూడ లాభమయియున్నదని యీ సందర్భమున చెప్పవలసియున్నది.

4. ముసర జాడ్యమునుండి పశువులను రక్షించుటకు యీ వ్యాధి బీజముగల మేక రక్తము (Goat virus) కూడ యీ యిన్స్టిట్యూటులో తయారుచేయబడుచున్నది. దీనివల్ల 32,000 కు పైగా పశువులు రక్షింపబడినవి.

5. మద్రాసు, పెరంబూరు బారక్సుకు చేరిన ఫారెను రోడ్డులోనున్న సర్కారువారి కట్టడములలో యీ యిన్స్టిట్యూటు నెలకొల్పబడియున్నది. దీనికి తగు మాదిరిగా అమర్చబడిన పరిశోధనాలయమును (Laboratory) శీతలాగారమును (Cold storage) పెంకుటి పశువుల శాలలును, కచ్చేరియును కలవు.

6. ముసర జాడ్యముగాక యితర ప్రాణాపాయమగు పశు వ్యాధులకు కావలసిన రసికలు (Sera) ను వాక్సినులను (Vaccines) ప్రస్తుతము యితర ప్రదేశములనుండి తెప్పించి యిచ్చుట భద్రపరుచబడుచున్నది. జిల్లాలలోని వెటెరినరి డాక్టర్లు వాటిని కోరినపుడెల్ల వారికి సప్లయి చేయబడుచున్నవి. త్వరలోనె మనకు కావలసిన యితర రసికలను (Sera) వాక్సినులను (Vaccines) ఈ యిన్స్టిట్యూటులోనే తయారుచేయ గలుగుదుమని నమ్ముచున్నాము.

కె. కైలాసమయ్యర్,
సూపరింటెండెంటు, సీరం ఇన్స్టిట్యూటు,
మద్రాసు.

## 30. వెటరినరి ఆసుపత్రులు, డిస్పెన్సరీలు చికిత్స ఖర్చు వగైరా విషయములు.

### ఆసుపత్రులు.

| వరుస నెంబరు. | జిల్లా. | స్థలము. | చికిత్స ఖర్చు. | పోషించువారు. |
|---|---|---|---|---|
| 1 | గంజాము ... | బరంపురము. | రుసుము వసూలు చేయబడును. | గవర్నమెంటు. |
| 2 | విశాఖపట్టణము... | విశాఖపట్టణము | డిటో. | డిటో. |
| 3 | డిటో ... | బొబ్బిలి ... | ఉచితము ... | డిటో. |
| 4 | డిటో ... | విజయనగరము. | డిటో ... | విజయనగర సంస్థానము. |
| 5 | తూర్పు గోదావరి. | అమలాపురము. | డిటో ... | గవర్నమెంటు. |
| 6 | డిటో. | కాకినాడ ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| 7 | డిటో. | రాజమండ్రి... | డిటో. | డిటో. |
| 8 | డిటో. | పిఠాపురము. | ఉచితము ... | పిఠాపురం మహారాజావారు. |
| 9 | పడమర గోదావరి. | ఏలూరు ... | రుసుము వసూలు చేయబడును. | గవర్నమెంటు. |
| 10 | కృష్ణా ... | ... | ... | ... |
| 11 | గుంటూరు ... | గుంటూరు ... | రుసుము వసూలు చేయబడును. | గవర్నమెంటు. |
| 12 | డిటో ... | ఒంగోలు ... | ఉచితము ... | డిటో. |
| 13 | నెల్లూరు ... | నెల్లూరు ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| 14 | కడప ... | కడప ... | ఉచితము ... | డిటో. |
| 15 | బళ్లారి ... | బళ్లారి ... | డిటో ... | గవర్నమెంటు. |
| 16 | డిటో ... | ఆదోని ... | డిటో ... | డిటో. |
| 17 | కర్నూలు ... | కర్నూలు ... | డిటో ... | డిటో. |
| 18 | డిటో ... | నందియాల... | డిటో ... | డిటో. |
| 19 | చిత్తూరు ... | చిత్తూరు ... | డిటో ... | డిటో. |
| 20 | డిటో ... | మదనపల్లి ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| 21 | అనంతపురం ... | హిందుపురము. | ఉచితము ... | డిటో. |
| 22 | ఉత్తర ఆర్కాడు. | వెల్లూరు ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| 23 | డిటో ... | తిరువన్నామలె. | ఉచితము ... | డిటో. |
| 24 | సేలం ... | సేలం ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |

| వరుస నెంబరు. | జిల్లా. | స్థలము. | చికిత్స ఖర్చు. | పోషించువారు. |
|---|---|---|---|---|
| 25 | చెంగల్‌పట్టు ... | సైదాపేట ... | రుసుము వసూలు చేయబడును. | గవర్నమెంటు. |
| 26 | దక్షిణ ఆర్కాడు. | కడలూరు ... | డిటో. | డిటో. |
| 27 | తంజావూరు ... | తంజావూరు. | డిటో. | డిటో. |
| 28 | డిటో ... | కుంభకోణం. | డిటో. | డిటో. |
| 29 | డిటో ... | నాగపట్టణము. | డిటో. | డిటో. |
| 30 | తిరుచునాపల్లి ... | తిరుచునాపల్లి. | డిటో. | డిటో. |
| 31 | మధుర ... | మధుర ... | డిటో. | డిటో. |
| 32 | రామనాడు ... | రాజపాలయము. | డిటో. | డిటో. |
| 33 | తిరునల్వేలి ... | తిరునల్వేలి ... | డిటో. | డిటో. |
| 34 | కోయంబత్తూరు. | కోయంబత్తూరు | డిటో. | డిటో. |
| 35 | డిటో. | ఈరోడ్డు ... | డిటో. | డిటో. |
| 36 | డిటో. | తిరుపూరు ... | రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| | | | 1934 వ సం॥ జూన్ 1 వ తేది లగాయితు. | |
| 37 | నీలగిరి ... | ఉదకమండలం. | డిటో. | గవర్నమెంటు. |
| 38 | డిటో ... | కూనూరు ... | డిటో. | డిటో. |
| 39 | మలబారు ... | కాలికట్ ... | డిటో. | డిటో. |
| 40 | డిటో ... | పాల్‌ఘాట్ ... | డిటో. | డిటో. |
| 41 | దక్షిణ కన్నడము. | మంగళూరు ... | ఉచితము ... | డిటో. |

## వెటరినరి డిస్పెన్సరీలు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | గంజాము ... | చికాకోలు ... | ఉచితము ... | గవర్నమెంటు. |
| 2 | డిటో ... | రస్సెల్‌కొండ. | డిటో ... | డిటో. |
| 3 | డిటో ... | టెక్కలి ... | డిటో ... | డిటో. |
| 4 | విశాఖపట్టణము. | పార్వతీపురము. | డిటో ... | డిటో. |
| 5 | డిటో. | అనకాపల్లి... | డిటో ... | డిటో. |
| 6 | డిటో. | జయపురము. | డిటో ... | డిటో. |
| 7 | తూర్పు గోదావరి. | పోలవరము ... | డిటో ... | డిటో. |
| 8 | డిటో. | కొత్తపేట ... | డిటో ... | డిటో. |
| 9 | డిటో. | ద్రాక్షారామము. | డిటో ... | డిటో. |
| 10 | డిటో. | భద్రాచలం... | డిటో ... | డిటో. |
| 11 | డిటో. | పెద్దాపురము. | డిటో ... | డిటో. |
| 12 | డిటో. | రాజోలు ... | డిటో ... | డిటో. |
| 13 | పడమర గోదావరి. | పాలకోలు ... | డిటో ... | డిటో. |
| 14 | డిటో. | తణుకు ... | డిటో ... | డిటో. |

| వరుస నెంబరు. | జిల్లా. | | స్థలము. | చికిత్స ఖర్చు. | | పోషించువారు. |
|---|---|---|---|---|---|---|
| 15 | కృష్ణా | ... | మచిలీపట్నం. | ఉచితము | ... | గవర్నమెంటు. |
| 16 | డిటో | ... | బెజవాడ ... | రుసుము వసూలు చేయబడును. | | డిటో. |
| 17 | డిటో | ... | గుడివాడ ... | ఉచితము | ... | డిటో. |
| 18 | డిటో | ... | నూజివీడు ... | డిటో | ... | డిటో. |
| 19 | డిటో | ... | జగ్గయ్యపేట. | డిటో | ... | డిటో. |
| 20 | డిటో | ... | కైకలూరు ... | డిటో | ... | డిటో. |
| 21 | డిటో | ... | వుయ్యూరు ... | డిటో | ... | డిటో. |
| 22 | గుంటూరు | ... | గురజాల ... | డిటో | ... | డిటో. |
| 23 | డిటో | ... | నరసారావుపేట. | డిటో | ... | డిటో. |
| 24 | డిటో | ... | తెనాలి ... | డిటో | ... | డిటో. |
| 25 | నెల్లూరు | ... | కావలి ... | డిటో | ... | డిటో. |
| 26 | డిటో | ... | వెంకటగిరి ... | డిటో | ... | డిటో. |
| 27 | కడప | ... | కడప ... | డిటో | ... | డిటో. |
| 28 | డిటో | ... | బద్వేలు ... | డిటో | ... | డిటో. |
| 29 | డిటో | ... | ప్రొద్దుటూరు. | డిటో | ... | డిటో. |
| 30 | డిటో | ... | రాజంపేట ... | డిటో | ... | డిటో. |
| 31 | బళ్లారి | ... | హాస్పేట ... | డిటో | ... | డిటో. |
| 32 | డిటో | ... | హర్పనహళ్లి. | డిటో | ... | డిటో. |
| 33 | కర్నూలు | ... | కొయిల్‌గుంట్ల. | డిటో | ... | డిటో. |
| 34 | డిటో | ... | నందికాటకర్. | డిటో | ... | డిటో. |
| 35 | చిత్తూరు | ... | ... | ... | | ... |
| 36 | అనంతపురం | ... | అనంతపురం. | ఉచితము | ... | గవర్నమెంటు. |
| 37 | డిటో | ... | తాడిపత్రి ... | డిటో | ... | డిటో. |
| 38 | ఉత్తర ఆర్కాటు. | | రాణిపేట ... | డిటో | ... | డిటో. |
| 39 | సేలం | ... | నామకలు ... | డిటో | ... | డిటో. |
| 40 | డిటో | ... | తిరుచనగోడు. | డిటో | ... | డిటో. |
| 41 | డిటో | ... | కృష్ణగిరి ... | డిటో | ... | డిటో. |
| 42 | చెంగల్‌పట్టు | .. | చెంగల్‌పట్టు. | డిటో | ... | డిటో. |
| 43 | డిటో | ... | తిరువళ్లూరు ... | డిటో | ... | డిటో. |
| 44 | డిటో | ... | కంజీవరము ... | డిటో | ... | డిటో. |
| 45 | డిటో | ... | పరవళ్లూరు ... | డిటో | ... | డిటో. |
| 46 | దక్షిణ ఆర్కాటు. | | కర్లకుచ్చి ... | డిటో | ... | డిటో. |
| 47 | డిటో. | | చిదంబరము ... | డిటో | ... | డిటో. |
| 48 | డిటో. | | తిండీవనము ... | డిటో | ... | డిటో. |
| 49 | తంజావూరు | ... | తిరువళ్లూరు ... | డిటో | ... | డిటో. |
| 50 | డిటో | ... | మాయవరము. | డిటో | ... | డిటో. |
| 51 | డిటో | ... | ననిలం ... | డిటో | ... | డిటో. |

| వరుస నెంబరు. | జిల్లా. | స్థలము. | చికిత్స ఖర్చు. | పోషించువారు. |
|---|---|---|---|---|
| 52 | తంజావూరు. | మన్నారుగుడి ... | ఉచితము ... | గవర్నమెంటు. |
| 53 | తిరుచునాపల్లి. | అరియలూరు ... | డిటో ... | డిటో. |
| 54 | డిటో. | కరూరు ... | డిటో ... | డిటో. |
| 55 | డిటో. | లాల్‌గుడి ... | డిటో ... | డిటో. |
| 56 | మధుర ... | మధుర పట్టణము. | డిటో ... | డిటో. |
| 57 | డిటో ... | దిండిగలు ... | డిటో ... | డిటో. |
| 58 | డిటో ... | కొడైకెనాలు ... | డిటో ... | డిటో. |
| 59 | డిటో ... | పెరియాకుళం ... | డిటో ... | డిటో. |
| 60 | రామనాడు ... | రామనాడు ... | డిటో ... | డిటో. |
| 61 | డిటో ... | దేవికోట్టయి ... | డిటో ... | డిటో. |
| 62 | డిటో ... | విరుదునగరు .. | డిటో ... | డిటో. |
| 63 | డిటో ... | శ్రీవల్లిపుత్తూరు ... | డిటో ... | డిటో. |
| 64 | తిరునల్వేలి ... | తుత్తుకొడి ... | 1934 వ సం॥ జూన్ 1 వ తేది లగాయితు రుసుము వసూలు చేయబడును. | డిటో. |
| 65 | కోయంబత్తూరు. | ధర్మపురం ... | ఉచితము ... | గవర్నమెంటు. |
| 66 | డిటో. | గోబిచెట్టిపాలయం. | డిటో ... | డిటో. |
| 67 | డిటో. | పొల్లాచి ... | డిటో ... | డిటో. |
| 68 | డిటో. | సత్తకడియూరు ... | డిటో ... | డిటో. |
| 69 | డిటో. | కొల్లెగాల్ ... | డిటో ... | డిటో. |
| 70 | మలబారు ... | కన్ననూరు ... | డిటో ... | డిటో. |
| 71 | డిటో ... | తలచ్చేరి ... | డిటో ... | డిటో. |
| 72 | దక్షిణ కన్నడ. | పుత్తూరు ... | డిటో ... | డిటో. |

## 20. వెటరినరి టూరింగు అసిస్టెంటు సర్జనులు వారి ప్రధాన కార్యస్థానములు వారి పర్యటన ప్రదేశములు.

### విశాఖపట్నం జిల్లా వెటరినరి ఆఫీసరుగారి క్రింద.

| వరుస నెంబరు. | హెూదా మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|
| | **గంజాం జిల్లా.** | |
| 1 | టూ.వె.అ.స. బరంపురము ... | బరంపురం, ఇచ్ఛాపురం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. టెక్కలి ... | టెక్కలి, పర్లాకిమిడి తాలూకాలు, నరసన్నపేట రెవిన్యూ డివిజన్. |
| 3 | టూ.వె.అ.స. అస్క | అస్క, సురడ, గుంసూరు తాలూకాలు. |

టూ.వె.అ.స. = టూరింగు వెటరనరీ అసిస్టెంటు సర్జను.

| వరుస నెంబరు. | హెూదా మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|

## గంజాం జిల్లా — శేషము.

| | | |
|---|---|---|
| 4 | టూ.వె.అ.స. రసులకొండ (ఏజెన్సి) డివిజన్. | గుంసూరు, ఉదయగిరి, రామగిరి, ఉదయగిరి, బల్లిగుడ తాలూకాలు. |
| 5 | టూ.వె.అ.స. ఛత్రపురం ... | ఛత్రపురం, కుదల తాలూకాలు. |
| 6 | టూ.వె.అ.స. వెటరినరి డిస్పెన్సరి, శ్రీకాకుళం. | శ్రీకాకుళం రెవిన్యూ ఫిర్కా. |

## విశాఖపట్టణం జిల్లా.

| | | |
|---|---|---|
| 7 | టూ.వె.అ.స. నరసపట్నం. | గొలుగొండ, వీరవల్లి, సర్వశిద్ధి గూడెం తాలూకాలు. |
| 8 | టూ.వె.అ.స. విశాఖపట్టణం. | విశాఖపట్టణం, అనకాపల్లి తాలూకాలు. |
| 9 | టూ.వె.అ.స. విజయనగరం. | విజయనగరం, శృంగవరపుకోట తాలూకాలు. |
| 10 | టూ.వె.అ.స. బొబ్బిలి ... | బొబ్బిలి, సాలూరు, పార్వతీపురం తాలూకాలు, నాటు తాలూకాలు మాత్రము. |
| 11 | టూ.వె.అ.స. గుణుపూరు. | గుణుపూరు, రాయగడ, బిసంకటుకం మరియు సాలూరు, పార్వతీపురం, బొబ్బిలి, ఏజెన్సి భాగాలు. |
| 12 | టూ.వె.అ.స. పాలకొండ ... | పాలకొండ, చీపురుపల్లి. |
| 13 | టూ.వె.అ.స. కోరాపుట్టి ... | కోరాపుట్టి, పొట్టంగి, పాడ్వా, మలకనగిరి, నౌరంగపురం, జయపురం తాలూకాలు. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, రాజమహేంద్రవరం, క్రింద.

## తూర్పు గోదావరి జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. రాజమండ్రి. | రాజమండ్రి, రామచంద్రాపురం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. కాకినాడ ... | కాకినాడ, పిఠాపురం తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. పెద్దాపురం.. | పెద్దాపురం, తుని తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. అమలాపురం. | అమలాపురం, రాజోలు తాలూకాలు. |
| 5 | టూ.వె.అ.స. పోలవరం ... | పోలవరం, చోడవరం, ఎల్లవరం సబ్ తాలూకాలు. |
| 6 | టూ.వె.అ.స. భద్రాచలం ... | భద్రాచలం, నూగూరు తాలూకాలు. |

## పశ్చిమ గోదావరి జిల్లా.

| | | |
|---|---|---|
| 7 | టూ.వె.అ.స. భీమవరం ... | భీమవరం, నరసాపురం, తణుకు తాలూకాలు. |
| 8 | టూ.వె.అ.స. ఏలూరు ... | ఏలూరు, చింతలపూడి, తాడేపల్లిగూడెం, కొవ్వూరు తాలూకాలు. |
| 9 | టూ.వె.అ.స. చింతలపూడి— | కామవరపుకోట తాలూకా. |

| వరుస నెంబరు. | హెూదా మరియు ప్రథాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|

## జిల్లా వెటరినరి ఆఫీసరు, బెజవాడ, క్రింద.

### కృష్ణా జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ. వె. అ. స. మచిలీపట్టణం. | బందరు, దివి తాలూకాలు. |
| 2 | టూ. వె. అ. స. బెజవాడ ... | బెజవాడ, గుడివాడ తాలూకాలు. |
| 3 | టూ. వె. అ. స. నూజువీడు ... | నూజివీడు డివిజన్, గన్నవరం. |
| 4 | టూ. వె. అ. స. జగ్గయ్యపేట. | నందిగామ తాలూకా. |
| 5 | టూ. వె. అ. స. తిరువూరు ... | తిరువూరు డివిజన్. |
| 6 | వె. అ. స. వె. డిస్పెన్సరి, కైకలూరు. | కైకలూరు తాలూకా. |

### గుంటూరు జిల్లా.

| | | |
|---|---|---|
| 7 | టూ. వె. అ. స. గుంటూరు ... | గుంటూరు, సత్తెనపల్లి తాలూకాలు. |
| 8 | టూ. వె. అ. స. బాపట్ల .. | పొన్నూరు సబ్ తాలూకాతప్ప బాపట్ల, వొంగోలు తాలూకాలు. |
| 9 | టూ. వె. అ. స. వినుకొండ ... | వినుకొండ, నరసారావుపేట, పల్నాడు తాలూకాలు. |
| 10 | టూ. వె. అ. స. నిడుబ్రోలు— | తెనాలి, రేపల్లె తాలూకాలు, పొన్నూరు డివిజన్. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, బళ్లారి, క్రింద.

### బళ్లారి జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ. వె. అ. స. బళ్లారి ... | బళ్లారి, రాయదుర్గం, శిరుగుప్ప తాలూకాలు. |
| 2 | టూ. వె. అ. స. ఆదోని ... | ఆదోని, ఆలూరు తాలూకాలు, యమ్మిగనూరు సబ్ తాలూకా. |
| 3 | టూ. వె. అ. స. హెూసపేట... | హెూసపేట, కూడ్లిగి తాలూకాలు. |
| 4 | టూ. వె. అ. స. హడగల్లి ... | హడగల్లి, హర్పనహళ్లి తాలూకాలు. |

### కర్నూలు జిల్లా.

| | | |
|---|---|---|
| 5 | టూ. వె. అ. స. కర్నూలు ... | కర్నూలు, నందికోటకూరు తాలూకాలు. |
| 6 | టూ. వె. అ. స. నంద్యాల ... | నంద్యాల, కోవెలకుంట్ల, శిరువెళ్ల తాలూకాలు. |
| 7 | టూ. వె. అ. స. డోను ... | డోను, పత్తికొండ తాలూకాలు. |
| 8 | టూ. వె. అ. స. మార్కాపురం. | మార్కాపురం తాలూకా. |
| 9 | టూ. వె. అ. స. గిద్దలూరు ... | కంబం తాలూకా. |
| 10 | టూ. వె. అ. స. ఆళ్లగడ్డ ... | కోయిల్‌కుంట్ల, సిరివేలు తాలూకాలు. |

| వరుస నెంబరు. | హోదా మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|

### జిల్లా వెటరినరి ఆఫీసరు, నెల్లూరు, క్రింద.

#### నెల్లూరు జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ. వె. అ. స. నెల్లూరు ... | నెల్లూరు, రాపూరు తాలూకాలు. |
| 2 | టూ. వె. అ. స. గూడూరు ... | గూడూరు, వెంకటగిరి, సూళూరుపేట తాలూకాలు. |
| 3 | టూ. వె. అ. స. బుచ్చిరెడ్డిపాళ్యం. | కోవూరు, ఆత్మకూరు తాలూకాలు. |
| 4 | టూ. వె. అ. స. కందుకూరు ... | కందుకూరు తాలూకా. |
| 5 | టూ. వె. అ. స. కనిగిరి ... | కనిగిరి తాలూకా. |
| 6 | టూ. వె. అ. స. ఉదయగిరి ... | ఉదయగిరి తాలూకా. |
| 7 | టూ. వె. అ. స. పొదిలి ... | పొదిలి, దర్శి తాలూకాలు. |
| 8 | వె. అ. స. వె. డిస్పెన్సరి, కావలి. | కావలి తాలూకా. |

#### కడప జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | వె. అ. స. వె. డిస్పెన్సరి, బద్వేలి | బద్వేలి తాలూకా. |
| 2 | వె. అ. స. వె. డిస్పెన్సరి, ప్రొద్దుటూరు. | ప్రొద్దుటూరు తాలూకా. |
| 3 | వె. అ. స. వె. డిస్పెన్సరి, రాజంపేట | రాజంపేట తాలూకా. |
| 4 | టూ. వె. అ. స. కడప ... | కడప, సిద్ధవటం తాలూకాలు. |
| 5 | టూ. వె. అ. స. రాయచోటి. | రాయచోటి, పులివెందల తాలూకాలు. |
| 6 | టూ. వె. అ. స. జమ్మలమడుగు. | జమ్మలమడుగు కమలాపురం తాలూకాలు. |

### జిల్లా వెటరినరి ఆఫీసరు, మదనపల్లి, క్రింద.

#### చిత్తూరు జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ. వె. అ. స. మదనపల్లి ... | మదనపల్లి, వాయల్పాడు తాలూకాలు, పుంగనూరు సబ్ తాలూకా. |
| 2 | టూ. వె. అ. స. చిత్తూరు ... | చిత్తూరు తాలూకా. |
| 3 | టూ. వె. అ. స. తిరుపతి ... | చంద్రగిరి, కాళహస్తి, తాలూకాలు. |
| 4 | టూ. వె. అ. స. పలమనేరి ... | పలమనేరి, వెంకటగిరికోట తాలూకాలు. |
| 5 | టూ. వె. అ. స తిరుత్తని ... | పుత్తూరు, తిరుత్తణి తాలూకాలు. |

#### అనంతపురం జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ. వె. అ. స. అనంతపురం. | అనంతపురం, కల్యాణదుర్గం తాలూకాలు |
| | టూ. వె. అ. స. గుత్తి ... | గుత్తి, తాడిపత్రి తాలూకాలు. |

| వరుస నెంబరు. | హెడ్ క్వార్టర్సు మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|
| | **అనంతపురం జిల్లా—శేషము.** | |
| 3 | టూ.వె.అ.స. ధర్మవరం ... | ధర్మవరం, కదిరి తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. పెనుకొండ ... | పెనుకొండ, హిందూపురం, మడకశిరా తాలూకాలు. |

**జిల్లా వెటరినరి ఆఫీసరు, మదరాసు (చెన్నపట్టణము), క్రింద.**

**చెంగల్ పట్టు జిల్లా.**

| | | |
|---|---|---|
| 1 | రెండవ వె.అ.స. సైదాపేట. | సైదాపేట తాలూకా (విల్లివాకం, మాదవరం ఫిర్కాలు తప్ప). |
| 2 | టూ.వె.అ.స. పొన్నేరి ... | పొన్నేరి, తిరువల్లూరు తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. చెంగలపట్టణం. | చెంగలపట్టణం, మదురాంతకం తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. శ్రీపెరుంబుదూరు. | కంజీవరం, శ్రీపెరుంబుదూరు తాలూకాలు. |
| 5 | వెటరినరి అ. సర్జను, వెటరినరి డిస్పెన్సరి, పరవల్లూరు. | మాదవరం, విల్లివాకం ఫిర్కాలు (సైదాపేట తాలూకా). |

**దక్షిణ ఆర్కాటు జిల్లా.**

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. తిండివనం ... | విల్లిపురం, తిండివనం, గింజి తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. కడలూరు ... | కడలూరు, చితంబరం (చితంబరంనకు 6 మైళ్ల దూరములోనున్న గ్రామములు తప్ప), వృద్ధాచెలం తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. తిరుకోయిలూరు. | తిరుకోయిలూరు, కాల్లకురిచి తాలూకాలు. |
| 4 | వె.అ.స. వెటరినరి డిస్పెన్సరి, చితంబరం. | చితంబరం తాలూకా 6 మైళ్ల దూరములోనున్న పల్లెటూర్లు. |

**జిల్లా వెటరినరి ఆఫీసరు, వెల్లూరు, క్రింద.**

**ఉత్తర ఆర్కాటు జిల్లా.**

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. వెల్లూరు ... | వెల్లూరు, వాలాజా, ఆర్కోణం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. తిరువన్నామలె. | తిరువన్నామలె, చెంగం, పోలూరు తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. చెయ్యారు. | చెయ్యారు, వందివాషు, ఆర్ని తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. తిరుపత్తూరు. | తిరుపత్తూరు, గుడియాతం తాలూకాలు. |

| వరుస నెంబరు. | హెడ్డు మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|

## సేలం జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. శేలం ... | శేలం, ఓమలూరు, అత్తూరు, యార్కాడు, మెటూరు తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. నామకల్ ... | నామకల్, తిరుచెంగోడు తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. ధర్మపురి ... | ధర్మపురి, హరూరు, కృష్ణగిరి తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. హెసూరు పశువుల ఫారం (ప్రధాన కార్య స్థలం, హెసూరు పశువుల ఫారం పోస్టు ఆఫీసు). | హెసూరు తాలూకా, డెంకానికోట డివిజను. |
| 5 | టూ.వె.అ.స. తిరుచెంగోడు. | తిరుచెంగోడు, ఓమలూరు తాలూకాలు. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, కోయంబత్తూరు, క్రింద.

## కోయంబత్తూరు జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. కోయంబత్తూరు. | అవనాశి, కోయంబత్తూరు తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. గోపిశెట్టిపాలెం. | భవాని, గోపిశెట్టిపాలెం తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. పల్లడం .. | పల్లడం, యీరోడు తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. పొల్లాచి ... | పొల్లాచి తాలూకా. |
| 5 | టూ.వె.అ.స. కొల్లిగల్ .. | కొల్లిగల్ తాలూకా. |
| 6 | టూ.వె.అ.స. ఉడమల్‌పేట. | ఉడమలపేట, ధర్మవరం తాలూకాలు. |

## నీలగిరి జిల్లా.

| | | |
|---|---|---|
| 7 | టూ.వె.అ.స. ఉదకమండలం. | ఉదకమండలం, కూనూరు తాలూకాలు. |
| 8 | టూ.వె.అ.స. గూడలూరు .. | గూడలూరు తాలూకా. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, కల్లికోట, క్రింద.

## మలబారు జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. కల్లికోట ... | కల్లికోట, కురుంబనాడు తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. పాలఘాటు ... | పాలఘాటు తాలూకా, బ్రిటిషువారి ప్రభుత్వములోచేరిన కొచ్చిను. |
| 3 | టూ.వె.అ.స. తలచ్చేరి ... | చిరక్కల్, కొట్టయాం తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. మానంటాడి. | వైనాడు తాలూకా. |
| 5 | టూ.వె.అ.స. పేరింటాలమన్న. | వల్లువనాడు తాలూకా. |
| 6 | టూ.వె.అ.స. మంజెరి ... | ఎర్నాడు, పొన్నాని తాలూకాలు. |

| వరుస నెంబరు. | హెడ్డా మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|

## దక్షిణ కన్నడా జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. ఉడిపి ... | ఉడిపి, కుందాపురం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. కాసరగోడు. | మకాసరగోడు తాలూకా. |
| 3 | టూ.వె.అ.స. మంగుళూరు. | పుంగుళూరు, కార్కల్ తాలూకాలు. |
| 4 | టూ. వె. అ.స. పుత్తూరు. | పుత్తూరు తాలూకా. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, తిరుచునాపల్లి, క్రింద.

### తిరుచునాపల్లి జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. ముసిరి ... | తిరుచునాపల్లి, ముసిరి, లాల్గుడి తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. అరియలూరు. | ఉదయార్‌పాల్యం, పెరంబలూరు తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. కులిత్తలై ... | కులిత్తలై, కరూరు తాలూకాలు. |

### తంజావూరు జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. తంజావూరు. | తంజావూరు, పాపనాశం, కుంబకోణం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. మాయవరం. | మాయవరం, నన్నిలాం, షియాలి తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. తిరువారూరు. | నాగపట్టణం, మన్నారుగుడి తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. పట్టుకోట్టై ... | తిరుత్తురయిపుండి, పట్టుకోట్టై, అరంతాంగి తాలూకాలు. |

## జిల్లా వెటరినరి ఆఫీసరు, మధుర, క్రింద.

### మధుర జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. మధుర ... | మధుర, మేలూరు, తిరుమంగళం తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. పెరియాకులం. | నీలకోట్టై, కొడైకెనాలు, పెరియాకులం తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. పళ్ని ... | దిండిగల్లు, పళ్ని తాలూకాలు. |

### రామనాడ్ జిల్లా.

| | | |
|---|---|---|
| 1 | టూ.వె.అ.స. శివగంగ ... | శివగంగ, అరుప్పుకోట్టై తాలూకాలు. |
| 2 | టూ.వె.అ.స. పరమగుడి ... | రామనాడ్, పరమగుడి, ముదుకలుత్తూరు తాలూకాలు. |
| 3 | టూ.వె.అ.స. శ్రీవిల్లిపుత్తూరు. | శ్రీవిల్లిపుత్తూరు, సత్తూరు తాలూకాలు. |
| 4 | టూ.వె.అ.స. తిరుపత్తూరు. | తిరుపత్తూరు, తిరువదనై తాలూకాలు. |

| వరుస నెంబరు. | హెడ్డుడా మరియు ప్రధాన కార్య స్థలములు. | పర్యటన ప్రదేశములు. |
|---|---|---|
| | **తిరునల్వేలి జిల్లా.** | |
| 1 | టూ. వె. అ. స. కోవిలిపట్టి ... | కోవిలిపట్టి, శంకరకోయిల తాలూకాలు. |
| 2 | టూ. వె. అ. స. తిరునల్వేలి ... | తిరునల్వేలి, శ్రీవైకుంఠం తాలూకాలు. |
| 3 | టూ. వె. అ. స. నంగునేరి ... | నంగునేరి, తిరిచందూరు తాలూకాలు. |
| 4 | టూ. వె. అ. స. తెన్ కాశి ... | తెన్కాశి, అంబాసముద్రం, అంజంగో, శంగ శేరి తాలూకాలు. |

---

## 32. మద్రాసు పశువైద్య కళాశాల.

### వివరములు.

1. సాధారణ సమాచారము.—ఈ కళాశాలలో, పశువైద్య విద్యకు సంబంధించిన అంశములలో, శాస్త్రీయమైనట్టియు, అనుభవనీయమైనట్టియు విద్యగరిపెదరు. ప్రస్తుతము, ఒక ప్రధానోపాధ్యాయుడు, విదుగురుపాధ్యాయులు, వారికి సహాయకారులు యింకా కొంతమంది క్రింది ఉద్యోగులు, పాఠశాల నడుపుటకు నియమింపబడిరి. పాఠశాల సక్రమముగా నడుపు బాధ్యత, ప్రధానోపాధ్యాయునిమీద నుంపబడినది. వారు మద్రాసు పశువైద్యశాఖాధికారి క్రింద పనిచేసెదరు. పశువైద్య విద్యయందు పట్టా పొందుటకు చదువు విద్యార్థులకు విద్యగరుపుటకు కావలసిన పశురోగ చికిత్సశాలయును తదితర అవకాశములన్నియును ఏర్పాటుచేయబడియున్నవి. ఒక పశువుల ఆసుపత్రి, పరిశోధనశాల, వస్తు ప్రదర్శనశాల, పుస్తకభాండాగారము, లాడములు తయారుచేయు కమ్మరము, విద్యార్థివసతిగృహము యీ కళాశాలకు అనుబంధింపబడినవి.

2. ప్రవేశము.—ఈ కళాశాలలో విద్యార్థులను చేర్చుకొనుటకు కుల, జాతిభేదములు పాటింపబడవు. ఇచ్చట చదువ నెంచువారి వయస్సు కళాశాలలో చేరేటప్పటికి 18 ఏండ్లకు తక్కువగా నుండగూడదు. సర్వసాధారణముగా 22 ఏండ్లకు మించినవారు కళాశాలలో చేర్చుకొనబడరు. స్వదేశ సంస్థానపు నివాసులు గవర్నమెంటువారి ఉత్తరువు లేకుండా చేర్చుకొనబడరు. విద్యార్థులను కళాశాలలో చేర్చుకొనుటకు, గవర్నమెంటుచే నియమింపబడిన నలుగురు మెంబర్లు, ప్రధానోపాధ్యాయునితో సహా కూడిన ఒక కమిటీ ఏర్పాటుచేయబడినది. కళాశాలలో చేరుటకు విద్యార్థులు వారి దరఖాస్తులను, క్రింద పొందుపరచిన నమూనా ప్రకారము వ్రాసి 'క్రింద షరాలో కోరిన, సర్టిఫికెట్టులతో సహా, ప్రతి సంవత్సరము జూన్ 15 వ తారీఖు లోపల కాలేజి ప్రధానోపాధ్యాయునికి అందచేయవలెను. దరఖాస్తుదారులు దరఖాస్తు ఫారము 2 వ నంబరు నోటులో నిర్ణయింపబడిన మార్కులయినా అధమపు తెచ్చుకొన్న స్కూలు పైనలుగాని, మెట్రికులేషన్‌గాని యూరోపియన్ హైస్కూలు ఎగ్జామినేషనుగాని పరీక్ష యిచ్చియుండవలెను. అంతకంటె పెద్ద పరీక్షలలో గెలుపొందినవారికి ప్రాధాన్యమియ్యబడును.

ఒక అభ్యర్థికి కమిటీవారిని చూచుటకు అవకాశమిచ్చినప్పుడు, ఆయనను కమిటి వారు స్వయముగా ఎన్నుకొనుటకు, ఆయన ఎచ్చటికి ఏ తారీఖున ఎన్ని గంటలకు రావలసినది నియమింపబడును. కాలేజిలో చేరినతరువాత, మొదటి రెండు నెలలవరకు విద్యార్థులను పరీక్షించెదరు. ఈ నియమితకాలములో అనర్హులని తోచినవారిని కాలేజి నుంచి తొలగించెదరు.

3. విద్యయొక్క గడువు.—డిప్లొమా పొందుటకు మూడు సంవత్సరములు చదువవలసియున్నది. ఒక్కొక్క సంవత్సరపు విద్యార్థులు ఒక్కొక్క తరగతిగా నుందురు. సంవత్సరాంతమున జరుగు పరీక్ష ఫలితముల ననుసరించి, పై తరగతిలో చేర్చుకొనబడెదరు. ఒక విద్యార్థి, మొదటి రెండు తరగతులలో వరుసగా రెండుసారులుతప్పినయెడల, వాని చదువు అంతటితో సమాప్తి నొందవలసినదే.

4. చదువవలసిన అంశములు—

(i) మొదటి సంవత్సరము.—(1) అనాటమీ (Anatomy).

(2) కెమిస్ట్రి (Chemistry), ఆర్గానిక్, ఇనార్గానిక్ (Organic and inorganic).

(3) బైయాలజీ (Biology), బాటనీ, జూవాలజి (Botany, Z oology).

(4) పశువులను వశపరచుకొనుట (Handling). మొదటి సంవత్సరములో విద్యార్థులకు పశువులను సంరక్షణచేయుట, పరిశీలించుట, పడద్రోయుట, బంధించుట మొదలగునవి నేర్పెదరు. పై పనులలో నుపయోగించు వస్తువుల పేర్లుకూడా నేర్పెదరు.

వ్యవసాయ శాస్త్రిమందు పటభద్రులైనవారు విద్యార్థులుగా చేరినచో బైయాలజీ కెమిస్ట్రీల పాఠములను చదువ నవరసములేదు. ఆ విషయములలో పరీక్ష ఇయ్యనక్కరలేదు.

కెమిస్ట్రీలోగాని, బాటనీలోగాని, బి.ఎ. పట్టము పొందినవారు, ఆయా పరీక్షలకు రానవసరములేదు.

(ii) రెండవ సంవత్సరము.—

(1) హిస్టాలజి ఎంబ్రియాలజి (Histology and Embryology) (2) ఫిసియాలజీ, బైయాకెమిస్ట్రి (Physiology including Biochemistry) (3) పేతాలజి, బేక్టీరియాలజి, యిమ్యూనాలజి (Pathology, Bacteriology and Immunology) (4) పెరసిటాలజీ, ప్రోటోజూఆలజి (Pharsitology including Protozoology) (5) ఫార్మకోలజి, మేటిరియా మెడికా (Paramacology including Materia Medica) (6) సర్జికల్ అనాటమీ, లాడములుకొట్టుట (Surgical Anatomy and shoeing).

రెండవ సంవత్సరమున, విద్యార్థులు ఆసుపత్రి పని నేర్చుకొనెదరు. పశువ్యాధి రోగ చికిత్సలో పాఠములు చెప్పబడును. కమ్మరము మందులు తయారుచేయుటకూడా నేర్పబడును. రణములు కోయుట చూపబడును.

షరా.—నె 1, 2, 3, 4 ర్లు కలసి పరీక్ష చేయబడును.

(iii) మూడవ సంవత్సరము.—సర్జరీ, అబ్ట్సెట్రిక్స్, సౌండునెస్సు జూరిస్ ప్రూడెన్సు (Surgery including obstetrics, Soundness and jurisprudence).

(2) తెరాపూటిక్స్, టాక్సికాలజీ (Therapentics and Toxicology).

(3) రోగనివారకౌషధము, పాలుమాంసమునుతనిఖీచేయుట (Preventive medicine including meat and milk inspection) పరిశుభ్రతచట్టము (Sanitary law). ఆరోగ్యము, ప్రసూతి శాస్త్రము, ఆహారము (Hygiene, including genetics and nutrition.)

మూడవ సంవత్సరమున విద్యార్థులు చచ్చిన పశువులను కోయుట, తర్వాత బ్రతికి యున్న పశువులను కోయుట, శవపరీక్ష, కట్టుకట్టుట, మొదలగు ఆసుపత్రి పనుల న్నియు చేయవలసియున్నది.

విద్యార్థులందరును గుఱ్ఱపుస్వారి పరీక్ష కావలసియున్నది. ఆ తరగతినుండి, అధికారి అనుమతిలేకుండా, వెళ్లినవారికి జరిమానా వేయబడును.

5. జీతము.—చెన్నపురి రాజధానినుండి వచ్చిన విద్యార్థులవద్ద సంవత్సరము నకు రూ 90 లు చొప్పున జీతము వసూలుచేయబడును. తక్కినవారందరు సంవత్స రమునకు రూ 400 లు చొప్పున సంవత్సరారంభమునందే జీతము చెల్లించవలెను. ఏ విద్యార్థిగాని ఛదివిన క్లాసులోనే మరొక యేడు చదువవలసి వచ్చినప్పుడు పయిని జెప్పిన రేట్ల చొప్పుననే బడి జీతములు చెల్లించవలెను. ఇదిగాక ప్రతి విద్యార్థియు ఆటలకు మొదటి టరమునకు మూడు రూపాయలవంతునను, రెండవ టరమునకు రెండు రూపాయలవంతునను ప్రతి సంవత్సరము యియ్యవలెను. ప్రతి సంవత్సరము పరీక్ష రుసుము రూ 15 లు కూడా కట్టవలెను.

6. విద్యార్థి వేతనము.—ప్రతి సంవత్సరము నెలకు రూ 15 లు వంతున వుచిత వేతనములు నలుగురు విద్యార్థులకు యియ్యబడును. ఈ వుచిత వేతనములు మూడు నిమ్న జాతులవారికిని, ఒకటి మహమ్మదీయునికిని యియ్యబడును. ఒక విద్యార్థి యిత రుల సహాయముగాని స్థానిక సంఘమువారి సహాయముగాని పొందుచున్నచో విద్యార్థి వేతనమునకు అర్హుడుకాడు. విద్యార్థి మంచి నడతయు, విద్యావృద్ధియు చూపిన వెను కనే వుచితవేతనమును యివ్వబడును.

7. సంవత్సర విభాగములు, కాలనిర్ణయ పట్టిక.—ప్రతి సంవత్సరము, మూడు భాగములుగా విభజింపబడినవి. జూలై మొదలుకొని సెప్టెంబరు మీదవరకు మొదటిది, అక్టోబరు మొదలు డిసంబరు తుదవరకు రెండవది, జనవరి మొదలుకొని మార్చితుదవరకు మూడవది. కాలనిర్ణయ పట్టిక, పాఠముల వివరములు నోటీసు బోర్డుమీద అంటింప బడును.

8. సెలవులు.—గవర్నమెంటువారి సెలవు దినములుగాక విద్యార్థులు ఈ క్రింది సెలవు దినములకర్హులు :—

వేసవి కాలపు సెలవులు (మూడు సెలవులు).

మైకలుమస్ సెలవులు (ఒక వారము).

క్రిస్టమస్, యీస్టరు సెలవులు (గజకొత్తు).

విద్యార్థులు సెలవు దినములలో, వంతుల ప్రకారము అనుమతి పనిచూడవలసి యుండును. ఆ పనినుండి సెలవు ప్రధానోపాధ్యాయుడు మాత్రమే యియ్యవలెను. సెలవు ప్రిన్సిపాలుగారే యిత్తురు. ప్రిన్సిపాలుగారికి నచ్చినయెడల, విద్యార్థి వేతనము పొందువారికి ఒకసారి 5 దినములకంటె యెక్కువకాకుండునట్లును సంవత్సరమునకు 10 దినములకు మించకుండునట్లును సెలవు యియ్యబడును. ఇతర పండుగ సెలవులలో కలిపి, సాధారణ సెలవు, విద్యార్థి వేతనము పొందువారికి వారివేతనము తగ్గింపక యియ్యబడదు. జబ్బుచేసినప్పుడు తీసికొన్న ఒక నెల సెలవుతప్ప యితరమైన సెలవు తీసికొన్న, విద్యార్థి వేతనము నిలుపుచేయబడును. అనారోగ్యముగానున్నప్పుడు తీసికొన్న సెలవుకు, గవర్నమెంటువారు అంగీకరించిన డాక్టరుగారివద్దనుండి సర్టిఫికెటు అవసరము.

9. పరీక్షలు.—పరీక్షలు, ప్రతి తరగతివాళ్లకు, వ్రాతపూర్వకముగాను, వాక్కుపూర్వకముగాను ప్రతి సంవత్సరము మార్చి నెలలో జరుపబడును. పరీక్షకు వచ్చుటకు, అభ్యర్థులు, కాలేజి చట్టప్రకారము, నియమిత దినములు కాలేజిలో చదువవలెను ముప్పాతికపాళ్లు పాఠములకు పనులకు హాజరైయుండవలెను.

ప్రథమ ద్వితీయ సంవత్సరముల తరగతులలోనికి అడ్డిగా చేర్చుకోబడిన విద్యార్థుల విషయములో తప్ప, ఇతర విద్యార్థి యెవరుగాని ఏసాలు సరి పరీక్షలోనయినా తప్పిపోయినయెడల అతడు క్లాసులోనే అధమము రెండవ మూడవ టరములలో నూటికి 75 దినములు క్లాసులో హాజరుకావలెను. అట్లు చేసిననే కాని పరీక్షకు రానీయరు.

10. మూడు సంవత్సరములు కాలేజిలో చదువుకొని పరీక్షలన్నియు గెలుపొందినవారికి "పశువైద్య శాస్త్రమందు నిపుణుడను" డిప్లామా యిచ్చెదరు.

11. కాలేజికి సంబంధించిన విద్యార్థి వసతి గృహములో 120 మందికివసతి యున్నది. ఎవరు ఇతర స్థలములో వుండుటకు ప్రిన్సిపాలుగారు అంగీకరింతురో వారు తప్ప తక్కిన విద్యార్థులందరు, కాలేజి వసతి గృహములో నుండవలసినదే. వసతి గృహములో ఉన్నందుకు నెల 1 కి రూ 3 లు అద్దెయున్ను, అణాలు 8 సాధారణ సర్వీసుచందాయున్ను, నెలనెలకు 1 రూపాయో రూ 1-8-0 లు ఇలెక్ట్రిక్ కరెంటు చార్జిన్ని, 8 అణాలో 1 రూపాయో నీటిపన్నున్ను యియ్యవలెను. భోజనపు ఖర్చు రూ 15 లు రూ 20 లు, మధ్యను వుండును.

12. యోగ్యతవడసిన విద్యార్థులకుండు లాభములు.—యోగ్యత బడసినవారు, మద్రాసు వెటర్నరి డిపార్టుమెంటులో, సహాయ డాక్టర్లుగా నియమింపబడుటకు అర్హులైయుందురు. గవర్నమెంటు యెంతమాత్రము ఉద్యోగమిచ్చెదమని అభయమియ్యరు.

ఇదిగాక, పురపాలక సంఘమువారి పశువుల తనికీదార్లుగాను ఖాఖామందులు పెట్టు పశువైద్యాలయములలో డాక్టర్లుగాను నియమింపబడవచ్చును. వీరు ఉద్యోగము సంపాదించుటకు, ప్రధానోపాధ్యాయుడు తగినంత సహాయము చేయును.

మద్రాసు పశువైద్య కళాశాలలో ప్రవేశించుటకు దరఖాస్తు నమూనా.

(ప్రతి సంవత్సరము జూన్ 15 వ తారీఖులోపల ప్రధానోపాధ్యాయునికి అందచేయవలెను.)

(1) అభ్యర్థి నిండు పేరు.
(2) వానివృత్తి.
(3) పుట్టుక స్థానము (జిల్లాతో సహా).
(4) తండ్రి పేరు లేక సంరక్షకుని పేరు.
(5) ప్రస్తుత నివాసము.
(6) తండ్రి వృత్తి, లేక సంరక్షకుని వృత్తి.
(7) యిదివరకు చదివిన పాఠశాల, తరగతిన్ని.
(8) ప్యాసయిన పరీక్షలలో పెద్దది, ప్యాసయిన తారీఖు.
(9) మాట్లాడగలిగిన స్వదేశ భాషలు మాతృభాష ముందుచెప్పి తక్కినవి వాటి వాటిలో గల ప్రావీణ్యానుసారము వరుసగా వ్రాయవలెను.
(10) వయస్సు-పుట్టుక దినము.
(11) మతము హిందువా? (బ్రాహ్మణుడా బ్రాహ్మణేతరుడా) మహమ్మదీయుడా? ఇండియన్ క్రైస్తవుడా? ఆంగ్లో ఇండియనా? యూరోపియనా? తక్కువ కులము నకు చెందినవాడయినచో ఆ కులము పేరు వ్రాయవలెను.
(12) ఎత్తు; రొమ్ము వెడల్పు.
(13) అభ్యర్థి పూర్తి చిరునామా.

దరఖాస్తు పెట్టుకొన్న తేది.—అభ్యర్థి సంతకము.

షరా.—(i) దరఖాస్తుతో యీ క్రింద చెప్పిన సర్టిఫికేట్లు చేర్చవలెను, (1) వయస్సునుగురించి, (2) దేహదార్ఢ్యమును గురించి యిది అసిస్టెంటు సర్జను హోదాకు తగ్గని రిజిస్టర్డు మెడికల్ ప్రాక్టిషనరు యిచ్చినదయి వుండవలెను, (3) నీతి ప్రవర్తనను గురించి యిది అభ్యర్థి చదివిన పాఠశాల ప్రిన్సిపల్‌గాని, అభ్యర్థి నౌఖరీలో వున్న యెడల ఆ ఆఫీసు హెడ్డుగాని ఇచ్చినదయి వుండవలెను, (4) ఏ ఇండియన్ యూనివర్సిటిలోనయినా మెట్రిక్యులేషను పరీక్షగాని, స్కూలు ఫయినల్ పరీక్షగాని, యురపియన్ హై స్కూలు పరీక్షగాని, ప్యాసయినట్టు సర్టిఫికేటు.

(ii) స్కూలు ఫైనలు పరీక్షలో ఇంగ్లీషులో నూటికి 45 మార్కులకు తగ్గకుండనున్న తక్కిన సబ్‌జెక్టుల్లో పబ్లికు సర్వీసులో చేర్చుకొనుటకు విధింపబడిన మార్కులకు తగ్గకుండానున్ను వచ్చియుండవలెను. దరఖాస్తుదారు తాను కాలేజి క్లాసులో చేరుటకు అర్హుల లిస్టులో (Eligible) వున్నయెడల ఆ సంగతి తెలుపవలెను. S.S.L.C. బుక్కుగాని పబ్లికు పరీక్షలో వచ్చిన మార్కుల ట్రూ కాపీ (True copy) గాని పంపవలెను. ఇతర దరఖాస్తుదార్లు తమ అసలు సర్టిఫికేట్లు పంపవలెను. లేదా తాము పరీక్ష ప్యాసయినట్లు ప్రకటించిన ఫోర్టు సెంటు జార్జి గెజెట్టు తారీఖున్ను పేజిన్ని తెలుపవలెను.

టి. జె. హార్లీ,
ప్రధానోపాధ్యాయుడు

1934 వ సం॥ ఏప్రిల్ 6 వ తేది.

## III. పరపతి సహకార శాఖ.

### 33. పరపతియొక్క పది సద్విధులు.

(1) సహకారముగా ఐక్యము.

(2) ఇది స్వేచ్ఛవలన సమకూడునది.

(3) ఇది సేవలయొక్క,

(4) పెంపు వృద్ధి గాంచునది,

(5) వారి పరపతి, నమ్మకము, కృషి సమకూర్చుటవలన లభించునది.

(6) సభ్యులందరికంటె మరొకరి మాట హెచ్చుగా జరుగకుండ అందరి సభ్యను సరిసమానత్వములో జరగునది.

(7) లోలోపు రహస్యపు లేక బినామి వ్యవహారములులేక, బహిరంగముగా కార్యములు నడపుటచే పరపతియు, నమ్మకమును ప్రోత్సహించునది.

(8) ప్రతి సభ్యుడును సంఘక్షేమమును కనిపెట్టుచు,

(9) సంఘము ప్రతి సభ్యునియం దాతృతగలిగి సభ్యులను, సంఘమును ఒండొరులకు తోడ్పడుటలో సంఘమునకు వ్యాపారమందు పూర్ణబలిమి కలుగచేసి, సభ్యులకు సహాయ మొనర్చుటయం దవకాశము గలిగినది పరపతి.

(10) ఇవ్విధమున సహకారము సభ్యుల మానవధర్మమును, సౌఖ్యమును ప్రోత్సహించును.

---

### 34. సహకారపు గుళికలు.

1. సహకారము దానము కాదు. సహకారము వ్యాపారము.—మంచి వ్యాపారము.

2. ఇచ్చినదానిని తిరిగి చెల్లించువానికి నమ్మకముతో యింకను ఎక్కువ నివ్వవచ్చును. ఆలస్యముచేయువాడు గుమ్మమువద్ద బిచ్చము అడుగుకొనునట్లడుగుకొనవలెను.

3. ప్రతి మాసమును బ్యాంకులో ఒకరూపాయి వేయుము. చెరువులో వర్షము పడకయే నీకు పంట పండివచ్చును.

4. నెలకు ఒక రూపాయి చొప్పున 360 నెలలకు వెయ్యి రూపాయలు ప్రోగుకుడును.

4. శీఘ్రత పెట్టుబడులకు తల్లివంటిది.

6. తాను అమ్మునట్టి లేదా కొనునట్టి ప్రతి వస్తువునకును సాహుకారు లాభము తీయును. ఒక సహకార సంఘమునచేరి, నీవే స్వంత సాహుకారువగుము.

7. సులభముగా అప్పుకొరకు వసతులు కల్పించుట, దానిని సదుపయోగపరచుట తెలియనివారికి మిక్కిలి ప్రవ్యనష్టము కల్గించును.

**35. ఫలసాయముపైనప్పిచ్చి విక్రయించు తూత్తుకుడి సహకార సంఘము, తూత్తుకుడి. (1912 వ సం॥పు II వ (ఇండియా) చట్టము ననుసరించి రిజిష్టరు చేయబడినది.)**

ఈ సంఘము అందలి సభ్యులచే పండింపబడిన ప్రత్తిని సమవాయముగా విక్రయించు ముఖ్యోద్దేశముతో నేర్పరుపబడెను. ప్రత్తి ధరావతుమీద సభ్యులకు అప్పివ్వబడును. ప్రశస్తమగు ఊదియు, కంబోడియా, కరంగణి ప్రత్తి విత్తులును ఎల్లప్పుడును సరసమగు ధరలకు దొరకును. ఇంకను, వివరములు, సంఘ కార్యదర్శివలన దెలియగలవు.

---

**36. విజయనగరము ఖద్దరు వీవింగు అండు స్పిన్నింగు కోఆపరేటివు సొసైటి, విజయనగరము.**

వ్యవసాయదారునకు వ్యవసాయపుపని తొందరలు లేని రోజులలో అతను అతని ఆలుబిడ్డలు, అతనియొక్క యితర కుటుంబీకులు వారికి తీరుబడియున్న సమయములందు కొన్ని గంటలకాలము, యీ సంఘమునుండి సప్లయిచేయబడిన ప్రత్తినుండి నూలువడికి జీవనోపాధికల్పించుకొనుట యీ సంఘముఖ్యోద్దేశములలో ఒకటి అయియున్నది.

1931-32 వ సంవత్సరములో యీ సంఘము రూ 10,014 లు విలువ గలిగిన సరకు తయారుచేసి ప్రజల కమ్మగా దానినుండి రూ 963-11-0 లు నికర లాభము వచ్చుటెంతయు సంతోషదాయకముగా నున్నది.

ఈ ప్రకారము యీ సంఘము గృహపరిశ్రమకు తగు రీతిగా ప్రోత్సాహ మొసంగుచున్నది. ప్రజల అభిరుచులకు తగినట్లుగా దీనిలో మెంబర్లుగా నున్న దేవాంగులు పలురకములగు వస్త్రములను నేయుచున్నారు. ఇచ్చటనుండి అమ్మకమగు వస్త్రములన్నియు కల్తీలేని వడుకు నూలుతో తయారుచేయబడినవని యీ సంఘము పూచీనిచ్చును. ఈ సంఘమునుండి సప్లయి కాబడిన ఖద్దరు వస్త్రమంతయు చవుక ధరకును, మన్నికకును పేరుగాంచినదై యున్నది. ప్రజా సముదాయమున్నూ, తదితర సహకార సంఘములున్నూ, ఒకతూరి యిచట కొనిచూచి వారు సంతుష్టిచెందినయెడల కడునింపుడా తిండిలేని బీదలకు యితర పనిపాట్లులేని కాలమున వారికి జీవనోపాధి కలిగించు ముఖ్యోద్దేశముతో స్థాపింపబడిన యీ గృహ పరిశ్రమకు ప్రోత్సాహమొసంగవచ్చును.

---

**37. అనకాపల్లి కోఆపరేటివు లోన అండు సేల్ సొసైటి లిమిటెడ్.**

విశాఖపట్టణము జిల్లాలో అనకాపల్లి, చోడవరము తాలూకాలు రెండున్నూ విస్తారముగా చెరుకు పండించుచున్నవి. అనకాపల్లి అప్పు అమ్మకము సహకార సంఘము స్థాపించుటకు పూర్వము రైతులు మధ్య బేరసారములుచేయు సావుకార (దళారి షావుకార్లు) దయకు పూర్తిగా పాత్రులై వుండవలసివచ్చెడిది. వారి బెల్లమంతయు యీ సావుకార్ల లాభములను పెంపొందించుటకు యివ్వవలసివచ్చెడిది. ఈ ప్రకారముగావున్న అనర్థకముల నిర్మూలించుటకుగాను 1927 వ సం॥ మార్చి నెల

13 వ తేదిని అనకాపల్లి అప్పు, అమ్మకము సహకార సంఘము స్థాపింపబడెను రయితులకు వలయు అప్పులను ధారాళముగా నొసంగి, వారి బెల్లము అమ్మిపెట్టుటకు యీ సంఘము, ఏజంటుగా పనిచేయుచున్నది. ఈ సంఘము కొన్ని సంవత్సరములనుండి ప్రశస్తమైన పనిచేయుచు ప్రజామోదమును బడసెను. దీనిలో యిప్పుడు 41 మంది ప్రత్యేకవ్యక్తులును, 62 సంఘములున్ను మెంబర్లుగా వున్నారు. చెల్లించినవాటా మొత్తము రూ 2,490 లు. సెంట్రలు బ్యాంకునుండి రూ 85,000 లు ధనపు అప్పు క్రింద తీసుకొనబడి సంవత్సరాంతమున తీర్చివేయబడెను. ఈ సంఘమునకు వచ్చిన రూ 51,400 లు వెలగల పెక్కు రకముల బెల్లము అమ్మివేయగా నికర లాభము రూ 250 లు వచ్చెను. ఈ సంవత్సరమున 1933 వ సం॥ ఏప్రియలు నెలారునకు రూ. 60,000 లు బెల్లము అమ్మబడెను. సరియైన కాలమందు, అనగా డిసెంబరు నెల మొదలు మే మాసాంతవరకు వివిధరకముల బెల్లము సంఘములో సరసమైన ధరలకు దొరుకును ఇంకను వివరములు వలయునెడల సంఘ కార్యదర్శిగారికి వ్రాసి తెలుసుకొనవచ్చును.

---

## 38. కోఆపరేటివు షుగరు మ్యానుఫాక్చరింగు కన్సరన్స్.

యస్. యస్. యం. రైల్వే లైనులో వున్న నరసపట్నం రోడ్డు రైలు స్టేషనుకు 4 మైళ్ల దూరములో వున్న యేటికొప్పాక గ్రామమున యేటికొప్పాక సహకార పారిశ్రామిక అప్పు సంఘము, లిమిటెడున్ను, అదే లైనుమీదవున్న అనకాపల్లి రైలు స్టేషనుకు 2 మైళ్ల దూరములో వున్న తుమ్మపాల గ్రామమున శ్రీ రామకృష్ణ సహకార పారిశ్రామిక అప్పు సంఘము, లిమిటెడున్ను, 1933 వ సం॥ ఏప్రిలు నెలలో రిజిస్టరు చేయబడి పని ప్రారంభించినవి. 1932 వ సం॥పు సహకార సంఘముల VI చట్టము క్రింద రిజిస్టరుచేయబడి చక్కెర తయారు చేయు సంఘములు చెన్న రాజధానియంతటిలోను యీ రెండుమాత్రమే వున్నవి. 1934 వ సం॥ జనవరి 1 వ తేదినుండి చెరుకు రసమునుండి నేరుగా మంచి రకపు పంచదార చేయగలవని మా నమ్మకము. క్రొత్తగా పెట్టబడిన యీ సంఘములకు జనసామాన్యమును, సహకార సంఘములును తగు ప్రోత్సాహమీయ ప్రార్థితులు.

---

## 39. మలబారు జిల్లాలోని కొన్ని సహకారసంఘములయొక్క పని వివరములు.

(1) పంతలాయినీ దేవాంగులయొక్క సహకార సంఘము లిమిటెడ్.

(2) తానూరు దేవాంగులయొక్క సహకార సంఘము లిమిటెడ్.

(3) కల్లికోట గృహపరిశ్రమల సహకార సంఘము లిమిటెడ్.

పంతలాయినీ దేవాంగుల సహకార సంఘము ఆ గ్రామములో నుండేటటువంటి దేవాంగులందరికి పని యిచ్చేనిమిత్తమును, నేతపనులు అభివృద్ధిచేయు ఉద్దేశముతో 1926 వ సంవత్సరమున స్థాపింపబడినది. ఈ సంఘము S.I.R. రెయిల్వే స్టేషను వద్ద స్థాపిత మయినది. ఇప్పుడు 7 గురు దేవాంగులకు పని యిచ్చుచున్నది.

స్వల్ప ధనముండుటచేత యెక్కువమంది దేవాంగులకు పనులు యిచ్చుటకు వీలు లేక యున్నది. ఈ సంఘము పెద్ద సాహుకార్లవద్ద, నూలుకొని, బట్టలు నేయు నిమిత్తము దేవాంగ మెంబర్లకు పంచిపెట్టుదురు. వారలకు కూలి, పైకము మూలముగా

చెల్లింతురు. కమీజు గుడ్డలు, నూలుచాపులు, తువాళ్లు, దుప్పట్లు యిప్పటికి ప్రజల ఉపయోగ నిత్యము తయారు అగుచున్నవి. వివిధ రకముల బట్టలు తయారు చేయ బడుచున్నవి. స్వదేశినూలు మాత్రమే ఉపయోగములోనున్నది. ఈ బట్టలు ఉపయోగము చేసే మనుజులు యివి గట్టివనియు చాలకాలమువరకు నుండుననియు చెప్పుచున్నారు.

కట్టిలాంగడి, పూతెంతేరు యీ రెండు దేవాంగులసహకార సంఘములు జూలై నెల 1934 వ సంవత్సరమున కలసి యిప్పుడు తానూరు దేవాంగుల సహకార సంఘపు పేరుతో నడచుచున్నది. దాని అడ్రసు తానూరు రైల్వే స్టేషను (S.I.R.) ఈ సంఘము 15 మంది దేవాంగులకు పని నిచ్చుచున్నది. మెంబర్లందరికిని అప్పులిచ్చి, నూలుకొనిపెట్టి పలువిధముల సదుపాయములు చేయుచున్నది. కూలిసొమ్ము బదులుగా బియ్యముపంచిపెట్టుచున్నారు. ఈ సంఘము, క్యాలికిట్ దేవధార్ మలబార్ రీకన్‌స్ట్రక్షన్ ట్రస్టువారిచే పరిపాలింప బడుచున్నది. 1934 వ సంవత్సరము జూలై నెల మొదలు 10 నెలల సరికి యీ రెండు సంఘములును 1,481 రూపాయల నూలుకొని 2,359 రూపాయల వరకు నూలును బట్టలును, అమ్మిరి. 821 రూపాయలు కూలిమూలముగా పంచడమైనది.

హెచ్చుగా అమ్మకమగుటచేత ఈ సంఘముచే, తయారు కాబడిన బట్టలు అనేకమంది మెచ్చుకొనుచున్నారు. అందువల్ల సంఘపు పని అభివృద్ధిలో వచ్చుచున్నది. నడుస్తున్న సంవత్సరములో మలబారు జిల్లా బోర్డువారు ఆసుపత్రుల కోసరము ఈ సంఘమునుండి యే దుప్పట్లు, తువాళ్లు డస్టర్లు, తుండులు, తలగడ గలేబులు మొదలగునవి తీసుకొనినారు. ఈ సంఘము తాలూకు వస్తువులు క్యాలికట్ డిపోయందు దొరుకును. ఈ డిపో దేవధార్ మలబార్ రీకన్‌స్ట్రక్షన్ ట్రస్టువారి తనిఖీ క్రిందనడువ బడుచున్నది. ఈ డిపో తాలూకు అడ్రస్సు యేమన "సహకార అమ్మకపు డిపో, మిఠాయి బజారు క్యాలికట్."

1934-35 వ సంవత్సరమందు గవర్నమెంటువారు ఈ డిపో ఉపయోగార్థము 400 రూపాయలు యిచ్చినారు. ప్రజలందరు ఐకమత్యమూలమున, సహకార సంఘమువారును, లోకలు బోర్డు వారును అందరు కలసి సహాయ్యము చేసే ఉద్దేశముతో సరకులను కొనుచో ఇకముందు గవర్నమెంటు సహాయ్యము లేకయే యీ డిపో నంతట తానే నడచుకొనవచ్చును.

## 40. తిరుప్పూరు సహకార వర్తక సంఘము లిమిటెడ్.

రైతుల తాలూకు ఫల సాయమునకు యెక్కువ ధరలు వచ్చుటకు యేర్పాటు చేయు నిమిత్తము కోయంబత్తూరు జిల్లాలో తిరుప్పూరు అను గ్రామమందు, తిరుప్పూరు సహకారవర్తక సంఘము అనునది ఒకటి యున్నది. ప్రతి వ్యవసాయదారుడును దీనిలో మెంబరై అందువల్ల లాభ మొందవచ్చును.

ఈ సంఘమునకు 8,000 రూపాయల విలువగల ఒక గొదాము యున్నది. రైతులు, వారల ఫలసాయము యీ గొదాములో దాచుకొనవచ్చును, ఆ ఫల సాయపు తనఖాపై అప్పులిచ్చెదరు, మంచి ధరలు వచ్చునప్పుడు ఈ ఫలసాయమును అమ్ముటలో సహాయ్య పడుదురు.

ఈ సంఘము ముఖ్యముగా ప్రత్తిలోను దూదిలోను పనిచేయుచున్నది. మిరప, చోళీ, దనియాలు కొద్ది కొద్దిగా నిలువచేసుకొని యీ సంఘముద్వారా అమ్మబడుచున్నది.

1934 వ సంవత్సరములో 3,764 పొదుల సీడ్ ఫారం కానటువంటి యితర ప్రత్తియు, 5,465 పొదుల సీడ్ ఫారం ప్రత్తియు, 756 బారువల దూదియు ఈ సంఘముద్వారా అమ్మబడెను. ఇట్లు అమ్మిన మెంబర్లు 20,000 రూపాయలవరకు లాభముపొందిరి. సేలం, ఉత్తర ఆర్కాటు, దక్షిణ ఆర్కాడు, తంజావూరు, తిరుచునాపల్లి జిల్లాలోని ప్రత్తి వ్యాపారముకూడ తీసుకొనబడును.

ఈ సంఘము కంబోడియా ప్రత్తి విత్తనపు అభివృద్ధి కొరకు పాటుపడుచున్నది. మెంచబడిన మంచి కంబోడియా ప్రత్తివిత్తనములు పంచి పెట్టడముగురించి యేర్పాటు జరుగుచున్నది. మొదటి సంవత్సరం 5,000 బస్తాల విత్తనము పంచిపెట్టుటకును, సంఘము అభివృద్ధి చెందినకొలది ప్రతి సంవత్సరం 5,000 బస్తాల విత్తనములు హెచ్చుగా పంచిపెట్టుచు ఆయిదవ సంవత్సరమున 25,000 బస్తాల విత్తనము పంచిపెట్టవలయునను ఉద్దేశముతో ఈ సంఘము పనిచేయుచున్నది.

1934 వ సంవత్సరములో ఈ సంఘము 7,399 బస్తాలుకొని, కోయంబత్తూరు మరి యితర జిల్లాలలో పంచిపెట్టినారు. ఈ సంఘమునదున్న సంవత్సరములో 1,501 బస్తాల మెంచిన విత్తనములు పంచిపెట్టి, ఈ విత్తనములో పండినటువంటి దూదిని జమపెట్టుకున్నారు. ఈ ప్రత్తినుండిలీసి నటువంటి దూదిని బారువ ఒక్కంటికి 10 రూపాయల ప్రీమియం చొప్పున అమ్ముచున్నారు. 417 బారువలదూది 75,000 రూపాయలకు యీ సంవత్సరముననే అమ్మి 6,000 రూపాయలు లాభముపొందినారు.

ప్రత్తిపైరుచేయువారికి సొమ్ము యిచ్చే నిమిత్తము తిరుప్పూరు ప్రత్తిపైరుచేయు సహకార సంఘము, తిరుప్పూరు సహకార వర్తక సంఘమునకు తోడ్పడుచున్నది. ఈ సంఘము 1934 వ సంవత్సరములో 15,000 రూపాయలవరకు పైర్లమీద అప్పిచ్చి, సరకు సంఘముద్వారా అమ్మకముచేయించి యిచ్చిన అప్పు రాబట్టు కొనడమైనది.

ప్రత్తి పైరు నేయువారికి మంచి తరుణము.

సహకారమువలన గొప్పలాభముండును.

తిరుపూరు కోఆపరేటివు ట్రేడింగు సొసైటి లిమిటెడ్, తిరుపూరు,

కోయంబత్తూరు జిల్లా.

తిరుపూరు కోఆపరేటివు ట్రేడింగు సొసైటి లిమిటెడ్ (తిరుపూరు కోయంబత్తూరు జిల్లా) వారి ముఖ్యోద్దేశము, వ్యవసాయ వస్తువులకు మంచి వ్యాపారము కలుగజేయుట. ప్రతి వ్యవసాయదారుడును యీ మార్కెట్టుయొక్క ఫలితమును నేరుగాగాని, గ్రామసంఘములద్వారాగాని, విత్తనముల సంఘముల (సీడ్ సొసైటీలు) ద్వారాగాని పొందవచ్చును.

1. మంచి వ్యాపారము సాగించుటకును, వారి సరకులన్నియు భద్రముగ నిలువ జేయుటకును యీ సంఘసభ్యుల ముఖ్యలాభమునకును 8,000 రూపాయలు విలువగల

ఒక కొట్టు కట్టబడెను. సభ్యుల యొక్క పోషణవృద్ధియగు కొలది సంఘమునకు వ్యాపారాభివృద్ధి కలుగుటకు అనుకూలము లెక్కువగా యేర్పడును. ఈ సంఘముయొక్క షేర్లు (వాటాలు) షేరు 1 కి 5 రూపాయల చొప్పన ప్రతి వ్యవసాయదారుని అనుకూలార్థమై నిర్ణయింపబడినది.

2. ఈ సంఘమునుండి ప్రత్తి, దూది, ప్రత్తిగింజలకు మాత్రము సొమ్ము అడ్వాన్సు యివ్వబడును. 4,038 పాదుల ప్రత్తి, 1,129 బారువల దూది, 23,304 బస్తాల ప్రత్తి గింజలను యీ సంఘముద్వారా 15,000 రూపాయల లాభమునకు అమ్మబడెను.

3. ఈ సంఘసభ్యులవలన నిలువచేసిన ప్రత్తిని వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు క్రో ఆపరేటివు ఇన్‌స్పెక్టరుగార్ల డైరెక్టు తనిఖీమీద ప్రత్తిని గింజలనుండి తీయుటయు వేరుపరచుటయు (జిన్నింగు, గ్రేడింగు) జరుగును. అట్లు వేరుపరుపబడిన ప్రత్తినుండి 1,060 బస్తాల విత్తనములను నిలువచేసి ప్రత్తిని పైరుచేయు కాలమందున సంఘసభ్యులకు విత్తనములకై పంచి పెట్టబడెను. దూది బారువ 1 కి 15 రూపాయల ఎక్కువ రేటుతో అమ్మబడెను. అందువల్ల 39,327 రూపాయల విలువగల దూది విక్రయ మొనర్పబడెను. ఈ బేరమువలన సంఘసభ్యులకు 4,000 రూపాయల లాభము వచ్చెను. దీనికి తోడు యీ సంఘమువారు వాయిదాల పద్ధతుల పై గ్రామములనుండి మంచి ప్రత్తి విత్తనములనుగూడ కొనిరి. ఈ విత్తనములు అనేకులగు వ్యవసాయదార్లకు పంచి పెట్టబడెను. అందువల్ల వారికి యెక్కువ పంట, మంచి సరకు లభించెను.

4. ఈ జిల్లాలో ప్రత్తిపైరు చేయువారలకు మంచి విత్తనములు సప్లయిజేసి శ్రేష్ఠ తరమైన సరకును పండించుటకుగాను యీ సంఘమువారిచే యేర్పాటు గావింపబడెను. వ్యవసాయదారుల క్షేమములకొరకు మాత్రమే యీ సంఘము యీ విధముగా సాగింపబడుచున్నది.

---

## 41. ఉర్లగడ్డల వర్తకమభివృద్ధి.

నీలగిరులలో ఉర్లగడ్డల వ్యాపారాభివృద్ధికొఱకు ఏర్పాట్లు జరుగుచున్నవి. మొట్ట మొదట దుంపలను పండించువారికి సదుపాయముగ నుండునట్లు పని ప్రారంభింపబడుచున్నది. మార్చి-ఏప్రెల్ ఋతువులకాలమందు 3,510 బస్తాల ఎరువును, సహకార డిపార్టుమెంటుద్వారా 594 మెంబర్లుగల 24 సంఘములకు 39,745 రూపాయల మొత్తపు ఖర్చుపైని, పంచిపెట్టించడమైనది. ఉజ్జాయింపుపైని 10,530 రూపాయలు మెంబర్లందరికి కలిసి మిగిలినది. ఇంతకు మునుపు ఉండేటటువంటి పద్ధతికిని, ఇప్పటి పద్ధతికిని లెక్కలువేసిచూడగా బస్తా ఒక్కంటికి 3 రూపాయలు అధికముగా ఎరువు నిమిత్తముగా పూర్వపు అరువుపద్ధతి ప్రకారము చెల్లించుచుండిరని తేలెను. పూర్వపు పద్ధతిప్రకారము నగదు చెల్లించుకొన్నవారు తక్కువగా నున్నారు. వారలుకూడా కొత్త పద్ధతిప్రకారము 8 అణాలు మిగిలించుకొనగలిగిరి. మరుచటి సంవత్సరమునకు విశేషముగా ఉరలగడ్డలు పండించుకొని యెక్కువ పైకము మిగిలించుకొనవచ్చును.

ప్రస్తుతము ఉరలగడ్డల అమ్మకముగురించి ఒక పద్ధతిని కనిబెట్టబోవుచున్నారు. అదియేమన, నీలగిరి ప్రదేశములో పండేటటువంటి ఉరలగడ్డలను సహకార అమ్మకపు సంఘమువారు ఒకచోట చేర్చి యెంచి, రకంవారిగా కుప్పలు పెట్టుకొని ధరలు వచ్చునప్పుడు అమ్మెదరు. నీలగిరిలో ఉరలగడ్డలు పైరుచేయువారు ఇప్పటి పద్ధతి నిప్పటియో

జనమని తెలుసుకొని, మనఃపూర్వకముగా సహకారపద్ధతిని అవలంబించుటకు ప్రయత్నించుచున్నారు. ఈ తలంపు స్వల్పకాలములోనే అమలులో పెట్టబడును.

ఉరలగడ్డలు ఉపయోగము చేయువారి అభిప్రాయముకూడ యీ ఉద్యమము మిగుల యెక్కువ ఉపయోగకరముగానుండునని అభిప్రాయపడుచున్నారు. ఇదివరకు నడచుచున్న పద్ధతిలో పండించుకొనేవానికిని, ఉపయోగము చేసుకొనేవానికిని కూడ ఖర్చు యెక్కువ అగునని అందరికి తెలిసియేయుండవచ్చును. ఇప్పుడు అవలంబించ దలచిన పద్ధతివలన అమ్మకపు ఖర్చులున్ను, ఉపయోగము చేసుకొనేవాని ఖర్చులున్ను కూడ మిగుల తగ్గును. ఇంకను అమ్మకపు ఖర్చులు తగ్గించుటకు యెక్కువగా ఉరలగడ్డలు ఖర్చైన సెంటర్లలో సహకారసంఘములు, అనగా మద్రాసు, తిరుచునాపల్లి, మధుర, మంగుళూరు, క్యాలికట్టు, సేలము యీ ప్రదేశములోని సంఘములద్వారా ఉరలగడ్డలను పంచిపెట్టుదురు. ఈ విషయమై జోక్యము కలిగించుకొనదలచిన సంఘములు కోయంబత్తూరు నుండేటటువంటి సహకారసంఘపు డిప్యూటి రిజిస్ట్రారువారికి వ్రాసి వివరమును తెలిసికొనవచ్చును.

ఇప్పుడు తలపెట్టినట్లుగా పండించుకొనేవారికిని, తినేవారికిని సహకారముండు యెడల అనేకవిధములుగా ఉరలగడ్డల పైరుకు లాభముండవచ్చును. మఱియు మంచి నాణ్యమైన దుంపలు దొరకవచ్చును. అందువలన వాని యాహారపు విలువకూడ హెచ్చును.

---

## 42. తంజావూరు జిల్లాలోని సహకార ఋణ, విక్రయసంఘములు.

ఈ జిల్లాలోనుండే వ్యవసాయదారులకు పెక్కువిధములుగా సహాయ్యముచేసే ఉద్దేశముతోను, వారలయొక్క పంటలకు మంచిధరలు వచ్చేవరకు ఉంచుకొనేటట్లును, మఱియు వారలయొక్క పైర్లు తనఖా ఉంచుకొని, వారలకు కావలసిన అప్పు యిచ్చి, ఈ అప్పులవల్ల వారు, వారివ్వవలసిన కిస్తీ చెల్లించుటకును, ఈ పలువిధముల సదుపాయముకొఱకు ఇట్టి సంఘములు తంజావూరు జిల్లాలో స్థాపింపబడినవి. ప్రస్తుతము, ఈ జిల్లాలో దిగువ వివరించిన సంఘములు పనులు చేయుచున్నవి. సాధారణముగా రైతులు వీటివల్ల బాగుపడుటకు అవకాశమున్నది; యెందుచేతననగా వారు పండించుకొనే ఫలసాయము మంచిధరలు వచ్చేవరకు, గిరాకివచ్చేవరకు ఉంచుకొనవచ్చును.

<u>తంజావూరు సహకార ఋణవిక్రయ సంఘము.</u>—ఈ సంఘమువారు ఫలసాయపు తనఖాపై మెంబర్లకు ఫలసాయము విలువమీద నూటికి 75 రూపాయల చొప్పున అప్పులిచ్చెదరు. మెంబర్లయొక్క గొదాములోనే ఫలసాయమును చేర్చుకొని అప్పులిచ్చెదరు, వీటివల్ల రైతులు ఫలసాయమును సంఘముయొక్క గొదాములకు తీసుకొనవసరములేదు. బళ్ల ఖర్చులు మొదలగు ఖర్చులు తగ్గును. 1935 వ సంవత్సరము య్ప్రెల్ నెలాఖరీ సరికి, ఆరమైనాలుగు అప్పులు 22,000 రూపాయలవరకు ఇవ్వబడియున్నవి. 1933-34 వ సంవత్సరములో 33,838 రూపాయలవరకు మెంబర్లకు అప్పులివ్వబడియున్నవి. తనఖాపెట్టుకొన్న ఫలసాయము చాలవరకు ధాన్యమున్ను, కొద్దిగా వేరుశనగయు, పప్పు దినుసులున్ను.

<u>వల్లము సహకార ఋణ విక్రయ సంఘము లిమిటెడ్, వల్లము.</u>—ఈ సంఘము కూడ తంజావూరు అప్పులిచ్చే విక్రయము చేసే సంఘమువలెనే ఏర్పాటు చేయబడెను. ఈ సంఘపు వ్యాపారము వల్లము తాలూకు రిజిస్ట్రేషన్ సరిహద్దువరకు వ్యాపించియు

న్నది. ఈ సంఘమువారు మెంబర్లకు నూటికి 75 రూపాయలవరకు ఫలసాయపు తనఖాపై అప్పులిచ్చెదరు. ఇక్కడకూడ ఫలసాయమును సంఘము తాలూకు అద్దె గోదాములోనైనను లేక మెంబర్ల తాలూకు గోదాములోనైనను దాచవచ్చును. 1935 వ సంవత్సరము మే నెలకు, తనఖా అప్పులు 9,306 రూపాయలవరకు నిల బడియున్నవి. తనఖా యుంచిన ఫలసాయము అంతయును ధాన్యమే.

సీడామంగళము ఋణ విక్రయ సంఘము లిమిటెడ్, సీడామంగళము.—1935 వ సంవత్సరము ఫిబ్రవరిలో స్థాపితమైనది. మూడుమాసముల స్వల్పకాలములో చాల అభివృద్ధికి వచ్చినది. సంఘము తాలూకు అద్దె గోదాములలో మెంబర్ల తాలూకు స్వంత గోదాములలోను ఫలసాయము తనఖాయుంచుకొని 38,649 రూపాయలవరకు అప్పులివ్వడమైనవి. తనఖా ఉంచబడిన ఫలసాయమంతయు ధాన్యమే.

2. ఈ సంఘములు మెంబర్ల స్వంత గోదాములలోనే నిలువ చేయబడిన సరకులపై అప్పిచ్చుట రైతులకు చాల సదుపాయము. రైతు లీసంఘములలో విస్తారసంఖ్యలుగ జేరినచో హెచ్చుధరవలనీ లాభమును పొందుటయేగాక కొంతవరకు ధరలనుకూడ నిర్ణయింప వీలగును. ఇతర వివరములకు ఆయా సంఘముల కార్యదర్శులకు వ్రాసు కొనవలెను.

II సహకారపద్ధతిని ఉప్పు తయారుచేయుట.—ఆదిరాం ఉప్పు పంట సహకార సంఘము-ఆదిరాంపట్నం తంజావూరు జిల్లాలోని పట్టుకోట తాలూకాలోని ఆదిరాం పట్నమందు యీ సంఘము 1928 వ సంవత్సరమునుండి పనిచేయుచున్నది. కార్మిక సభ్యులపాటువలననే యీ సంఘము ఉప్పు తయారుచేయుచున్నది. ఈ సంఘము 329 ఎకరములు ఉప్పు గల్లీలపై పనిచేయుచున్నవి. ఈ సంఘమువద్ద 23,125 రూపాయలు విలువగల ఉప్పు నిల్వయున్నది. తంజావూరులో ఏజంటు నేర్పరచి వానిద్వారా ఉప్పు విక్రయింపబడుచున్నది. ఈ సంఘమునకు నేరుగగాని, తంజావూరు సహకార సెంట్రల్ బ్యాంకుకుగాని వ్రాసి యీ సంఘమువద్ద ఉప్పు రాయితీగా కొనవచ్చును. రిజర్వు ఫండు వగైరాలు మినహాయించగా వచ్చులాభము, పనిచేయు సభ్యులకు బోనసుగా పంచిపెట్టబడును. ఈ సంఘమువద్ద ఉప్పు కొని సహాయము చేయువారు అందు పాటుబడువారికి మేలుచేసినవారగుదురు.

---

## 43. లాల్ గుడి శివజ్ఞానం వ్యవసాయ సహకార సంఘము లిమిటెడ్, నెం. ఆర్. 171, తిరుచునాపల్లి జిల్లా.

ఈ లాల్ గుడి శివజ్ఞానం వ్యవసాయ సహకారసంఘము లిమిటెడ్ దీని అమలు క్రిందయున్న ప్రదేశములలోని రహితులయొక్క స్థితిని బాగుపరిచి నూతన వ్యవసాయ పద్ధతులు తెలియచేసి విత్తనములు, ఎరువులు, పనిముట్లు రహితులకు పంచిపెట్టుటకు 1925 వ సంవత్సరములో స్థాపించబడినది. ఈ సంఘము 1933-34 వ సంవత్సరములో 39.57 ఎకరములు విస్తీర్ణముగల దంపభూమి వరిచెరకు సాగులలో క్రొత్త పద్ధతులు తెలియచేయుటకు సాగుచేయబడినది. ఈ సంఘము "ఇంపీరియల్ కెమికల్ ఇండస్ట్రీసు (ఇండియా) మద్రాసు" వారి తరఫున సాధారణపు కమీషను యేజంట్లుగా పనిచేసి వాయిదా పద్ధతులమీద ఎరువుల నమ్మకములో విరివిగా వ్యాపారము సాగించుచున్నారు. లాల్ గుడి, ఉడైయ్యార్పాళెం తాలూకాలలో పెక్కు స్థలములయందు యీ సంఘముయొక్క శాఖలున్ను, చిల్లర కొట్లున్ను గలవు. 1934 వ

సంవత్సరము మార్చి 31 వ తారీఖు ఆఖరగు సంవత్సరాంతముకు 97,097 రూపాయలు విలువగల రసాయనపు ఎరువులు 5,731 రూపాయలు విలువగల పచ్చి యెరువు విత్తనములు అమ్మబడినవి. మొత్తముపైని యీ సంఘము 595 రూపాయలు లాభముతో పనిచేసినది. సంవత్సరాంతమునకు నిలువచేయబడిన రిజర్వుఫండు 6,249 రూపాయలు.

---

## 44. సేలం నేతగాండ్ర సహకార సంఘము లిమిటెడ్ పనిచేయుటను గురించి—ఒక చిన్న సూచన—పోర్టు సేలం.

నేతగాండ్రయొక్క పనిలేనితనము తగ్గించుటకు 1930 వ సంవత్సరములో యీ సంఘము స్థాపింపబడెను. ఈ సంఘము సుమారు 200 ల నేతగాండ్రకు పని కల్పించి వారికి సరసమైన కూలి నిచ్చెను. ఈ సంఘము షోలాపూర్ నూలుకొని సంఘములోని యొక సభ్యునిచేత రంగును వేయించును. ఈ సభ్యుడు ప్రత్యేకము యీ పరిశ్రమలో నుత్తీర్ణుడై మేలైన సరుకును తయారుచేయగలడు. ఈ సంఘము ప్రతి సంవత్సరము సుమారు 4,000 రూపాయలు విలువగల సరుకును తయారుచేసి, సంఘమునకును, కొనుప్రజలకును మంచి సదుపాయముగ నుండునట్లు అమ్ముదురు. ఈ సంఘముయొక్క ఆర్థికపరిస్థితులు యీ దిగువ నుదహరించబడినవి :—

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| వాటాధనము ... ... | 12,670 | 10 | 0 |
| మూలధనము ... .. | 1,035 | 4 | 0 |
| వసూలగుననునమ్మకములేని బాకీల నెత్తివేయుటకై నియమించిన మూలధనము. | 3,544 | 0 | 0 |

ఈ సంఘము యిప్పుడు ముఖ్యముగా చెన్నపట్నములోని సహకార సంఘములకు కావలసిన సరుకును ఏజన్సీ పద్ధతిమీద విరివిగా సరఫరా చేయును. ఈ సంఘములకు సరుకు సర్దుటకుగాను కోఆపరేటివు డిపార్టుమెంటు తాలూకు ఒక జూనియరు కోఆపరేటివు ఇనస్పెక్టరును అమ్మకపు యుద్యోగస్థుడుగా పై సంఘము నియమించినది.

ఈ సంఘము తన సరుకు నమ్ముటకుగాను యీ దిగువ పద్ధతులపైన ఏజంట్లను కోరుచున్నది.

(1) ఏజంట్లు నిలవ ఉన్నట్టియు అమ్మబడినట్టియు సరకులను గురించి 15 రోజుల కొకసారి జమాఖర్చు లెక్కలను పంపవలెను.

(2) సంఘము తరపున నియమించబడ్డవారు నిలువ సరకును, లెక్కలును తనిఖీచేయుటకు తగిన వసతులను ఏజంట్లు యివ్వవలెను.

(3) ప్రస్తుతము అమ్మకపు ధరలపైన యీ దిగువ వివరించిన కమీషను యివ్వబడును.

(a) రూ 50 లు వరకును రూ 1 కి ఒక అణా.

(b) రూ 50 లు దాటి రూ 500 లు వరకును రూ 1 కి రూ. 0-1-6.

(c) ఒక నెలలోపుగ రూ 500 లకు పైగా అమ్మినయెడల రూ 1 కి అ 2 లు.

(4) వివరించిన ధరలు సేలం ఆఫీసులో బట్వాడాచేయుట మట్టుకే; సామానులు కట్టుటకును, పంపుటకును అగు ఖర్చులు ఏజంటు భరించవలెను.

(5) ఏజంటునుంచి రావలసిన పైకము తాను కట్టిన ధరావత్తు పైకముకన్న ఎప్పుడును రెట్టింపుకన్న యెక్కువ యుండరాదు.

(6) అమ్ముడుకాని బట్టలు తిరిగి తీసికొనబడవు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మాత్రము యీ దిగువ చెప్పినట్లున్న యెడల తిరిగి తీసికొనబడును.

(ఎ) బట్టలు నలగకుండా జాగ్రత్తగా నుండవలెను.

(బి) ఏజంటు తన స్వంత ఖర్చులపైన తిరిగి పంపవలెను.

(సి) ఏ సందర్భములోనైనను కొన్న సర్కులో 100కి 5 వ వంతు భాగముకన్న సర్కు వాపసు తీసుకొనబడదు.

## 45. రాసిపురం సహకార వ్యాపార సంఘము లిమిటెడ్.

యీ సంఘము సేలం జిల్లాలోనున్న రాసిపురములోనున్నది. యీ సంఘము చేయు పని సేలం రివిన్యూ జిల్లా యంతటను వ్యాపించియున్నది. దీనియొక్క ముఖ్యోద్దేశమేమన వ్యవసాయ సంబంధమైన సరుకు సంఘ సభ్యులకు ఎక్కువ లాభకరముగా నుండునట్లు అమ్ముటయే. 1935 వ సం॥ ఫిబ్రవరి మొదలుకొని మే వరకు సభ్యుల తరపున యీ సంఘము 1421 పొదులపత్తి (పొ. = 250 పౌ॥) బహిరంగ వేలము ములమూలముగా ప్రతి శుక్రవారము అమ్మబడినది. రాసిపురం, సేలం, తిరుచంగోడునుల నుండియున్ను అప్పుడప్పుడు తిరుప్పూరునుండియున్ను మిల్లుదార్లు వేలముల సమయములలో పోటీ చేయుదురు. యీ పోటీవలన యీ సంఘములకు లభించు ధరలు సాధారణముగా తిరుప్పూరు బజారు ధరలుకన్న 1, 2 రూపాయిలు ఎక్కువ కిట్టును. యీ ఎక్కువ ధరలువలని లాభములకు తోడు యీ సంఘమున సభ్యులను గ్రామ వ్యాపారస్థులు తూనికలలోను కొలతలలోను చేయు మోసములనుండి కాపాడును. యీ సంఘమునకు సభ్యులయొక్క సరుకులను తప్పులేకుండా నికరమైన రాళ్లతో తూచుటకు వక “ఏవరి” కాటాగలదు.

కోఆపరేటివు డిపార్టుమెంటు తాలూకు ఒక సీనియరు ఇన్‌స్పెక్టరు ఆధీనములో యీ సంఘముయొక్క వర్తకపు కొట్టుయుంచబడినది. యీ సంఘము అమ్మిన ప్రతి పొదిపత్తికిన్ని 8 అణాలు చొప్పున కమీషను తీసుకొనును. యీ సంఘముయొక్క కొట్టులో ఒక వారమువరకును పత్తి నిల్వయుంచినయెడల పొది 1కి 1 అణా బాడిగయు రూ 0-0-3 ం భీమా రుసుముయు వసూలు చేయబడును. నిల్వ చేయబడ్డ పత్తికైన కట్టిన బజారు ధరలో 100కి 70 వంతున యీ సంఘము అప్పు యివ్వగలదు. యీ విధముగా యిచ్చిన అప్పులపైని 100కి రూ 7-8-0 లు చొప్పున వడ్డీ వసూలుచేసి ఆరు మాసములే గడువు యివ్వబడును.

వ్యవసాయదార్లును వ్యవసాయ సహకార సంఘములున్ను యీ సంఘములో సభ్యులుగా జేరవచ్చును. సంఘములు “ఎ” తరగతి రూ 5 లు విలువగల వాటాలు కొనుటకు అరహత గల్గియున్నవి కాని ప్రత్యేక రహితులకు “బి” తరగతి రూ. 1 విలువగల వాటాలకు మాత్రము అరహత గల్గియున్నది. సేలం జిల్లాలోని వ్యవసాయదార్లున్ను వ్యవసాయ సంఘములున్ను యీ సంఘములో సభ్యులుగా చేరుటకు అహ

నించబడుచున్నారు. ప్రత్తి వేరు సెనగ వ్యాపారము గల పెద్ద వర్తకులు యీ సంఘము తనిఖీచేసి దీని వేలములలో తోడ్పడుటకు కోరబడుచున్నారు.

## 46. దక్షిణార్కాడు సెంట్రలు సహకార వేరుసెనగ విక్రయ సంఘము.

### వేరుసెనగ పండించే రయితులకు యేలాగు తోడ్పడును.

దక్షిణ ఆర్కాడు సెంట్రల్ సహకార సంఘము మూడు కొట్లను, కడలూరు ప్రాతనగరమువద్దను, విరుద్ధాచెలంవద్దను మరియు తిరుక్కోయిలూరువద్దను యేర్పరచిరి. ఒక్కొక కొట్టు, ఒక్కొక సహకార యినస్పెక్టరుగారి పూచీక్రిందనుగాని, వ్యవసాయపు డిమాన్‌స్ట్రేటరుగారి పూచీక్రిందనుగాని యున్నది. వీరినే కొట్ల యధికారి అనియుకూడ అందురు. ఈ యధికారి తన కొట్టుకువచ్చే వేరు సెనగను తీసుకొని, నిఖరమైన వాటాతో తూచుకొని, దాని విక్రయము నిమిత్తమై తగిన యేర్పాటు చేయును. ఈ యధికారి రయితులను తప్పు తూనికలనుండి కాపాడును. ఈయన బజారుతో సంబంధము యెక్కువగా కలుగజేసుకొనుటవలన యీయన ఎవరు ఎక్కువ ధర యిచ్చుకొందురో వారిని కనుగొను శక్తిగలిగియుండును. ఎవరయిన ఒక రయితు తన పంటను ఎక్కువ ధరకు అమ్ముటకు వుద్దేశించినయెడల, యీయన తన కొట్లలో ఆ సరకును ధరవచ్చేవరకు దాచుటకు వొప్పుదలయైయుండును. కావలసినయెడల తన యొద్ద దాచియుండు సరకు పైని సంఘమునుండి అప్పుకూడా ఇప్పించును. దక్షిణార్కాడు జిల్లాలో వేరు సెనగ పండించే రయితు, తనకు సహాయ్యము కావలసినయెడల ఆ వేరుసెనగ అమ్మే సంఘములో, ఒక రూపాయియిచ్చి వాటా పుచ్చుకొని, తన దినుసునంతయు ఆ కొట్టు అధికారివద్దకు పంపించవలెను. తన ద్వారాఅమ్మేటటువంటి ప్రతి పుట్టికి ఆ 4 లు చొప్పున్న, కమిషన్ మూలముగా కొట్టు యధికారి తీసుకొనును. గాని రయితునకు వచ్చే లాభము చాలాయుండును.

"రయితుకు ఒకవేళ తన సాగుకు కావలసిన అర్థ సహాయము అవసరమయినట్టయితే స్థానిక సహకార సంఘములో చేరినయెడల తక్కువ వాయిదాపయిని అప్పులు పుచ్చుకొనుటకు తగిన సదుపాయములు గలిగించబడును. ప్రస్తుతపు తక్కువ ధరలవలన రయితుకు గలిగిన ప్రస్తుతపు దుస్థితి ననుసరించి వేరుసెనగ అప్పులుపైని వడ్డీ నూటికి 9కి నుండి 7కి వరకు వడ్డీ తగ్గించబడి రయితులకు తన ఖర్చులుపోను నికరలాభము కొంచెము హెచ్చునట్లు చేయబడినది. అట్టి అప్పులు కష్టము లేక తన స్వల్పాదాయముతో తీర్చుకొనుటకు సహాయముగ నుండునట్లు సదరు అమరకము చేయనపుడు వసూలు చేయబడును." రయితులు యీ వేరుసనగ కొట్లు తమ వుపయోగముకొరకు పెట్టిరని తెలిసికొని, స్థానిక సహకార సంఘములునుండి ఆర్థిక సహాయమును పొంది, తమ సరుకును చాలమట్టుకు యీ కొట్లద్వారా విక్రయించినయెడల వేరుసెనగ ధర వృద్ధిచేయుటకున్ను, తమ ఆర్థిక పరిస్థితి కొంచముగ బాగుచేసుకొనుటకును వీలుండవచ్చును.

యీ దిగువ నుదహరించిన లెక్కలు గత మూడు సంవత్సరములలో పైన చెప్పిన వేరు సెనగ కొట్లుద్వారా వేరు సెనగ కాయ అమ్ముటవలన రయితులకు యీ కొట్లపైని గల అభిమానము తెలియజేయును.

కొట్లద్వారా అమ్మిన వేరు సెనగ విలువ.

| | 1933 | 1934 | 1935 (1935 వ సం॥ ఏప్రిల్ 30 వ తేదివరకు) |
|---|---|---|---|
| | రూ. | రూ. | రూ. |
| వృద్ధాచలము ... | 13,535 | 25,263 | 71,564 |
| కడలూరు ... | 21,911 | 45,097 | 23,011 |
| తిరుక్కోయిలూరు ... | 26,631 | 14,444 | 32,342 |
| మొత్తం ... | 62,077 | 85,804 | 1,26,917 |

## 47. సహకార భూమి తనఖా బ్యాంకులు.

### వ్యవసాయదారుల ఋణ విముక్తి—దీర్ఘ వాయిదా అప్పులు.

పాత ఋణములు తీర్చుకొనుటకున్నూ, మరికొన్ని ఇతర కార్యముల కొరకున్నూ సాగుబడి భూముల తనఖాపైన సహకారభూమి తనఖా బ్యాంకుల మెంబర్లకు ఇరువది సంవత్సరములలో తీర్చుకొనే పద్ధతిని అప్పులు ఇవ్వబడును.

ఏ మెంబరుకున్ను రూ 5000 లకు మించిన అప్పు ఇవ్వబడదు. తనఖా పెట్టబడు భూములు బ్యాంకి అప్పుకు ప్రథమ తనఖాగా ఉండవలెను. తనఖాయుంచు ఆస్థియందు దరఖాస్తుదారునకు ల్యాప్రకారము నిరాక్షేపణమైన హక్కుండి అప్పు తీర్చగల సమర్థత మొదలగు యితరసందర్భములు తృప్తిగానున్నచో తనఖాయుంచబడు భూముల ఆస్థి కిమ్మతునందు నూటికి రూ 50 లకు లోపున అప్పు యివ్వబడును. భూమి తనఖా బ్యాంకులనుండి తీసుకొన్న అప్పులకు మామూలు అప్పులకువలె స్టాంపు ఖర్చు గాని, రిజిస్ట్రేషన్ ఫీజుగానిలేదు. అప్పు కావలసినవారు తాము తనఖాయుంచు భూములు యే భూమి తనఖా బ్యాంకి జ్యూరిష్డిక్షనులోనున్నవో ఆ భూమి తనఖా బ్యాంకు వారికి దరఖాస్తు పెట్టుకోవలెను. చెన్నరాజధానిలో ఈ దిగువ పేర్కొనబడిన స్థలములందు భూమి తనఖా బ్యాంకులు స్థాపింపబడినవి :—

| జిల్లాలు. | తాలూకాలు. |
|---|---|
| గంజాం ... ... | 1. శ్రీకాకుళం. |
| విశాఖపట్నం ... ... | 1. చోడవరం. |
| | 2. విజయనగరం. |
| | 3. ఎలమంచిలి. |
| | 4. నరసపట్నం. |
| తూర్పు గోదావరి ... ... | 1. ఆలమూరు. |
| | 2. పిఠాపురం. |
| | 3. అమలాపురం. |
| | 4. కాకీనాడ. |
| | 5. రాజోలు. |
| | 6. రాజమండ్రి. |
| | 7. రామచంద్రపురం. |

| జిల్లాలు. | | తాలూకా. |
|---|---|---|
| పశ్చిమ గోదావరి | ... ... | 1. భీమవరం. |
| | | 2. పెనుగొండ. |
| | | 3. ఏలూరు. |
| | | 4. నర్సాపురం. |
| | | 5. కొవ్వూరు. |
| | | 6. తాడేపల్లిగూడెం. |
| కృష్ణా | ... ... | 1. పెడన. |
| | | 2. గుడ్లవల్లేరు. |
| | | 3. కైకలూరు. |
| | | 4. వుయ్యూరు. |
| | | 5. గన్నవరం. |
| | | 6. అవనిగడ్డ. |
| గుంటూరు | ... ... | 1. గుంటూరు. |
| | | 2. రేపల్లె. |
| | | 3. పొన్నూరు. |
| నెల్లూరు | ... ... | 1. నెల్లూరు. |
| | | 2. కావలి. |
| | | 3. గూడూరు. |
| అనంతపురం జిల్లా | ... | 1. ధర్మవరం. |
| బళ్లారి జిల్లా | ... | 1. హాస్పేట. |
| కర్నూలు జిల్లా | ... | 1. నంద్యాల. |
| కడప జిల్లా | ... | 1. రాజంపేట. |
| చెంగల్పట్టు జిల్లా | ... | 1. చెంగల్పట్టు. |
| | | 2. కంజీవరం. |
| | | 3. మధురాంతకం. |
| | | 4. కీళచేరి. |
| తూర్పు ఆర్కాటు జిల్లా | ... | 1. ఆంబూరు. |
| | | 2. తిరువణ్ణామలై. |
| | | 3. కలవాయి. |
| | | 4. అనకాపూరు. |
| దక్షిణ ఆర్కాటు జిల్లా | ... | 1. కాట్టుమన్నార్ కోయిల్. |
| | | 2. చిదంబరం. |
| | | 3. వృద్ధాచలం. |
| | | 4. కడలూరు. |
| కోయంబత్తూరు జిల్లా | ... | 1. పెరుందురై. |
| | | 2. విజయమంగళం. |
| | | 3. పీలమేడు. |
| | | 4. భవాని. |

| జిల్లాలు. | | తాలూకాలు. |
|---|---|---|
| | | 5. సూలూరు. |
| | | 6. గోబిచెట్టి పాళయం. |
| | | 7. తిరుప్పూర్. |
| | | 8. ఈకోడ్డు. |
| | | 9. పొళ్ళాచి. |
| సేలం జిల్లా | ... | 1. వేలూరు. |
| | | 2. తిరుచెంగోడు. |
| తంజావూరు జిల్లా | ... | 1. తంజావూరు. |
| | | 2. మాయవరం. |
| | | 3. తిరువాహూరు. |
| | | 4. కొడవాసల్. |
| | | 5. కుంభకోణమ్. |
| | | 6. తిరుత్తురై పూండి. |
| | | 7. మన్నారుగుడి. |
| | | 8. షియాలి. |
| తిరుచునాపల్లి జిల్లా | ... | 1. తిరుచునాపల్లి. |
| | | 2. కులితలై. |
| | | 3. లాల్గుడి. |
| మధుర జిల్లా | ... | 1. మధుర. |
| | | 2. ఉత్తమపళయం. |
| | | 3. షోలవందన్. |
| రామనాథపురం జిల్లా | ... | 1. రాజుపాళయం. |
| | | 2. వాత్రప్. |
| తిరునల్వేలి జిల్లా | ... | 1. అంబాసముద్రం. |
| | | 2. శ్రీ వైకుంఠం. |

డి బెంచర్లు.

మద్రాసు సెంట్రల్ కో ఆపరేటివు భూమి తనఖా బ్యాంకివారు ఇరువది సంవత్సరముల డి బెంచరు పత్రములను విక్రయించుచున్నారు. ఈ డి బెంచర్ల అసలు సొమ్ముకున్నూ అందుపైన ఇయ్యవలసిన వడ్డికిన్ని మద్రాసు గవర్నమెంటువారి గ్యారంటీకలదు. ఈ డి బెంచర్లు ట్రస్టీ సెక్యూరిటీల జాబితాలో జెప్పబడినవి. వివరములు కోరువారు ఈ క్రింది చిరునామాకు వ్రాసి తెలుసుకొనవలెను.

“ సెక్రటరీ, మద్రాసు కో ఆపరేటివు సెంట్రల్ ల్యాండు మార్టుగేజు బ్యాంకు లిమిటెడ్, మౌంటురోడ్డు, మద్రాసు. ”

## IV. పరిశ్రామిక శాఖ.

48. మదరాసు రాజధానిలోనున్న గవర్నమెంటువారి సాంకేతిక పాఠశాలలయొక్కయు పరిశ్రామిక పాఠశాలలయొక్కయు జాబితా.

| పేరు. | బోధింపబడు విషయములు. |
|---|---|
| 1 స్కూల్ ఆఫ్ ఆర్ట్సు అండు క్రాఫ్ట్సు, మదరాసు. | బీరువాలు, అలమారులు మొదలైనవి చేయుట, కొయ్యమీద చిత్రించుట, చెక్కడపు పని, |

| పేరు. | బోధింపబడు విషయములు. |
| --- | --- |
| | లోహపు పని, బంగారు, వెండి పని, శృంగారించుటకైన చిత్రలేఖనము, రత్నకంబళ్లు నేయుట, విగ్రహములను చేయుట, నక్షీ పని, బట్టలమీద అద్దకము, పేము పని, సామాన్యపు డ్రాయింగు, చిత్రలేఖనము. |
| 2 గవర్నమెంటు స్కూల్ ఆఫ్ టెక్నాలజీ, మదరాసు. | మెకానికలు ఇంజనీరింగు, ఎలెక్ట్రికలు ఇంజనీరింగు, ప్లంబింగు, శానిటరీ సైన్సు, అప్లయిడు గణితశాస్త్రము, మెకానికలు డ్రాయింగు. |
| 2ఎ ప్రిపరేటరి ట్రేడ్ స్కూల్, మదరాసు. | చేతిపనులుచేయ నభిలషించువారికి సామాన్య విద్య నేర్పుట. |
| 3 గవర్నమెంటు టెక్స్టైల్ ఇన్స్టిట్యూటు, మదరాసు. | ప్రత్తి యేకుట, చేతిమగ్గముమీద నేయుట, పట్టు పురుగులను పెంచుట, పట్టు నూలు వడకుట, ఉండలుగ చుట్టుట, పట్టు త్రాళ్లను పేనుట, జరీ అల్లకము, రంగులు వేయుట, బట్టలను పరీక్షించుటయును, ఉన్ని వడకుట. |
| 4 గవర్నమెంటు ఇండస్ట్రియలు స్కూల్, మధుర. | కొయ్య పని, జనరల్ మెకానిక్స్ పని, ఆయల్ ఇంజనులను నడుపుట, ఇంజనీరింగు ట్రేడు. |
| 5 గవర్నమెంటు ట్రేడ్స్ స్కూల్, మంగళూరు. | మెకానిక్కులకు కావలసిన విద్య నేర్పుట వడ్రంగమునకు వలయు విద్య నేర్పుట, ఎలిక్ట్రికల్ వైరింగు. |
| 6 గవర్నమెంటు ఇండస్ట్రియల్ స్కూల్, కళ్లికోట. | కుర్చీలు, బీరువాలు మొదలైనవి చేయుట, మెకానికలు యింజనీరింగు. |
| 7 గవర్నమెంటు ఇండస్ట్రియలు స్కూల్, బళ్లారి. | కుర్చీలు, బీరువాలు మొదలైనవి చేయుట, జనరల్ మెకానిక్కులకు కావలసిన విద్య నేర్పుట, ఆయల్ ఇంజనులను నడుపుట. |
| 8 కేరళా సోపు యిన్స్టిట్యూటు, కళ్లికోట. | సబ్బుచేయుట—నూనె శుభ్రముచేయుట నూనెలు, కొవ్వులు, క్షారములు, సబ్బులు తనిఖీచేయుటయందు పరిశోధనాలయములో విద్యగరపుట, నూనె, తదితర పదార్థములు తనిఖీచేసి తక్కువ రుసుముకు తనిఖీ పత్రములిచ్చుట. రుసుము వివరములకొరకు యిన్స్టిట్యూటు సూపరింటెండెంటు గారికి దరఖాస్తు చేసికొనవలెను. |

ప్రత్యేకముగా గవర్నమెంటువారివలన పరిపాలింపబడునట్టి పైన చెప్పబడినవే కాక యీ రాజధానిలో సహాయమును బడయుచున్న దాదాపు 70 పారిశ్రామిక పాఠశాలలు గలవు. పారిశ్రామిక పాఠశాలలను గురించి యింక యెక్కువ సమాచారము యేదైనను కావలసియున్నయెడల పారిశ్రామిక డయిరక్టరువారినుండి బడయవచ్చును.

---

## 49. ఇండస్ట్రియలు (పారిశ్రామిక) ఇంజనీరింగుశాఖవారిచే జరుపబడు పనికి రుసుములను విధించుటకొరకైన విధులు.

1. ఇందు నికముందు వుదహరింపబడే విధులకు లోబడి ఇండస్ట్రీసు డిపార్టుమెంటు సాధారణమైన సంగతులను తెలియజేయును ; సలహా నొసగును ; ప్లానులను తయారుచేయుటలోను, యంత్రములను కొనుటయందును సహాయ్యమొనర్చును. ఇస్టిమేషనులను ఒక పద్ధతి ననుసరించి తనిఖీచేయును. మరిన్ని జన సామాన్యముయొక్క వుపయోగము నిమిత్తము యీ క్రింది ప్లాంటులను యంత్రసామగ్రిని వుంచును :—

(i) హ్యాండుబోరింగు (చేతితో భూమిని రంధ్రముచేయు) యంత్రము.

(ii) పవరు డ్రిల్లులు (ఆవిరి మొదలగు వాటి సహాయముతో రంధ్రముచేయు యంత్రములు).

(iii) ఒకచోటునుండి మరియొక చోటుకు తీసికొనిపోవుటకు అనుకూలముగా నుండే పంపింగు (నీళ్లతోడే) యంత్రము.

(iv) బ్లాస్టింగు (పెద్ద రాళ్లను పగలగొట్టు) యంత్రము.

(v) చెఱకు గానుగ మిల్లులు.

ఈ యంత్రసామగ్రి యీ దిగువ నుదహరించిన వరుసను అద్దెకు యివ్వబడును :—

మొదటి తరగతి.—(a) వ్యవసాయదారులకు—ప్రత్యేకముగ వ్యవసాయ పనుల కొరకే యంత్రముగాని, యంత్రము నడిపించు యుద్యోగస్తులుగాని, సంతోషము కొరకు వేసికొనిన తోటలలోగాని, తదితర అభిలాషలకొరకుగాని, బావులు త్రవ్వించుటకు నియోగింపబడదు.

(b) చిన్న తరగతి పరిశ్రమలు చేయువారుకూడ, వ్యవసాయదారులు మాదిరిగనే గమనించబడుదురు.

(c) ప్రత్యేక వ్యక్తులకుగాక, గ్రామములలో ప్రజలకు నీటి సదుపాయము చేయు వుద్దేశ్యములకు.

(d) కార్మిక శాఖ, సహకార శాఖ, తదితర సర్కారు శాఖలు.

రెండవ తరగతి.—స్థానిక పరిపాలనా ఆఫీసులకును, తదితర ప్రజలను సంబంధించిన అధికారములకున్ను.

మూడవ తరగతి.—పడమటి తీరమునను, దత్తమండలములోనున్న తగిన కారణములు చూపినయెడల నీరస జలాధారములు బాగుచేయుటకు అంతకన్న ముఖ్యమైన దరఖాస్తులు గమనించిన తరువాత ప్రత్యేక వ్యక్తులకుకూడ సహాయము చేయబడును.

నాలగవ తరగతి.—పెద్ద తరగతి పరిశ్రమలు.

ఉదా.—500 ల పనివాండ్లు పైబడి కూలివాండ్లు పనిచేయు కర్మాగారములుగాని, 1,000 గుఱ్ఱములుగాని, అంతకు పైబడి సత్తువగల యంత్రములు పనిచేసినప్పుడుగాని ఆ పరిశ్రమను “పెద్ద తరగతి పరిశ్రమ” యందురు.

ఐదవ తరగతి.—రైల్వేను.

2. ఈ క్రింది షరతులకులోబడి యీ డిపార్టుమెంటువారు పనులనుచేయుదురు:—

(i) డిపార్టుమెంటువారు సహాయముచేయుటకును క్రమపర్చినట్టి విధుల ననుసరించి విధింపదగిన యావత్తు రుసుమును లేదా యితర చార్జీలును నిష్కర్షగా ముందుగానే చెల్లించవలెను.

షరా.—సహకార సంఘములకు చేసిన పనులకు సాధారణపు రేట్లలో సగమే తీసికొనబడును. కాని రవాణా కర్చులు మాత్రము సంఘమువారు వారి స్వంత కర్చుల పైని భరించనియెడల నియమించబడిన రేట్ల ప్రకారము పూర్తిగా వసూలుచేయబడును.

(2) సహకార సంఘములు సహా దరఖాస్తుదార్ల అల్పాదాయమునకు విధించిన రుసుము భరించరానిదైన, అరుదైన విషయములలో పరిశ్రమశాఖ డైరెక్టరు వారు, వారి ఆలోచనల ననుసరించి అట్టి రుసుములనుగాని, కర్చులనుగాని, పూర్తిగా గాని, కొంతగాని సర్కారువారికి రిపోర్టు పంపించు పద్ధతిపైన అద్ది సొమ్ముకాక తక్కినది రద్దుచేయవచ్చును.

(ii) పై పద్ధతుల ప్రకారం వసూలుచేయబడిన రుసుములు, కర్చులు సర్కారుకు జమకట్టబడును.

(iii) సాధారణముగా రుసుములు వాపసుచేయబడవు. కాని బజానా యిచ్చిన సొమ్ములో పని పూర్తియైన తరువాత యేమైన మిగిలినయెడల వాపసుచేయబడును.

(iv) ప్రజలయొక్క కోరికలు సాధారణముగా తీర్చుటకు ప్రయత్నముచేసినను డిపార్టుమెంటువారు యెంతమాత్రము కాలాతీతమునకు బాధ్యులుకారు.

(v) డిపార్టుమెంటువారి పనులకు యెప్పుడు ఒప్పుకొనిరో అప్పుడే వారి ప్రచురణములలో నియమించిన పద్ధతులుకూడ ఒప్పుకొనినట్లే యగును.

(vi) డిపార్టుమెంటువారివద్ద అడిగి తీసుకొనిన యంత్రసామగ్రులు యే సందర్భమునను కూడ యితరులకు తిరిగి అద్దెకు యివ్వకూడదు.

(3) వ్యాపారసంబంధమైన డిపార్టుమెంట్లకు, సర్కారు వ్యాపారసంబంధమైన పనులకు తప్ప యితర సర్కారు డిపార్టుమెంట్లకు చేసిన పనులకుగాని యిచ్చిన సామగ్రికిగాని రుసుము తీసుకొనబడదు. అయినను అట్టి పనులకు అయిన విలువకు ఆయా డిపార్టుమెంట్లనుండి రశీదు మాత్రము పొందబడును.

## I. సంగతులును, సలహాయును.

4. సాధారణమైన సంగతులున్నూ, సలహాయున్నూ, ఆ సంగతులు తెలిసినంత వరకు రుసుము లేకయే తెలుపబడును. స్థలములను తనిఖీ చేయకయే సలహా నియ్యవచ్చును.

5. స్థానిక పరీక్ష అయినమీదనే సలహా యివ్వగల్గు సందర్భములలో అట్టి సలహా నిచ్చుటకు 1 వ నిబంధనలో నియమించబడ్డ 1, 2, 3 తరగతులవారినుండి రూ 10 లు రుసుమున్నూ, 4, 5 తరగతులవారినుండి రూ 100 లు రుసుమున్నూ తీసుకొనబడి పరీ

పుకు తగిన యేర్పాట్లు చేయబడును. ప్రత్యేక అప్పు నిబంధనల ప్రకారము యిచ్చు అప్పులకుగాను చేయబడు తనిఖీలకొరకై స్థానిక పరీక్ష చేయుటకు వెళ్లినయెడల యిట్టి రుసుము తీసుకొనబడదు.

6. ఇట్టి పరీక్షలో దరఖాస్తుదారు డిపార్టుమెంటు సహాయములేకయే యంత్రము కొనుటకుగాని అమర్చుటకుగాని నిశ్చయించినయెడల పరీక్ష నివేదికలో కావలసిన యంత్రసామగ్రి వివరములు అమర్చుటకు ప్లాను చేర్చబడును.

7. దరఖాస్తుదారుడు డిపార్టుమెంటువారిచే యంత్రము కొనబడుటకుగాని, అమర్చబడుటకుగాని కోరినయెడల "II—యంత్రములుకొని అమర్చుట" యను శీర్షిక క్రింద వుండు పద్ధతులనుబట్టి రుసుము వసూలు చేయబడును.

## II. యంత్రములను కొనుటయును, స్థాపించుటయును.

8. ఆ ప్రకారము కోరబడినప్పుడు, డిపార్టుమెంటువారు ప్లాంటుకుగాను వుత్తరవు చేయుటకున్ను, ప్లానులు తయారుచేయుటకున్ను యంత్రములను స్థాపించినప్పుడు పై తనిఖీ చేయుటకును పూనుకొందురు అట్టి సందర్భములలో రూ 250 లకు తక్కువ కాకుండో లేదో ప్లాను యొక్క విలువలో రమారమి నూటికి 15 వంతున యీ రెంటిలో యేది యెక్కువ మొత్తమో దానిని డిపాజిట్టు చేయవలెను. రుసుములను లెక్కపెట్టు కార్యములకొరకు యింతకు పూర్వమే వాటి ప్లాంటుయొక్క విలువ, దాని ప్రస్తుతపు విలువగా భావించబడును.

I, II, III తరగతులలో యీ పనికి వసూలుచేయబడు రుసుము రూ. 100 కి రూ 20 లున్ను, తనిఖీ కర్చులు రూ 10 లున్నూ అయియున్నది. IV, V తరగతులలో యంత్రసామగ్రి విలువపై నూటికి రూ 10 లు చొప్పున రూ 100 లు తనిఖీ కర్చులు వసూలుచేయబడును. ప్రతి తరగతిలోనుకూడా యంత్రముల కరీదు రూ 1,250 లకు మించినయెడల ప్లానులు తయారుచేయుటకు రూ 10 లు వసూలు చేయబడును. ఇంతకుముందే తనిఖీ కర్చుల నిమిత్తమై పైకము యిదే పనికి కట్టినయెడల యింక తనిఖీ రుసుము వసూలుచేయబడదు.

కట్టడపు పని విషయమై పై విచారణ చేయవలసినప్పుడు లేదా ప్లాంటు రూ 10,000 లకంటె యెక్కువ ఖరీదగునప్పుడు ప్రత్యేక షరతులు యేర్పాటు చేయబడును.

9. తనిఖీ చేయబడిన తర్వాతనున్ను, యేదేని ప్లాంటుకుగాను వుత్తరవు చేయబడుటకు పూర్వమున్ను ఒక దరఖాస్తుదారుడు తన స్కీమును వదలుకొనుటకు కోరినెడల, తనిఖీ రుసుము రూ 10 లున్ను, వుదా రంగు అచ్చు ప్లానులు తయారు చేయబడినయెడల, ప్లానులు తయారుచేసినందుకు రూ 10 లున్ను మినహాయించి, చెల్లింపబడిన రుసుములు ధరావతులున్న వాపసు చేయబడును.

10. దరఖాస్తుదార్లు దరఖాస్తులు పంపుకొనిన తరువాత మనస్సు త్రిప్పుకొనినయెడల నష్టముకల్గితే డిపార్టుమెంటువారు బాధ్యులుకారు.

11. యావత్తు సామానులను, కూలి పనిని దరఖాస్తుదారుడు యేర్పాటు చేసుకొనవలెను.

12. సప్లయిచేయనట్టి ఫరమువారిచే ప్లాంటు నిర్మింపబడనున్న నే తప్ప లేదా దాని స్థాపనమీద ఇండస్ట్రీసు డిపార్టుమెంటువారిచే పై తనిఖీ చేయబడనున్న నే తప్ప యే ప్లానులున్ను తయారు చేయబడవు, మరిన్ని యే ప్లాంటుకుగాని వుత్తరువు పంప బడదు.

13. ఇంతకు పూర్వమే ప్లాంటును కొనియుందు నఫరులు పై చెప్పిన షరతుల ప్రకారమే డిపార్టుమెంటువారు దాని స్థాపనమీద, పై తనిఖీచేయుటకై దరఖాస్తు పెట్టుకోవచ్చును. అయితే ప్లాంటును పరీక్ష చేయుటకొరకు యేర్పాటుచేయు హక్కు డైరెక్టరుకు వుండును. (దీనికి తగు ఖర్చులు రూ 10 లు.) అట్లు పరీక్ష చేయబడి నను, ప్లాంటు సరిపడియుండలేదనిగాని, తప్పుగా యేర్పాటు చేయబడినదనిగాని లేదా వేరే యే విధముననైనను అనక్షేపణీయమైనదనిగాని డైరెక్టరు తలచినయెడల, అతడు డిపార్టుమెంటు మూలకముగా సహాయ్యము నీయక నిరాకరించవచ్చును.

14. ప్రథమ దఫా ప్లాంటును స్థాపించుటకొరకు కాకుండ వేరే కార్యములకొరకు డిపార్టుమెంటువారి యింజనీరింగు పని కావలసినయెడల, అట్టి పనులకు యీ క్రింది ప్రకారము రోజువారి రేట్లు చార్జీ చేయబడును :—

ఒక సూపరువైజరుకుగాను మొదటి రోజునకు రూ 10 లును, దానితోపాటు దరిమిలా ప్రతి రోజునకు రూ 6 లును.

ఒక మెకానిక్‌కు (యంత్రములు నడుపువారికి).—మొదటి రోజునకు రూ 7-8-0 లు దానితోపాటు దరిమిలా ప్రతి రోజునకు రూ 4 లు.

15. దరఖాస్తుదారులు బాధ్యులగు కారణములవల్ల విడువకుండ పని జరుపుటలో యేదేని భంగము కలిగినయెడల, తిరిగి పని ప్రారంభింపబడిన తరువాత మొదటి రోజుకు చార్జి చేయబడు రుసుములు సూపరువైజరుకు రూ 10 లు, మెకానిక్‌కు రూ 7-8-0 లుగను వుండును.

డైరెక్టరుకు 14 వ రూలులో చెప్పిన విషయము రోజువారీ రుసుములపైని 8 వ రూలులో చెప్పిన ప్రకారము పనిచేయనపుడు సూపరువైజరుకాని, మెకానికు గాని, కూలి మనుష్యుల లేమిచే పనిలేకుండునప్పుడు ఖర్చులు తీసుకొనుటకు హక్కు కలదు.

### III. ఇక్‌స్టలేషనులను ఒక పద్ధతి ననుసరించి తనిఖీ చేయుట.

16. ఇక్‌స్టలేషనులను ఒక పద్ధతి ననుసరించి తనిఖీ చేయుటకొరకు డిపార్టుమెంటు వారు యేర్పాటుచేయుదురు.—ఈ తనిఖీ రెండు విధములుగాను నుండును. అవి యేవనగా, డిపార్టుమెంటువారి సౌకర్యమునుబట్టి చేయబడే "రొటీన్ (సామాన్యపు) తనిఖీలు"ను, దరఖాస్తుదారు అవసరముగా చేయబడవలెనని కోరినమీద చేయబడే 'స్పెషలు (ప్రత్యేకమయిన) తనిఖీలు.'

17. ప్రారంభమునందు 1, 2, 3 తరగతులకు రూ 10 లు రుసుమున్ను, 4, 5 తరగతులకు రూ 50 లు రుసుమున్ను విధింపబడును. దీనిలో మూడు రొటీను తనిఖీల ఖర్చు చేరియుండును. కాని రుసుముయొక్క విలువ మొత్తము పూర్తిగా వినియో గింపబడనియెడల వాపసులు యేమిన్ని చేయబడవు. ఇదిగాక దీనిలో సంవత్సరమునకు రెండు పర్యాయములకంటె యెక్కువకాకుండా తటాలున పని నిల్చిపోయే సందర్భ

మందు ప్రత్యేకముగ వచ్చి చూచుటకు (విజిటుకు) తగిలే ఖర్చులున్ను చేరును. ఇట్లు ప్రారంభమునందు విధింపబడే రుసుములో చేరినవి కాకుండా వేరే యెక్కువ స్పెషలు తనిఖీలు లేదా విజిట్లు, ప్రతి విజిటుకు ఒక మెకానిక్కుకు రూ 5 లు వంతునను, ఒక సూపరువైజరుకు రూ 7-8-0 లు వంతునను చార్జీ కట్టబడును.

18. ప్రత్యేకముగా వెళ్లినందుకుగాని, సగటున యేడాదిలో వెళ్లి చూచుచుండుటకుగాని, విర్వాప్తమైన రుసుము చెల్లించిననే యిక్స్పెక్షన్ తనిఖీ చేయవలెను. ఒకసారి చెల్లించిన రుసుముకు సంబంధించిన కాలము అయిపోగానే, మరల తనిఖీ చేయుటకు దరఖాస్తు రుసుము, డిపార్టుమెంటుకు చేరకపోయినప్పుడు డిపార్టుమెంటువారు ఒక నోటీసు జారీ చేయవలెను.

19. యంత్రములకు యేమైన మరమ్మత్తులు చేయవలసివచ్చినప్పుడు 17 వ పేరాలో వివరించిన రుసుముగాక ఆ మరమ్మత్తుకయ్యే సామాను, కూలి, దరఖాస్తుదారే భరించవలెను.

20. యంత్రములు సరిగా పనిచేయు స్థితిలోనున్నవని పరీక్షచేసి తెలుసుకొన్న పిమ్మటనే డిపార్టుమెంటువారు పై విధమైన తనిఖీకి ఒప్పుకొందురు. యంత్రములు సరియైన స్థితిలో లేనప్పుడు వాటికి యేయే మరమ్మత్తులు అవసరమో దరఖాస్తుదారునకు తెలియచేయబడును. అటువంటి మరమ్మత్తులు జరిపించిన పిమ్మటనే డిపార్టుమెంటువారు తనిఖీకి పూచీపడుదురు. అటువంటి మరమ్మత్తులు డిపార్టుమెంటువారిద్వారానే జరిపించవలెనని దరఖాస్తుదారు కోరినయడల 14 వ పేరాలో చెప్పిన రుసుము చెల్లగానే డిపార్టుమెంటువారు అందుకుతగిన యేర్పాట్లు చేయుదురు.

21. ఇండస్ట్రీసు డైరెక్టరుగారు యే విధమైన కారణములు తెలుపకయే, యేవైన యంత్రములు తనిఖీచేయుటకు పూచీ పడకపోవచ్చును.

## IV. భూమియందు రంధ్రముచేయు యంత్ర సామగ్రి—చేతితో రంధ్రముచేయు యంత్ర సామగ్రి.

22. చేతితో రంధ్రముచేయు యంత్ర సామగ్రి సంబంధమైన యే సంగతిగాని తెలిసికొనవలసియుండునెడల మొదట లోకల స్థానిక (ఇండస్ట్రీసు) సూపరువైజరుకుగాని లేదా లోకల అసిస్టెంటు డండస్ట్రీసు ఇంజనీయరుకుగాని లేక మదరాసు, చేపాకము, పోస్టు బాక్సు నెం 402 య డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీసువారికిగాని వ్రాసి తెలిసికొనవచ్చును.

23. డిపార్టుమెంటువారికి వున్న చేతితో రంధ్రముచేయు వుపకరణములు సాధారణమైన భూములయందు 200 నుండి 800 అడుగులవరకు రంధ్రము వేయును, కాని రాతి పొరలయందు రంధ్రము వెయుటకు తగినది కావు. ఇంకను లోతుగా రంధ్రము వెయవలసియున్నను లేదా గాతి పొరలలో రంధ్రము చేయవలసినను ఒక పవరు డ్రిల్లు వుపయోగించవలసియుండును. క్రిందవచ్చు V వ సెక్షన్ చూడుడు.

డిపార్టుమెంటువారు చేతి యంత్రములోగాని, మర యంత్రముతోగాని రంధ్రములు దొల్చినప్పుడు, మంచినీరు వుప్పునీరు పడుట నిశ్చయించుటగాని, పూచీ పడజాలరు.

భంగ్రముచేయు భూమి యంత్రమునకు అపాయకరమని తోచినపుడు అసిస్టాంటు యిండస్ట్రియల్ యింజినీరుగారు 150 అడుగలకన్న యెక్కువలోతు దొల్చుట ఆపు చేయుటకు అధికారము కలదు. యంత్రములకు నష్టము కలిగినను, అంతకన్న లోతుగా దొల్చుటకు దరఖాస్తుదారు కోరినయెడల డైరెక్టరువారికి అవసరమని తోచిన షరతులకు, అందువల్ల డిపార్టుమెంటుకు కలిగిన నష్టములు భరించుటకున్నూ ఒప్పుకొని పూచీకత్తు వ్రాసియిచ్చినయెడల డైరెక్టరుగారు అట్లు లోతుగా దొలచుటకు అంగీకరింప వచ్చును. ఈ అంగీకారము వారి యిష్టాయిష్టములకు విడిచిపెట్టబడెను.

24. భూమి దొల్చుటకు దరఖాస్తులు పెట్టినపుడు యీ దిగువ వివరింపబడిన రేట్ల ప్రకారము యంత్ర సామగ్రి తెచ్చుటకు రవాణా కర్చులు ముందుగా కట్టబడినయెడల ఆ దరఖాస్తులు మటుగు మాత్రమే రిజిష్టరుచేయబడును. I, II, III తరగతుల నుండి దరఖాస్తులకు రవాణా రుసుము రూ 7-8-0 లు, 4 రోజుల అద్దెకుగాను రూ 8 లు బజానాయున్ను కట్టవలెను. IV, V తరతులకు రవాణా రుసుము రూ 37-8-0 లున్ను, మొదటి 4 రోజులకు ఖర్చుల నిమిత్తము రూ 80 లున్న కట్టవలెను. ఈ యంత్ర సామగ్రి యిచ్చెదమని వుత్తరవు జారీచేసిన తేది మొదలుకొని 5 రోజులలోపుగా తన స్వంత కర్చులపైన దరఖాస్తుదారుడు సామగ్రి తీసుకు వెళ్లదనని దరఖాస్తులో తెలియజేసినయెడల అడ్వాన్సు రవాణాల సొమ్ము తోసివేయబడును. నూతులలో పని చేయవలసివచ్చునపుడు, పని అయిన తర్వాతగాని, పని నిల్పివేసినప్పుడుగాని, నూతులోనుండి సామాను బయిటకు తీయుటకు ఒకవేళ కూలివాళ్ల ఆలస్యమున్నయెడల తగులు అదనపు కర్చుల నిమిత్తను రెట్టింపు అడ్వాన్సు కట్టవలెను.

25. మంజూరైన దరఖాస్తులకు పని జరిపించుటలో స్థలమును పట్టి డిపార్టుమెంటువారు వరుస నేర్పఱచుదురు. అట్టి ఏర్పాటు ప్రకారం ఎప్పుడు ఏ దరఖాస్తుదారుకు యంత్రములు సప్లయిచేయుదురో ముందుగా తెలియచేయబడును. నిర్ణయింపబడిన స్థలమునకు చేర్చిన వెనుక యంత్రములు వినియోగింపనిచో అందుకుగా చెల్లించిన రవాణాఖర్చులు మినహాయించి అడ్వాన్సు వాపసు చేయబడును.

26. రవాణా ఖర్చులు యంత్రసామగ్రి పనిచేయవలసిన స్థలమునకు తీసికొనుపోవుటకు అయ్యే వ్యయము నిమిత్తము ఉద్దేశింపబడినవి. యీ విషయమై దరఖాస్తుదారు చెల్లించిన పైకముకన్న అసలు ఖర్చులు తక్కువైనప్పుడు మిగిలినది వాపసు చేయుట గాని ఎక్కువైనపుడు ఆ యెక్కువ డిమాండు చేయుటగాని జరుగదు.

27. I, II, III, తరగతుల చేతి దోలుపు పనిముట్లు గాడుకకు దినము 1 కి రూ 2 లు చొప్పుననూ, IV,V తరగతుల పనిముట్లకు దినము 1 కి రూ 20 లు చొప్పునన్నూ రుసుము యివ్వవలసియుండును. యీ రుసుములో పనిముట్ల అద్దెయున్నూ వాటితో పనిచేయు మేస్త్రీ జీతమున్నూ చేరియున్నవి. పని చేయుటకు కావలసిన యితర సామగ్రులు కూలి వగైరాలు మాత్రం దరఖాస్తుదారే జతపెట్టవలయును.

28. మొదటి అడ్వాన్సు పైకము 4 దినముల ఛార్జీలకు సరిపోవును. అది అయిపోగానే మొదట చెల్లించిన మొత్తమునకు తక్కువకాకుండా మరల అడ్వాన్సు జమకట్టవలయును. ఈ పని ఎప్పుడున్నూ అరువు చేయబడదు గనుక అట్లు వెంటనే పైకం చెల్లింపనియెడల అంతకుముందు చెల్లించిన పైకము సరిపోయిన వెంటనే పని ఆపుచేయబడును.

**29.** దొలుచుట పని పూర్తికాగానే అందు విషయమై చెల్లించిన అడ్వాన్సులు పని జరిగిన రోజులకు లెఖ్ఖ తేలిన పైకం గాక ఏమైన మిగిలిన యెడల వాపసు చేయబడును. నూతులలో దొల్చునపుడు పని పూర్తి అయినప్పటినుంచిగాని ఆపు చేయించినప్పటినుంచి గాని 48 గంటలలోపున యంత్రములు నూతులలోనుండి పైకి తీయించుటకు కావలసిన పనివాండ్రను దరఖాస్తుదారు జతపెట్టవలయును. అట్లు చేయనియెడల ఆ యంత్రములు నూతులోనుండి పైకితీసి బండ్ల నెక్కించువరకు అగు అద్దెలకు దరఖాస్తుదారుడే బాధ్యుడు. 24 వ పేరా ప్రకారం పుచ్చుకొన్న ఎక్స్ట్రా పైకము యిందు విషయమై వినియోగింపబడును. దరఖాస్తుదారుడు ఆలస్యము లేకుండా పనివాండ్రను జతపెట్టినయెడల ఆ పైకము వాపసుచేయబడును.

**30.** పనిముట్లు పనిచేయు స్థలమున యున్నంత కాలము అడ్వాన్సు చెల్లించక పోయినందువల్లగాని పనివాండ్రను జతపర్చక పోయినందువల్లగాని యింకా యితరమైన విపరీత అభ్యంతరములవల్లగాని పనిచేయకపోయిననూ ఆ పూర్తికాలమునకు అద్దె వసూలు చేయబడును. ప్రమాద వశాత్తుగాని ఎక్కువ వర్షములవల్లగాని వశముతప్పి మరి ఏ యితర కారణములవల్లగాని పని జరుగక పోయినయెడల ఆ దినములకు అద్దె కోరబడదు. సర్కారువారు నిర్ణయించిన శెలవు దినములలో ఆ గ్రామములలో జరుగు సంత దినములలోను పనిచేయకపోయినయెడల అద్దె యియ్యనక్కరలేదు. నెలలతరబడిని యంత్రములను అద్దెకు తీసుకొనినపుడు మాత్రం సర్కారు నిర్ణయించిన శెలవుదినములు ఆ గ్రామపు సంత దినములు కలిపి లెఖ్ఖపెట్టియే అద్దె వసూలుచేయబడును. పనిముట్లకుగాని, గొట్టములకు గాని, కన్నములకుగాని ఏదైన ప్రమాదము సంభవించిన యెడల అది సరిచేయుటకు కావలసిన కూలి వస్తుసామగ్రి వగయిరాలు దరఖాస్తుదారే జతపర్చవలయును. డయిరెక్టరువారు ఏమైన ప్రత్యేక సమయములలో యీ విషయమైన ఖర్చులు పూర్తిగాగాని కొంతగాని దరఖాస్తుదారునుండి పుచ్చుకొనుటమాని వేయవచ్చును. అది వారి యిష్టాయిష్టముపై ఆధారపడి యుండును.

**31.** దొలచుటవలన కలిగిన ఫలితములు దరఖాస్తుదారుకి తెలియజేస్తూ నీటి వసతిని ఎలా వాడుక చేయవలసినది కూడా డిపార్టుమెంటు వారే సలహా యిస్తారు. దొలచిన రంధ్రము సరిగా పనిచేయునది లేనిది చూచుటకై కావలసిన పనివాళ్లను, వస్తువులను దరఖాస్తుదారే జతపెట్టవలెను.

**32.** లోపల నీరు తగలగానే దొల్చుటకు దింపిన గొట్టము దరఖాస్తుదారు కోరినయెడల రంధ్రములోనే విడిచిపెట్టివేయబడును. దానిఖరీదు మాత్రము అతడే భరించవలెను. నీరు దొరకనప్పుడు మాత్రము రంధ్రములో దింపిన గొట్టములు తీసివేయుటకు గావలసిన పనివాళ్లను సామానులు వగైరాలు దరఖాస్తుదారే జతపెట్టవలెను.

**33.** చేతితో దొలచు పనిముట్లు నెలలతరబడిని యీ దిగువ వివరించెడి రేట్ల ప్రకారము అద్దె ముందుగా చెల్లించి ఉపయోగించవచ్చును :—

| | I, II, III తరగతులకు. | IV, V తరగతులకు. |
|---|---|---|
| ఒక నెల వరకు ... | రోజుకు రూ 2 లు చొప్పున, రూ 100 లకు ఎక్కువ కాకుండా. | రోజుకు రూ 20 లు చొప్పున రూ 400 లకు ఎక్కువ కాకుండా. |

| | I, II, III తరగతులకు. | IV, V తరగతులకు. |
|---|---|---|
| ఒక నెల పైబడి మూడు నెలలకు పైబడని కాలమునకు. | నెలకు రూ 40 లు చొప్పున, రూ 100 లకు ఎక్కువ కాకుండా. | నెలకు రూ 400 లు చొప్పున రూ 1,000 లకు ఎక్కువ కాకుండా. |
| ఆరు నెలలకు ఎక్కువ గాని కాలమునకు. | మొదటి మూడు నెలలకు రూ 100 లున్నూ ఆ పైన నెలకు రూ 40 లు చొప్పున మొత్తము రూ 200 లకు దాటకుండా. | మొదటి మూడు నెలలకు రూ 1,000 లున్నూ ఆ పైన నెలకు రూ 400 లు చొప్పున మొత్తము రూ 2,000 లకు దాటకుండా. |
| ఆరు నెలలకు పైబడిన కాలమునకు. | మొదటి ఆరు మాసములకు రూ 200 లు ఆ పైన నెలకు రూ 40 లు చొప్పున మొత్తము మూడేసి మాసములకు రూ 100 లు మించకుండా. | మొదటి ఆరు నెలలకు రూ 2,000 లు ఆపైన నెలకు రూ 400 లు మొత్తం మూడేసి మాసములకు రూ 1,000 లు మించకుండా. |

(రవాణా ఛార్జీలు వీటిలో చేరవు.)

34. రంధ్రములను తొలుదు చేతి ఉపకరణములుచేసిన జయప్రదము కానట్టి గంధ్రముల విషయములో దరఖాస్తుదారు చెల్లించిన అడ్వాన్సు రోజు బాడుగయును తిరిగి యిచ్చివేయబడును. ట్రాన్సుపోర్టు ఛార్జీలు మాత్రము అట్లు తిరిగి యిచ్చివేయబడవు. ఒక రంధ్రము జయప్రదముగా చేయబడినదో లేదో ప్రతి సందర్భము యొక్క గుణానుగుణములనుబట్టి యిండస్ట్రీసు డైరెక్టరువారిచే తీర్మానింపబడును. మరిన్ని ఆయన తీర్మానము కడపటిదై యుండును. రంధ్రములో చౌడు నీరుగాని, ఉప్పునీరుగాని పడినయెడల ఆ ప్రయత్నము వృథా యనిపించుకొనదు. ఎట్టి వాపసను చేయబడదు.

35. ఇండస్ట్రియల్ డైరెక్టరువారు ఏ కారణములను తెలుపకయే దొలుచుట పని కట్టిపెట్టి దరఖాస్తుదారు చెల్లించిన పైకమును వాపసు చేయవచ్చును.

V. భూమిలో రంధ్రముచేయు యంత్రము—పవరు డ్రిల్లులు.

36. డిపార్టుమెంటువారి వద్దనున్న పవరు డ్రిల్లులు యే విధమైన రాతియందుగాని సాధారణముగా 500 అడుగుల లోతువరకు రంధ్రము చేయును. రంధ్రము చేయబడే భూమి పవరుడిల్లునకు ఎక్కువ అపాయకరమని కనబడినప్పుడు 350 అడుగులకంటె క్రిందికి రంధ్రము చేయకుండ యే సమయమందయినను అసిస్టెంటు ఇండస్ట్రియలు ఇంజనీర్లు రంధ్రముచేయు పనిని నిలిపివేయవచ్చును. అంతకన్న లోతుగా దొలచుటకు దరఖాస్తుదారు కోరినయెడల డైరెక్టరువారికి అవసరమని తోచిన షరతులకు, అందువల్ల డిపార్టుమెంటుకు కలిగే నష్టములను భరించుటకు ఒప్పుకొని పూచీకత్తు వ్రాసియిచ్చినయెడల డయిరెక్టరువారు అట్లు లోతు దొలుచుటకు అంగీకరింపవచ్చును. యీ అంగీకారము వారి యిష్టాయిష్టములను బట్టి యుండును.

37. పవరు డ్రిల్లులు గురించి యే సమాచారముగాని తెలిసికొనవలసియుండిన యెడల స్థానిక ఇండస్ట్రియలు సూపరువైజరుకుగాని లేదా అసిస్టెంటు ఇండస్ట్రియలు ఇంజనీయరుకుగాని లేదా మదరాసు, చేపాకము పోస్టు బాక్సు నె 432 రు డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీసుగారికి గాని వ్రాసి తెలుసుకొనవచ్చును.

38. ప్రథమమందు యే రుసుములుగాని అడ్వాన్సులుగాని కోరబడవు. కాని పవరు డ్రిల్లుల నుపయోగింప గోరుచు చేయబడు దరఖాస్తుల రిజిస్టరు ఒకటి వుంచ బడును.

39. రిజిష్టరు చేయబడిన దరఖాస్తుల విషయమై విక్రమము ననుసరించి చర్య తీసుకొనబడునో అది రంధ్రము చేయబడవలసియుండు స్థలమునుబట్టి డైరెక్టరు ఆఫ్ యిండస్ట్రీసు వారిచే నిశ్చయింపబడును. సదరు డ్రిల్లు దరఖాస్తుదారు యుపయోగార్థమై ఎప్పుడు యిచ్చేదీ ముందుగా తెలియజేయబడును. ఆ నోటీసు అందగానే రవాణా ఖర్చు లున్ను యీా దిగువ నుదహరించిన అడ్వాన్సులున్ను చెల్లించవలెను :—

I, II, III తరగతులకు రవాణా కర్చులు రూ 75 లున్ను అడ్వాన్సు రూ 100 లు.

IV, V తరగతులకు రవాణా కర్చులు రూ 150 లున్నూ అడ్వాన్సు రూ 1,000 లు.

ఈపైకము నోటీసుచేరిన 5 దినములలోగా చెల్లకపోయినయెడల దరఖాస్తు రద్దుచేయబడును. యంత్రము సిద్ధముగా నున్నదని తెలియజేయు నోటీసు అందిన 5 దినములలోగా దరఖాస్తుదారు డ్రిల్లు తీసుకొనిపోవుటకొప్పుకొని అందుకయే కర్చులు తానే భరింతునని దరఖాస్తులో తెలియజేసినయెడల రవాణా చార్జీలు వసూలు చేయబడవు.

40. దరఖాస్తుదారు నిర్ణయింపబడిన కాలములోపల తానే తీసుకొని పోవుదునని చెప్పినప్పుడు తప్ప సాధారణముగా డ్రిల్లుపని చేయవలసిన స్థలమునకు తీసుకొని పోవు ఏర్పాట్లు డిపార్టుమెంటువారే చేయుదురు. రవాణా కర్చులు యంత్ర సామగ్రులు పనిచేయవలసిన స్థలమునకు తీసుకొనిపోవుటకు అయ్యే వ్యయము నిమిత్తము ఉద్దేశింపబడినది. యీా విషయమై దరఖాస్తుదారు చెల్లించిన పైకము కన్న అసలు కర్చులు తక్కువైనప్పుడు మిగిలినది వాపసుచేయుటగాని ఎక్కువైనవుడు ఆ ఎక్కువ డిమాండు చేయుటగాని జరుగదు. స్థలమునకు తీసుకొని వచ్చినపిమ్మట డ్రిల్లు ఉపయోగింపకపోయినయెడల రవాణా చార్జీలు వాపసు చేయబడవు.

41. కనీసము రూ 30 లకు మొత్తమునకు లోబడి పవరు డ్రిల్లు వుపయోగించుకొన్నందులకు, I, II, III తరగతులకు దినమునకు రూ 6 లున్ను, IV, V తరగతులకు మొత్తము రూ 300 లకు తక్కువ కాకుండా, దినమునకు రూ 60 లు వంతున రుసుము నిర్ణయము.

యీా రుసుము నందు డ్రిల్లుకుగాను అద్దెయున్ను, దానితో సంబంధించిన పనిని నడపుటకు అవశ్యకమైన అనుభవ శాలుర వేతనమున్ను చేరును. దీనికి సంబంధించిన కూలి, వంటచెరుకు, నూనె వగైరా యావత్తు యితర కర్చులు దరఖాస్తుదారుడే భరించవలెను.

42. రూ 100 లు అసలు అడ్వాన్సు రమారమి పదునారు రోజులవరకు డ్రిల్లు అద్దెకు సరిపోవును. ఆ మొత్తము ఖర్చు అయిపోయిన తరువాత ఒక్కొక్కసారి కనీసము రూ 100 లు అదనపు అడ్వాన్సులు తక్షణమే చెల్లింపబడవలెను. అరువు పద్ధతిమీద రంధ్రములుచేయు పని యే సందర్భమందును జరుపబడదు. గనుక అడ్వాన్సు ఖర్చయిపోయిన తక్షణమే అదనపు అడ్వాన్సులు క్రమప్రకారము చెల్లింపబడిననే తప్ప పని నిలిపివేయబడి డ్రిల్లు ఆ స్థలమునుండి దీసుకపోబడును.

43. దరఖాస్తుదారు చెల్లించిన సొమ్ములో 41 పేరాలో నిర్ణయించబడ్డ కనీసపు అద్దె మినహాయించుకోగా మిగతా సొమ్ము పని పూర్తికాగానే వాపసు చేయబడును.

44. పనిముట్లు పనిచేయు స్థలమున ఉన్నంత కాలము అడ్వాన్సు చెల్లించకపోయినందువల్లగాని, పనివాండ్రను జతపర్చకపోయినందువల్లగాని, యింకా విపరీతమైన అభ్యంతరములవల్లకాని పనిచేయకపోయినను ఆ పని పూర్తికాలమునకు అద్దె వసూలు చేయబడును. ప్రమాదవశాత్తుగాని ఎక్కువ వర్షములచేతగాని, వశము తప్పిన యితరకారణములవల్లగాని పనిజరుగక పోయినయడల ఆ దినములకు అద్దె కోరబడదు. సర్కారు నిర్ణయించిన శలవు దినములలోను, ఆ గ్రామములో జరుగు సంతదినములలోను పనిచేయకపోయినను అద్దె యియ్యనక్కరలేదు. పనిముట్లకుగాని, గొట్టములకుగాని, కన్నములకుగాని ఏదయిన ప్రమాదము సంభవించినయడల అది పనిచేయుటకు కావలసిన కూలి వస్తుసామగ్రి వగయిరాలను దరఖాస్తుదారే జతపర్చవలెను. డయిరెక్టరువారు ఏదయిన ప్రత్యేక సమయములలో యీ విషయములైన ఖర్చులు పూర్తిగాగాని కొంతగాని దరఖాస్తుదారునుండి పుచ్చుకొనుట మానివేయవచ్చును. అది వారి యిష్టాయిష్టములపై ఆధారపడి యుండును.

45. దొలచుటవలన కలుగు ఫలితములు దరఖాస్తుదారుకి తెలియజేస్తూ నీటివసతిని ఏలాగు వాడుక చేయవలసినది కూడా డిపార్టుమెంటు వారే సలహానిస్తురు. దొలచిన రంధ్రము సరిగా పనిచేయునది లేనిది చూచుటకై కావలసిన పనివాళ్లను, వస్తువులను దరఖాస్తుదారే జతపెట్టవలెను.

46. లోపల నీరు తగలగానే దొల్చుటకు దింపిన గొట్టము దరఖాస్తుదారు కోరినయడల రంధ్రములోనే విడిచిపెట్టబడును. దాని ఖరీదు మాత్రము అతడే భరించవలెను. నీరు దొరకనప్పుడు మాత్రము రంధ్రములో దింపిన గొట్టములు తీసివేయుటకు గావలసిన పనివాళ్లను, సామానులు వగైరాలు దరఖాస్తుదారే జతపెట్టవలెను.

47. ఇండస్ట్రియల్ డైరెక్టరువారు ఏ కారణములను తెలుపకయే దొలుచుట పని కట్టిపెట్టి దరఖాస్తుదారు చెల్లించిన పైకమును వాపసు చేయవచ్చును.

### VI. పంపింగు (నీళ్లతోడే) యంత్రము.

48. డిపార్టుమెంటువారివద్దనున్న యింజనులు మొత్తము 50 అడుగుల యెత్తువరకు ఒక నిముషమునకు 150 నుండి 325 గ్యాలనులవరకు నీళ్లు తోడగలవు. ఎక్కువ వేగముగల టెస్టింగు ఇంజనులు ఒక్కసారి విడువకుండ 4 ఘంటలకంటె యెక్కుడు కాలము లేదా ఒక్క పగలు రాత్రి అనగా 24 ఘంటల కాలములో 8 ఘంటలకంటె యెక్కువ కాలము నడుపబడవు. ఈ విధియందలి చివర భాగము సాధారణమైన (క్రూడు ఆయిలు) పంపింగు యంత్రములకుకూడ అన్వయించును.

49. పంపింగు యంత్రములను గురించి యే సమాచారముగాని తెలిసికోవలసి యుండినయెడల స్థానిక ఇండస్ట్రియలు సూపరువైజరునకుగాని లేదా అసిస్టెంటు ఇండస్ట్రియలు యింజనీయరుకుగాని మదరాసు, చేపాకము పోస్టు బాక్సు నె 482 రు డైరెక్టరు అఫ్ ఇండస్ట్రీసువారికిగాని వ్రాసి తెలుసుకొనవచ్చును.

50. ప్రథమమందు యే రుసుములుగాని, అడ్వాన్సులుగాని కోరబడవు. కాని పంపింగు యింజనులను వుపయోగింప గోరుచు చేయబడు దరఖాస్తుదారుల రిజిస్టరు ఒకటి వుంచబడును.

51. రిజిష్టరుచేసిన దరఖాస్తులు ఆలోచనలోనికి యే క్రమము ననుసరించి తీసుకొనబడునో అది స్థలమునుబట్టి డైరెక్టరు అఫ్ ఇండస్ట్రీసువారు నిర్ణయించగలరు. దరఖాస్తుదారుల వుపయోగార్థము యెప్పుడు ఒక పంపింగు యంత్రము వారి వశమున చేయబడునో ఆ విషయమై వారికి క్రమప్రకారము సమాచారము తెలియచేయబడును. నోటీసు అందిన తక్షణమే దరఖాస్తుదారుడు పంపింగు యంత్రమును ఆ స్థలమునకు తీసికొనిపోవుటకు I, II, III తరగతులకు ట్రాన్సుపోర్టు రుసుము రూ 50 లున్ను, రూ 20 లు అడ్వాన్సున్ను ; IV, V తరగతులకు, ట్రాన్సుపోర్టు రుసుము రూ 100 లున్ను ; రూ 200 లున్ను చెల్లించవలెను.

నోటీసు అందిన తరువాత అయిదు రోజులలోపల ఆ మొత్తము చెల్లించబడని పక్షమున ఆ దరఖాస్తు రద్దయినట్లు భావింపబడును. అయినను యంత్రములు యివ్వజూపబడిన తేదీనుండి అయిదు రోజులలోగా వాటిని తానే తన స్వంత ఖర్చుపైని ట్రాన్సుపోర్టు చేసుకొనుటకు సిద్ధముగా నున్నట్లు తన దరఖాస్తులో దరఖాస్తుదారుడు తన యుద్దేశమును తెలుపునెడల ట్రాన్సుపోర్టు రుసుము అడ్వాన్సు విడిచిపెట్టబడును.

52. దరఖాస్తుదారు నిర్ణయింపబడిన కాలములోపల తానే తీసుకొని పోవుదునని చెప్పినప్పుడు తప్ప సాధారణముగా యంత్రము, పనిచేయవలసిన స్థలమునకు తీసుకొనిపోవు ఏర్పాట్లు డిపార్టుమెంటు వారే చేయుదురు. రవాణా కర్చులు యంత్ర సామగ్రులు పనిచేయవలసిన స్థలమునకు తీసుకొని పోవుటకు అయ్యే వ్యయము నిమిత్తము ముద్దేశింపబడినది. యీ విషయమై దరఖాస్తుదారు చెల్లించిన పైకముకన్న అసలు కర్చులు తక్కువైనప్పుడు మిగిలినది వాపసు చేయుటగాని, ఎక్కువైనప్పుడు ఆ ఎక్కువ డిమాండు చేయుటగాని జరుగదు. స్థలమునకు తీసుకొని వచ్చిన పిమ్మట యంత్రము వుపయోగించకపోయినయెడల రవాణా చార్జీలు వాపసుచేయబడవు.

53. I, II, III తరగతులకు కనీసము రు 15 ల మొత్తమునకు లోబడి పంపింగు యంత్రములు వుపయోగించుకొన్నందుకు రుసుము దినమునకు రూ 3 లు. IV, V తరగతులకు రూ 150 లకు తక్కువ కాకుండా దినము 1 కి రూ 30 లు. ఈ రుసుమునందు యంత్రమునకుగాను అద్దెయున్ను దానిని నడుపుటయందు అనుభవము గల డ్రయివరుకు వేతనమున్ను చేరును. పనికి సంబంధించిన యావత్తు యితర ఖర్చులను దరఖాస్తుదారుడే భరింపవలెను. దరఖాస్తుదారు కూలీలను సరఫరా చేయవలెను. మరిన్ని ఆ యంత్రము నుపయోగించుటకు కావలసియున్న వంటచెరుకు నూనె యితర స్టోర్సు అతడు యివ్వవలెను.

54. అడ్వాన్సు సరాసరి ఆరు రోజులవరకు యంత్రము అద్దెకు సరిపోవును. ఆ మొత్తము ఖర్చయిపోయిన తర్వాత ఒక్కొక్క సారి కనీసము మొదట చెల్లించిన

చానికి తక్కువకాకుండ అదనపు అడ్వాన్సు తక్షణమే చెల్లించవలెను. అప్పు పద్ధతిని యీ పంపింగు పని యే సందర్భమునందును జరుపబడదు. గనుక అడ్వాన్సు ఖర్చయిపోయిన తక్షణమే అదనపు అడ్వాన్సులు క్రమప్రకారము చెల్లించబడిననే తప్ప పని నిలిపివేయబడి యంత్రము ఆ స్థలమునుండి తీసుకుపోబడును.

55. దరఖాస్తుదారు చెల్లించిన సొమ్ములో 41 వ పేరాలో నిర్ణయించబడ్డ కనీసపు అద్దె మినహాయించుకోగా మిగతా సొమ్ము పని పూర్తి కాగానే వాపసు చేయబడును.

56. పనిముట్లు పనిచేయు స్థలము నున్నంతకాలము అడ్వాన్సు చెల్లించక పోయినందువల్లగాని, పనివాండ్రను జతపర్చకపోయినందువల్లగాని యింకా యితర విపరీత అభ్యంతరములవల్లకాని పని చేయకపోయిననూ, ఆ పూర్తి కాలమునకు అద్దె వసూలు చేయబడును. ప్రమాదవశాత్తుగాని, యెక్కువ వర్షములవల్లగాని, వశము తప్పి మరి వీ యితర కారణములవల్లగాని పని జరుగకపోయినయడల ఆ దినములకు, అద్దె కోరబడదు. సర్కారువారు నిర్ణయించిన శలవు దినములలోను, ఆ గ్రామములో జరుగు సంత దినములలోను పని చేయకపోయినయడల అద్దె యీయ నక్కరలేదు. నెలం తరవడిని యంత్రమును అద్దెకు తీసుకొనినప్పుడు మాత్రం, సర్కారు నిర్ణయించిన శలవు దినములు, ఆ గ్రామపు సంత దినములు కలపి లెక్క పెట్టి యే అద్దె వసూలు చేయబడును. పనిముట్టకుగాని యంత్రముకుగాని, నూతికిగాని యేదైన ప్రమాదము సంభవించినయడల అది సరిచేయుటకు కావలసిన కూలి, వస్తు సామగ్రి వగైరాలు దరఖాస్తుదారే జతపర్చవలయును. డైరెక్టరువారు ఏమైన ప్రత్యేక సమయములలో యీ విషయమైన ఖర్చులు పూర్తిగాకాని, కొంతగాని, దరఖాస్తుదారువద్దనుండి పుచ్చుకొనుట మానివేయవచ్చును. అది వారి యిష్టా యిష్టముల పై ఆధారపడియుండును.

57. మడ్డినూనె (Liquid fuel) ఉపయోగింపబడి నడుపబడే కొన్ని ప్రత్యేకమైన పంపింగు యంత్రములుకూడ పైకము ముందే చెల్లించినమీదట యీ క్రింది షరతుల ప్రకారము నెలసరి అద్దెకు దొరకును. యంత్రము నుపయోగించుకొనువారే నూనెను సరఫరా చేయవలెను. :—

| | I, II, III తరగతులు. | IV, V తరగతులు. |
|---|---|---|
| | రూ. | రూ. |
| ఒక నెలకు ... ... | 75 | 750 |
| మూడు నెలలకు ... ... | 200 | 2,000 |
| ఆరు నెలలకు ... ... | 400 | 4,000 |

నిర్ణయింపబడిన కాలములోగా తామే యంత్రములను తీసికొనిపోవుటకు దరఖాస్తుదారుడు ఒప్పుకొను సందర్భములో తప్ప యంత్రమును తీసుకొని పోవుటకగు ఖర్చుకుగాను 51 వ రూలులో ప్రకారము ట్రాన్సుపోర్టు రుసుము అదనముగా విధింపబడును. ఇతర విషయములలో నెలసరి అద్దెకు సంబంధించిన షరతులు రోజువారి అద్దెకు సంబంధించినవి యెట్టివో అట్టివే. విరామములేకుండ అద్దెకు తీసుకొనినయెడల పై స్కేలు ప్రకారము తేడాలు చెల్లించి అద్దె కాలమును దరఖాస్తుదారులు హెచ్చించుకోవచ్చును.

58. ఇండస్ట్రియల్ డైరెక్టరువారు ఏ కారణములను తెలుపకయే నీళ్ల తోడుట పనిని కట్టిపెట్టి దరఖాస్తుదారు చెల్లించిన పైకమును వాపసు చేయవచ్చును.

## VII. బ్లాస్టింగు (పాషాణములను మందుపెట్టి పగులకొట్టే) యంత్రము.

59. డిపార్టుమెంటువారివద్దనున్న బ్లాస్టింగు యంత్రము నీటి సరఫరాలు అభివృద్ధి చేయుటకుగాను బావులందలి లేదా భూమిలో తొలువబడిన రంధ్రములందలి పాషాణములు పగలగొట్టుటకు వుద్దేశింపబడియున్నది. గట్టిరాతి నేలలయందు మాత్రము బ్లాస్టింగు పని సాధారణముగా వుపయోగకరముగా నుండును.

60. బ్లాస్టింగు యంత్రముగురించి యే సమాచారముగాని తెలిసికొనవలసి యుండిన యెడల స్థానిక ఇండస్ట్రియలు సూపరువైజరుకుగాని లేదా స్థానిక అసిస్టెంటు ఇండస్ట్రియలు ఇంజనీయరుకుగాని లేదా మదరాసు, చేపాకము, పోస్టుబాక్సు నెం 432 రు డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీసుగారికి వ్రాసుకోవలెను.

61. I, II, III తరగతులకు అడ్వాన్సుగా రు 10 లున్ను IV, V తరగతులకు రూ 15 లున్ను రుసుము చెల్లించినమీదట యంత్రము నుపయోగించు కొనుటకుగాను దరఖాస్తు రిజిస్టరు చేయబడును. రిజిస్టరుచేసిన దరఖాస్తులు ఆలోచనలోనికి యే క్రమము ననుసరించి తీసుకోబడునో అది అసిస్టెంటు యిండస్ట్రియల్ ఇంజనీరుగారిచే స్థలమునుబట్టి నిశ్చయింపబడును. దరఖాస్తుదారులు వుపయోగార్థము యెప్పుడు యంత్రమువారికి అమర్చబడునో ఆ విషయమై వారికి క్రమప్రకారము సమాచారము తెలియచేయబడును. బ్లాస్టింగు యంత్రమును యివ్వ జూపినపుడు అది అంగీకరింపబడనియెడల అడ్వాన్సు పైకము దండుగైపోవును.

62. ఒక్కసారి పాషాణమును బద్దలగొట్టుటకు అయ్యే ఖర్చుకు అడ్వాన్సు పైకము సరిపోవును. అదనముగా పగలగొట్టుటకు పైకము ప్రతిసారి రూ 7-8-0 లు రుసుము I, II, III తరగతులకున్ను, రూ 12-8-0 లు IV, V తరగతులకున్ను చెల్లింపవలెను.

63. పాషాణములను పగలగొట్టుటవలన పర్యవసానము దరఖాస్తుదారునకు తెలుపబడును. దీనినిబట్టి అతడేమి పనులు చేయవలయునో అందునుగురించి అతనికి సలహా యివ్వబడును.

64. ఇండస్ట్రియల్ డైరెక్టరువారు ఏ కారణమును తెలుపకయే పగలగొట్టుట పనిని కట్టిపెట్టి దరఖాస్తుదారు చెల్లించిన పైకమును వాపసు చేయవచ్చును.

## VIII. చెఱుకు గానుగ యంత్రము.

65. బాడుగ కివ్వబడుటకు యంత్ర శక్తిచే నడుపబడు గానుగలు డిపార్టుమెంటు వారియొద్ద కొలదిగా నున్నవి.

66. చెరకు గానుగను గురించి యే సమాచారముగాని తెలుసుకోవలసి యుండిన యెడల స్థానిక ఇండస్ట్రీసు సూపరువైజరుకుగాని అసిస్టెంటు ఇండస్ట్రియలు ఇంజనీయరుకుగాని, మదరాసు, చేపాకము, పోస్టుబాక్సు నెం 432 రు, డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీసుకుగాని వ్రాసి కనుగొనవచ్చును.

67. మొట్టమొదట రుసుములుగాని అడ్వాన్సులుగాని అడగబడవు. కాని యంత్రములను వుపయోగింపగోరువారు చేయబడు దరఖాస్తుల రిజిష్టరు ఒకటి వుంచబడును.

68. రిజిష్టరు చేయబడిన దరఖాస్తులు ఏ క్రమము ప్రకారము గమనింపబడునో స్థలమునుబట్టి డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీసువారిచే నిర్ణయింపబడి గానుగ యెప్పుడు తమ వశము చేయబడునది దరఖాస్తుదారులకు క్రమముగా తెలుపబడును. అట్టి నోటీసు అందిన వెంటనే గానుగ మాత్రమే కావలసియున్నయెడల రూ 50 లును, గానుగ యింజను కావలసియున్నయెడల రూ 100 లును అడ్వాన్సుగా దరఖాస్తుదారుడు పంపవలెను. నోటీసు అందిన తరువాత అయిదు రోజులలోగా పైకము చెల్లింపబడనియెడల దరఖాస్తు రద్దుచేయబడినట్లు భావింపబడును.

69. రూ 50 లు ట్రాన్సుపోర్టు రుసుము కట్టవలయును. అయినను యంత్రమును యివ్వజూపిన తేదినుండి అయిదు రోజులలోగా వాటిని తానే తన స్వంత ఖర్చుపైని తీసికొనిపోవుటకు సిద్ధముగా నున్నట్టు దరఖాస్తుదారుడు తన యుద్దేశమును తన దరఖాస్తులో తెలుపునెడల ట్రాన్సుపోర్టు రుసుము విడచిపెట్టబడును.

70. యంత్రముల నుపయోగించుకొనుటకు గానుగ ఒక్కటికి రూ 50 లును, ఇంజను గానుగ కలిపి రూ 100 లను నెలసరి బాడుగ యీ చార్జిలో యంత్రముల బాడుగయును ఇంజను నడుపు డ్రయివరుయొక్క వేతనమును చేరియున్నవి. పనితో సంబంధించిన యావత్తు యితర చార్జీలు దరఖాస్తుదారుడే భరింపవలెను.

దరఖాస్తుదారుడు కూలీలను సప్లయిచేసి ఇంజనుకు కావలసిన వంటచెరుకు, చమురు ఇతర స్టోర్సు యివ్వవలెను.

71. ఒక నెల బాడుగకు యిచ్చిన అడ్వాన్సు రూ 50 లు లేదా రూ 100 లు అయిపోయినప్పుడు అదనము ఒక నెల బాడుగకైనను సరిపడే జాస్తీ అడ్వాన్సును వెంటనే చెల్లించవలయును. ఏ కారణమువలనగాని అరువు పద్ధతిపైని యంత్రములు బాడుగకు యివ్వబడవు. కావున జాస్తీ అడ్వాన్సు క్రమముగా చెల్లించిననే తప్ప అడ్వాన్సు అయిపోయిన వెంటనే పని నిలిపి వేయబడి యంత్రములు తీసుకొని పోబడును.

ఉద్యోగస్థుల ప్రధాన కార్య స్థానములు.

| జిల్లా. | అసిస్టాంటు యిండస్ట్రియల్ యింజనీయరు యొక్క ప్రధాన కార్యస్థలము. | సూపర్‌వైజరు యొక్క ప్రధాన కార్యస్థలము. |
|---|---|---|
| **బెజవాడ డివిజన్.** | | |
| గంజాము ... | బెజవాడ ... | విశాఖపట్టణము. |
| విశాఖపట్టణము ... | | |
| కృష్ణా ... | డిటో ... | బెజవాడ. |
| గుంటూరు ... | | |
| తూర్పు గోదావరి ... | డిటో ... | రాజమండ్రి. |
| పశ్చిమ గోదావరి ... | | |

| జిల్లా. | | అసిస్టాంటు యిండస్ట్రియల్ యింజనీయరు యొక్క ప్రధాన కార్యస్థలము. | | సూపర్‌వైజరు యొక్క ప్రధాన కార్యస్థలము. |
|---|---|---|---|---|
| **బెజవాడ డివిజన్—శేషము** | | | | |
| నెల్లూరు | ... | బెజవాడ | ... | నెల్లూరు. |
| బళ్లారి | ... | డిటో | ... | బళ్లారి. |
| కర్నూలు | ... | | | |
| **కోయంబత్తూరు డివిజన్.** | | | | |
| కడప | ... | కోయంబత్తూరు | ... | కడప. |
| అనంతపురము | ... | | | |
| మలబారు | ... | డిటో | ... | మంగుళూరు. |
| దక్షిణ కన్నడము | ... | | | |
| అంజుంగో | | | | |
| ఉత్తర ఆర్కాడు | ... | డిటో | ... | వెల్లూరు. |
| చిత్తూరు | ... | | | |
| కోయంబత్తూరు | ... | డిటో | ... | కోయంబత్తూరు. |
| నీలగిరి | ... | | | |
| సేలము | ... | | | |
| **తంజావూరు డివిజన్.** | | | | |
| దక్షిణ ఆర్కాడు | ... | తంజావూరు | ... | కడలూరు. |
| తంజావూరు | ... | డిటో | ... | తంజావూరు. |
| తిరుచునాపల్లి | ... | డిటో | ... | తిరుచనాపల్లి. |
| మధుర | ... | | | |
| రామనాడ్ | ... | డిటో | ... | తిరునల్వేలి. |
| తిరునల్వేలి | ... | | | |
| **మదరాసు డివిజన్.** | | | | |
| మదరాసు | ... | ఇండస్ట్రియల్ ఇంజనీయరు, మదరాసు. | | |
| చెంగల్పట్టు | ... | | | |

వ. రా.—ఒక అసిస్టాంటు యిండస్ట్రియల్ యింజనీయరు యొక్క ఛార్జి ఒక డివిజన్ అనియును ఒక సూపర్‌వైజరు యొక్క ఛార్జి ఒక సబ్ డివిజన్ అనియును చెప్పబడును. ప్రతి ఛార్జియును దాని ఛార్జిలో నుండు ఆఫీసరు యొక్క ప్రధాన కార్యస్థలపు పేరుతో పిలువబడును.

## IX. తెల్ల పంచదారను తయారుచేయుట.

మూతలేని పెనము పద్ధతి మూలముగా కొద్దిపాటి పరిమితిమీద చెరుకునుండి పంచదారలు తయారు చేయుటకుగాను పొయ్యిలను నిర్మించుటలోను యంత్రములను స్థాపిం

చుటలోను యీ డిపార్టుమెంటువారు అవసరమైన సలహాలను శాస్త్రీ సంబంధమయిన సహాయమును యిచ్చెదరు. పంచదారను తయారు చేయగోరు రైతులకు కొద్దిపాటి సంఖ్యగల పంచదార సెంట్రిఫ్యూగల్ (తిరుగుడు చక్రములుగల) యంత్రములు కాగ బెట్టుటకైన పెనములు పొయ్యిలలో స్థాపించుటకు కావలసిన యినుపకడ్డీలు యీ మొదలైనవి దొరకును. ఈ డిపార్టుమెంటువారిచే యొసగబడు సౌకర్యములకు ప్రస్తుతము యెట్టి అద్దెఖర్చులుగాని రుసుముగాని విధింపబడవు. కాని రైతులు రవాణా ఖర్చులు పని సాగించుటకగు ఖర్చులు యీ మొదలయినటువంటి ఖర్చులు యావత్తు తగలబడి ఖర్చులు భరింపవలెను.

ఇంకను యెక్కువ వివరములకు పోస్టుబాక్సు నెం 432 రు, చేపాకు, మదరాసు, ఇండస్ట్రీసు డైరక్టరువారికి వ్రాసుకోవలెను.

X. వాయిదాలుగా పైకము చెల్లించుకొనగోరు పద్ధతిమీద పింటో చెక్కు (గానుగల) విక్రయము.

ఆహారమునకుపయోగించు నూనెలను తీయుటకు జనసామాన్యము యెక్కువగా కోరుచున్న పింటో గానుగ వివరము సచిత్రముగా యీ పంచాంగములో వేరొకచోట కనబడును. ఈ గానుగలు కొలదిగా మాత్రము వాయిదాలుగా పైకమును చెల్లించు కొనుగోలు పద్ధతిమీద విక్రయమునకు దొరకును. మదరాసు చాకలిపేటలోని ఇండస్ట్రీయలు వర్కుషాపులో ఒప్పచెప్పబడు దీని నికరపు విలువయయిన రూ 550 లును, అప్పటప్పుడు చెల్లించగా నిలువయుండు మొత్తముమీద సంవత్సరమునకు నూటికి 7½ వంతున వడ్డీతో కలిపి పది సమానమైన అర్ధ సంవత్సరపు వాయిదాలుగా తిరిగి చెల్లించవలెను. క్రియదారుడు చాలినంత హామీని యివ్వవలసియుండును. మరిన్ని సదరు కార్యము నిమిత్తము నిర్ణయింపబడిన నమూనాలో ఒక ఒడంబడిక పత్రమును వ్రాసి యివ్వవలసియుండును.

ఇంకను యెక్కువ వివరములకు పోస్టుబాక్సు నెం 432 రు, చేపాకు, మద్రాసు ఇండస్ట్రీయలు డైరక్టరువారికి వ్రాసుకొనవలెను.

## 50. పరిశ్రమలకు సర్కారు వారొనర్చు సహాయము.

దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి ముఖ్యముగా సంబంధించిన పరిశ్రమలకు (1923 వ సం॥పు 5 వ ఆక్టగు) సర్కారువారి సహాయమును క్రమపరచుటకైన ఆక్టు ననుసరించి ఋణములు తీర్చుటకుగాను ప్రస్తుత సంవత్సరం బడ్జటునందు రూ 50,000 లు యేర్పాటుచేయబడినది. ఆ పరిశ్రమలు యేవనగా:

(ఏ) క్రొత్త లేక ప్రారంభదశలోనున్న పరిశ్రమలు,

(బి) అట్టి పరిశ్రమలు అభివృద్ధి పొందని సలములందు క్రొత్తగా ప్రవేశ పెట్టబడవలసిన పరిశ్రమలు.

(సి) గృహ పరిశ్రమలు.

రూ 1,000 లకు మించని మూలధనము కలిగినవికానట్టి పారిశ్రామిక వ్యాపారములకు గృహపరిశ్రమలకు మాత్రము తప్ప, హెచ్చు మొత్తము మూలధనముగాగల పరిశ్రమలకు అప్పటికుండు బాధ్యతలు (బాకీలు వగయిరాలు) మినహాయించగా మిగిలిన ఆస్తుల నికరపు విలువలో నూటికి 50 వ వంతుకంటె మించిన ఋణము ఇవ్వబడ

కూడదు. అయితే రూ 40,000 లకు మించని మొత్తముగల ఋణము ఆస్తుల యొక్క విలువలో 50 వ వంతుకంటె మించియున్నప్పటికిని కూడా మంజూరు చేయబడ వచ్చును. అప్పు యివ్వబడినప్పుడున్న యే భాద్యతకైనను లోబడి వ్యాపారము యొక్క లేదా యత్నముయొక్క యావత్తు ఆస్తులు తనఖా కావలసగాని ఫ్లోటింగ్ చార్జీవలనగాని, యివ్వబడిన ఋణము భద్రపరుపబడును. రూ 1,000 లకు మించని మూలధనమును పెట్టుబడిగాగల పారిశ్రామిక వ్యాపారముల లేదా యత్నములు విషయము లోను మరిన్ని గృహపరిశ్రమల విషయములోను యివ్వతగిన ఋణముయొక్క మొత్త ము యివ్వబడిన హామీయొక్క విలువకు మించియుండకూడదు. మరిన్నీ అట్టి ఋణము :—

(ఎ) వ్యాపారము, ప్రయత్నము లేదా గృహ పరిశ్రమయొక్క యావత్తు ఆస్తులయొక్క తనఖా మూలముగా లేదా వాటిపైని ఫ్లోటింగు చార్జీ మూలముగా గాని లేక,

(బి) దరఖాస్తుదారుని యావత్తు ఆస్తులయొక్క తనఖా మూలముగా, లేదా వాటిపై ఫ్లోటింగు చార్జీ మూలముగాగాని లేక,

(సి) దరఖాస్తుదారుయొక్క జామీనుదారుని లేదా, జామీనుదారుల ఆస్తుల యొక్క తనఖామూలముగా లేక వాటిపైని ఫ్లోటింగు చార్జీమూలముగాగాని లేక,

(డి) రూ 500 లు మొత్తము వరకు దరఖాస్తుదారుని స్వంత జామీనుమూల ముగా లేక దరఖాస్తుదారుడున్నూ ఒకడు లేక అంతకంటె యెక్కువమందియున్న యిచ్చే వ్యక్తుల వుమ్మడి జామీను మూలముగా (అయితే అట్టి జామీను సామాన్యముగా అదనపు జామీనుగా మాత్రమే తీసికొనబడును) కాని, లేదా

(ఇ) పైన చెప్పిన జామీనుల తరహాలయొక్క సమ్మేళనము మూలముగాగాని భద్రపరుపబడును.

సదరు ఆక్టుక్రింద ఋణములకు ప్రస్తుతము కట్టబడుచున్న వడ్డీ నూటికి రూ $6\frac{1}{4}$ లు.

దరఖాస్తు పెట్టుకొనగోరువారుగాని ఇంక నేమయినను సమాచారము వలయు వారుగాని చేపాకునందలి, ప్రాత యింజనీయరింగు కళాశాల భవనమునందుండు, మద రాను, డైరక్టరు ఆఫ్ ఇండస్ట్రీసు వారికి వ్రాసి తెలిసికొనవచ్చును.

---

## 51. నేతశాఖయొక్క పనులగురించి.

1. గవర్నమెంటువారి నేత పరిశ్రమాలయము చాకలిపేటలో కత్తియవాకము హైరోడ్డుమీద చాకలిపేట ట్రాము టర్మినస్సుకును చాకలిపేట రైల్వేస్టేషనుకును దగ్గర గానున్నది. నూలుతో పడుగు పేకలు తయారుచేయు శాఖయును, ఉన్ని తయారు చేయు సెక్షన్, పట్టు తయారుచేయు సెక్షన్, నేతను పరీక్షించు సెక్షన్, అల్లిక, నేత, నేతకు సంబంధించిన రసాయన శాస్త్రమునకును, రంగులుచేయుటకును వేర్వేరు శాఖలు అత్యంత నవీనమైన పరికరములతోడను యంత్రములతోడను అమర్చబడియున్నవి.

యంత్రములతో నూలును వడకు సెక్షనుకూడ 1933-34 లో స్థాపింపబడెను.

సదరు పరిశ్రమాలయ విషయమును తెలియజేయు పుస్తకముయొక్క ప్రతులు మదరాసు చాకలిపేటలోని గవర్నమెంటునేత పరిశ్రమాలయము (Govt. Textile Institute) యొక్క ప్రిన్సిపాలుగారివద్ద దొరకును.

## 52. మదరాసు రాజధానిలో బట్టలచేతి నేత పరిశ్రమను వృద్ధిచేయుటకు విధానము.

విక్రయ విధానమే చేతినేతకు సంబంధించిన చిక్కు విషయము. ఇందును బట్టి చేతి మగ్గములమీద నేయువారి పక్షమున సహకార పద్ధతిమీదకాని విక్రయించుటను వృద్ధిచేయుటకును చేతి మగ్గములనేత పరిశ్రమ సాధారణముగా ఎక్కువ సౌష్ఠవముగా ఏర్పాటుచేసి వృద్ధిచేయుటకును సహాయ ద్రవ్యము నిచ్చుట మూలముగా సహాయపడు టకు ఇండియా గవర్నమెంటువారు అంగీకరించిరి. ఈ రాజధాని నిమిత్తమైన గ్రాంటు 1934-35 సం॥మునకు రూ 26,500 లును, 1935-36 సం॥మునకు రూ 59,500 లును. ఒక సహకార సంఘమునకు సహాయ ద్రవ్యము నిచ్చుటకు పరిశ్రమల డైరెక్టరు యీ గ్రాంటు నుపయోగించుటకు ఉద్దేశించుచు తదను సారముగా సహకార సంఘముల రిజిస్ట్రారుగారితో ఆలోచించి ఒక రాష్ట్రీయ సహకార సంఘమును నెల కొల్పుటకు సూచించెను. ఈ సంఘము పనిచేయు విస్తీర్ణము యావత్తు రాజధాని కిని వ్యాపించును. ఈ సంఘముయొక్క ప్రధాన కార్యస్థానము మదరాసై దాని అధికారయుతమైన మూల ధనము 5 లక్షల రూపాయలు ఒక్కొకటి రూ 50 లది యగు 10,000 భాగములుగా విభజింపబడినది. ఇతర సహకార సంఘములతో పాటునేత గాండ్ర మేలు నిమిత్త ముద్దేశింపబడిన సహకార సంఘములు సభ్యులగుటకు అర్హత కలిగియుండి అట్టి ప్రతి ప్రాథమిక సంఘమును ప్రారంభములో కనీసము 50 మంది సభ్యులను కలిగియుండవలెను. మొదట అట్టివగు ముప్పది సంఘములు ఏర్పాటు చేయబడును. సదరు రాష్ట్రీయ సంఘము, సదరు సంఘముయొక్క డైరక్టరుల బోర్డు తాలూకు ఉద్యోగరీత్యా సభ్యులుగా వర్తించు పరిశ్రమల డిపార్టుమెంటుయొక్క యు సహకార సంఘముల డిపార్టుమెంటుయొక్కయు ఉద్యోగులవలని సాధారణమైన పై తనిఖీకి లోబడి, ఖానిగీ మనుష్యులవలన నడుపబడవలెను.

2. నేతగాండ్ర సంఘములవలన తయారుచేయబడు చేతినేత బట్టలు క్రమముగా విక్రయింపబడుటమీద యీ విధానము ఫలవంతమగుట ఆధారపడి యుండును కాబట్టి ఒక మార్కెటింగు (విక్రయించు) ఆఫీసరు నియమింపబడి రాష్ట్రీయ సహకార సంఘ మునకు చేర్చబడును. ఈ ఉద్యోగియేగాక, తగిన కేంద్రములలో అయిదుగురు మార్కెటింగు (విక్రయించు) ఏజెంట్లు ఉందురు. ఈ ఏజెంట్లువారి విచారణాధికార ప్రదేశములోని ప్రాథమిక నేతగాండ్ర సంఘములకు వాటి బట్టలను విక్రయించుటలో సాయపడుదురు. కొంత కాలము పోయినతరువాత వేతన మివ్వబడు మార్కెటింగు ఏజెంట్లుకు బదులుగా కమీషను పద్ధతిమీద మాత్రమే బహుకరింపబడు మార్కెటింగు ఏజెంటు నియమింపబడి వేతన మివ్వబడు మనుష్యులు క్రొత్త కేంద్రముల నిమిత్తము విని యోగింపబడుదురు.

మార్కెటింగు ఆఫీసరు చేతిమగ్గములతో నేయు నేతగాండ్ర నిమిత్తము ఒక ప్రమాణమైన కూలి జాబితాను తయారుచేసి, ప్రాథమిక నేతగాండ్ర సంఘములలో తయారు చేయబడు బట్టల ఖరీదును క్రమపరచి మార్కెటింగు ఏజెంట్లు ఒకే విధమున పనిచేయు నట్లు చేయవలెను. అతను బట్టల టోకువర్తకులవద్ద ముందు కంట్రాక్టు ఆర్డ రులనుకూడ పొంది వాటిని నెరవేర్చుటకు మార్కెటింగు ఏజెంట్లకు వాటిని పంపవలెను

16-A

3. బట్టలకు అనేకమైనట్టియు వృద్ధిచేయబడినట్టియు డిజైనుల (అంచులను) నేతగాండ్రకు సరఫరా చేయుటకు రాష్ట్రీయ సహకార సంఘమువలన ఒక బట్టల డిజైనరు నియమింపబడును. విరివిగా విక్రయింపబడు మిల్లు బట్టలయొక్క డిజైనులను మాదిరులను అతను బాగుగా గమనించుచు అందుకు సమానమైన మాదిరులుగల చేతిమగ్గపు బట్టలనిమిత్తము తగిన డిజైనులను తయారుచేయవలెను.

4. బట్టలను తయారుచేయు ఖర్చును తగ్గించుటకు ప్రయత్నింపబడును. చేతిమగ్గపు నేతగాండ్రకు అవసరమగు నూలు, రంగులు, రసాయనికపదార్థములు మొదలైన ముడివస్తువుల ఉత్పత్తి, పరిపాకము లేదా విక్రయముతో పనిచేయు ఫరము (వర్తక సంఘము)లను రాష్ట్రీయ సంఘముయొక్క సభ్యులుగా చేర్చుటవలన లాభప్రదమైన షరతులమీదను నాణ్యత విషయమున గ్యారెంటీతోను నేతగాండ్ర సంఘములకు కావలసిన ముడిపదార్థములు సరఫరా చేయబడునని ఆశింపబడుచున్నది. చేతిమగ్గముల నిమిత్తము సిద్ధముగా తయారుచేయబడిన పడుగులను తయారుచేయుటకైనట్టియు పంచుటకైనట్టియు శక్తిచే నడపబడు చిన్న యంత్రములు, చేతి మగ్గపు బట్టలను తయారుచేయుటకగు ఖర్చులను తగ్గింపగలవు. ఇట్టి యంత్రములు చేతిమగ్గపు బట్టలు ఒక ప్రమాణమునకు వచ్చునట్లు చేయగలవు. అందున విక్రయము సులభమగును. క్రమమైన తయారు చేతిమగ్గపు బట్టలు విక్రయమగుటకు కారణముకూడ కావచ్చును లేదా వాటి విక్రయమును వృద్ధిచేయవచ్చును. అందున శక్తితో నడుపబడు పడుగును తయారు చేయునట్టియు తయారును కలుగజేయునట్టియు ప్రత్యేకయంత్రములను నెలకొల్పుటకు ద్దేశింపబడినది. ఒక చిన్న అద్దకపు ఫ్యాక్టరీ రాష్ట్రీయ సంఘమునకు చేర్చబడును.

కాని, ఇండియా గవర్నమెంటువారు యిచ్చిన గ్రాంటు కొంచెమగుటవలన, వైయంత్రములను నెలకొల్పుటకు రాష్ట్రీయ సంఘమునకగు ఖర్చులో నొక భాగమును భరించు నుద్దేశముతో కొంత ద్రవ్యమును సహాయము చేయుట కుద్దేశింపబడినది.

5. వారి సిబ్బందియొక్క ఖర్చులను భరించుటకును పనిముట్లను కొనుటకును ప్రాథమిక నేతగాండ్ర సంఘములకు ద్రవ్యసహాయము చేయబడును. వాటికి లాభము కలుగుట ప్రారంభమైనప్పుడు యీ సహాయ ద్రవ్యము యితర విస్తీర్ణములలో ప్రారంభింపబడు క్రొత్త సంఘముల కివ్వబడును. వాటి పనులు, అవి పనిచేయు స్థలములలో లేదా స్థలముల సమీపమున విక్రయింపబడగల బట్టలను తయారుచేయు పట్లను, వాటి విస్తీర్ణములలో వుపయోగింపబడు నిమిత్తము దిగుమతిచేయబడు మిల్లు బట్టలవంటి బట్టలను చేతిమగ్గములమీద తయారుచేయుటకు పూనుకొను విషయమునకూడ, ముఖ్యముగా కేంద్రీకరింపబడును. లుంగీలు, కైలీలు, మదరాసు జేబుగుడ్డలవంటి విక్రయమునకు ఎగుమతిచేయుటకైన గుడ్డలుకూడ నేయబడి విక్రయింపబడును.

## 53. పట్టు పురుగులను పెంచుటకై నిర్మింపబడిన శాఖయొక్క పనినిగురించి.

పట్టు పురుగులను పెంచు స్థానములు.—ఈ రాజధానిలో నాలుగు స్థానములు గలవు. వాటియందు పట్టుపురుగు విత్తనములను తయారుచేసి కొళ్లేగాలు తాలూకాలో పంచిపెట్టుచున్నారు. ఈ స్థానములలో పరిశోధనపనిన్ని, సంకరజాతులను తయారుచేయు పనిన్ని విత్తనము సరఫరాపనిన్ని చేయుచున్నారు. యిదిగాక మల్‌బరీ అభివృద్ధియందు కూడ పనిచేయుచున్నారు. ఈ ఫారములు కూనూరులో ఒకటియు

మైసూరు తాలూకా మాడిగిరి యందొకటియు, పలమనేరు నందొకటియు, కొళ్లేగాలు తాలూకా తాడిగుణియందొకటియు గలవు.

జిల్లాలలో పని.—ఈ రాజధానిలో తగుమైన ప్రదేశములను పట్టుపురుగులు పెంచు పనుల క్రింద యేర్పాటుచేయు నుద్దేశముతో (1) ఏలూరు, (2) మంగళగిరి, (3) వడ కాంగుళము, (4) పెనుకొండ, (5) కుప్పం, ఈ అయిదు స్థలములలోను వృత్తిగా పట్టుపురుగులను పెంచుటయందు శరిపేదు అయినవారు అయిదుగురు నియమింపబడి యున్నారు. సదరు పరిశ్రమ లీఘణకుగా ఒక గృహ పరిశ్రమగా జరుపబడు కొళ్లేగాలులో కాకుండా యీ క్రింది క్రొత్త స్థలములలో మల్బరీచెట్లు నాటుటయందును పట్టు పురుగులను పెంచుటయందును జయప్రదమైన ప్రదర్శనములు జరుపబడినవి.

(1) తిరునల్వేలి, (2) చిత్తూరు, (3) కోయంబత్తూరు, (4) కృష్ణా, (5) చెంగల్పట్టు, (6) శేలం, (7) అనంతపురం జిల్లాలలో కొన్నికొన్ని భాగములందు.

కొళ్లేగాలులోనుండు పట్టు పురుగులను పెంచు సంచారపు పార్టీ.—కొళ్లేగాలు తాలూకాలోని యీ క్రింది స్థలములలో ఒక పట్టు సూపరింటెండెంటు విచారణ క్రింద అయిదుగురు పట్టు పరీక్షించువారును, పురుగులను పెంచుటయందుత్తీర్ణుడయిన ఒక మనిషియుగలరు. వీరు క్రింద నుదహరింపబడిన యేడు స్థానములందును వుంచబడి యున్నారు. (1) మడిగుండము, (2) హుల్లాహల్లి, (3) కుంటూరు, (4) నూరాపురము, (5) పాళియం, (6) కాముక్కి, (7) కణూరు.

వారు పైన పేర్కొనబడిన స్థలములలో—

(1) పెంచువారికి తెగులులేని గ్రుడ్లను సరఫరా చేయుటయందున్ను,

(2) పెంచువారి పిసినికాయ (గూరు) లను వారి స్వంత యిండ్లలోనే మైక్రాస్కోపులు మూలముగా పరీక్షించుటయందును,

(3) తెలివిగల వారికి పురుగులను మైక్రాస్కోపుతో పరీక్షించు శాస్త్రమును నేర్పుటయందును,

(4) గ్రేయ్‌నేజు (విత్తనములస్థానము)లను ప్రారంభించునట్లు ప్రోత్సాహపరచుటయందును,

(5) అభివృద్ధి చేయబడిన యంత్రములమూలముగా పరిటన చుట్టుటయందును మరిన్ని పట్టునూలును పరిటన పట్టు స్థలములను అభివృద్ధిచేయబడిన మార్గముగా పట్టు నూలును పరిటన పట్టుటకు యేర్పాటుచేయుట యందును,

(6) వేరువేరు జిల్లా సెంటర్లకు మల్బరీ మొక్కలను పట్టు పురుగు గ్రుడ్లను సరఫరా చేయుటయందును,

(7) మల్బరీ తోటలలో పచ్చియాకు యెరువులు ప్రవేశపెట్టుటయందును,

(8) మల్బరీ చెట్లకు నీటి పారుదలకుగాను బావులు త్రవ్వుటయందు ప్రోత్సాహపర్చుటయందును,

పొలము గట్లమీద మల్బరీ చెట్లను నాటుటయందును, దొడ్లలో తోటలయందు మొలకలను ప్రవేశ పెట్టుటయందును తీవ్రముగా కృషిచేయుచున్నారు.

తెగులు లేని విత్తనపు సరుకును వృద్ధిచేసి కొళ్లేగాలులో పట్టు పురుగులను పెంచు వారి సరఫరాకు సంచారపు పార్టీవారికి మైసూరు విత్తనపు డొక్కలనుకొని తనిఖీచేసి సరఫరా చేయుటకుకూడ అనుజ్ఞ యివ్వబడినది.

విరికల్చర్ అను (ఆముదపు పట్టు పరిశ్రమ).—విరికల్చర్ అను పట్టు పరిశ్రమ రాజధానియందలి పెక్కు జిల్లాలలో జయప్రదముగా ప్రవేశపెట్టబడినది. ప్రపంచము నందంతటను పొడచూపిన వ్యవహార మాంద్యమువలన పట్టుపురుగుల గూళ్లకు గిరాకి లేకపోవుటచేత డిపార్టుమెంటువారి రాట్నము మూలముగా లేదా తక్లి మూలముగా నూలుగామార్చి సదరు నూలును గుడ్డగా నేయుట మంచిది. విరి పట్టు గుడ్డ గట్టిగాను చాలకాలము నిలిచియుండునదిగాను వుండి రాజధానిలో బాగుగా వెలకు తప్పక క్రయమగును.

విరిపట్టును పట్టు డొక్కలలోనుండి వడకుటకు డిపార్టుమెంటువారు ఒక నూతనమైన రాట్నమును ప్రవేశపెట్టిరి. ఈ రాట్నములు వ్యవసాయ స్థానము లన్నింటికిని చాలవరకు సప్లయిచేయబడెను. విరిపట్టును వడకుటయందు తరిఫీదయిన వానిని ఒకనిని డిపార్టుమెంటువారు యీ స్థానములకు అప్పు డప్పుడు పంపుచున్నారు. ఈ పరిశ్రమయందు ఆసక్తియున్నవారు యీ స్తానములనుదర్శించి యీపనిని నేర్చుకొనవచ్చును.

---

## V. ఫిషరీస్.

### 54. గవర్నమెంటు ఫిషరీస్ ట్రెయినింగు ఇన్స్టిట్యూటు, కాలికట్టు.

మద్రాసు రాజధాని విశాలమైన సముద్రతీరము గలిగినదై చేపల వ్యాపారమునకు మిక్కిలి అర్హమైయున్నది. అందును దక్షిణ పశ్చిమ దేశములందు ఈ వ్యాపారము పెంపొందియున్నది.

దేశమున కింత ఆహారమును పెట్టు విషయములో ముందు వ్యవసాయమును జెప్పి పిదప ఈ చేపల వ్యాపారమును జెప్పవలయును. ప్రజల కింత అన్నము పుట్టించునదియగుటవల్ల నిది రెండు కారణములచే మిగుల విలువగలదైనదిగ గన్పించుచున్నది.

మొదటిది ధాన్య సంబంధమై అనగా బియ్యము మొదలగు వానివల్ల సామాన్యముగ మనము తయారుచేసెడి ఆహారమున లేనట్టియు, మనము భుజించు పదార్థములలో ముఖ్యముగా ఉండవలసినదియునగు మాంసకృత్తులు అను వస్తువు ఈ చేపలయందున్నది. రెండవది తగిన కాలములందు వర్షాదులు లేకుండుటచే వ్యవసాయదారుడు కరువు కాటకములకు లోనుగావలసివచ్చును. కాని యీ చేపల వ్యాపార మట్లు వర్షాదులపై నాధారపడియుండలేదు. కనుక ఈ వ్యాపారము చేయువారికి కరువు కాటకములవలన భయమేమాత్రమునులేదు. కేవలము వ్యవసాయ దేశమేయైన మన హిందూ దేశమునకు వర్షాదులతో నిమిత్తములేని యిట్టి వ్యాపారములు అత్యవసరములైయున్నవి. ఒక్క ఆహారమేగాక ఈ వ్యాపారమువల్ల ముత్యములు, శంఖములు, చేపనూనె, చేపయెరువు మొదలగు విలువయైన వస్తువులు నైతము మనకు లభించును.

ఈ ఫిషరీస్ డిపార్టుమెంటు చేపల పట్టుకొను విషయములోను, దాని యుపయోగమునందును క్రొత్తమార్గములను జూపుటకును, చిరకాల మిది అభివృద్ధిలో నుండునట్లు చేయుటకును యత్నించుచున్నది. కనుక ప్రజా సామాన్యముయొక్క సంపూర్ణమగు తోడ్పాటు లేనిది కేవల మొక్క ప్రభుత్వమే యింతటి ఘనకార్యమును చేయజాలదు. ఇంతకాలము ఈ విషయమున మనవా రెట్టి పొరపాటును బడుచున్నారో యను విషయ మిపుడు కనుగొనబడినది. చేపల పట్టువారు చాలవరకు విద్యావంతులు గాకుండుట

వారికి మూఢభక్తి యెక్కువగా నుండుటయేగాక చేపల పట్టుకొను విషయమున వారొనర్చు ఉపాయములు చాలా ప్రాచీనములు. వారిలో విద్యావ్యాప్తి చేయుట ఎంతయో అవసరమైన కార్యమేగాక ఈ వ్యాపారముయొక్క ప్రాచీన స్థితిని తొలగించి అభివృద్ధి చేయవలసియున్నది. ఈ విధముగ మద్రాసు ఫిషరీస్ డిపార్టుమెంటువారు చేపల వారికి ముందు విద్యావ్యాప్తిచేయు కార్యమునందు నిమగ్నులైయున్నారు.

ఒక బాలునకు నేర్పెడి విద్య వాని జాతి వృత్తులకు తప్పక తోడ్పడి యుండవలయునని పండితు లందరియొక్కయు అభిప్రాయము కనుక మన దేశమునందుండెడి ప్రజలలో చాలమంది వ్యవసాయదారులును గ్రామీణులును అగుటచే వారికి తగిన విద్యయే నేర్పబడెడి ఎలిమెంటరీ పాఠశాలను ప్రారంభించుటకు చూచుచున్నారు. అయితే యిప్పటి సామాన్య ఎలిమెంటరీ పాఠశాలలలోని విద్య కేవలము వ్యవసాయదారులకే యుపయుక్తమని యందరి యభిప్రాయము. కనుక ఇతర వృత్తుల వారికీ విద్య ఉపయోగకరముగ నుండుటలేదు. చూడుడు! చేపలవారి జీవితమునకును తదితర వృత్తులవారి జీవితమునకును ఎంత భేదమున్నదో. కనుక ఈ ఫిషరీస్ డిపార్టుమెంటువారు చేపలవారికి యుపయోగించెడి విద్య నేర్పెడి పాఠశాలను స్థాపింప నెంచినారు.

కనుక ముఖ్యముగా అవసరమైయున్న దేమనగా ఈ కార్యమును కొనసాగించుటకుగాను ఈపనియందు బాగుగా తర్ఫీదు పొందిన ఉపాధ్యాయులు గావలయును కాలికట్టులో 1919 వ సంవత్సరములో ఇట్టి యుపాధ్యాయులను సప్లయిచేయుటకు "గవర్నమెంటు ఫిషరీస్ ట్రెయినింగు ఇన్‌స్టిట్యూటు" అనే పేరుతో నొక పాఠశాల స్థాపింపబడ్డది.

ఈపాఠశాల ముఖ్యముగా ఉపాధ్యాయులకు ట్రెయినింగు స్కూలువంటిది. కాని యిందలి బోధనము మాత్రము కేవలము ఫిషరీసుకు సంబంధించినదిమైయున్నది. ఒక యుదాహరణము. సృష్టిపరిశీలనము (Nature Study) నేర్పవలయునన్న సముద్రము, సముద్రతీరములయొక్క జీవ ఉద్భిజ్జకోటులను గురించియే చెప్పబడును. ఇందలి విద్యార్థులు విద్యాశాలవారిచే సప్లయిచేయబడు పడవలపై సాధారణములగు కొక్కెములు వలలు తీసికొని సముద్రముపై పని చేయవలయును. యిందుకుగాను, మూడు చేపలను పట్టుకోల పడవలును ఒకరహకనావ, ఒక స్వారీపడవ, స్కాట్లెండు దేశపు బోర్డు ఆఫ్‌ఫిషరీసువారి నమూనా ప్రకారము తయారు చేయబడి 15 టన్నుల బరువుగల 'సదరులెండు' అనుపెద్ద ప్రయాణపు పడవకలవు. మరియు ఇందలి విద్యార్థులు ఒక్కొక కాలమున కొంతభాగము తానూరులో ఉన్న గవర్నమెంటు ఫిషరీస్ పరిశోధనాస్థానమున అచ్చట చేయబడు చేపనూనె, చేపలను శుభ్రముచేయుట, పొగపెట్టుట మొదలగునవి నేర్చుకొనుటకై గడుపవలయును. ఈ సంవత్సరమునుండి అట్లు చేపనూనె వగైరాలను చేయుటకుగాను ప్రాక్టికల్ టీచింగ్ ఏర్పరుపబడినది. ఈసామాన్య బోధనమే గాక యందలి ఉపాధ్యాయులు గ్రామ పునరుద్ధారణమునుకూడ చేయవలయును. కనుక వారు ట్రెయినింగు అగు కాలములో మితవ్యయము, పరస్పర సాహాయ్యము, మద్యపాన నిషేధ ప్రచారము మొదలగునవి కూడా వారికి నేర్పబడును. వారికి శిక్షనిచ్చుటకుగాను "సముద్ర సంచారకసంఘము" అనుదానిని యీ విద్యాశాలయందు యేర్పరచినారు. 1921 వ సం॥లో రిజిస్టరు కాబడిన స్కూలు కో ఆపరేటివు సంఘమునందు మెంబర్లుగాచేరి, అందరును కో ఆపరేటివు ప్రేక్టికల్ వర్కు నేర్చుకొనవచ్చును.

ఈ పాఠశాలయందు మూడు సంవత్సరములు చదువవలెను. గవర్నమెంటుచే నియమింపబడిన వుద్యోగస్తులు కాని ఒక కమిటీచే యిందుకు విద్యార్థులు యెన్నుకో బడుదురు. చేపల వృత్తిలోనున్న వారికి ముందు అవకాశ మీయబడును.

ఫిషరీసు డిపార్టుమెంటువారు దక్షిణ కన్నడ, మలబారు జిల్లాలలో రెండు ప్రాథమిక పాఠశాలనుంచియున్నారు. అందువల్ల మళయాళముగాని, కన్నడముగాని స్వభావగా కలవారే సాధారణముగా చేర్చుకోబడుదురు. ట్రెయినింగు ఇన్‌స్టిట్యూటు మళయాళ దేశములో నున్నందున కన్నడ విద్యార్థులు రెండు సంవత్సరములు మంగళూరు లోనున్న గవర్నమెంటు హైయ్యరు ఎలిమెంటరీ ట్రెయినింగు స్కూలులో శిక్షపొంది తరువాత క్యాలికట్టులోవున్న యిన్‌స్టిట్యూటులో ఒక సంవత్సరము ఫిషరీసు వుపాధ్యాయ విద్యనభ్యసించి తమశిక్షను పూర్తి చేసుకోవలెను.

ఇందు చేర్చుకోబడు విద్యార్థులు 8 వ తరగతిగాని, 3 వ ఫారముగాని ప్యాస్ చేసియుండవలెను. అట్టి విద్యార్థులలో 8 వ తరగతిగాని, 3 వ ఫారముగాని పరీక్ష నిచ్చి, హైస్కూలు చదువు పూర్తిచేయనివారికి మగవారైన నెలకు రూ 9 లున్ను ఆడవారైన నెలకు రూ 11 లున్ను విద్యార్థివేతనము (Stipend) యీయబడును. మూడవయేటి తుదిని విద్యార్థులు పరీక్షాధికారి వర్గముచే పరీక్షింపబడుదురు. పరీక్షాధికారి వర్గమునకు ప్రెసిడెంటు, కాలికెట్టు జిల్లా విద్యాశాఖాధికారి పరీక్షలలో ప్యాసు అయినవారు వారి యోగ్యతల ననసరించి హైయ్యర్ లేక సెకండరీ గ్రేడు ట్రెయినింగు టీచెర్లుగా అంగీకరింపబడుదురు. ఇందు బాగుగా చదివి వుత్తీర్ణులైనవారు పెక్కురుఫిషరీస్ ఎలిమెంటరీ స్కూళ్లుగానున్న 37 డింటిలోను వుపాధ్యాయులుగా నియమింపబడిరి.

ఫిషరీసు ప్రాథమిక పాఠశాలలలో బాలిక సంఖ్య ఎక్కువగానున్నందున ఉపాధ్యాయినులన నియమింపవలసివచ్చినది. ఆ విధముగానే మోప్లాబడులలో మతసంబంధమైన చదువు చెప్పుటకు ఫిషరీసు తరిఖీదైన "ముల్లా" ఉపాధ్యాయులు కావలసియుండెను. యింమకుగాను అదివరకే వుపాధ్యాయ శిక్షపొందిన స్త్రీలకు 'ముల్లాలకు' ఫిషరీసు ట్రెయినింగు యిన్‌స్టిట్యూటులో మూడవయేటి శిక్ష ఒసంగబడినది.

పశ్చిమ తీరమందు ఫిషరీసు డిపార్టుమెంటువారుచేసిన అభివృద్ధిచూచి, తూర్పు తీరపు చేపలవృత్తివారుకూడ అటువంటి పాఠశాలలు, యితర సౌకర్యములు తూర్పు తీరమునకు కలుగజేయవలసినదని కోరుచున్నారు. తూత్తుకుడిలోనున్న "పరవ" వాళ్లు అక్కడ ఒక ఫిషరీసు ట్రెయినింగు యిన్‌స్టిట్యూటు స్థాపించుటకు రూ 10,000 లు విరాళమిత్తుమనిరి. కాని గవర్నమెంటు వారాకోర్కె నెరవేర్పలేమనిరి. కాని తిరునల్వేలి, రామనాథం జిల్లాలలో 'బెస్త' వాళ్ల బడులలో ఉన్న ఉపాధ్యాయుల కొందరకు ఫిషరీసు ట్రెయినింగు యిన్‌స్టిట్యూటులో చేపలను పట్టువిషయము లను గురించి శిక్షపొందుటకు శలవిచ్చిరి. యీ విషయమై ఒక అదనపు యిన్‌స్పెక్టరు కూడ నియమింపబడును.

---

## ౫౫. నత్తగుల్ల పొడి కోళ్ల పెంపకము.

1. నత్తగుల్లలపొడి పలువిధముల నత్తగుల్లలనుండి యంత్రసహాయముతో తయారు చేయబడుచున్నది.

2. కోళ్లకు యిచ్చు ఆహారపదార్థములలో నై పొడిని మిశ్రముచేసి యిచ్చినయెడల అవి బాగుపడుటయేగాక పెంకు గట్టిగాయుండు గ్రుడ్లు సహా పెట్టునని అనుభవము

వల్ల తెలియుచున్నది. ఈ విషయము బాగుగా బోధపడుటకై కోళ్ల ఆహారకోశము (ఆలిమెంటరి కెనాల్) విషయము వివరముగా తెలుసుకొనుట ఆవశ్యకరము.

3. కోళ్లయొక్క ఆహారకోశము అనేక భాగములు కలిగియున్నది. ఇది నోటి యందు ప్రారంభమై మెడలో అడ్డముగాపోవు యిరుకుగాను పొడవుగాను యున్న గొట్ట ములో కలియును. మెడ అడుగున యీ గొట్టము పెద్దది అగును. దీనికి గింజల తిత్తి (క్రాప్) అనిపేరు.

కోళ్లు అతి త్వరగా మ్రింగిన ఆహారపదార్థములు కొద్దికాలము యీ గింజల తిత్తి లో చేర్చబడియుండుటచే నవి బాగుగా నాని మెత్తపడును. పుంజుగాని, పెట్టగాని బాగుగా ఆహారము తినిన తర్వాత యీ గింజల తిత్తి ఆహారపదార్థములచే నుబ్బి మెడయు దేహము కలియుభాగమున గుండ్రముగాను యెత్తుగాను కనబడును. ఈ గింజల తిత్తి దిగువను మరియొక చిన్న గొట్టముతో కలియును.

ఈ చిన్న గొట్టము కండకలిగి కఠినముగానున్న కడుపు (అరలపొట్ట)లో చేరును. కోళ్లు మ్రింగునటువంటి యిసుక చిన్న రాలి పెల్లలు యీ కడుపులోనుండి అవి తిను ఆహారమును మృదువగు పిండిగా చేయుటకు తోడ్పడును. ఈ కడుపునుండి పొడుగై నట్టియు పెక్కుచుట్లు కలిగియుండునట్టియు "గొట్టము" అనగా "పేగులు" ప్రా రంభమగును. ఈ ప్రేగులే ఆహారకోశమునందలి విస్తారభాగము. అవి పొత్తికడుపున యుండును.

4. ఈ పక్షులకు దంతములు లేనందువల్ల మనుష్యులు నములునట్లు తను ఆహార పదార్థములను నమలలేవు. గింజలు మాతం తిని బ్రతుకునటువంటి పక్షులు అనగా కోడి, కోలింకిపిట్ట, నెమలి మరి యీ జాతిలోచేరిన యితర పక్షులు బలమైన కండలు కలిగిన పొట్టను గలిగియున్నవి.

ఈ కడుపులో పైన చెప్పిన ప్రకారం ఆహారపదార్థములేకాక యిసుకయు చిన్న రాళ్లు సహా వుండును. కడుపుయొక్క వివిధ భాగములు తమంతట తామే ముడుచు కొనుటచేత కడుపులోనున్న యిసుక రాతిపెల్లలు మొదలగువాని రాపిడిచే యీ పక్షులు భుజించిన ఆహారము మెత్తబడును. అనగా యితర జంతువులలో దంతములు చేయుపని యిసుక రాతిపెల్లలు యీ పక్షులలో చేయుచున్నవి.

5. సాధారణముగా దొడ్లలోను మరి యితర స్థలములయందును జాగ్రతతో పెంపబడిన పెంపుడుకోళ్ల ఆహారమునందు యిసుక తక్కువగానుండును. ఆహారపదార్థ ములను జీర్ణమగుటకు సిద్ధముచేయుటయేకాక "నత్తగుల్లలపొడి" మరియొక ముఖ్య కార్యమునకు వుపయోగపడుచున్నది. ఈ పొడియందున్న సున్నపు సంబంధమైన పదార్థములు కడుపులో ఆహారపదార్థములను పొడిపొడిగా చేయు సమయమున వానితో కలియుచున్నది. ఈ విధముగా ఆహారముతో కొంత సున్నమును పేగులు తీసుకొను చున్నవి.

6. పక్షులు పెట్టు గ్రుడ్లు అన్నిటికిని సున్నపు సంబంధమైనటువంటి కప్పు ఒకటి యున్నది. ఈ కప్పుయొక్క కఠినత్వము సున్నముపై ఆధారపడియున్నది. సున్నము తక్కువగా నున్నయెడల గ్రుడ్లు పైపొర మెత్తగా నుండును. అనగా గ్రుడ్లు తోలు గ్రుడ్లగును. పెంపుడుకోళ్లు పెట్టు గ్రుడ్లన్నీ యీ దురవస్తకు లోనగు విషయము

కోళ్లు సాకువారికి తెలిసినదే. మెత్తని డొల్లకలిగిన గ్రుడ్లు చూపుకు అందములేక యుండుటయేకాక అమ్మకముసహా దుర్లభము. మరియు అవి పొదుగుటకుసహా కష్టము.

నత్తగుల్లలపొడి ఆహారముతో కలిపి యిచ్చినయెడల యీ పక్షులకు కావలసినంత సున్నము లభించి మెత్తని డొల్లకలిగిన గుడ్లు పెట్టవు.

7. ఈ పిండియొక్క ఖరీదుకు మదరాసుదగ్గర "యెన్నూరు" స్టేషన్ (మదరాసు దక్షిణ మహారాష్ట్ర రైల్వే)వద్ద దొరకును. 80 పౌనులు (రతులు) రూ 4-4-0 లు; 60 పౌనులు రూ 3-4-0 లు, 40 పౌనులు రూ 2-4-0 లు, 20 పౌనులు రూ 1-4-0 లు.

8. కొద్దిగా యీ పొడి ఒక తొట్టియందుగాని, గిన్నెయందుగాని కోళ్ల కొట్టములో నుంచినయెడల అవి తమంతటు తామే తినగలవు.

9. ఈ పొడిని ప్యాసింజర్ రైలుద్వారా పంపవలయుననిన ఖర్చులు అధికమగును.

పొడి అధికముగా (పెక్కుమందిచేరి) గూడ్సుద్వారా తెప్పించుకొన్నయెడల ఖరీదు స్వల్పమగును. మదరాసు ఫిషరీస్ డిపార్టుమెంటువారు యీ పిండిని తయారుచేయుచున్నారు.

ఇక్కడ తయారుచేయు పిండి ఖరీదు యితర దేశములనుండి దిగుమతిచేయబడిన పిండికన్న ధర తక్కువగానున్నది. హిందూదేశమందంతటను బర్మాదేశమందంతటను కోళ్లను పెంచువారు యెన్నూరు స్థానమునుండియే యీ పిండిని కొనుచున్నారు.

10. జాబులు వ్రాయగోరువారు "రిసర్చి అసిస్టెంటు, గవర్నమెంటు ఫిషరీస్ స్టేషన్, యెన్నూరు" అని పై విలాసము వ్రాయవలయును.

---

## VI. ఆరోగ్య శాఖ.

### 56. బోర్ హోల్ లెట్రిన్ అనబడు పాయిఖానా దొడ్లు.

#### గ్రామ పారిశుద్ధ్యమునకు ముఖ్యముగా తోడ్పడును.

హిందూదేశములోని ప్రజలలో చాల భాగము పల్లెలలోనే నివసించుచున్నారు. వారు పూర్వ పద్ధతులను ఆచారములను విడిచిపెట్టుటలేదు. ఇతర దేశములందలి ప్రజలు అటులకాదు. ఆ దేశములలో శాస్త్రవిజ్ఞానము విరివిగ వ్యాప్తి జెందుటచే ఆరోగ్య మార్గ విధులను ప్రజలు తమ దిన చర్యలయందు ఆచరించి లాభము పొందుచున్నారు. మన దేశములోని గ్రామాదులలో పారిశుద్ధ్యమునుగూర్చి గమనించుటయనునది లేనేలేదు. పెంట, ఎరువు, పేడ, అమేధ్యము అన్నిచోట్ల కాన్పించును. గ్రామ పారిశుద్ధ్యమునకు ముఖ్యముగా గమనించవలసినవి :—(i) పరిశుద్ధమైన జల వసతి, (ii) మురికి నీరు గ్రామములోని యిండ్ల మధ్య నిలువకుండునటుల చేయు పద్ధతులు, (iii) గృహముల నుండి మలము, చెత్త, ఎప్పటికప్పుడే తీసివేయు ఏర్పాట్లు. సరిగా కట్టబడిన కక్కసులును, మురికి నీరు వెలుపలికి పోవుటకు జలదార్లును చిన్న గ్రామములలో లేనే లేవు. గ్రామస్థులు మల విసర్జనము చేయుటలో స్థలవిచక్షణ కనపరచరు. అందుచే నీటి వసతులకు సమీపముగా కాలకృత్యములు నెరవేర్చిన, నీరు మలినమగుటకు అవకాశములు

కలుగుచున్నవి. మలముపై యీగలు వ్రాలి తిరిగి ఆహారపదార్థములమీద వ్రాలుటచే ఆ పదార్థములు చెడిపోవుచున్నవి.

ఇట్టి దుస్థితికి కారణములు మూడు—

(1) సామాన్య ఆరోగ్య సూత్రములను ప్రజలు గమనింపకపోవుట.

(2) సంఘమునకును, తమకును, తమ యిరుగుపొరుగున కాపురముండువారి యెడలను తమకుండు బాధ్యతను గుర్తింపక పోవుట.

(3) ఆరోగ్యవిధులను గమనించి ఆప్రకారము ఆచరించుటకు వలసిన అవకాశములు లేకపోవుట.

కావలసినన్ని శుభ్రమగు కక్కసులు లేకపోవుటచే గ్రామస్థులు పొలములోను చెరువుల లేక కాలువల గట్లపైనను, వీధులలోను, సందు గొందులయందు నాగజెముడు మొదలగువానిచే మరుగుగానున్న ప్రదేశములలోను మల విసర్జనము చేయుదురు. అమేధ్యమువలన నేల పాడై పోవుటచే గ్రామ పారిశుద్ధ్యము భంగమగుచున్నది. అపాయకరమగు వ్యాధులు ఒకనినుండి మరియొకనికి వ్యాపించుటకు ఈ ప్రకారము చేయు పల్లెలలోని దురభ్యాస పద్ధతులే ముఖ్యకారణము. కలరా (వాంతి భేది), రక్త భేది, సన్నిపాత జ్వరము, యీ మూలముగా వ్యాపించుచున్నవి. ఈ దేశములో అతి విస్తారముగా వ్యాపించియున్న కొంకి పురుగు వ్యాధికి యీ ప్రకారము స్థలవిచక్షణలేక మల విసర్జనముచే చెడిపోయిన నేలయే కారణము.

అశుద్ధముచే మలినమైన భూమిలో వ్యాధిని కలుగజేయు క్రిములుండును. ఈగలు ఆ నేలపై వ్రాలి తిరుగ యెగిరి మనము భుజించు వస్తువుపై వ్రాలి వాటిని మలిన మొనర్చును లేదా వర్షము కురిసినపుడు ఆ వాననీటిద్వారా యీ సూక్ష్మజీవులు బావులు, కాలువలు, చెరువులు మొదలగువానిలోనికి ప్రవేశించును. పందులు, కోళ్లు కూడ యీ కశ్మలమును వ్యాపింపచేయును. అందుచే గ్రామాదులలోని ప్రజలకు సరిపడునన్ని క్రమముగ కట్టబడిన కక్కసులను ఏర్పాటుచేసి, ప్రజలందరును మల విసర్జనమునకు ఆ కక్కసులనే ఉపయోగించునటుల ప్రచార మొనర్చవలెను.

గ్రామాదులలో పాయికానా దొడ్లు నిర్మించుట చాల ధనవ్యయమగుటచే యిది వరలో మామూలు కక్కసులు చాలినన్ని కట్టుటకు వీలైనదికాదు. ఇప్పుడన్నో అట్టి ప్రతిబంధకము తీఱినది. ఎలయన చాల అనుకూలపడునదియు, చౌకగ నిర్మింప వీలగునదియు అగు "బోర్ హోల్" లెట్రిన్ అనబడు క్రొత్తవిధమగు కక్కసు ఒకటి కనుగొనబడినది. దాని ప్రతిమ యొకటి ప్రత్యేకముగా చిత్రింపబడియున్నది.

ఈ బోర్ హోల్ కక్కసు 10 మొదలు 20 అడుగుల లోతుండును. ఇది 14 అంగుళముల వలయముగల ఒక గుండ్రని రంధ్రముచేయుటచే ఏర్పడును. ఈ రంధ్రము మీద మూత వైచుటకు 2½ అడుగుల పొడవును, అంత వెడల్పును గల కడపరాతి పలక కావలెను. అది రాయిగాకున్న, సున్నము, చిన్న రాళ్లతో పలకమాదిరి కట్టవచ్చును. ఆ పలకకుకూడ పై చెప్పబడిన రంధ్రముతోపాటు సరిగా రంధ్రము ఉండును. చుట్టును అయిదారు అడుగుల యెత్తు గోడ కట్టబడును. గోడ మట్టిదైనను సరియే, లేదా, తారు పూసిన వెదురు తడికలుగాని, జింకు రేకులనుగాని ఉపయోగింపవచ్చును. రేకులను వాడుటయే మంచిది. అవి చాలకాలము చెడిపోకుండ నుండును. గనుక చౌక,

అందము, శుచిత్వముగలవి. భూమిని తొలచు ఒక విధమగు పనిముట్టుచే భూమిలో, లోతగు రంధ్రము చేయవచ్చును. మామూలు గట్టి నేలలో ముగ్గురు కూలీలు పనిచేసి ఒకటిన్నర రోజులలో 15 అడుగుల లోతుగల రంధ్రము చేయగలరు. ఈ భూమిని తొలచు యంత్రము ఖరీదునకు దొరకును. లేదా మద్రాసు ఆరోగ్యశాఖ డైరెక్టరువారు కొద్ది బాడుగకు ఇచ్చెదరు.

కక్కసు తయారుచేయుటకు ముఖ్య ఖర్చులలో మూతవేయుటకు కావలసిన పలకను కొనుటయే మొదటిది. రెండవది రంధ్రము చేయుట కగు కూలి. ఒక జిల్లాలో చాల కక్కసులు నిర్మింపబడవలసివచ్చినయెడల పలకలను ఒకేచోట తయారుచేయించిన ఖర్చు తక్కువయగును. ఒక రంధ్రముచేయుట కగు కూలి చాల పరిస్థితులపై ఆధారపడియుండును. భూమి కఠినత, కూలీల అనుభవము, తనిఖిచేయు సిబ్బంది కగు వ్యయము ప్రధానమైనది. సగటున పలక ఒకటికి మూడు రూపాయ లగును. రంధ్రముచేయుటకు 15 అడుగుల లోతుకు రెండు రూపాయ లగును.

రంధ్రము భూమి పై భాగమునకు రెండు అడుగులవరకు నిండునపుడు, ఆ రెండడుగుల లోతు రంధ్రమును పొడిమట్టితో పూడ్చి, పలక రాయిని తీసివైచి, వేరే సమీప ప్రదేశములో పై ప్రకారము తొలచబడిన క్రొత్త రంధ్రముపై వైచి నూతన కక్కసును తయారు చేయవచ్చును. మరుగు కొరకు యేర్పాటుచేసిన తడకలను లేక జింకు రేకులను క్రొత్త కక్కసు చుట్టును పెట్టుకొనవచ్చును. ఈ పలకలు అనేకసార్లు యిదే ప్రకారము అనేక కక్కసులకు మార్చుచుండవచ్చును. అందుచే తిరిగి, తిరిగి కక్కసుల నిర్మించుటకు ఖర్చు భూమిలో రంధ్రము చేయుటకగు వ్యయము మాత్రమే అగును. ఇప్పుడు సాధారణముగా వాడుకలో యున్న మామూలు పాయకానా దొడ్లు కట్టుటకు వాటిని క్రమముగు వాడుకలో నుంచుటకు అగు ఖర్చుతో పోల్చిచూడ యీ బోర్ హెూల్ లెట్రిక్ కగు ఖర్చు అతి స్వల్పము. ఆరు నెలలు ఊరికే యుండనిచ్చి తరువాత యెరువుగా నుపయోగించుటకు యీ బోర్ హెూల్ లెట్రిక్‌లోని పదార్థము పనికివచ్చును. ఆ స్థలములోనే తిరిగి కక్కసుకు రంధ్రము చేయవచ్చును. సాధారణముగా ఒక సారి తొలచిన యీ కక్కసు రంధ్రము ఒకటి రెండు సంవత్సరములలో నిండును.

ఈ బోర్ హెూల్ లెట్రిక్ విషయములో ఒకటి ముఖ్యముగా గమనింపవలెను. అది సరిగా జాగ్రత్తతో వాడనయెడలమాత్రమే ఆదర్శకప్రాయమగు కక్కసు. దానిని నుపయోగించు జనులు రంధ్రములోనే పదునతుల మల విసర్జనము చేయవలయును గాని, ఆ పలకపైనను, చుట్టుప్రక్కలను లోనికి పోవు దారిలోను చేయకూడదు. పద్ధతి ప్రకారము చేయవలెను. అటులొనర్పక దుర్వాడుక చేసినయెడల యితరు లుపయోగించుటకు వీలుండదు. అసహ్యమగుటచే జనులు వాడుటకు యిష్టపడరు. కావుననే యీ కక్కసును నిర్మించినవారలు దుర్వాడుకను సాధ్యమైనంతవరకు తగ్గించు తలంపుతోనే అనవసరమగు కాళీస్థళమును, మరుగు ప్రదేశమును మార్గమును లేకుండా ఏర్పాటుచేసియున్నారు.

"బోర్ హెూల్ లెట్రిక్" వ్యాపకము ప్రజాభిప్రాయముపైనను, దేశ ప్రజారోగ్య భాగ్య శ్రేయోభిలాషులగు విద్యాధికుల ప్రచారముపైనను, ఆధారపడియున్నది.

---

## 57. కొంకిపురుగు.

ఒక గ్రామములో కొందరు మనుజులు బలముగానుందురు. ప్రతిదినము యెక్కువ గంటలకాలము పనిచేయగలుగుదురు. కొంచెము శ్రమకే అలసిపోవువారుగా నుండరు. వారికి జీవితము పుత్సాహముగాయుండును. వారు యెక్కువ ద్రవ్యమును సంపాదింప గలరు. ఆ సంపాదించిన ద్రవ్యమును సుఖముగ ననుభవించెదరు. కొందఱన్నో అటుల శక్తివంతులుగ లేకపోవుటచే ప్రతిదినము చాలకాలము పనిచేయలేరు. కొద్ది పనికే అలసిపోవుదురు. జీవనమన్నవారికి నిరుత్సాహము. కష్టపడి ధన మార్జించలేరు. ధనమైనను వారికి సుఖమొనరింపజాలదు. పై చెప్పబడిన అదృష్టవంతులు కొంకిపురుగు వ్యాధిచే బాధపడక తప్పించుకొన్నవారని మీకు తెలియునా? కొంకిపురుగు తాను లోబరచుకొన్న మనిషి రక్తమును త్రాగును. అతని శరీరములో విషద్రవ్యమును ఉత్పత్తి చేసి క్రమముగా అతని దుర్బలునిగ జేయును. ఈ కొంకి పురుగులు మనుజుని తక్షణమే చంపకున్నను, అతని శక్తిని తగ్గించి ఇతర వ్యాధులకు సులభముగ ఆహుతియగునట్లు చేయును.

కొంకి పురుగు అంగుళములో మూడవ భాగము పొడుగుండును. దాని లావు మామూలు గుండుసూది పరిమాణము, దాని పండ్లు పదునుగలిగి కొక్కివలెయుండును. ఈ పండ్లతో మనుజుని పేగుల చర్మములోని భాగమును పట్టుకొనియుండును. పెద్దయగు ఆడపురుగు దినమునకు వేయికిపైగా గ్రుడ్లుపెట్టును ఈ గ్రుడ్లు మనుజుని మలములో బయటపడును. మల విసర్జనము తేమగలిగి తగుపాటి వేడిగల భూమిపై జరిగినపుడు ఈ గ్రుడ్లు ఆ నేలమీద చితికి వాటినుండి చిన్న కొక్కి పురుగులు ఏర్పడును. ఈ చిన్న పురుగులు కొద్దికాలము వృద్ధిపొందిన తర్వాత మనుష్యుని చర్మము పట్టుకొని రంధ్రముచేసి శరీరములో ప్రవేశించును. పైవిధముగా అంటు సోకిన భూమిపై కాళ్లకు జోడులేకుండ నడచునట్టి వారును, అట్టి నేలలో గోతులు త్రవ్వువారును లేక ఇతర విధమున అక్కడమట్టితో పనిచేయువారును తరచుగ ఈవ్యాధిచే బాధితులగుదురు. సాధారణముగ కాలివ్రేళ్ల మధ్యనుండు పలుచని చర్మమున ఈ చిన్న పురుగులు రంధ్రము చేయును. ఈ పురుగులు రంధ్రము చేసిన స్థలమందు మొదట కొంచెము దురదయుండి తరువాత పుండ్లు అగును. దీనికే నేల దురద అనిపేరు. శరీరములో ప్రవేశించిన పిమ్మట ఈ చిన్నపురుగులు రక్తముచే తిరిగి ప్రేగులలో ప్రవేశపెట్టబడి అక్కడ వృద్ధి పొందును. అక్కడ వృద్ధిపొంది పెద్దవైన తరువాత ఆడపురుగు గ్రుడ్లను తిరిగి పెట్టుటకు ప్రారంభించును. పైన కనుపఱచిన విధమున గ్రుడ్లు వెలుపలికి వచ్చి పొదుగుట మొదలగు పద్ధతుల క్రమేణ చేయుచుండును. ఈ విధముగా అంటువ్యాధి నేల పాడగుట తిరిగి అంటువ్యాపించుట మొదలగు అపాయములు ఎప్పటికిని అవిచ్ఛిన్నముగ జరుగుచునేయుండును.

కొక్కి పురుగువలన కలుగు అపాయము రోగి కడుపులోనుండు పురుగుల సంఖ్యనుబట్టియు మనుజుని జీవనపరిస్థితులు అభ్యాసముల మీదను ఆధారపడియుండును. కొందఱి కడుపులో చాల పురుగులుండియు అవి వున్నటులే కనుబడవు. కొంతమందికి కొంచముగా పురుగులున్నను ఉపద్రవము చేయును. కొంచెము మాత్రమే పురుగులుండిన శరీరము పాలిపోవును. మనస్సు బడలిక దుర్బలత్వము మాత్రమేయుండును. ఈ రోగ చిహ్నములు ముఖ్యముగా కడుపులో ఇది అది అని నిర్ధారణచేయ వీలులేని ఒక విధమగు నొప్పులు, తలనొప్పి, తల తిరుగుట, తఱుచుగ అజీర్ణముచేయుట, మట్టి,

ఇసుక, కాగితము, బూడిద మొదలగు వస్తువులను తినవలయునను బుద్ధి అనునవి. వ్యాధి ఎక్కువగానున్నవారి పాదములు, కాళ్లు వాపుతేలును. శరీరము కృశించును. బుద్ధి హీనునివలె కనుబడును. బుగ్గలుపొంగియుండును. నీరసము భరింప శక్యముగాదు. కడుపు ఎత్తుగనుండును. గర్భిణి స్త్రీలు అయినయెడల గర్భవిచ్ఛిన్నము కలుగును.

ఈ కొక్కి పురుగుల వ్యాధివలన మనుష్యులకు కష్టపడిపనిచేయు శక్తి తగ్గిపోవును. అందుచే దేశదారిద్ర్యతయు హెచ్చును. పసిపిల్లలు సరిగ ఎదుగజాలరు. వారి శరీరము పుష్టిగనుండదు. వారి శరీరములోని రక్తము తగ్గిపోవును. చదువుటకుగాని కష్టపడి పనిచేయుటకుగాని శక్తియుండదు. బాలులకుండవలసిన సహజోత్సాహపు శక్తికొరవడి యుండును. బుద్ధి మందగించును. బుద్ధి వికాసముగాని, శరీరసౌష్టవముగాని లేకపో వుటచేత వారు తోడి మానవులవలె సౌఖ్యము నందజాలరు.

ఈ వ్యాధి తేలికగా గుర్తించవచ్చును. చికిత్స చేసి కుదుర్చవచ్చును. మలమును దుర్భిణి యంత్రముచే పరీక్షించిన కొక్కి పురుగు గుడ్లు ఉన్నదియు లేనిదియు నిశ్చయ ముగ తెలిసికొనవచ్చును. ఈ పురుగులను చంపి మలముతో బయటికి రప్పించుటకు ప్రశస్తమైన మందులు కొన్ని కలవు. ఒక మోతాదు సాధారణముగ సరిపోవును. సర్కారు లేక లోకలు ఫండుచే నిర్వహింపబడు ధర్మవైద్యశాలలన్నిటిలోను యీ మందు ఉచితముగా ఇవ్వబడును. మీరు యీ రోగముచే బాధపడుచున్నయెడల మీరు యీ సదుపాయమును వినియోగించుకొని చికిత్సనొంది ఆరోగ్యమును పొంది ఎందుకు సుఖపడరాదు ?

వ్యాధి కుదిరిన తరువాత తిరిగి యీ రోగమురాకుండునటుల చేసికొనవలెను. నేల యీ క్రిములవలన చెడిపోయిన యెడల మాత్రమే యీ వ్యాధివ్యాపించుటకు అను కూలపడును. ఖాళీస్థలములలో యిష్టమువచ్చినటుల మలవిసర్జనము చేయరాదు. మీ ఇరుగు పొరుగు గృహస్థులకు యీ విషయమై తెల్పి ఎక్కడ వీలైన అక్కడ బహి ర్భూమికి పోకుండునటుల చేయుము. ఈ ప్రకారము భూమియందు అంటు ప్రవేశిం చుటచే కొక్కిపురుగు వ్యాధి, కలరా, సన్నిపాతము లేక 21 రోజుల జ్వరము, రక్త భేదులు, అజీర్ణభేదులు వ్యాపించును. ఇటులయ్యును ఎందుచేత ఇట్టి అపాయకరమగు దురభ్యాసములను విడువరు? మీ గ్రామములలో పాయిఖానా దొడ్లు కట్టించి వానిలోనే మల విసర్జనముచేయుడు. ఆ ప్రకారము చేసిన మీ గ్రామము పరిశుభ్రముగా ఉండు టయేగాక అనేక ఘోరమగు అంటువ్యాధులు వ్యాపింపవు.

## 58. కలరా.

కలరా అను ఘోరవ్యాధివలన ప్రతి సంవత్సరము వేనవేలు జనులు చనిపోవు చున్నారు. ఇది కంటికి కనుపడని యొక సూక్ష్మజీవివలన కలుగును. కలరా రోగి వాంతియందును భేదియందును, ఇట్టి జీవులు కోటానుకోట్లు వుండును. ఆకారణము వల్లనే యీ వ్యాధి గ్రామములో ఒక్కసారి ప్రవేశించిన త్వరగాను, విరివిగాను వ్యాపించును. మనము భుజించు ఆహారము ద్వారాగాని త్రాగెడి ద్రవపదార్థముతో కలిసి గాని యీ క్రిములు మన కడుపులోనికి ప్రవేశించినయెడల కలరా వ్యాధి వచ్చును. ఈ క్రిములవల్ల మలినమైన ఆహారముగాని నీరుగాని లోపలికి పుచ్చుకొన్న తప్ప కలరా రాదు.

2. కలరా రాకుండచేయుట కడుసులభము. ఈ క్రింద వివరింపబడిన విధులను గమనింపుము. ఈ రోగము రాదు :—

(1) నీవు త్రాగు నీరు కలరా సూక్ష్మజీవులవలన తాకుడు లేక అంటుకాకుండా వుండవలెను. సందేహముగా నున్నయెడల నీటిని సలసల కాచి చల్లార్చి త్రాగుము. నీటిని కాచినయెడల కలరా సూక్ష్మ జీవులు నశించును. త్రాగుటకేకాక యితర గృహకృత్యములకును కలరా సూక్ష్మజీవుల సంపర్కములేని జలమునే ఉపయోగింపవలయును.

(2) ఈగలు పెంటమీదను అశుద్ధముమీదను వ్రాలి తిరిగి యెగిరి ఆహారపదార్ధములమీద వ్రాలును. ఈ యీగల కాళ్లకును రెక్కలకును అసంఖ్యాకములగు యీ సూక్ష్మ జీవులును, మురికియు, అంటుకొని, తిరిగి ఆహారపదార్ధములమీద వ్రాలినప్పుడు యీ విషక్రిములును ఆహారపదార్ధములతో కలియును. అందుచేత భోజనపదార్ధములపై దుమ్ముపడకుండా యీగలు వ్రాలకుండా సరిగా మూతలు వేయవలయును.

(3) కలరా రాకుండాయుండుటకు సూదిమందు ఉపయోగింపవలెను. నీవును మీకుటుంబములోని వారందరును ప్రతి సంవత్సరము గ్రామాదులలో కలరా ప్రారంభించుటకు ముందు కలరా యినాక్యులేషన్ అనగా సూదిమందు వేయించుకొనవలెను.

(4) పచ్చికాయలను మిగుల మాగినపండ్లను తినకూడదు. కలరా గ్రామంలో యున్నప్పుడు, భేది అగుటకు మందు వాడకూడదు. అజీర్ణంచేత లేక యితర కారణములచేత భేదియగుమనుజుని కలరా వ్యాధి సులభముగా లోబరచుకొనును.

(5) కలరా కనుపించిన వెంటనే వైద్యుని సలహాతీసికొనుము. ఆలస్యము అపాయము. చికిత్స ఎంత త్వరగా ప్రారంభించిన అంత మంచిది.

(6) కలరా రోగిని ప్రత్యేకమైన గది లేక స్థలములో పరుండబెట్టవలెను. ఒకరిద్దరికన్న యెక్కువమంది రోగికి పరిచర్య చేయగూడదు. రోగియొక్క వస్త్రములు రోగి ఉపయోగించిన పాత్రలు మొదలగునవి ప్రత్యేకముగా ఉంచవలెను. వాటిని పూర్తిగా శుద్ధిచేయనిదే యితరులు వాడగూడదు.

(7) కలరా రోగియొక్క వాంతిభేదులతో లక్షలకొలది కలరా క్రిములు ఉండును. ఆ వాంతిభేదులను, రంపపుపొట్టు వట్టిగడ్డితో కలిపి కిరసనాయిలుపోసి కాల్చివేయుము. రోగి ఉపయోగించిన గుడ్డలను సలసలకాగు నీటిలో ఒక గంటసేపు ఉంచవలెను. లేదా క్రిములను చంపు శక్తిగల ఘాటగు మందు ద్రావకముతో శుద్ధిచేయుము. అటుపిమ్మట ఆ గుడ్డలను చాకలవానికి వేయవలెను.

(8) రోగి ఉపయోగించిన పాత్రలు, గుడ్డలు, నదులు, చెరువులు, బావులు మొదలగు జలవసతులవద్ద శుభ్రముచేయుటగాని లేక ఉతుకుటగాని కూడదు. అట్లు ఉతికిన ఆ నీటియందు కలరా క్రిములు ప్రవేశించి యితరులకు చప్పున వ్యాపించును.

(9) రోగిని తాకినయెడల వెంటనే చేతులను సబ్బుతో శుభ్రముచేసికొనవలెను. మీ చేతి గోళ్లలోగూడ కలరా క్రిములు దూరియుండవచ్చును. అందుచే విషక్రిమి సంహారియగు మందు ద్రావకముతో మీ చేతులను శుద్ధిచేసికొనవలెను.

(10) కలరా వ్యాధి కనుపించిన వెంటనే గ్రామమునసబుగారికిగాని లేక హెల్తు ఇన్‌స్పెక్టరుగారికిగాని తెలియపరచుము. గ్రామములో వ్యాధివ్యాపింపజేయకుండా కావలసిన యేర్పాటులు వారు చేయుదురు.

(11) నదులు, కాలువలు, వీటి నీరు ఉపయోగించవద్దు. చెరువులు, బావులు, ప్రతిదినము గ్రామంలో కలరాయున్నప్పుడు శుద్ధి (క్లోరినేషన్) చేయించుకొని ఆ నీటిని ఉపయోగించవలెను.

---

## 59. చలిజ్వరము—దోమలు.

చలిజ్వరము ఒక విధమగు దోమ కాటువలన గలుగును. అది తప్ప వేరు మార్గముగ యీ వ్యాధిరాదు. చలిజ్వరముచే బాధపడు రోగియొక్క రక్తములో యీ జ్వరమును కలుగజేయు సూక్ష్మజీవులు వేనవేలుగనుండును. దోమ, రోగిని కరచి రక్తము త్రాగునపుడు రక్తములోపాటు ఈ క్రిములనుగూడ మ్రింగును. ఈ సూక్ష్మజీవి దోమ కడుపులోనే పెరుగును. ఈ దోమ ఆరోగ్యవంతుడగు మనుష్యుని కఱచునప్పుడు ఈ క్రిములను కొన్నిటిని ఆ మనుజుని రక్తములోనికి జారవిడుచును. ఏనుగకాలు, డెంగూ జ్వరముకూడ దోమ కాటువలన కలుగును.

దోమలు లేనియెడల ఈ వ్యాధులు కనుపింపవు. నీళ్లలో మాత్రమే దోమలు వృద్ధి పొందును. ఆడ దోమ నీటిలో వందలకొలది గ్రుడ్లు పెట్టును. ఒకటి, రెండు రోజులలో ఈ గ్రుడ్లు చితికి పురుగువంటి చిన్న పిల్లలు యేర్పడును. వాటికి అప్పుడు లార్వే అని పేరు. స్వల్పకాలములోనే ఈ లార్వే రూపు మార్పుచెందును. అప్పుడు వాటికి ప్యూపా అని పేరు. ఈ ప్యూపానుండి పెద్ద దోమలు యేర్పడును.

గ్రుడ్డు మార్పుచెంది దోమ యగుటకు సాధారణముగ 7 మొదలు 10 రోజులగును. నిలువ నీరు శుభ్రముగనున్నను సరే, మురికిగనున్నను సరే, దోమలు వృద్ధిపొందుటకు చాలును. అట్టి జలము తరుచుగా పగిలిన కుండలు, పీపాలు, తొట్లు, నెరియలు, గుంటలు, తొట్లు మొదలగువానిలో వుండును. చలిజ్వరము వ్యాపించుట సాధారణముగా ఈ క్రింది పరిస్థితులపై ఆధారపడియుండును:—

(1) చలిజ్వరము లేక మలేరియాచే బాధపడు రోగి రక్తములో ఈ జ్వరమును కలుగజేయు సూక్ష్మజీవులు.

(2) మలేరియా రోగినుండి ఆరోగ్యముగనున్న మనుజుని రక్తములోనికి క్రిములు ప్రవేశపెట్ట శక్తిగల వక జాతి దోమ.

(3) దోమ కరచుటకు అవకాశములు. ఈ మూడు వుండవలయును.

చలిజ్వరమును నిర్మూలింపవలయునన్న పై మూడు పరిస్థితులను ముఖ్యముగ గమనింపవలయును. సరిగ నెరవేర్చినయెడల యిది కష్టమగు పనికాదు. ఈ క్రింది విధుల నాచరించినచో మలేరియా వ్యాధి రాకుండ చేసుకొనవచ్చును:—

(1) మలేరియా క్రిములను సంహరించుటకు 'క్వైనా' కన్న మంచిమందు లేదు. మలేరియా రోగులు కావలసినంత క్వైనాను సేవించి తమ రక్తములోని మలేరియా క్రిములను నాశనము చేయవలెను. వైద్యుని సలహా అనుసరింపుము. క్వైనాను సరిగ దీసికొనినయెడల నీవ్యాధిని కుదుర్చుకొనుటయేగాక, నీద్వారా యీ జ్వరము యితరులకు వ్యాపించు నవకాశములు తగ్గును. మీకు సమీపముననుండు ప్రతి పోస్టాఫీసునందును క్వైనా క్రయమునకు దొరకును.

(2) మీ యింటిలోపలను, సమీపమందును దోమలను వృద్ధిపొందనీయకుము. నీరు లేకున్న దోమలు వృద్ధిపొందజాలవు. చిన్న గుంటలలో నీళ్లులేకుండ పూడ్చి

వేయుము. జలదారులు, నీటి తొట్లు, ఎప్పుడును శుభ్రముగా నుంచుము. పగిలిన కుండలు, తొట్లు, సీసాలు, పీపాలు మొదలగు వాటిలో నీరులేకుండ తీసివేయుము. అట్లు నీరులేకుండ పూడ్చుటకుగాని, లేకుండ తీసివేయుటకుగాని వీలులేకున్న యెడల వారము నకు ఒకసారియయినను కిరసనాయిలు మొదలగు నూనెను, అట్టి నీటిలో చల్లి ఆలార్వే యన బడు దోమ పిల్లలను చంపి వేయవలయును. ఈ కిరసనాయిలు నూనెను చల్లుటచే నీటిపైన నొక చిన్న పొర యేర్పడును. ఆ పొర వుండుటచే చిన్న దోమలు నీటి పైకివచ్చి గాలిని పీల్చుటకు వీలులేకపోవుటచే అవి చచ్చును.

(3) వ్యాధి వ్యాపించే శక్తియున్నను లేకున్నను, దోమ కాటువలన ప్రజలు చాల బాధచే కష్టపడెదరు. అందుచే దోమ తెరలలో నిద్రించి దోమకాటు లేకుండ జేసికొనవలయును.

---

## 60. స్ఫోటకము.

మీలో చాలమందికి స్ఫోటకమనిన తెలియును. అది సులభముగా వ్యాపించు అంటు వ్యాధి. జలుబు, తలనొప్పి జ్వరముతో ప్రారంభించును. మూడు దినములు జ్వరము వచ్చిన తరువాత స్ఫోటక చిహ్నములగు పొక్కులు ముఖముమీదను, చేతుల మీదను కనుపడి, క్రమేణ దేహమంతయు వ్యాపించును. అపాయకరమగు సందర్భ ములలో ఇట్టి పొక్కులు కలసిపోయి పెద్దవిగా యేర్పడుటయేకాక, అట్టకట్టుకొని పుండ్లు అగును.

ఈ దేశములో యీ ఘోరవ్యాధి మూలమున అనేక వేలమంది మృతినొందుచు న్నారు. అదృష్టముచే ఈ రోగమునుండి చావక తప్పించుకొన్నవారిలో చాలమంది కురూపులగుచున్నారు. కొందరికి జీవితమంతయు వృథాయగునటుల గ్రుడ్డితనము వచ్చు చున్నది.

ఒక రోగినుండి స్ఫోటకము యితరులకు గాలిద్వారా వ్యాపించును. రోగి వస్త్ర ములకు పడకకు ఈ వ్యాధి అంటుకొనియుండును. వానిని తాకు వారికి ఈ రోగము వచ్చును. రోగికి పరిచర్య చేయువారికిని, ఆ యింటిలో వున్న వారికికూడ ఈరోగము వచ్చుట కవకాశమున్నది. అందుచేతనే పూర్వ కాలములో—అనగా టీకాలు వేయనికాలములో—ఒక గ్రామములో స్ఫోటకము కనుపించినయెడల అందరును ఈ వ్యాధిచే బాధితులగుచుండిరి.

ఈ కాలములో వ్యాధివలన అపాయములు తప్పినవి. టీకాలు వేసుకొన్నయెడల స్ఫోటకము వచ్చుటలేదు. ఈ వ్యాధిరాకుండ చేసుకొనుటకు టీకాలు వేసుకొనుట కన్న వేరొండు మేలు మార్గములేదు. టీకాలు తప్పక రోగమును రాకుండ చేయును. టీకాలపద్ధతి ఆచరణలో లేనప్పుడు ప్రతి మనుజుడును తన జీవిత కాలములో ఒకసారి యయినను స్ఫోటకమునకు గురి అయ్యెడివాడు. నీవు యిప్పుడు టీకాలు వేయించు కొనుము ; నీకు స్ఫోటకమురాదు. ఎవరు నిర్లక్ష్యముగా టీకాలు వేయించుకొనుటకు అశ్రద్ధచేసెదరో వారినే స్ఫోటకము బాధించును.

టీకాలు వేయుటవలన బాధయుండదు. ఒక చుక్క టీకాలరసము నీ భుజముల సమీపములో చేతిచర్మముపై యుంచి గుండ్రముగా కొంచెము గీకెదరు. కొద్ది దినము లలో చిన్న పొక్కు యేర్పడి కొంచెము పెద్దదై చితికి చిన్నపుండు అగును. దానిని శుభ్రముగా నుంచినయెడల త్వరలోనే పుండు మాని, పై పక్కు ఊడిపోవును. అక్కడ చిన్న మచ్చ యేర్పడును.

పసిబిడ్డలకు మూడు లేక ఆరు నెలలు వయసప్పుడే టీకాలు వేయించవలెను. ఒకసారి టీకాలు వేసుకొనినయెడల చాలదు. ప్రథమ టీకాలవలన వచ్చిన శక్తి క్రమేణ తగ్గిపోయి, తిరిగి స్ఫోటకమురాకుండ చేయజాలదు. అందుచే పది సంవత్సరముల కొకతూరి రెండవసారి టీకాలు వేయించుకొనవలయును. గ్రామములలో స్ఫోటకము వ్యాపించియున్నయెడల వెంటనే టీకాలు వేయించుకొనుట అత్యవసరము. టీకాలు వేయించుకొనుటవలన నీకేవిధమైన బాధయు, అపాయమును నుండదు. అంతేకాక నిన్ను స్ఫోటకము బారినుండి తప్పక రక్షించును.

---

## 61. ప్లేగు (మహామ్మారి).

ప్లేగు అపాయకరమగు అంటువ్యాధి. ఇది ఏ గ్రామమునకైనను, ఎప్పుడైనను రావచ్చును. ఇతర అంటు వ్యాధులు మనుష్యులను మాత్రమే బాధించును. మహమ్మారి యన్ననో మనుజులను యెలుకలనుకూడ సంహరించును. ఏ ప్రదేశములోనయినను ప్లేగు వ్యాధి ప్రవేశించినదని తెలియుటకు ప్రధానమైనగుర్తు ఎలుకలు విపరీతముగచచ్చుటయే.

ప్లేగు కంటికి కనబడనంతటి సూక్ష్మ జీవివలన కలుగును. రోగము సోకిన యెలుకలయొక్కయు, మనుష్యునియొక్కయు రక్తములోను శరీరములోని అవయవములందును ఈ సూక్ష్మ క్రిములు అసంఖ్యాకములుగాయుండును. ఎలుకల ఒడలిపైనుండు రోమములలో పేలవలె చిన్న పురుగులుండును. వీటి పేరు ఎలుక పేలు. ఈ పేలు ఎలుక రక్తమును త్రాగి జీవించును. ఎలుకకు ప్లేగు వ్యాధి కనుపించి చచ్చినవెంటనే యీ చిన్న పురుగులు యెగిరి సమీపమునుండు ఎలుకలను, మనుజులను పట్టుకొనును. ఈ విధమున యీ క్రిములు రోగముచేచచ్చిన యెలుకలనుండి ఆరోగ్యమైన ఎలుకలకును మనుష్యులకును వ్యాపింపచేయును. ఎలుకలును ఎలుకలలో యీ వ్యాధికూలమున చావులును లేకున్నయెడల మహమ్మారి వ్యాధియుండదు. మన గ్రామములలో లెక్కపెట్ట సాధ్యముగాని ఎలుకలు వున్నవి. అందుచేత ఒక గ్రామములో ప్లేగు వ్యాధి కనుపించిన, ఆ రోగము త్వరలో సులభముగా గ్రామమంతయు వ్యాపించుటలో ఆశ్చర్యము లేదు. ఎలుకలవలన మనకు లాభములేదు. అది మన ధాన్యమును, ఆహారపదార్థములను తినివేయును. అందుచే దేశమునకు, సంఘమునకు ద్రవ్యనష్టమపారము. అందుచే యేల ఎలుకల నాశనమొనరించి ప్లేగు వ్యాధినుండి తప్పించుకొనరాదు?

మీ గ్రామములో మహమ్మారి వ్యాధి ప్రవేశించకుండవలెనన్న యీ క్రింది పంశములు గమనించి ఆ ప్రకారము చేయవలెను.

(1) ప్లేగు రోగమువలన భీతిచే వ్యాపించియున్న గ్రామము విడచి పారిపోవు మనుజుల దుస్తులు సామానుద్వారాను, ఆ గ్రామమునుండి వర్తకపురీత్యా యెగుమతియగు ధాన్యము ఆహారపదార్థములద్వారాను అంటుసోకిన యెలుకపేలు యితర గ్రామములకు చేరును. అందుచే వ్యాధి కనుపించిన గ్రామమునుంచి మీ గ్రామమునకు యెవరిని రానీయకూడదు. రానీయవలెనన్న ముందుగా అట్టివారిని పూర్తిగ మందు ద్రావకముతో శుద్ధిచేయవలెను. బాగుగా యెండలోపోసి శుభ్రముచేయనిదే ధాన్యపు బస్తాలను, యితర సామానులను రోగము వ్యాపించియున్న స్థలమునుండి రానీయగూడదు.

(2) ఎలుకలను నాశనమొనర్చుటకు పూర్తి ప్రయత్నము కడు శ్రద్ధగా చేయవలెను. అన్ని యెలుకలను చంపుము. మీ గ్రామమునకు ప్లేగు వ్యాధి రాదు.

(3) గ్రామమును, ముఖ్యముగా మీ యింటి చుట్టుప్రక్కలను శుభ్రము చేయుము. చినిగిన గుడ్డలు పనికిమాలిన సామానులేకుండ చేయుము. ఎలుకలు వానిలో కాపురము చేయును. ఆహారపదార్థములును, ధాన్యపు దినుసులును మూతలేకుండ నుంచగూడదు. ఇంటిలోను పెరటియందును చెత్త వుంచగూడదు. పెంటకుప్పలలోనే ఎలుకలు వృద్ధియగును.

(4) ధాన్యము నిలువచేయుటకు ఎలుకలు చొరశక్యముగాని కొట్టులను గాదులను కట్టవలెను.

(5) సూది మందు వేయించుకొనినయెడల మీకు మహమ్మారి వ్యాధి రాదు. అందుచే ప్లేగు కనుపించుకాలమునకు ముందుగానే మీరును, మీ కుటుంబస్థులందరును యినాక్యులేషను చేయించుకొనవలెను.

(6) అనుమానాస్పదమైన జ్వర రోగులున్నను లేదా విపరీతపు ఎలుక చావులు కనుబడినను వెంటనే గ్రామాధికారికిగాని, సమీప హెల్తు యిన్‌స్పెక్టరుగారికిగాని తెలియపరుచుము.

(7) ఒక గ్రామములో మహమ్మారి వ్యాధి కనుపించినతోడనే ఆరోగిని, ఆరోగ బాధితులకు ప్రత్యేకముగా యేర్పరచబడ్డ వైద్యశాలకు కొనిపొమ్ము. అక్కడ రోగికి సమస్తోపచారములు చక్కగా జరుగును.

(8) చచ్చిన ఎలుక యింటిలో పడుటయే ఆ యింటికి అంటుసోకిన దనుటకు గుర్తు. వెంటనే ఆ యిల్లు విడువవలెను. ఆ యింటిలోనే నీవు వాసముచేయదలచిన యెడల నీవు అపాయమునకు తప్పక గురియయ్యెదవు. అందుచే ఆరోగ్యమైనవారికి ప్రత్యేకముగా యేర్పర్చబడ్డ వసతి గృహములోనికిపోయి నివసింపుము. అక్కడ సమస్త సదుపాయములును మీకు లభించును.

(9) ఆరోగ్యశాఖాధికార్లు మీ పూర్వపుటింటికి పోయిన మీకు అపాయము లేదని తెల్పు పర్యంతము మీరు మీ స్వగృహములకు పోకూడదు. ఆ యధికార్లు మీ యిల్లు శుద్ధిచేసి శుభ్రపఱచెదరు. ఇంటిలోని అన్ని ఎలుకలను ఎలుకపేలను నశింపజేసి మీకు వాసయోగ్యముగను సురక్షితముగను వుండునటుల చేసెదరు.

(10) అన్నిటికన్న ముఖ్యము.—భయపడగూడదు. పై వివరించిన విధుల ననుసరించిన మీరును మీ సమీప గృహస్థులును ప్లేగు వ్యాధి రాకుండ చేసికొనగలుగుదురు.

---

## VII. వివిధ విషయములు.

### 62. మద్రాసు రాజధాని జిల్లాలో ప్రతివారం జరిగే పశువుల సంతల పట్టీ.

| తాలూకా. (1) | పశువులసంత జరిగే గ్రామం పేరు. (2) | పశువుల సంత జరిగే వారపు పేరు. (3) | దగ్గరగానుండు రైలు స్టేషన్ పేరు. (4) |
|---|---|---|---|
| | ఉత్తర ఆర్కాడు జిల్లా. | | |
| వాలాజా ... | రాణిపేట ... | ప్రతి శుక్రవారం. | రాణిపేట. |
| వందివాషు ... | మజయూరు ... | డిట్టో. | పోలూరు. |

| తాలూకా. (1) | పశువులసంత జరిగే గ్రామం పేరు. (2) | పశువుల సంత జరిగే వారపు పేరు. (3) | దగ్గరగానుండు రైలు స్టేషన్ పేరు. (4) |
|---|---|---|---|
| | **ఉత్తర ఆర్కాడు జిల్లా—శేషము.** | | |
| వందివాషు ... | తెళ్లార్ ... | ప్రతి గురువారం. | తిండివనం. |
| చెయ్యారు ... | పురిసైై ... | ప్రతి ఆదివారం. | కాంచీపురం. |
| డిటో ... | తిరువత్తిపురం ... | ప్రతి సోమవారం. | డిటో. |
| డిటో ... | కుజమండల్ ... | ప్రతి బుధవారం. | డిటో. |
| ఆరణి ... | ఆరణి ... | ప్రతి ఆదివారం. | ఆరణి రోడ్డు. |
| డిటో ... | దేవికాపురం ... | ప్రతి మంగళవారం. | పోలూరు. |
| డిటో ... | ఒన్నెపురం ... | ప్రతి గురువారం. | ఒన్నెపురం. |
| గుడియాత్తం ... | లవెరి ... | ప్రతి ఆదివారం. | లత్తేరి. |
| డిటో ... | వడుగం లంగాల్. | ప్రతి బుధవారం. | విరింజిపురం. |
| డిటో ... | పేరనంబట్టు ... | ప్రతి సోమవారం. | మైల్‌పట్టి. |
| డిటో ... | గుడియాత్తం ... | ప్రతి మంగళవారం. | గుడియాత్తం. |
| వెల్లూరు ... | పేన్నతూరు ... | ప్రతి బుధవారం. | పేన్నత్తూరు. |
| పోలూరు ... | వడమడిమంగలం. | ప్రతి సోమవారం. | మడిమంగలం. |
| డిటో ... | కలసపాకం ... | ప్రతి శుక్రవారం. | కలసపాకం. |
| డిటో ... | పడవెడు ... | డిటో. | ఆర్ని రోడ్డు. |
| తిరుపత్తూరు ... | మేట్టాంపల్లి ... | ప్రతి మంగళవారం. | తిరుపత్తూరు. |
| డిటో ... | పుదుపేట ... | ప్రతి గురువారం. | పుదుపేట. |
| డిటో ... | జోలారుపేట ... | ప్రతి బుధవారం. | జోలారుపేట. |
| డిటో ... | వాణియంబాడి ... | ప్రతి శనివారం. | వాణియంబాడి. |
| | **దక్షిణ ఆర్కాడు జిల్లా.** | | |
| కడలూరు ... | వలయకారన్ కుప్పం. | ప్రతి శుక్రవారం. | మేల్పట్టాంబాకం. |
| డిటో ... | కుళ్లన్ చావిడి ... | ప్రతి ఆదివారం. | కుళ్లన్ చావిడి. |
| డిటో ... | కోనమంగళం ... | ప్రతి సోమవారం. | నెల్లికుప్పం. |
| డిటో ... | కారుంగులి ... | ప్రతి గురువారం. | కురింజిప్పాడి. |
| డిటో ... | కారామణికుప్పం. | ప్రతి సోమవారం. | వరగల్‌పట్టు. |
| డిటో ... | కురింజిప్పాడి ... | డిటో. | కురింజిప్పాడి. |
| కళ్లకుర్చి ... | రుషివందయం ... | ప్రతి గురువారం. | తిరుక్కోయిలూరు. |
| చిదంబరం ... | బువనగిరి ... | ప్రతి శుక్రవారం. | చిదంబరం. |
| డిటో ... | వల్లంపడుగై ... | ప్రతి సోమవారం. | డిటో. |
| వృద్ధాచలం ... | పెన్నాడం ... | ప్రతి మంగళవారం (ఏప్రిలునుండి జూలై వరకు). | పెన్నాడం. |
| డిటో ... | కాట్టుపహూర్ ... | ప్రతి గురువారం. | పువనూరు. |
| విల్లుపురం ... | రాధాపురం ... | ప్రతి సోమవారం. | ముండియంపాకం. |

| తాలూకా. (1) | పశువులసంత జరిగే గ్రామము పేరు. (2) | పశువులసంత జరిగే వారపు పేరు. (3) | దగ్గరగానుండు రైలు స్టేషన్ పేరు. (4) |
|---|---|---|---|
| **దక్షిణ ఆర్కాడు జిల్లా—శేషము.** | | | |
| విల్లుపురం ... | రాట్టత్తూరు ... | ప్రతి మంగళవారం. | పెరణి. |
| డిటో ... | పంచమదేవి ... | ప్రతి గురువారం. | నెరడామూరు. |
| డిటో ... | కీడార్ ... | డిటో. | మాంబలపట్టు. |
| జింజి ... | చెట్టిపాలయం ... | ప్రతి శుక్రవారం. | తిండివనం. |
| డిటో ... | వలలై ... | ప్రతి ఆదివారం. | డిటో. |
| తిండివనం ... | కుట్చేరిపట్టు ... | డిటో. | మైలం. |
| డిటో ... | ఒంగూరు ... | ప్రతి మంగళవారం. | తొలుపేడు. |
| **చిత్తూరు జిల్లా.** | | | |
| పలమనేర్ ... | పలమనేర్ ... | ప్రతి శుక్రవారం. | చిత్తూరు (25 మైళ్లు). |
| **చెంగల్పట్టు జిల్లా.** | | | |
| కాంచీపురం ... | వాలాజాబాద్ ... | ప్రతి సోమవారం. | వాలాజాబాద్. |
| డిటో ... | కాంచీపురం ... | ప్రతి ఆదివారం... | కాంచీపురం. |
| చెంగల్పట్టు ... | సింగపెరుమాల్ కోవిల్. | ప్రతి బుధవారం. | సింగపెరుమాల్ కోవిల్. |
| మధురాంతకం ... | ఆచ్చరపాకం ... | డిటో. | ఆచ్చరపాకం. |
| డిటో ... | ఆన్నైకట్టు ... | ప్రతి శుక్రవారం. | మధురాంతకం. |
| సైదాపేట ... | పల్లావరం ... | డిటో. | పల్లావరం. |
| **కోయంబత్తూరు జిల్లా.** | | | |
| అవనాశి ... | అన్నూరు ... | ప్రతి శనివారం... | సోమనూరు. |
| భవాని ... | అండియూరు ... | ప్రతి సోమవారం. | ఈరోడ్. |
| డిటో ... | బూదపాడి ... | ప్రతి మంగళవారం. | డిటో. |
| డిటో ... | కవండపాడి ... | ప్రతి బుధవారం. | డిటో. |
| డిటో ... | కోలట్టూరు ... | ప్రతి శుక్రవారం. | డిటో. |
| డిటో ... | మైలంబాడి ... | ప్రతి శనివారం. | డిటో. |
| కోయంబత్తూరు. | కోయంబత్తూరు. | ప్రతి ఆదివారం... | కోయంబత్తూరు. |
| డిటో. | వెళ్లాలూరు ... | ప్రతి మంగళవారం. | పోదనూరు. |
| డిటో. | తుడియలూరు ... | ప్రతి సోమవారం. | తుడియలూరు. |
| డిటో. | కోయిల్పాళయం. | ప్రతి బుధవారం. | కోయంబత్తూరు. |
| గోబిశెట్టిపాళెం. | పుంజెపులియంపట్టి | ప్రతి గురువారం. | వంజపాళెం. |
| డిటో. ... | సిరువల్లూరు ... | ప్రతి మంగళవారం | పెరుందురై. |
| డిటో. ... | మోడసూరు ... | ప్రతి శనివారం. | పూడుకోళి. |
| పొల్లాచి ... | పొల్లాచి ... | గురువారం ... | పొల్లాచి. |

| తాలూకా. (1) | పశువుల సంత జరిగే గ్రామము పేరు. (2) | పశువుల సంత జరిగే వారపు పేరు. (3) | దగ్గరగా వుండే రైలు స్టేషను పేరు. (4) |
|---|---|---|---|
| | | గంజాం జిల్లా. | |
| శ్రీకాకుళం ... | నారాయణవలస. | ప్రతి గురువారం. | తిలారు. |
| డిటో ... | గార ... | ప్రతి మంగళవారం. | చికాకోలు రోడ్డు 8 మైళ్లు. |
| పర్లాకిమిడి ... | ఉప్పలాడ ... | ప్రతి ఆదివారం... | పర్లాకిమిడి. |
| డిటో ... | బళద ... | ప్రతి మంగళవారం. | వారణాశి. |
| పర్లాకిమిడి ... | పర్లాకిమిడి ... | ప్రతి శనివారం... | పర్లాకిమిడి. |
| డిటో ... | విరవకోట ... | ప్రతి గురువారం. | తిలారు. |
| డిటో ... | కోసమల ... | డిటో. | పర్లాకిమిడి. |
| డిటో ... | తెంబూరు ... | డిటో. | తెంబూరు. |
| గుంసూరు ... | బెల్లుగుంట ... | ప్రతి సోమవారం. | బరహంపురం. |
| జి. ఉదయగిరి ... | టిక్కాబాలి ... | ప్రతి శుక్రవారం. | డిటో. |
| డిటో ... | రైక ... | ప్రతి గురువారం. | డిటో. |
| శ్రీకాకుళం ... | ఆముదాలవలస... | శనివారం ... | శ్రీకాకుళం రోడ్డు. |
| డిటో ... | చింతాడ ... | డిటో ... | శ్రీకాకుళం 2½ మైళ్లు. |
| డిటో ... | సరిబుజ్జిలి ... | శుక్రవారం ... | డిటో 11 మైళ్లు. |
| ఛత్రపురం ... | నరేంద్రపూర్ ... | బుధవారం ... | జగన్నాథపూర్ 2 ఫర్లాంగులు. |
| జి. ఉదయగిరి ... | జి. వుదయగిరి ... | శనివారం ... | బరంపురం 77 మైళ్లు. |
| డిటో ... | గుత్తింజియ ... | గురువారం ... | బరంపురం 92 మైళ్లు. |
| బల్లిగుడ ... | బల్లిగుడ ... | శనివారం ... | బరంపురం 120 మైళ్లు. |
| డిటో ... | కొర్జామెండి ... | ఆదివారం ... | డిటో. |
| డిటో ... | కొట్గాఢ్ ... | గురువారం ... | మునిగూడ. |
| ఆర్. వుదయగిరి. | నెళిగాడో ... | బుధవారం ... | పర్లాఖిమిడి. |
| ఛత్రపురం ... | వాంజిలి ... | శనివారం ... | బరంపురం 14 మైళ్లు. |
| డిటో ... | కొంచూరు ... | ఆదివారం ... | బరంపురం 11 మైళ్లు. |
| | | తూర్పు గోదావరి జిల్లా. | |
| రామచంద్రపురం. | అలమూరు ... | ప్రతి మంగళవారం. | ద్వారపూడి. |
| డిటో. | ద్వారపూడి ... | ప్రతి బుధవారం. | డిటో. |
| డిటో. | ద్రాక్షారామము. | ప్రతి సోమవారం. | ద్రాక్షారామము. |

